శ్లో॥ ఏవం ధ్యాతి గోవిందే ఆకాశాత్సూర్య వర్చసౌ ।
రథావుపస్థితౌ సద్యస్ససూతౌ సపర్ఛిదౌ ॥ 11

ఇట్లు గోవిందుడాలోచించుచుండగనే ఆకాశమునుండి ధ్వజకవచాదులతో సారథి సహితములైన, సూర్య ప్రభా భాసితములగు రెండు రథములు ఉపస్థితములయ్యెను. (11)

శ్లో॥ ఆయుధానిచ దివ్యాని పురాణానియదృచ్ఛయా ।
దృష్ట్వాతాని హృషీకేశస్సంకర్షణ మథాబ్రవీత్ ॥ 12

టీ:- ఏవ మితి. ససూతౌ సారథి సహితౌ పరిచ్ఛేదః పరికరః ధ్వజ కవచాదిః తత్సహితౌ. (11-12)

అకస్మాత్తుగా వచ్చిన ప్రాక్తనములగు దివ్యాయుధములను శ్రీకృష్ణభగవానుడు చూచి ప్రక్కనేయున్న బలరామునితో ఇట్లనెను. (12)

శ్లో॥ పశ్యార్యవ్యసనం ప్రాప్తం యదూనాంత్వావతాం ప్రభో ।
ఏష తే రథ ఆతో దయితాన్యాయుధాని చ ॥ 13

శ్లో॥ యానమాస్థా యజహ్యేతద్వ్యసనాత్స్వాన్ సముద్ధర ॥
ఏతదర్థం హినౌ జన్మ సాధూనామీశ శర్మకృత్ ।
త్రయోవింశత్యనీకాఖ్యం భూమేర్భార మపాకురు ॥14

టీ:- పశ్యేతి త్వం అవన్ రక్షకో నాథో విద్యతే యేషాం తే త్వావంతః తేషాం. (13-14)

ఓ ప్రభో బలరామా! నీవు రక్షకుడుగానున్న యాదవకులమునకు కష్టమాపతితమైనది. చూడుము. సూతసహితములైన రథములు ఆయుధములు సమయమున కుపస్థితములైనవి. రథాధిరోహణముచేసి శత్రువుల సంహరించి స్వజనులను కాపాడుము. సాధువులకు మేలు చేయుటకే కదా మన ఇరువురి అవతార పరమార్థము. అందువలన ఇరువదిమూడు అక్షౌహిణుల సైన్యమును దున్ని భూభారమును దూరము చేయుము.(13-14)

శ్లో॥ ఏవం సంమంత్ర్యదాశార్హౌ దంశితౌరథినౌ పురాత్ ।
నిర్జగ్మతుస్స్వాయుధాఢ్యౌ బలేనాల్పీయ సావృతౌ ॥ 15

శ్లో॥ శంఖందధ్మౌ వినిర్గమ్య హరిర్దారుక సారథిః ।
తతోஉభూత్పర సైన్యానాం హృది విత్రాసవేపథుః ॥ 16

టీ:- ఏవమితి. దంశితౌ బద్ధ కవచౌ స్వాయుధాఢ్యౌ శోభనాయుధ సంపన్నౌ. (15-16)

ఈవిధంగా బలరామకృష్ణులాలోచించుకొని కవచముల ధరించి తమతమ ఆయుధములను గ్రహించి, ఆ రథములనెక్కి అల్పసైన్యముతో కూడి పట్టణము వెలుపలికి వచ్చిరి. దారుకుడను సారథితో అట్లు వచ్చిన హరి శంఖమును పూరించెను. ఆ నాదము పరసైన్యము గుండెలలో భయముతో కూడిన కంపములను పుట్టించెను.(15-16)

శ్లో॥ తావాహ మాగధోవీక్ష్య హే కృష్ణ పురుషాధమ ।
గుప్తేన చ త్వయామంద నయోత్స్యే యాహి బంధుహన్ ॥17

టీ:- తావితి. పురుషా అధమాః యస్మాదితి వాస్తవోஉర్థః హే పురుషోత్తమేతి. గుప్తేన దంశితత్వాత్సర్వాంతరత్వాద్దర్శనానర్హేణ. హేమంద. బధ్నాతీతి బంధుః అవిద్యా తాం హంతీతి హన్, హే అవిద్యానిరసనేతి. యాహి ప్రాప్నుహి. (17)

ఇలా వచ్చిన బలరామకృష్ణులను చూచి జరాసంధుడు ఓకృష్ణా! నీవు పురుషాధముడవు, గుప్తచరునివి, మందుడవు. బంధునాశక. ఇట్టి బాలకుడవగు నీతోయుద్ధము చేయుటకు సిగ్గగుచున్నది. కావున నీతో యుద్ధముచేయను పొమ్ము అనెను. (17)

శ్లో॥ త్వం తు రామయది శ్రద్ధాయుధ్యస్వస్థైర్యమాన హ ।
హిత్వా వామచ్ఛరైశ్ఛిన్నం దేహం స్వర్యాహి మాం జహి ॥18

టీ:- త్వమితి. అచ్ఛేద్యదేహోஉసావితి స్వయమేవ మత్వా. అపరితోషాత్పక్షాంతరమాహ.- యద్వా. మాం జహీతి. (18)

ఓ బలరామా ! ఇక నీకు యుద్ధము చేయవలెననుకోరిక యున్నచో స్థైర్యముతో యుద్ధము చేయుము. నా బాణములతో ఛేదింపబడిన దేహమును వదలి స్వర్గమునకు పొమ్ము. లేదా నన్ను చంపుము. (18)

శ్రీ భగవానువాచ

శ్లో॥ నవై శూరావికత్థంతే దర్శయంత్యేవ పౌరుషం ।
నగృహ్ణీమో వచోరాజన్నాతురస్య ముమూర్షతః ॥19

టీ:- నేతి. యథా శ్రుతార్థ గ్రహణేన భగవదుత్తరం న వై శూరా వికత్థంతే శ్లాఘంత ఇతి. (19)

శ్రీ భగవానుడు పలికెను.

ఓ జరాసంధా! వీరుడైనవాడు తనను తాను పొగడుకొనుడు. పౌరుషమును మాత్రమే ప్రదర్శించును. మరణమునకారాటపడువాని మాటలను మేము పరిగణించము.(19)

శ్లో॥ జరాసుతస్తావభిరీసృత్య మాధవౌ
మహాబలౌఘేన బలీయసావృణోత్ ।
ససైన్యయాన ధ్వజవాజిసారథి
స్సూర్యానలౌ వాయురివా భ్రరేణుభిః ॥ 20

శ్లో॥ సువర్ణతాళధ్వజచిహ్నితౌరథా
వలక్షయంత్యో హరిరామయోర్మృథే ।
స్త్రియఃపురాట్టాలకహర్మ్యగోపురం
సమాశ్రితాస్సంముముహుశ్శుచార్పితాః ॥21

టీ:- జరాసుత ఇతి. మాధవౌ మధువంశసంభవౌ. మహతా సైన్య సమూహేన. ఆవృతవాన్. వాయురభ్రైః సూర్యం రేణుభిశ్చాగ్నిం యథేత్యదర్శన మాత్రమేవ. నావరణమితి సూచితవాన్. (20-21)

జరాసంధుడు బలరామకృష్ణులను ఎదుర్కొని సూర్యాగ్నులను ఆకాశమునకెగయు మేఘముల చేతను, ధూళిరేణువులచేతను, కప్పివేయు వాయువువలె మహాశక్తి సామర్థ్యముగల సైన్య, రథ, ధ్వజ, అశ్వ, సారథులతో చుట్టుముట్టెను. సంగరమున బలరామకృష్ణుల యొక్క సువర్ణతాళధ్వజముల చిహ్నములు రథములు కనిపించకపోగ పట్టణమునందలి కాంతలు మేడలు మిద్దెలనెక్కికండ్లార్పక చూచును మోహితులయిరి. (20-21)

శ్లో॥ హరిః పరానీకపయో ముచాంముహు
శ్శిలీముఖాత్యుల్బణ వర్షపీడితమ్ ।
స్వ సైన్యమాలోక్య సురాసురార్చితం
వ్యస్ఫూర్జయచ్ఛార్ఙ్గ శరాసనోత్తమమ్ ॥ 22

టీ:- హరిరితి. రస్యానికాని సైన్యాని. తాన్యేవ పయోముచః మేఘాః తేషాం శిలీముఖాబాణాః. తేషామత్యుల్బణం వర్షం తేన పీడితం వ్యస్ఫూర్జయత్ ఉజ్జృంభితవాన్. (22)

హరి పరసైన్యములను జలదముల నుండి కురియుచున్న అతి తీవ్ర బాణ వర్షముచే పీడితులగుచున్న తమ సైన్యములను చూచి దేవ దానవులచే అర్చింపబడిన శార్ఙ్గమను ఉత్తమ ధనుస్సుతో విజృంభించెను. (22)

శ్లో॥ గృహ్ణన్నిషంగాదధ సందధచ్ఛరాన్
వికృష్యముంచన్ శితబాణపూగాన్ ।
నిఘ్నన్రథాన్ కుంజరవాజి పత్తీ
ర్నిరంతరం యద్వదలాత చక్రమ్ ॥ 23

టీ:- తదాహ- గృహ్ణన్నితి. నిషంగాదిషుధేః. శరాన్ గృహ్ణన్. అథ తాన్ గుణేసందధత్. గుణమాకృష్య నిశితబాణ సమూహాన్ ముంచన్ నిఘ్నన్ ప్రహరన్. పత్తీః పదాతీః. నిరంతరమితి గ్రహణాది క్రియా విశేషణం. జ్వలత్కాష్ఠం భ్రమణే యథా చక్రవద్ భ్రమతి. తద్వత్ వ్యస్ఫూర్జయదితి. (23)

అమ్ముల పొదినుండి శరములను గ్రహించి సంధించెను. వాడియైన బాణవర్షమునుశత్రుసైన్యముపైగుప్పించి వారి రథ, గజ, తురగ బలములను చక్రాకారమున మండుచున్న కాష్ఠభ్రమణమువలె ఖండించుచు విజృంభించెను. (23)

శ్లో॥ నిర్భిన్నకుంభాః కరిణోనిపేతు రనేకశో
ఽశ్వాశ్శర వృక్ణ కంధరాః ।
రథా హతాశ్వ ధ్వజ సూతనాయకాః
పదాతయశ్ఛిన్నభుజోరు కంధరాః ॥ 24

టీ:- నిర్భిన్నేతి. హతాః అశ్వాః ధ్వజాః సూతాః నాయకాః రథినశ్చ యేషుతే. (24)

కుంభస్థలములు పగిలిన గజములు, బాణములచేతెగి పడిన మెడలుగల అనేక అశ్వములు, విరిగిన రథములు, చంపబడిన సారథులు, తెగిపడిన భుజములు,తొడలు మెడలుగల పదాదులును యుద్ధమునమడిసిరి. (24)

శ్లో॥ సంఛిద్యమాన ద్విపదేభవాజినా మంగ
ప్రసూతాశ్శత శోఽసృగాపగాః ।
భుజాహయః పూరుషశీర్ష కచ్ఛపా
హతద్విప ద్వీపహయాగ్రహాకులాః ॥ 25

టీ:- సంఛిద్యమానేతి. సంఛిద్యమానాః ద్విపదాః ఇభాఃవాజినశ్చ తేషామంగేభ్యః ప్రసూతాః అసృగాపగాః రుధిరనద్యః. పరస్పరం ప్రవర్తితా ఇతి తృతీయేనాన్వయః. ప్రసిద్ధనదీరూపకమాహ-భుజా ఏవ అహయో యాసాం తాః. పురుషాణాం శీర్షాణ్యేవ కచ్ఛపా యాసాం తాః. హతాః ద్విపా ఏవ ద్వీపాః అంతర్వర్తితటాని హయా ఏవ గ్రహాః గ్రాహాః తైశ్చ తైశ్చాకులాః వ్యాప్తాః. (25)

ఈరెండు శ్లోకములందు ప్రసిద్ధ నదీ రూపకముకలదు:- ఆ పరస్పర సంగరమున ఛేదింపబడిన కుంజర కుంభముల నుండి, హయముల అంగములనుండి శతధారలుగ ప్రవహించిన రక్తము ఏరులై పారెను. అందు భుజములే సర్పములు, పురుషుల తలలే తాబేళ్ళు, మరణించిన ద్విపములే ద్వీపములు. గుఱ్ఱములే మొసళ్ళు, వీటన్నింటిచే వ్యాప్తమైనవి ఆ రక్తపు టేరులు.

ఇంకను కరములు ఊరువులు పెద్దచేపలు, నరులకేశములు నీళ్ళలోనిపాచి, ధనస్సులేతరంగములు, ఆయుధములే చీలమండలు. వీటన్నింటితోడను వ్యాప్తమైనది. చర్మములు లేదా రథచక్రములే భయంకరములైన నీటిసుడులు. మణిమయ ఉత్తమాభరణములు,

శ్లో॥ కరోరు మీనానరకేశ శైవలా
ధనుస్తరంగాయుధ గుల్మ సంకులాః ।
అస్థ్ధరికావర్త భయానకా మహా
మణిప్రవేకాభరణాశ్మ శర్కరాః ॥ 26

టీ:- కరేతి.కరా ఊరవశ్చ మీనా యాసు తాః. నరాణాం కేశా ఏవ శైవలం యాసు తాః. ధనూంష్యేవ తరంగాః. ఆయుధాన్యేవ గుల్మాః తైశ్చ తైశ్చ సంకూలాః. అస్థ్ధరికాశ్చర్మాణి చక్రాణి వా. తా ఏవర్తాస్తైర్భయానకాః. మహామణీనాంప్రవేకా ఉత్తమా ఆభరణాని చ యథాయథమశ్మానః శర్కరాశ్చ యాసు తాః, భీరూణాం భయావహాః మనస్వినాం హర్షకర్యః. (26)

శ్లో॥ వినిఘ్నుతారీన్ ముసలేన దుర్మదాన్
సంకర్షణేనాపరిమేయ తేజసా ।
బలంతదంగార్ణవ దుర్గభైరవం
దురంతపారం మగధేంద్రపాలితమ్ ।
క్షయం ప్రణీతం వసుదేవ పుత్రయో
ర్విక్రీడితం తజ్జగదీశయోః పరమ్ ॥ 27

టీ:- వినిఘ్న తేతి. కించ. సంకర్షణేనాపితద్బలం క్షయం ప్రణీతం.

అందలి రాళ్ళు, మహామణులునై భీరువులకు భయమును, సహృదయుల కానందమును కల్గించుచున్నవి.(25-26)

ఓరాజా! అపార బలసంపన్నుడగు బలరామదేవుని చేత కూడ ముసలాయుధముతో దుర్మదులైన శత్రువులు మర్దించబడిరి. దానితో సముద్రమువలె సమరభూమి దుర్గమము భయంకరమయ్యెను. ఈ విధముగ మగధరాజు బలగమంతయు జగదీశ్వరులగు బలరామ కృష్ణుల సంగర క్రీడచే నాశనము చేయబడెను. (27)

అంగ హే రాజన్. అర్ణవవత్ దుర్గం దుర్గమం భైరవం భయంకరం చ. యతః దురంతపారం అంతోఽత్ర తలం పారమవధిః. దుశ్శబ్దో నిషేధే. విక్ర మేణాగాధం దేశతశ్చ నిరవధికమిత్యర్థః. కించ. మగధేంద్రేణ చ పాలితం బలం. యదేవంభూతం. రామకృష్ణయోః కర్మోక్తం తత్పరం కేవలం. తయోర్విక్రీడనం. న తు పరాక్రమః.(27)

శ్లో॥ స్థిత్యుద్భవాంతం భువనత్రయస్య
యస్సమీహతేఽనంత గుణస్స్వ లీలయా ।
న తస్య చిత్రం పరపక్షనిగ్రహ
స్తథాపి మర్త్యానువిధస్య వర్ణ్యతే ॥ 28

అనంత గుణసంపన్నుడగు ఆ హరి తన లీలలతో ముల్లోకముల సృష్టి, స్థితి, లయములకు కారకుడు. అట్టివానికి శత్రుసైన్య విజయము చిత్రమేమియు కాదు. అయినను మానవానుకరణమిట వర్ణింపబడుచున్నది. (28)

టీ:- న చైతదాశ్చర్యమిత్యాహ. – స్థితీతి. తర్హి కిమిత్యాశ్చర్యమివ వర్ణితం తత్రాహ – తథాపీతి. మర్త్యాననువిధత్తే అనుకరోతీతి మర్త్యానువిధః తస్య. (28)

శ్లో॥ జగ్రాహ విరథం రామో జరాసంధం మహాబలమ్ ।
హతానీకావశిష్టా సుంసింహః క్షుద్రమృగం యథా ॥ 29

సింహము నీచమృగమునువలె, బలగము చావగ, ప్రాణములతో మిగిలిన మహాబలుడు, విరథుడునైన జరాసుతుని బలరాముడు పట్టుకొనెను. (29)

టీ:- కించ జగ్రహేతి. హతాన్యనీ కాని యస్య. అవశిష్టః అసవ ఏవ యస్య తం చ తం చ. (29)

శ్లో॥ బధ్యమానం హతారాతిం పాశైర్వారుణమానుషైః ।
వారయామాస గోవిందస్తేన కార్య చికీర్షయా ॥ 30

శ్లో॥ సముక్తో లోకనాథాభ్యాం వ్రీడితో వీరసంమతః ।
వివిక్షుస్తపసేఽరణ్యం పారితఃపథిరాజభిః ॥ 31

టీ:- బధ్యమానమితి. హతాః బహుశః అరాతయః శత్రవో యేన తం. తథా భూతమపి జరాసంధం బధ్యమానం. వారయామాస. (30-31)

అప్పటికే సగము చచ్చియున్న శత్రువును త్రాళ్ళతో బంధించుచుండగ వానితోమున్ముందు కార్యమున్నందున గోవిందుడు వలదని వారించెను. లోక రక్షకులతో విడువబడిన జరాసంధుడు సిగ్గుపడి అరణ్యమున తపస్సు చేయ నిశ్చయించు కొని పోవుచుండగా మార్గమధ్యమున రాజులచే వారింబడెను. (30-31)

శ్లో॥ వాక్యైః పవిత్రార్థపదైర్నయైశ్చప్రాకృతైరపి ।
స్వకర్మ బంధప్రాప్తశ్చ యదుభిస్తేపరాభవః ॥ 32

టీ:- వాక్యైరితి. పవిత్రార్థాని ధర్మోపదేశపరాణి పదాని యేషు తైః వాక్యైః నయైర్నీతిభిః. ప్రాకృతైః లౌకికైః తత్ర లౌకికన్యాయమహుః - స్వకర్మేతి. యదుభిరల్పకైః కృత్వా. తే మహతః పరాభవః కేవలం కర్మబంధేనైవ ప్రాప్తః అతస్త్వయా న లజ్జితవ్యమితి. (32)

అల్లులగు యాదవులచే మహానుభావుడగు మీకు చేయబడిన అవమానము పూర్వజన్మ కర్మానుసారమైనది. లజ్జింపనవసరములేదని ధర్మోపదేశ పరములగు నీతివాక్యములతోడను,లౌకిక వాక్యములతోడను జరాసంధుడు రాజులచే ఓదార్చబడెను. (32)

శ్లో॥ హతేషుసర్వానీకేశు ర్నుపోబార్హ్వద్రథస్తదా ।
ఉపేక్షితో భగవతామగధాన్ దుర్మనాయయౌ ॥ 33

టీ:- హతేష్వితి. బార్హ్వద్రథో జరాసంధః. (33)

సకల సైన్యము హతముకాగా అప్పుడు జరాసంధుడు భగవంతుడగు హరిచేత వదలబడినవాడై లజ్జతో వికలమనస్సుతో మగధను చేరపోయెను. (33)

శ్లో॥ ముకుందోప్యక్షత బలోనిస్తీర్ణారిబలార్ణవః।
వికీర్యమాణః కుసుమైస్త్రిదశైరనుమోదితః ॥ 34

టీ:- ముకుంద ఇతి. ముకుందో௨పి యయావిత్యానుషంగః. న క్షతం బలం యస్య సః తస్తైవా మృతదృష్ట్యాక్షతప్రతిసంధానాదితి భావః నిస్తీర్ణః. అనాయసేనైవ తీర్థః అరిబలార్ణవో యేన సః. సాధునా ద్విత్యనుమోదితశ్చ. (34)

ముకుందుడు కూడ పరబలసంద్రమును తరించి అక్షతమగు స్వసైన్యముతో దేవకాంతలు పూలవాన కురిపించుచుండగ వారి యనుమతితో మధురానగరమునకు పోయెను.(34)

శ్లో॥ మాధురైరుపసంగమ్య విజ్వరైర్ముదితాత్మభిః ।
ఉపగీయమాన విజయస్సూత మాగధ వందిభిః ॥ 35

టీ:- మాధురైరితి. ప్రత్యుద్గతైర్మధురావాసిభిః జనైరుపసంగమ్య మిళిత్వా.(35)

శ్రీకృష్ణభగవానుడు మధురను ప్రవేశించుచుండగా మధురాపుర జనులు ఆనంద పరవశులై ఎదురొచ్చిరి. శంఖ దుందుభులు అనేక తూర్యనాదములు మార్మోగుచుండెను. వీణవేణు గానములు మృదంగ ధ్వనులులతో ప్రజలు ముందు స్వాగతము పలుకుచుండిరి.(35-36)

శ్లో॥ శంఖ దుందుభయోనేదుర్భేరీ తూర్యాణ్యనేకశః ।
వీణవేణుమృదంగాని పురం ప్రవిశతి ప్రభౌ ॥ 36

టీ:- శంఖేతి. తథా ప్రవిశతి సతి. శంఖాదయో నేదుః. (36)

శ్లో॥ సిక్తమార్గాంహృష్టజనాం పతాకాభిరలంకృతామ్ ।
నిర్ఘుష్టాం బ్రహ్మఘోషేణ కౌతుకాబద్ధ తోరణామ్ ॥ 37

టీ:- కథం భూతాం పురీం తదాహ-సిక్తేతి. బ్రహ్మఘోషేణ వేదఘోషేణ నినాదితాం. నిర్ఘుష్టామ్. కౌతుకేణ - ఉత్సాహేన ఆసమంతాత్ బద్ధాని తోరణాని యస్యాం తాం. (37)

శ్లో॥ నిచీయమానో నోభిర్మాలాదధ్యక్షతాంకురైః ।
నిరీక్ష్యమాణస్సస్నేహం ప్రేత్యుత్కంఠిత లోచనైః ॥ 38

టీ:- నిచీయమాన ఇతి. నిచీయమానః వికీర్యమాణః ప్రవివేశేతి విపరిణామతోஉనుషంగః. (38)

శ్లో॥ ఆయోధనగతం విత్తమనంతంవీరభూషణమ్ ।
యదు రాజాయ తత్సర్వమాహతంప్రాదిశద్విభుః ॥ 39

మార్గమునందంతట కల్లాపుచల్లి స్త్రీలు రంగవల్లులను తీర్చి ధ్వజ పతాకములనలంకరించియుండగ, విప్రులు వేదపాఠములతో కీర్తించుచుండగ, సుందరీమణులు పూలమాలలతో, దధి అక్షతలతో, ఆదరపూర్వక నేత్రములతో నెదురుచూచుండగా యుద్ధరంగమున సేకరించిన వీరభూషణ విత్తములతో మధురను ప్రవేశించి మధుర రాజుకు సమస్తమును సమర్పించెను. (37-39)

టీ:- ఆయోధనేతి. ఆయోధనం రణభూమిః. తత్రస్థం విత్తం. వీరాణాం. భూషణం. (39)

శ్లో॥ ఏవం సప్త దశకృత్వస్తావత్య క్షౌణిహీబలః ।
యుయుధే మాగధోరాజా యదుభిః కృష్ణపాలితైః ॥ 40

ఈవిధముగ పరాభవము పాలయ్యును జరాసుతుడు పదిహేడు మారులుఅంతే అక్షౌహిణుల బలమును సమకూర్చుకొని కృష్ణ రక్షకులైన యాదవులతో సంగరమొనర్చెను. (40)

టీ:- ఏవమితి. తావతీతి ఛేధః. తావతి పరాజయే వర్తమానేఽపి అక్షౌహిణ్యోబలం యస్య సః. సప్తదశ కృత్వః సప్తదశవారాన్ యుయుధే. (40)

శ్లో॥ అక్షిణ్వంస్తద్బలం సర్వం వృష్ణయః కృష్ణ తేజసా ।
హతేషు స్వేష్వనకేషు త్యక్తోయాదరిభిర్నృప ॥ 41

ఓ రాజా! యదుబలగము కృష్ణపరమాత్ముని శక్తితో జరాసంధ సైన్యమునంతటిని నశింపజేసిరి. జరాసంధుడు శత్రువులచేత చిక్కి సైన్యమంతయు మరణించిన తరువాత విడిచిపెట్టబడిన వాడై మగధకు పోయెను. (41)

టీ:- అక్షిణ్వన్నితి. అక్షిణ్వన్ క్షయం నిన్యుః. (41)

శ్లో॥ అష్టాదశేతు సంగ్రామ ఆగామిని తదంతరా ।
నారదప్రేషితో వీరో యవనః ప్రత్య పద్యత ॥ 42

పదునెనిమిదవ సంగ్రామకాలము సమీపించులోగా మధ్యలో నారదప్రేరితుడై వీరుడు యవనుడగు కాలయవనుడు అకస్మాత్తుగ దండెత్తివచ్చెను. (42)

టీ:- అష్టాదశ ఇతి. అష్టాదశే సంగ్రామే భావ్యే తన్మధ్యే అకస్మాత్కాల యవనః ప్రాప్తః. (42)

శ్లో॥ రురుధ మధురామేత్యతిస్రుభిర్మ్లేచ్ఛ కోటిభిః ।
నృలోకేచాప్రతి ద్వంద్వోవృష్ణీంశ్ఛుత్వాత్మ సమ్మితాన్॥ 43

టీ:- రురోధేతి. ఆత్మసమ్మితాన్ స్వతుల్యాన్. 43

శ్లో॥ తంద్రుష్ట్వాచింతయత్కృష్ణ స్సంకర్షణ సహాయవాన్ ।
అహో యదూనాం వృజిన ప్రాప్తంహ్యుభయతో మహత్ ॥44

టీ:-తమితి. వృజినం దుఃఖం ఉభయతః యవనాజ్జరాసంధాశ్చ. 44

శ్లో॥ యవనోయం నిరుంధేస్మానద్య తావన్మహాబలః ।
మాగధోప్యద్యవాశ్వోవా పరశ్వోవా గమిష్యతి ॥ 45

టీ:- తదాహ- ద్వయేన. యవన ఇతి. నిరుంధే నిరుణద్ధి. 45

శ్లో॥ ఆవయోర్యుధ్యతోరస్య యద్యాగంతా జరాసుతః ।
బంధూన్ హనిష్యత్యథవా నేష్యతి స్వపురంబలీ ॥ 46

శ్లో॥ తస్మాదద్యవిధాస్యామో దుర్గం ద్విపద దుర్గమమ్ ।
తత్రజ్ఞాతీన్ సమాధాయ యవనం ఘాతయావహే ॥ 47

టీ:- అవయోరితి. అస్య అనేన సహ.(46-47)

నరలోకమున సాటియగువారు లేనట్టి తనతో సమానమైన బలపరాక్రమములుకలిగినట్టి వారిని వృష్ణులను విని మూడుకోట్లమ్లేచ్ఛులతోకాలయవనుడు మధురను దరిశి ముట్టడించెను. (43)

వానిని చూచి బలరామ సహాతయుడైన కృష్ణుడు ఆహా! ఇరువైపులనుండి యాదవులకు మహాదుఃఖ మాపతిత మైనదికదా.యని ఆలోచించెను.(44)

నేడు మహాబలవంతుడైన కాలయవనుడు మమ్ముల నెదుర్కొనుటకు వచ్చియున్నాడు. రేపోమాపో మగధుడు జరాసంధుడు కూడా రాగలరు. (45)

మేమిరువురము కాలయవనునితోనేడు యుద్ధము చేయుచుండగ జరాసంధుడు వచ్చినట్లయినచోవాడు వృష్ణివంశీయుల నందరిని చంపగలడు లేదా బంధించి మగధకు కొంపోగలడు. అందువల్ల నేడు గజబలము ప్రవేశంపజాలని దుర్గమును నిర్మించి, అచట బంధువులనెల్ల సమాధానపరచి యుంచి కాలయవనుని కడతేర్చుదము. (46-47)

శ్లో॥ ఇతి సంమంత్ర్య భగవాన్ దుర్గం ద్వాదశయోజనమ్ ।
అంతస్సముద్రేనగరం కృత్స్నాద్భుతమచీకరత్ ॥ 48

టీ:- ఇతీతి. సముద్రమధ్యే దుర్గం తన్మధ్యే నగరం కృత్స్నాద్భుతం సర్వాశ్చర్యమయంఈ అచీకరత్ కారయామాస. (48)

అని ఆలోచించి భగవంతుడు కృష్ణుడు సముద్రమధ్యమున పండ్రెండామడల వీస్తీర్ణమైన దుర్గమును సర్వాద్భుతమగు నగరమును నిర్మించెను. (48)

శ్లో॥ దృశ్యతే యత్రహిత్వాష్టం విజ్ఞానం శిల్ప నైపుణ్యమ్ ॥49

టీ:- దృశ్యత ఇతి. త్వష్టా విశ్వకర్మా తదీయం శిల్పనైపుణ్యం క్రియా కౌశలం. (49)

శ్లో॥ రథ్యాచత్వరవీథీభిర్యథా వాస్తువినిర్మితమ్ ।
సురద్రుమ లతోద్యాన విచిత్రోపవనాన్వితం ॥50

టీ:- తదాహ సార్ధైస్త్రిభిః.- రథ్యేతి. రథ్యాః రాజమార్గాః పురతః వీథ్యః ఉపమార్గాః పశ్చిమతః. ఉభయతోఽపి చత్వరాణ్యంగణాని. తన్మధ్యే గోష్ఠాః. తతోఽప్యంతః సువర్ణభవనాని తదుపరి స్ఫాటికాట్టాలకాః తదుపరి హేమకుంభాః ఇతి బహుభూమికం యథా వాస్తుగృహదీనాం నిర్మాణ స్థానం. తదనతిక్రమ్య వినిర్మితం. సురాణాం ద్రుమాః లతాశ్చ యేషు తాన్యుద్యానాని. విచిత్రోపవనాని చ తైరన్వితం. (50)

అచట విశ్వకర్మ శిల్పనైపుణ్య విజ్ఞానమంతయు కలదు. వాస్తుపద్ధతిగా రాజమార్గములు, ఉపమార్గములు,కూడళ్ళు, ముంగిళ్లు, సువర్ణ భవనములు, వాటిపై స్ఫటికములు పొదిగిన బురుజులు వాటిపై బంగారుకలశములు,కల్పలతలు,పారిజాత వృక్షములుగల విచిత్ర ఉద్యానవనములతోడను. (49-50)

శ్లో॥ హేమ శృంగైర్దివిస్పృగ్భి స్స్ఫాటి కాట్టాల గోపురైః ।
రాజ తారకుటైర్జుష్టం హైమకుంభైస్స్వలంకృతైః ॥ 51

టీ:- హేమేతి. హేమమయాని శృంగాణి యేషాం తైః దివిస్పృగ్భి రత్యుచ్చైః. స్ఫాటికాట్టాలకాః ఉపరితనభూమికాః గోపురాణి ద్వారాణి చ తైర్నిర్మి తమిత్యుత్తరేణాన్వయః . రాజతారకుటైః రజతం చ అరకుటం చ పీతలలోహం తాభ్యాం నిర్మితైః కోష్ఠైః అశ్వశాలాన్న శాలాదిభిః. కథంభూతైహైమైః కుంభైః అలంకృతైః. (51)

ఆకాశమునంటుచున్న బంగారపు కొమ్ములతోను స్ఫటికములను పొదిగిన అంచులుగల గోపురద్వారములతోడను, వెండి,ఇత్తళ్ళతో నిర్మితమైన బంగరు కలశములతో నలంకరింపబడిన అశ్వశాలలు అన్నశాలలతోడను. (51)

శ్లో॥ రత్నకూటైర్గృహైర్హైమైర్మహామరకతస్థలైః ।
వాస్తోష్పతీనాం చ గృహైర్వలభీభిశ్చ నిర్మితమ్ ॥
చాతుర్వర్ణ్యం జనాకీర్ణం యదు దేవగృహోల్లసత్ ॥ 52

టీ:- రత్నేతీ. తథా రత్నకూటైః పద్మరాగాది శిఖరైః హైమైః సౌవర్ణైః మహామరకతమయాని స్థలాని యేషు తైః గృహైశ్చ. కించ. నగరగృహ ద్వారదౌ వాస్తోష్పతీనాం చ గృహైః వలభీభిశ్చంద్రశాలాభిశ్చ నిర్మితం. యదుదేవగృహైః రాజ గృహైరుల్లసత్ శోభమానం. (52)

పద్మరాగమణులతికిన సువర్ణమయ శిఖరములు కలిగినట్టి, మరకతమణులు పొదిగిన నేలలుగలగృహములతోడ మరియు నగరగృహ ద్వారముల ముందు ఇంద్రాదుల గృహములతోడను చంద్రకాంత మణులతోడను, చాతుర్వర్ణ్య జనులతో సందడిగనున్న యాదవరాజు గృహము శోభిల్లుచుండెను. (52)

శ్లో॥ సుధర్మాం పారిజాతంచ మహేంద్రః ప్రాహిణోద్ధరేః ।
యత్రచావస్థితో మర్త్యోమర్త్య ధర్మైర్న యుజ్యతే ॥ 53

మానవావతారమున ప్రాణిధర్మములైన ఆకలిదప్పులతోడను, మనోధర్మములగు శోకమోహములతోడను, దేహధర్మములగు జననమరణములతో నొప్పుచున్నహరికి ఇంద్రుడు పారిజాత వృక్షమును సుధర్మయను దేవసభను పంపెను. (53)

శ్లో॥ శ్యామైక కర్ణాన్ వరుణోహయాంచ్ఛుక్లాన్ మనోజవాన్ ।
దదౌ సహస్ర సంఖ్యాతాన్ దేవదేవాయ తోయరాట్ ॥ 54

మున్నీటికధిపతియగు వరుణుడు శ్యామవర్ణపు చెవులు కల్గి మనోజవముకల తెల్లనిగుఱ్ఱములను వేలకొలదిగపంపెను. (54)

టీ:- సుధర్మామితి. పారిజాతం చ ప్రాహిణోత్ ప్రస్థాపయామాసేతి శుకపరిక్షిత్సంవాదాత్పూర్వభావిత్వాద్భూతనిర్దేశః మర్త్యధర్మైః క్షుత్పిపాసాదిభిష్షడూర్మిభిః. (53-54)

శ్లో॥ అష్టౌనిధిపతిః కోశాన్ లోకపాలో నిజోదయాన్ ।
తథాన్యే లోకపాలాశ్చ దదుస్స్వాధికృతం ధనమ్ ॥ 55

ఇంకను ధనపతి లోకపాలుడునగు కుబేరుడు తనవైన మహాపద్మ, పద్మ, మత్స్య, కూర్మ, ఉదక, నీలముకుంద, శంఖములను అష్టనిధులను, ఇతర లోకపాలురు కూడా తమతమ ధనాదులను సమర్పించిరి. (55)

టీ:- అష్టావితి. నిధిపతిః కుభేరః అష్టౌ కోశాన్ నిధీన్. శ్లో."పద్మశ్చైవ మహాపద్మో మత్స్యం కూర్మస్తథోదకః, నీలో ముకుందశ్శంఖశ్చ నిధయోఽష్టౌ ప్రకీర్తితాః" ఇతి. ప్రసిద్ధాన్ నిజోదయాన్ నిజవిభూతీన్ అన్యే చ సిద్ధాదయః. (55)

శ్లో॥ యద్యద్భగవతా దత్త మాధిపత్యంస్వసిద్ధయే ।
సర్వం ప్రత్యర్పయామాసుర్హరౌ భూమింగతేనృప ॥ 56

టీ:- యదితి. భగవతా స్వాధికారసిద్ధయే యద్యదాధిపత్యం దత్తమాసీత్. తత్సర్వం ప్రత్యర్పయామాసురితి. (56)

ఓ రాజా ! హరి భూమియందవతరిపగనే ఇంద్రాది దేవతలు హరి తమకు కల్పించిన ఆధిపత్య సిద్ధులను ప్రత్యర్పణము గావించిరి. (56)

శ్లో॥ తత్రయోగప్రభావేన నీత్వా సర్వజనం హరిః ।
ప్రత్యాగత్యాథరామేణ కృష్ణస్సమనుమంత్రితః ।
నిర్జగామపురద్వారాత్పద్మమాలీ నిరాయుధః ॥57

టీ:- తత్రేతి. యథాకాలయవనో న వేత్తి. సచాసౌ జనః. తథా యోగప్రభావేన నీత్వా త్వమత్ర స్థిత్వా ప్రజాః పాలయ అహం పలాయిష్య ఇతి సమనుమంత్రితః కృతానుమంత్ర ఇత్యర్థః. (57)

కాలయవనునకు తెలియకుండగ హరి యోగ మాయతో స్వజనమునంతటిని ఆనగరమునకు గొనిపోయివిడిచి మరలి వచ్చి బలరామునితో నీవు వీరిని రక్షించుచుండుము. నేను పలాయనము చిత్తగించెదనని వచించి నిరాయుధుడై పట్టణమునుండినిర్గమించెను. (57)

**ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే, పంచాశత్తమోऽధ్యాయః**

**శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు యాభైయవ అధ్యాయము సమాప్తము**

## ఏకపంచాశత్తమోஉధ్యాయః

శ్లో॥ ఏక పంచాశత్తమేஉహన్ ముచికుందదృశాహరిః ।
యవనం ముచికుందేన స్తుతస్సన్నన్వకంపత ॥
యవనేంద్రసుతాత్కాలయవనాద్యదుభీషణాత్ ।
హరిర్ద్వారగిరస్స్వైరం పాలానాయా పలాయత ॥

యదా గర్గః స్యాలేన షండ ఇత్యుక్తస్తదాయాదవైరుపహసితః క్రుద్ధోஉసౌ శ్రీమహేశ్వరం ప్రసాద్య యదుభీషణం పుత్రం వరం లబ్ధవాన్. తతశ్చ యవనేంద్రేణ పుత్రేణ స్వక్షేత్రే పుత్రోత్పాదనాయ ప్రార్థితః. గర్గః తత్క్షేత్రే కాలయవనమజీజనదితి పురాణ ప్రసిద్ధం.

## 51వ అధ్యాయము

ఈ యాబదియొక్క అధ్యాయమునందు హరి కాలయవనున్ని ముచుకుందుని చూపులతో సంహరింపజేసెను. ముచుకుందుడు హరిని సందర్శించి స్తుతించెను. హరి ముచుకుంద నను(గహించెను. యవనేంద్ర సుతుడగు కాలయవనుడు యాదవులకు భయంకరుడు కావున హరి పరమేశ్వరుని పలుకులను పాలించుటకై వాని నుండి తప్పించుకొని పారిపోయను. ఒకప్పుడుగర్గుని వాని బావమరిది నీవు నపుంసకుడవని అవమానించెను. ఆకోపముతో గర్గుడు మహేశ్వరుని ప్రసన్నుని చేసికొని యదు భయంకరుడగు పుత్రుని పొందినట్లుగ వరమును పొందెను. ఈవిషయమునెరిగిన యవనేంద్రుడు స్వక్షేత్రమున పుత్రుని పొందమని ప్రార్థించి గర్గుని తన ఆలమందలో తెచ్చి దించెను. ఆచట ఆతనిని కామించిన అప్సరస వలన గర్గుడు పుత్రుని పడసెను. అతడే కాలయవనుడు. అమిత బలోపేతుడు.– ఇది ప్రసిద్ధ పురాణకథ.

## ముచుకుందస్య శ్రీకృష్ణ సందర్శనాది కథా ప్రారంభఘట్టః.

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ తం విలోక్య వినిష్క్రాంత ముజ్జిహాన మివోడుపమ్ ।
దర్శనీయతమం శ్యామం పీతకౌశేయవాససమ్ ॥1

శ్లో॥ శ్రీవత్స వక్షసం భ్రాజత్కౌస్తుభా ముక్తకంధరమ్ ।
పృథు దీర్ఘ చతుర్బాహుం నవకంజారుణేక్షణమ్ ॥ 2

టీ:- తమితి. పురద్వారాద్వినిష్క్రాంతం ఉజ్జిహానం ఉద్గచ్ఛంతం. (1-2)

శ్లో॥ నిత్యం ప్రముదితం శ్రీమత్సుకపోలం శుచిస్మితమ్ ।
ముఖారవిందం బిభ్రాణం స్ఫురన్మకరకుండలమ్ ॥ 3

శ్లో॥ వాసుదేవో హ్యయమితి పుమాన్ శ్రీవత్సలాంఛనః ।
చతుర్భుజోऽరవిందాక్షో వనమాల్యతి సుందరః ॥ 4

టీ:- నిత్యమితి. నిత్యం ప్రముదితమితి. ముఖారవింద విశేషణం. (3-4)

## ముచుకుందునకు శ్రీకృష్ణ దర్శన కథా ప్రారంభఘట్టము.

**శ్రీ శుకుడు పలికెను.**

దర్శనీయుడు, శ్యామలవర్ణుడు, పీతాంబరధారి, శ్రీవత్స వక్షాంకితుడు, కౌస్తుభధారి, ముత్యాలహారములతో విరాజిల్లు కంఠము కలవాడు, ఆజానుబాహువు, పద్మపత్రనేత్రుడునగు, ఆకసమున వెలుగుచున్న చంద్రునివలె పురమునుండి వెడలిపోవుచున్న హరిని కాలయవనుడు చూచి (చూచెను) (1-2)

ఎల్లవేళల ఆనందముతో విరాజిల్లు కపోలములు కలిగినట్టి, స్వచ్ఛమగు చిర్నగవు కలిగినట్టి, మకరకుండలములతో భాసించు ముఖపద్మము కలిగినట్టి, శ్రీవత్సలాంఛనుడు, అరవిందాక్షుడు, చతుర్భుజుడు, వనమాలాధారణముచే అతిలోక సుందరుడగు ఈ పురుషుడు వాసుదేవుడేయని, (నిశ్చయించుకొనెను) (3-4)

శ్లో॥ లక్షణైర్నారదప్రోక్తైర్నాన్యో భవితమర్హతి ।
నిరాయుధశ్చలన్ పద్భ్యాంయోత్స్యేఽనేన నిరాయుధః ॥ 5

టీ:- లక్షణైరితి. నారదోక్తైరేతైర్లక్షణైరయం పుమాన్ వాసుదేవ ఏవ నాన్యో భవితు మర్హతి అయం చ నిరాయుధః. అతోఽనేన పద్భ్యామేవ చలన్నిరాయుధోఽహం యోత్స్యే. 5

నారదమహర్షిచే చెప్పబడిన ఈ లక్షణములచే, మరియొకడగుటకు వీలులేదని, నిరాయుధుడుగనే పోయి యుద్ధము చేయుదునని తలంచెను. 5

శ్లో॥ ఇతి నిశ్చిత్యయవనః ప్రాద్రవంతం పరాఙ్ముఖమ్ ।
అన్వధావజ్జిఘృక్షుస్తందురాపమపి యోగినామ్ ॥ 6

టీ:- ఇతీతి. ఇతి ఏవం ప్రకారేణ నిశ్చిత్య తం పరాఙ్ముఖం ప్రాద్రవంత మన్వధావదిత్యన్వయః. 6

అని నిశ్చయించుకొని కాలయవనుడు పడమటి దిక్కుగ పరుగిడుచున్న, యోగులు సైతము పొందరాని శ్రీకృష్ణుని జయింప గోరి వెంటబడెను. 6

శ్లో॥ హస్త ప్రాప్తమివాత్మానం హరిణా స పదే పదే ।
నీతో దర్శయతా దూరం యవనేశోఽద్రికందరమ్ ॥ 7

టీ:- హస్తేతి. ఆత్మానం హస్తప్రాప్తమివ దర్శయతా. దూరం నీత ఇత్యన్వయః. 7

శ్రీహరి తానే తన చేతికిచిక్కుతున్నట్లుగనే మాటి మాటికి నటించుచునే, దూరమున నున్న పర్వతగుహకు కాలయవనునితీసుకొని పోయెను. 7

శ్లో॥ పలాయనం యదుకులే జాతస్య తవనోచితమ్ ।
ఇతిక్షిపన్ననుగతో నైనం ప్రాపహతాశుభః ॥ 8

శ్లో॥ ఏవం క్షిప్తోఽపి భగవాన్ప్రావిశద్గిరి కందరమ్ ।
సోఽపి ప్రవిష్టస్తత్రాన్యం శయానాం దదృశేనరమ్ ॥ 9

టీ:- పలాయనమితి. హతాశుభః క్షీణకర్మా. (8-9)

నశించిన పుణ్యకర్మగల కాలయవనుడు, ఓ కృష్ణా! యాదవ కులమున జన్మించిన నీవు పారిపోవుట తగదని ఆక్షేపించుచు వెంటబడియు హరిని దరిజేరలేకపోయెను. ఇట్లు నిందింపబడిన కృష్ణుడు పర్వత గుహను ప్రవేశించెను. కాలయవనుడును అందు ప్రవేశించి అచట శయనించి యున్న వేరొక నరున్ని చూచెను.(8-9)

శ్లో॥ నన్వసౌ దూరమానీయ శేతేమామిహ సాధువత్ ।
ఇతి మత్వాచ్యుతం మూఢస్తం పదాసమతాడయత్ ॥ 10

శ్లో॥ స ఉత్థాయ చిరం సుప్తశ్శనైరున్మీల్య లోచనే ।
దిశో విలోకయన్పార్శ్వే తమద్రాక్షీదవస్థితమ్ ॥ 11

టీ:- నన్వితి. తంశయాన మచ్యుతం మత్వా అతాడయదితి. (10-11)

ఈ శ్రీకృష్ణుడు నన్ను ఇంతదూరము తీసికొని వచ్చి తాను మాత్రము సాధువు వలె శయనించి యున్నాడు. అని ఆ మూఢుడు అతని నచ్యుతుగానే భావించి కాలితో బలముగ తన్నెను. చాలా కాలము నుండి యోగనిద్రయందున్న ఆ నరుడు మెల్లగ కనులు తెరచి దిక్కులు పరికించుచు ప్రక్కనేయున్న కాలయవనుని కాంచెను.(10-11)

శ్లో॥ సతావత్తస్యరుష్టస్య దృష్టిపాతేన భారత ।
దేహజేనాగ్నినా దగ్ధో భస్మసాదభవత్క్షణాత్ ॥ 12

టీ:- స ఇతి. తస్య క్రుద్ధస్య దృష్టిపాతేన సందీప్తోయః స్వదేహజోఽగ్నిస్తేన. 12

ఓ రాజా! కోపగించిన ఆ వ్యక్తి దృష్టిపాతముతో దేహమునుండి పుట్టిన అగ్ని వలన దహింపబడిన వాడై కాలయవనుడు క్షణములో బూడిదయ్యెను. 12

**రాజోవాచ**

శ్లో॥ కోనామ స పుమాన్బ్రహ్మన్కస్య కిం వీర్య ఏవ వా ।
కస్మాద్గుహాంగతశ్శిశ్యే కింతేజో యవనార్దనః ॥ 13

టీ:- క ఇతి. యవనమర్దయతి హినస్తీతి యవనార్దనః. తథా సకస్య వంశ్యః? కింవీర్యః? కీదృక్ ప్రభావవాన్? కింతేజః? కస్య వీర్యం? పుత్ర ఇత్యర్థః. శిశ్యే ఆశయిష్ట. 13

**రాజు పలికెను.**

ఓ మహర్షీ ! ఆ నరుని పేరేమి? ఆయన ఎవరు? యవనుని చంపిన అతని వంశమేది? ఎంతటి బలసంపన్నుడు? ఎట్టి మహిమ కలవాడు? ఆ తేజస్సుకు మూలమేది? ఎవరి సుతుడు? ఎందుకా గుహ మధ్యమును చేరి శయనించియున్నాడు? అని రాజు అడిగెను. 13

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ స ఇక్ష్వాకుకులేజాతో మాంధాతృ తనయో మహాన్ ।
ముచుకుంద ఇతి ఖ్యాతో బ్రహ్మణ్యస్సత్య సంగరః ॥ 14

శ్లో॥ స యాచితస్సురగణైరింద్రాద్యైరాత్మ రక్షణే ।
అసురేభ్యః పరిత్రస్తైస్తద్రక్షాం సోఽకరోచ్చిరమ్ ॥ 15

టీ:- స ఇతి. సత్యః సంగరో యుద్ధం ప్రతిజ్ఞా వాయస్యసః. (14-15)

**శ్రీ శుకులు పలికిరి**

ఆయన ఇక్ష్వాకు వంశమున పుట్టినవాడు. మహనీయుడు, మాంధాత తనయుడు. బ్రహ్మజ్ఞాని, సత్యప్రతిజ్ఞుడు. పేరు ముచుకుందుడు. ధర్మయుద్ధము చేయువాడు. రాక్షస భీతులగు దేవతలు తమను రక్షింపమని యాచించగా వారిని చాలకాలము రక్షించెను. (14-15)

శ్లో॥ లబ్ధ్వా గుహంతేస్వః పాలంముచుకుందమథా బ్రువన్ ।
రాజన్ విరమతాం కృచ్ఛ్రాద్భవాన్నః పరిపాలనాత్ ॥ 16

టీ:- లబ్ధ్వేతి. గుహం కార్త్తికేయం. స్వః పాలం స్వర్గపాలకం సేనాన్యం. 16

దేవతలు కార్త్తికేయుని స్వర్గ పాలకునిగ పొందిన అనంతరము ఓ రాజా! మా రక్షణ బాధ్యత నుండి ఇక నీవు విరమింపుము. అని ముచుకుందునితోననిరి. 16

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ నరలోకం పరిత్యజ్య రాజ్యం చ హతకంటకమ్ ।
అస్మాన్ పాలయతో వీరకామాస్తే సర్వ ఉజ్ఝితాః ॥ 17

టీ:- నరలోకమితి. ఉజ్ఝితాస్త్యక్తాః గతా ఇత్యర్థః. 17

ఓ వీరా! మానవలోకమును సుఖమయమైన రాజ్యమును వదిలి వచ్చి మమ్ములను రక్షించిన నీచే సకల కామములు వదిలివేయబడినవి. 17

శ్లో॥ సుతామహిష్యో భవతో జ్ఞాతయో భృత్యమంత్రిణః ।
ప్రజాశ్చ తుల్యకాలీయా సాధునాసన్తి కాలితాః ॥ 18

టీ:- కించ సుతా ఇతి. తుల్యకాలీయాః త్వత్సమానకాలీయాః కాలితాః విచాలితాః. 18

నీ భార్యా బిడ్డలు, దాయాదులు, సేవకులు, అమాత్యులు, నీ సమకాలీనులైన ప్రజలు, నీతో తిరిగిన మిత్రులు, ఇప్పుడు లేరు. 18

శ్లో॥ కాలోబలీయాన్ బలినాం భగవానీశ్వరోఽవ్యయః ।
ప్రజాః కాలయతే క్రీడన్ పశుపాలో యథా పశూన్ ॥ 19

టీ:- మత్ప్రజాః కోఽన్యః కాలయేదితి చేదత ఆహుః - కాల ఇతి. కాలయతే ఇత స్తతశ్చాలయతి. 19

కాలము బలీయమైనది. అవ్యయుడు భగవంతుడు నగు పరమేశ్వరుడు బలఢ్యులలో బలీయుడు. పశువులనుకాయువాడు పశువులతో వలె, ప్రజలతో నాడుకొనుచు ప్రజలను ఇటునటు త్రిప్పుచున్నాడు. 19

శ్లో॥ వరం వృణీష్వ భద్రం తే ఋతే కైవల్యమద్య నః ।
ఏక ఏవేశ్వరస్తస్య భగవాన్ విష్ణు రవ్యయః ॥ 20

టీ:- వరమితి. తస్య కైవల్యస్య. 20

ఓ ముచుకుందా! నీకు మంగళమగుగాక ! కైవల్యముదప్ప నేదేని వరమును కోరుకొమ్ము. మనకు ముక్తిని ప్రసాదించువాడు భగవంతుడు. అవ్యయుడునగు విష్ణువొక్కడే. ఆ విష్ణువే సమస్త సృష్టికి ఈశుడు. 20

శ్లో॥ ఏవముక్తస్సవైదేవానభివాద్య మహాయశాః ।
అశయిష్ట గుహావిష్టో నిద్రయా దేవదత్తయా ॥ 21

శ్లో॥ యవనే భస్మతాంనీతే భగవాన్ సాత్వతర్షభః ।
ఆత్మానం దర్శయామాస ముచుకుందాయ ధీమతే ॥ 22

శ్లో॥ తమాలోక్య ఘనశ్యామం పీతకకౌశేయ వాససమ్ ।
శ్రీవత్సవక్షసం భ్రాజత్కౌస్తుభేన విరాజితమ్ ॥ 23

శ్లో॥ చతుర్భుజం రోచమానం వైజయంత్యాచమాలయా ।
చారు ప్రసన్నవదనం స్ఫురన్మకరకుండలమ్ ॥ 24

శ్లో॥ ప్రేక్షణీయం త్రిలోకస్య సానురాగస్మితేక్షణమ్ ।
అపీచ్య వయసం మత్తమృగేంద్రోదార విక్రమమ్ ॥ 25

టీ:- ఏవమితి. గుహాం ప్రవిష్టః శేతేస్మ.(21-25)

అని ఇట్లు దేవతలు పలుకగ ఆ మహనీయుడు దేవతలకు నమస్కరించి పర్వతగుహను ప్రవేశించి, దేవదత్తమగు నిద్రతో శయనించెను. ఓ సుమతీ! యవనుడు భస్మము చేయబడగనే యదుకుల శ్రేష్ఠుడగు భగవంతుడు కృష్ణుడు ముచుకుందునకు స్వ స్వరూపమును దర్శింపజేసెను. ఆ మేఘశ్యాముని, పీతాంబరధారిని, శ్రీవత్సాంకితవక్షసుని కాంతులీనుచున్న కౌస్తుభమణితో విరాజిల్లు చున్నట్టి, చతుర్భుజములతో, వైజయంతి మాలలతో ప్రకాశించు చున్నట్టి, మకరకుండలములతో, అందమైన ప్రసన్నవదనములతోడను, ముల్లోకములకు ముచ్చటగ చూడవలయునను కోరిక కల్గించునట్టి, అనురాగము చిరునగవుల చూపులు కల్గినట్టి, తరుణ వయస్సుతో మదించిన సింగము వంటి విక్రమము గల ఆ విష్ణువును చూచి, (21-25)

శ్లో॥ పరపృచ్ఛన్మహాబుద్ధిస్తేజసా తస్య ధర్షితః ।
శంకితశ్శనకై రాజన్ దుర్ధర్షమివ తేజసా ॥ 26

టీ:- పరపృచ్ఛదితి. ధర్షితః అభిభూతః దుర్ధర్షం. 26

ఓ రాజా! ఆ మహానుభావుని తేజస్సుచే తిరస్కృతుడై సమీపింప నలవికాని ఆ తేజోవంతుని సందేహించుచు ప్రశ్నించెను. 26

ముచుకుంద ఉవాచ

శ్లో॥ కో భవానిహసంప్రాప్తోవిపినే గిరిగహ్వరే ।
పద్భ్యాం పద్మపలాశాభ్యాం విచరస్యురు కంటకే ॥ 27

టీ:- క ఇతి. విపినే అరణ్యే. తత్రాపి గిరేః గహ్వరే దుష్ప్రవేశస్థానే. తత్రాపి. ఉరుకంటకే పద్మపలాశసదృశాభ్యాం విచరసి. 27

శ్లో॥ కింస్విత్తేజస్వినాం తేజో భగవాంస్త్వం విభావసుః ।
సూర్యస్సోమో మహేంద్రోవా లోకపాలో పరో౽పివా ॥ 28

టీ:- కింస్విదితి. తేజః మూర్తిః ప్రభావో దీప్తిమాన్. 28

శ్లో॥ మన్యే త్వాం దేవదేవానాం త్రయాణాం పురుషర్షభమ్ ।
యద్బాధసే గుహాధ్వాంతం ప్రదీపః ప్రభయా యథా ॥ 29

శ్లో॥ శుశ్రూషతామవ్యలీకమస్మాకం నరపుంగవ ।
స్వజన్మ కర్మ గోత్రంవా కథ్యతాం యదిరోచతే ॥ 30

టీ:- తత్రాపరితోషాదాహ.- మన్య ఇతి. పురుషర్షభం శ్రీవిష్ణుం గుహాధ్వాంతం అంతస్తమః. (29-30)

ముచుకుందుడు పలికెను

మహారణ్యమునందలి ఈ పర్వత గుహయందు ప్రవేశించిన నీవెవరు? ముండ్లతో నిండిన ఈ విపినము నందు పద్మములు, మోదుగు పుష్పదళముల వలె సుకుమారమైన పాదములతో తిరుగాడు చున్నావు. 27

నీవు తేజోవంతులకంటె తేజోమూర్తియగు భగవంతుడగు అగ్నివా? లేక సూర్యుడవా? చంద్రుడవా? మహేంద్రుడవా? లోకపాలుడవా? లేక ఇంకను ఇతరుడవా? 28

నిన్ను దేవదేవులగు త్రిమూర్తులలో విష్ణువని తలంచు చున్నాను. ఎందుకనగ ఈ గుహ మధ్యమునందలి చీకటిని దీపకాంతివలె పటాపంచలు చేయుచున్నావు. నరపుంగవా! సేవించువారికి అప్రియమైనను మీకిష్టమగుచో తమ జన్మ కర్మ గోత్రములను చెప్పవలయునని కోరుచున్నాను.(29-30)

శ్లో॥ వయం తు పురుషవ్యాఘ్ర ఐక్ష్వాకాః క్షత్రబంధవః ।
ముచుకుంద ఇతి ప్రోక్తో యౌవనాశ్వాత్మజః ప్రభో ॥31

ఓ పురుషపుంగవా! మేము ఇక్ష్వాకు వంశీయులము. క్షత్రియ బంధువులము. ఓ ప్రభూ! నన్ను ముచుకుందుడందురు. యౌవనాశ్వుని సుతుడను.

శ్లో॥ చిర ప్రజాగరశ్రాంతో నిద్రయాఽపహృతేంద్రియః ।
శయేఽస్మిన్విపినే కామం కేనాప్యుత్థాపితోఽధునా ॥ 32

చాలాకాలము మేల్కొని యుండుటచే అలసియుండి ఈ విపినమునందలి పర్వత గుహాంతరమున నిద్రతో ఇంద్రియశక్తిని కోల్పోయి తృప్తిదీరా శయనించితిని. ఇపుడు ఎవరి చేతనో మేల్కొలుప బడితిని.

శ్లో॥ సోఽపి భస్మీకృతో నూనమాత్మీయేనైవ పాప్మనా ।
అనంతరం భవాన్ శ్రీమాన్ లక్షితోఽమిత్రశాసన ॥ 33

నిద్రలేపినవాడు నిశ్చయముగ స్వపాప కర్మ వశమున బూడిదచేయబడెను. పిమ్మట ఓశత్రునిర్మూలనా! నీవు నాచే చూడబడితివి.

శ్లో॥ తేజసాతేఽవిషహ్యేణ భూరి ద్రష్టుం న శక్నుమః ।
తతోపై త్వం మహాభాగ మాననీయోఽసి దేహినామ్ ॥ 34

నీ తేజము సహింపతగని దగుటచే మాటిమాటికి చూడజాలకున్నాము. అందువల్ల మహానుభావా! నీవు మానవులకు మాననీయుడవు.

శ్లో॥ ఏవం సంభాషితో రాజ్ఞా భగవాన్ భూతభావనః ।
ప్రత్యాహ ప్రహసన్ వాణ్యామేఘనాదగభీరయా ॥ 35

ఇట్లు ముచుకుందుడనగ ప్రాణులచే కీర్తనీయుడైన భగవంతుడు చిరునగవుతో మేఘ గంభీరమైన వాక్కులతో బదులు పలికెను. (31-35)

**శ్రీ భగవానువాచ**

శ్లో॥ జన్మ కర్మాభిధానాని సంతి మేం௨_గ సహస్రశః ।
నశక్యంతే ప్రసంఖ్యాతు మనంతత్వాన్మమాపి హి ॥ 36

టీ:- వయమితి. వయమితి వంశ్యాభిప్రాయేణ బహువచనం తేష్వహం ముచకుంద ఇతి. ప్రోక్త ఇతి. యవనాశ్వః మాందాతుః పితా. (31-36)

శ్లో॥ క్వచిద్రజాంసి విమమే పార్థివాన్యురుజన్మభిః ।
గుణ కర్మాభిధానాని నమే జన్మాని కర్హిచిత్ ॥ 37

శ్లో॥ కాల త్రయోపపన్నాని జన్మకర్మాణి మేన్నృప ।
అనుక్రమంతో నైవాంతంగచ్ఛంతి పరమర్షయః ॥ 38

శ్లో॥ తథాప్యద్యతనాన్యంగ శృణుష్వ గదతో మమ ।
విజ్ఞాపితో విరించేన పురాహం ధర్మగుప్తయే ॥ 39

శ్లో॥ భూమేర్భారాయమాణానా మసురాణాం క్షయాయ చ ।
అవతీర్ణో యదుకులే గృహ ఆనకదుందుభేః ॥ 40

**శ్రీ భగవానుడు పలికెను**

ఓ ముచుకుందా! జన్మ కర్మలకనురూపమైన వేలకొలది నామములు నాకున్నవి. అవి లెక్కకు మిక్కిలియైనవి. అంతము లేనివి. నాకును లెక్కించుటకు సాధ్యము కానివి.

కొన్ని జన్మలెత్తినను ఇసుకరేణువులను లెక్కింపజాలనట్లే గుణ కర్మలతో నేర్పడిన నా జన్మనామములు గణించుటకు తరముగావు.

ఓ రాజా! నా జన్మ కర్మలు త్రికాలములకు సంబంధించినవి. పరమ మహర్షులు కూడ వాటిని అన్వయించుచు అంతమును కనజాలరు. (36-38)

ఓ ముచుకుందా! పూర్వము ధర్మ రక్షణార్థము బ్రహ్మదేవునిచే విన్నపింపబడిన నా ఆధునిక నామములను వినుము. 39

భూమికి భారమైన దానవ వినాశనము కొరకు యాదవ కులమున, అనక దుందుభి గృహమున అవతరించితిని. 40

శ్లో॥ వదంతి వాసుదేవేతి వసుదేవసుతం హి మామ్ ।
కాలనేమిర్హతః కంసః ప్రలంబాద్యాశ్చ సద్విషః ॥ 41

వసుదేవుని సుతుడను. నన్ను వాసుదేవుడందురు. కాలనేమి, కంసుడు, ప్రలంబాదులను, సచ్ఛత్రువులు నాచే హతులైరి. 41

టీ:- క్వచిదితి. క్వచిత్. కదాచిత్. కశ్చిత్ యద్యపి రజాంసి విమమే గణితవాన్. తథాపి న జన్మాని కర్మాణి విమిమీతే. (37-41)

శ్లో॥ అయంచ యవనోదగ్ధో రాజంస్తేతిగ్మ చక్షుషా ।
సో$\mathcal{S}$హంతవానుగ్రహార్థం గుహామేతాముపాగతః ॥
ప్రార్థితః ప్రచురం పూర్వం త్వయాహం భక్తవత్సలః । 42

ఓ రాజా! నీ తేజోవంతమైన దృష్టిపాతముతో ఈ కాలయవనుడు కూడా దహింపబడెను. నిన్ననుగ్రహించుటకొరకే నేను ఈ గృహలోకి వచ్చితిని. భక్త వత్సలుడనగు నేను నీచే పూర్వము అమితముగ ప్రార్థింపబడితిని.

టీ:- అయమితి. తేన తిగ్మచక్షుషా నిమిత్తేన. మయైవ దగ్ధః. 42

శ్లో॥ వరాన్ వృణీష్వ రాజర్షే సర్వాన్కామాన్ దదామితే ।
మాంప్రపన్నోజనః కశ్చిన్న భూయో$\mathcal{S}$ర్హతి శోచితుమ్ ॥ 43

ఓ రాజర్షీ! వరములను కోరుకొనుము. నీకు అన్ని కోర్కెలను ప్రసాదింతును. అపూర్ణుడు, దుఃఖభాజనుడు, నన్ను శరణు పొందిన వాడెవ్వడును దుఃఖ భాజనుడు కాడు. (42-43)

టీ:- వరానితి. అపూర్ణో$\mathcal{S}$హమితి శోచితుం యద్వా. అన్యైర్దత్తేషు వరేషు క్షీయమాణేషు యథా శోచంతి. నైవం మాం ప్రపన్నః. మద్దత్త వరాణామక్షయత్వాదితి భావః. 43

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఇత్యుక్తస్తం ప్రణమ్యాహముచుకుందో ముదాన్వితః ।
జ్ఞాత్వానారాయణం దేవం గర్గ వాక్యమనుస్మరన్ ॥ 44

టీ:- ఇతీతి. అష్టావింశతితమే యుగే భగవానవతరిష్యతీతి వృద్ధగర్గ వాక్యమనుస్మరన్నిత్యర్థః. 44

**శ్రీ శుకులు పలికిరి.**

ఇట్లు విష్ణువుచే పలుకబడిన ముచుకుందుడు అమితానందముతో 28 వ యుగమున భగవంతుడవతరించునను వృద్ధుడగు గర్గవాక్యమును గుర్తుచేసుకొని తన యెదుటనున్నది భగవంతుడగు నారాయణుడని గ్రహించి ప్రణమిల్లి ఇట్లు పలికెను. 44

**ముచికుంద ఉవాచ**

శ్లో॥ విమోహితోఽయంజన ఈశమాయయా
త్వదీయయా త్వాం న భజత్యనర్థదృక్ ।
సుఖాయ దుఃఖ ప్రభవేషు సజ్జతే
గృహేషు యోషిత్పురుషశ్చ వంచితః ॥ 45

టీ:- త్వద్భక్తిరేవ కేవలం దుర్లభా. కామాస్తుతుచ్ఛాః న వరణయోగ్యా ఇత్యాశయేన అభక్తానాం సంసారమష్టభిః ప్రపంచయన్ స్తౌతి - విమోహిత ఇతి. హే ఈశ యోషిత్పురుషశ్చేతి. ద్వివిధోఽప్యయం జనః. త్వదీయయా మాయయావిమోహితః. అతోఽనర్థదృక్ అర్థం పరమార్థసుఖరూపం త్వాం న పశ్యతీతి తథా. అతస్త్వాం న భజతి కింతు పరస్పరం వంచితస్సన్ సుఖేచ్ఛయాదుఃఖానామేవ ప్రభవోయేషు తేషు గృహేష్వేవ సజ్జత ఇతి. 45

**ముచుకుందుడు పలికెను.**

నీ భక్తి మాత్రమే లోకమున దుర్లభమైనది. కోరికలన్నియు తుచ్ఛములు. అందువలన కోరదగినవి కావు. అను అభిప్రాయముతో భక్తులు కానివారి సంసారమును గూర్చి ఎనిమిది శ్లోకములతో నుతించుచున్నాడు.

ఓ మహానుభావా! లోకమున స్త్రీ పురుషులు నీ మాయలోపడి పరమార్థ సుఖస్వరూపమైన నిన్ను కనజాలకున్నారు. సేవింపకున్నారు. దుఃఖములకు నిలయములగు గృహములందు పరస్పరము మోసగించుకొనుచు జీవించుచున్నారు. 45

శ్లో॥ లబ్ధ్వా జనో దుర్లభమత్ర మానుషం
కథంచిదవ్యంగ మయత్నతస్తవ ।
పాదారవిందం న భజత్య సన్మ తి
ర్గృహాంధ కూపే పతితోయథాపశుః ॥ 46

టీ:- కించ కామ సుఖం సూకరాదిష్వపి సంభవతీతి భగవద్భజనం తు న మానుషజన్మ వ్యతిరేకేణేతి. మానుషత్వం ప్రాప్య త్వామభజన్నిత మూఢ ఇత్యాహ - లబ్ధ్వేతి. అత్ర కర్మభూమౌ అవ్యంగం అవికలాంగం. కించం. అసతి విషయసుఖే మతిర్యస్య సః గృహమేవాన్ధకూపస్తస్మిన్. పతితః యథాపశుస్తృణలుబ్ధోஉంధకూపే పతతీతి. 46

కామాది విషయములు పందులకు కూడా అనుభవమే భగవద్భజనమునకు వాటికి అవకాశములేదు. మనుష్యునికి మాత్రమే ఉన్నది. అట్టి జనుడు దుర్లభమైన మానుష జన్మను పొందియు మూఢుడై సంసార విషయసుఖములందులోలుడై గడ్డి యందలి ఆశతో పశువు చీకటి గుంతలో పడినట్లు విషయ బంధముల తగుల్కొని కొట్టు మిట్టాడుచు బుద్ధిహీనుడై నీ పాదపద్మములను సేవింప జాలకున్నాడు. 46

శ్లో॥ మమైషకాలోஉజితనిష్ఫలో గతో
రాజ్యశ్రియోన్నద్ధ మదస్య భూపతేః ।
మర్త్యాత్మబుద్ధేస్సుత దార కోశ భూ
ష్వాసజ్జమానస్య దురంత చింతయా ॥ 47

టీ:- న కేవలమన్యజనస్యేయం గతిః. కింతు మమాపి తథైవేత్యాహ - మమేతి. మర్త్యే శరీరే ఆత్మ బుద్ధిర్యస్య తస్య మమ అత ఏవ సుతాదిష్వాసజ్జమానస్య. 47

కేవలము ఇతరులకేకాదు. నా విషయమునను అదియేస్థితి. రాజ్య సంపదతో వృద్ధిపొందిన మదముగల నావంటి వానికి ఇదేస్థితి. భార్యా పిల్లలు, ధన రాజ్యములందు చిక్కిన మానవ మతులకు నిన్ను సేవింపవలెనను కోరిక ఎట్లుకలుగును? 47

శ్లో॥ కళేబరేఽస్మిన్ ఘటకుడ్య సన్నిభే
నిరూఢమానో నరదేవ ఇత్యహమ్ ।
వృతోరథేభాశ్వ పదాత్యనీకపై
ర్గాం పర్యటంస్త్వా మగణయ్య దుర్మదః ॥ 48

టీ:- ఉన్నద్ధమత్వం ప్రపంచయతి - కళేబర ఇతి. ఘటకుడ్యాదిసదృశే దృశ్యే అనాత్మని యత ఏవం దుర్మదః అభవం. అతో మమైష కాలో నిష్ఫలో గత ఇతి. 48

అధిక మదమును గూర్చి నడువుచున్నాడు.- ఆత్మరహితమైన కుండ గోడలతో సమానమగు ఈకళేబరము నందు నేను మహారాజునను అహంభావమున్నది. రథ, గజ, పదాతులతో కూడి దుర్మదము తోరాజ్యమున సంచరించు నాకు ఇంతకాలము నిష్ఫలముగ గడిచినది. 48

శ్లో॥ ప్రమత్తముచ్చైరితి కృత్య చింతయా
ప్రవృద్ధలోభం విషయేషు లాలసమ్ ।
త్వమ ప్రమత్తస్సహసాభి పద్యసే
క్షుల్లేలిహానోఽహిరివాఖు మంతకః ॥ 49

టీ:- త్వామగణయంతం మాం త్వమాక్రామసీత్యాహ - ప్రమత్తమితి. ప్రమత్తం అనవహితం త్వాం అంతకం అవిగణయ్య దేహాదిష్వాసక్తమితి యావత్.కుతః ప్రమత్తం. ఇతి కృత్యచింతయా ఏకమేవ కరణీయమితి మనోరథపరంపరయామనోరథే భగ్నేఽపి విషయేషు లాలసం ఉత్సుకం ప్రాప్తేఽపి పునః ప్రవృద్ధో లోభస్తృష్ణ యస్యతం. అంతకస్త్వమభిపద్యసే అభిభవసీత్యర్థః. క్షుధా సృక్వణీ లేలిహానో అహిః ఆఖుం మూషకమివేతి. 49

నేనొక్కడనే సర్వమును నిర్వహించగలనని మిక్కిలి మత్తుడనై విషయలాలసుడనై లోభమున దేహభ్రాంతిచే పరాకాష్ఠచెందిన నన్ను నీవతి జాగరూకుడవై, ఆకలితో నఱ్ఱులు సాచు సర్పము మూషకమును వలె ఆక్రమించుచున్నావు. 49

శ్లో॥ పురారథైర్హేమ పరిష్కృతైశ్చరన్
మతంగజైర్వా నరదేవ సంజ్ఞితః ।
స ఏవ కాలేన దురత్యయేన తే
కళేబరో విట్క్రిమి భస్మ సంజ్ఞితః ॥ 50

టీ:- కాలాత్మనాత్వయా అభిపన్నో దేహః ఏవం భవతీత్యాహ -పురేతి. శ్వసృగాలాదిభిర్భక్షితోవిట్సంజ్ఞితః. తైరభక్షితః క్రిమిసంజ్ఞితః. దగ్ధో భస్మసంజ్ఞతో భవతీతి. బుద్ధ్వా విచార్యైవంభూతే దేహే మమతాం కుర్వంతో జనాఃహరిం నారాధయంతి యే, తే ఆత్మని శత్రుభూతాః జ్ఞేయాః సతతం యతః. శ్లో. యోనేస్సహస్రాణి బాహూని గత్వా దుఃఖేన లబ్ధ్వాపి చ మానుషత్వం, సుఖావహం యే న భజంతి విష్ణుం తేవై మనుష్యాత్మని శత్రుభూతా ఇతి. 50

పూర్వము బంగరు రథములతో, మదగజములతోడ చరించిన మానవుడు దురంతమైన కాలమున దేహాభిమానియై నిన్నారాధింపక కళేబరాధారి యగు కుక్కలు నక్కలు మొదలగువానిగను క్రిమి కీటకాది యోనులందును జన్మించును.- ఎవడు వేలకొలది యోనులందు అనేక జన్మలను పొంది చివరకు సుఖకరమగు మానవజన్మను పొంది, సుఖప్రదాతయగు విష్ణువును సేవింపడో వాడు మనుష్యరూపముననున్న శత్రువు. 50

శ్లో॥ నిర్జిత్య దిక్చక్రమ భూత విగ్రహో
వరాసనస్థ స్సమరాజ వందితః ।
గృహేషు మైథున్య సుఖేషు యోషితాం ।
క్రీడామృగః పూరుష ఈశనీయతే ॥ 51

టీ:- కించ అంతకప్రాప్తేః ప్రాగపిదిగ్విజయినో రాజ్ఞో௨పి పారతంత్ర్య దుఃఖం తదవస్థమేవేత్యాహ - నిర్జిత్యేతి. అభూతవిగ్రహః అవిద్యమాన సంగ్రామః. పూర్వం యే సమాః రాజానః తైః రాజభిర్వందితో௨పి.

దిగ్విజయియగు రాజునకు మరణమునకు పూర్వము పరతంత్రమైన దుఃఖము తన పరిధిలోనిదే ఎందుకనగ, దిక్కులను జయించి శత్రురాజులులేక సింహాసనస్థుడై, సమస్థాయి గల రాజులచే నమస్కరింపబడిన వాడైనను ఓ పరమేశ్వరా! అట్టివాడు సంభోగసుఖమే పరమావధిగా తలంచుస్త్రీలచే క్రీడార్థమైన మృగమువలె ఇటునటు త్రిప్పబడుచుండును. 51

మిథునీభావ సుఖమేవ పరం యేషు తేషు యోషితాం గృహేషు. క్రీడామృగ ఇవ ఇతస్తతో నీయతే. 51

శ్లో॥ కరోతి కర్మాణి తపస్సునిష్ఠితో
నివృత్త భోగస్తదపేక్షయా సకృత్ ।
పునశ్చ భూయాసమహం స్వరాడితి
ప్రవృద్ధతర్షో న సుఖాయ కల్పతే ॥ 52

టీ:- కించతత్రాతి తృష్ణాకులస్య న భోగక్షణః కశ్చిదస్తీత్యాహ - కరోతీతి. తపసి అధశ్శయనబ్రహ్మచర్యాదౌ సునిష్ఠితః పునశ్చ స్వరాట్ ఇంద్రః స్యామితి. యద్వా. జన్మాంతరేఽప్యేవ మేవ చక్రవర్తీ స్యామితి. (52)

బ్రహ్మచర్యాది ఆశ్రమములందు సుఖ నిరపేక్షుడై తపోదీక్ష యందున్నవాడు తత్సంబంధ కర్మలను చేయును. పునర్జన్మయందును ఇంద్రుడు లేదా చక్రవర్తి కావలయునను దురాశాపరుడు క్షణకాలమును సుఖమును శాంతిని అనుభవించజాలడు. 52

శ్లో॥ భవాపవర్గో భ్రమతో యదాభవే
జ్జనస్యతర్హ్యచ్యుత సత్సమాగమః ।
సత్సంగమోయర్హి తదైవ సద్గతౌ
పరాపరేశేత్వయి జాయతే మతిః ॥ 53

టీ:- తదేవమష్టభిః శ్లోకైరీశబహిర్ముఖానాం సంసారం ప్రపంచ్య భక్త్యా తన్నివృత్తిక్రమమాహ - భవాపవర్గ ఇతి. అచ్యుత. భ్రమతః సంసరతో జనస్య యదా త్వదనుగ్రహేణ భవస్య బంధస్య అపవర్గః అంతో

అచ్యుతా ! నీయనుగ్రహమున సంసార బంధవిమోచనము కల్గిన వానికి సత్సమాగమము సిద్ధించినచో, దాని వలన కార్య కారణ నియతవగు నీయందు భక్తిభావము బలపడును. తద్వారా ముక్తి లభించును. 53

సంగనిర్వృత్త్యా కార్యకారణనియంతరి త్వయి భక్తిర్భవతి. తతో ముచ్యత ఇత్యర్థః. 53

శ్లో॥ మన్యే మమానుగ్రహ ఈశతే కృతో
రాజ్యానుబంధాపగమోయదృచ్ఛయా ।
యః ప్రార్థ్యతే సాధుభి రేక చర్యయా
వనం వివిక్ష ద్భిరఖండ భూమిపైః ॥ 54

టీ:- మమతు సత్సంగమాత్పుర్వ మేవ యో రాజ్యాది సంగవిచ్ఛేదో జాతః సోఽయం.త్వయా మమ మహాననుగ్రహః కృత ఇత్యాహ.- మన్య ఇతి తే త్వయా సాధుభిర్వివేకిభిః. తపసే వనం ప్రవేష్టుమిచ్ఛద్భిః స్వయం త్యక్తుమలభమానైః ప్రార్థ్యత ఇతి. 54

ఓ కృష్ణా! నాకు మాత్రము నీ అనుగ్రహము వలన సత్సంగమునకు పూర్వమే రాజ్యాది సంగవిచ్ఛేదము కలిగినది. ఇదియే కదా అరణ్యవాసమును కోరు సకల రాజన్యులచే ప్రార్థింపబడునది. 54

శ్లో॥ నకామయేఽన్యం తవ పాదసేవనా
దకించన ప్రార్థ్యతమాద్వరం విభో ।
ఆరాధ్య కస్త్వాంహ్యపవర్గదం హరే
వృణీత ఆర్యో పరమాత్మ బంధనమ్ ॥ 55

టీ:- తదేవం విషయసేవామార్గం భగవత్సేవామార్గం చ వివిచ్య వరాన్ వృణిష్వేతి యదుక్తం తత్రోత్తరమాహ- నేతి. అకించనాః నివృత్తాభి మానాః ఆర్యో వివేకీ. 55

ఓ ప్రభూ! అకించనుని ప్రార్థించుటకంటె నీ పాద సేవనము శ్రేష్ఠమైనది. దానిని తప్ప నేనింకొకదానిని ఆశించను. ఓహరీ! వివేకియగు వాడెవడు ముక్తిప్రదుడవగు నిన్ను ఆరాధించి సంసార బంధనమును కోరుకొనును? కోరడని భావము. (55)

శ్లో॥ తస్మాద్విసృజ్యాశిష ఈశ సర్వతో
రజస్తమస్సత్త్వ గుణాను బంధనాః ।
నిరంజనం నిర్గుణ మద్వయం పరం
త్వాం జ్ఞప్తిమాత్రం పురుషం వ్రజామ్యహమ్ ॥ 56

టీ:- తస్మాదితి. రజస్సత్త్వతమోగుణైరనుబధ్యంత ఇతి తథా ఐశ్వర్యాదిశత్రు మరణాది ధర్మాదిరూపాః విసృజ్య. పరం పురుషమీశ్వరం జ్ఞప్తిమాత్రం జ్ఞానఘనం తత్ కుతః? నిరంజనం. తత్కుతః? నిర్గుణం. తదపి కుతః? అద్వయం అత ఏవ అక్షరం త్వాం శరణం వ్రజామీతి. 56

ఓ ఈశ్వరా! రజస్తమస్సత్త్వ గుణముల అనుబంధములను వదలనిచో పరమాత్మ జ్ఞాన మెట్లు లభించును. నిరంజనత్వ మెట్లు సిద్ధించును. నిర్గుణత్వమెట్లేర్పడును. అద్వైత సిద్ధి ఎట్లు కలుగును. అందువలన నిన్ను శరణు పొందుచున్నాను. నన్ను ఆశీర్వదించుము. 56

శ్లో॥ చిరమిహ వృజినార్తస్తప్యమానోఽనుతాపై
రవితృష షడమిత్రో లబ్ధ శాంతిః కథంచిత్ ।
శరణదసముపేత స్త్వత్పదాబ్జం పరాత్మ
న్నభయమృతమశోకం పాహిమాపన్నమీశ ॥ 57

సర్వసుఖములననుభవింపుము. కైవల్యము కరతలామలకము గదాయని వరములతో ప్రలోభపరచు శ్రీకృష్ణ పరమాత్ముని పాదములను పట్టుకొని ముచుకుందుడు ప్రార్థించుచున్నాడు.- ఓ ఈశ్వరా ! చిరకాలము కర్మఫలములతో తపించు నేను ఇంద్రియములను శత్రువులబారినపడి నీయనుగ్రహమున నిపుడు ముక్తుడనై శాంతిని పొందియున్నాను. రక్షకుడవైన నీపాద సన్నిధిని చేరితిని. నీ సన్నిధి అభయదము. అమృతము. శోకాదినాశకము. ఆపన్నుడనగు నన్ను కావుము. 57

**శ్రీకృష్ణ ఉవాచ**

శ్లో॥ సార్వభౌమ మహారాజ మతిస్తే విమలోర్జితా ।
వరైః ప్రలోభితస్యాపినకామైర్విహతాయతః ॥ 58

టీ:- భుంక్ష్వ తావద్భోగాన్ కైవల్యం తు కరస్థమే వేతి పునః పునర్వరైః ప్రలోభయంతం శ్రీకృష్ణం పాదోపసంగ్రహణేన. ప్రార్థయతే - చిరమితి. వృజినైః స్వకర్మఫలైరార్తః. పునస్తద్వాసనాదిభిః తప్యమానః తథాసి అవితృషషడమిత్రః తృడేవ తృష్ణా నవిగతతృషాః షట్ అమిత్రాః శత్రవః ఇంద్రియలక్షణా యస్యసః. అత ఏవాలబ్ధశాంతిః కథంచిద్దైవవశేనా లబ్ధకాంతిరితివా. శరణం స్వజ్ఞానం తద్దదాతీతి తథా హే శరణద సముపేతః ప్రాప్తోఽహం. అశోకత్వేహేతుః. అభయం తత్రాపి హేతుః - ఋతం ఆపన్నం ఆపత్ప్రాప్తం పాహీతి. (57-58)

**శ్రీ కృష్ణులు పలికిరి.**

సార్వభౌమ! మహారాజా ! నీ బుద్ధి నిర్మలమైనది వరములచే ప్రలోభపెట్టబడినను కోరికలకు దాసోహమనలేదు. 58

శ్లో॥ ప్రలోభితోవరైర్యత్వ మప్రమాదాయవిద్ధితత్ ।
నధీర్మయ్యేక భక్తానామాశీర్భిర్భిద్యతే క్వచిత్ ॥ 59

టీ:- ప్రలోభిత ఇతి. అప్రమాదాయ ప్రమాదాయ న భవత్యేవ. కుత ఇత్యత ఆహ- న ధీరితి. ఏకాంతభక్తానాం ధీరాశీర్భిః ప్రాప్తాభిరపి న భిద్యతే న సజ్జత ఇత్యర్థః. 59

ఓ ముచుకుందా! వరములతో ప్రలోభపట్టబడిన నీవు ప్రమాదములకు లోనుగాకుండ నుండుటకొరకే వరమీయబూనితిని. నా యందు ఏకాంత భక్తిభావము కలవారి బుద్ధి ఆశీస్సులను పొందినను చలించదు కదా! 59

శ్లో॥ యుంజానానామ భక్తానాం ప్రాణాయామాదిభిర్మనః ।
అక్షీణ వాసనం రాజన్ దృశ్యతే క్వచిదుత్థితమ్ ॥ 60

టీ:- వ్యతిరేకమాహ-యుంజానానామితి. ఉత్థితం విషయాభిముఖం. (60)

శ్లో॥ విచరస్వ మహీం కామంమయ్యావేశిత మానసః ।
అస్త్వియం నిత్యదాతుభ్యం భక్తిర్మయ్యనపాయినీ ॥ 61

టీ:- విచరస్వేతి. తుభ్యం తవ. 61

శ్లో॥ క్షత్రధర్మ స్థితోజంతూనవధీర్మృగయాదిభిః ।
సమాహిత స్తత్తపసా జహ్యఘం మదుపాశ్రయః ॥ 62

శ్లో॥ జన్మన్యనంతరే రాజన్ సర్వభూత సుహృత్తమః ।
భూత్వాద్విజ వరస్త్వం వైమామముపేష్యసి కేవలమ్ ॥ 63

టీ:- యుక్త్యాభాసేన భీషయన్ తపసి లోకసంగ్రహే ప్రవర్తయతి.-క్షత్రధర్మేతి. (62-63)

**ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే, ఏకపంచాశత్తమోஉధ్యాయః**

ఓ రాజా! ప్రాణాయామాదు లందు మనస్సును లగ్నము చేసినను భక్తి హీనులగు వారి మనస్సులందు నేను నివాసము చేయుట ఎచటనైనయున్నదా? 60

అందువల్ల ఓ రాజా! నా యందు మనస్సును నిరంతరము నిలిపి భూమి యందు చరించుము. నాయందు నిత్యము తొలగని భక్తిని నీకు ప్రసాదించుచున్నాను. 61

క్షత్రియ ధర్మమును పాటించుచు వేట మార్గమున జంతువులను వధింపుము. నన్నాశ్రయించిన చిత్తముతో తపస్సు నందు ఉన్నత స్థితుడవై పాపమును పారద్రోలుము. 62

ఓ రాజా! మరొక జన్మమున సకల భూత హితుడవై బ్రాహ్మణకులమున జన్మించి నన్ను తప్పక పొందగలవు. 63

**శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు**
**యాభైయొకటవ అధ్యాయము సమాప్తము**

## ద్విపంచాశత్తమోఽధ్యాయః

శ్లో॥ ద్విపంచాశత్తమేధావన్ భయాదివగతః పురీమ్ ।
అన్వమోదత సందేశం రుక్మిణ్యా ద్విజవర్ణితమ్ ॥

### శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఇత్థం సోఽనుగృహీతోఽంగ కృష్ణేనే క్ష్వాకునందనః ।
తం పరిక్రమ్య సన్నమ్య నిశ్చక్రామగుహాముఖాత్ ॥ 1

టీ:- ఇత్థమితి. 1

శ్లో॥ సవీక్ష్య క్షుల్లకాన్ మర్త్యాన్ పశూన్ వీరుద్వనస్పతీన్ ।
మత్వాకలియుగం ప్రాప్తం జగామ దిశ ముత్తరామ్ ॥ 2

టీ:- స ఇతి. క్షుల్లకాన్ అల్పప్రమాణాన్. 2

శ్లో॥ తపశ్శ్రద్ధాయుతో ధీరో నిస్సంగో ముక్తసంశయః ।
సమాధాయ మనః కృష్ణే ప్రావిశద్గంధమాదనమ్ ॥ 3

టీ:- తప ఇతి. తపసి శ్రద్ధాయుతః. 3

## 52వ అధ్యాయము

ఈ యాబదిరెండవ అధ్యాయమునందు శ్రీకృష్ణుడు భయపడిన వానివలె పురమునకు పరుగెత్తిపోవుట, బ్రాహ్మణ వర్ణితమగు రుక్మిణీదేవి సందేశమును విని అంగీకరించుట వర్ణించబడినది.

### శ్రీ శుకులు పలికిరి.

ఓ రాజా! ఈ విధముగ శ్రీకృష్ణునిచే అనుగ్రహింపబడిన ఇక్ష్వాకు నందనుడు ముచుకుందుడు ఆ దేవునకు ప్రదక్షిణము చేసి ప్రణమిల్లి గుహనుండి నిర్గమించెను. 1

ముచుకుందుడు అల్పాయుస్సుగల మానవులను పశువులను తీగలతో నల్లుకొనబడిన వృక్షములను చూచి కలియుగము ప్రవేశించినట్లుగ తలచి ఉత్తరదిశాభిముఖుడై పోయెను. 2

తపస్సు నందు శ్రద్ధాళువులు, ధీరుడు, సంగరహితుడు, సంశయవిరహితుడునగు ముచుకుందుడు శ్రీకృష్ణ భగవానునియందు మాత్రమే మనస్సును దిటవు పరచుకొని గంధమాదన పర్వతమును ప్రవేశించెను. 3

శ్లో॥ బదర్యా(శమమాసాద్యనర నారాయణాలయమ్ ।
సర్వద్వంద్వ సహశ్శాంత స్తపసారాధ యద్ధరిమ్ ॥ 4

టీ:- బదర్యా(శమమితి. త(త చ బదర్యా(శమం. 4

ఆ గంధమాదన పర్వతమున నరనారాయణులకు నిలయమగు బదర్యా(శమమును చేరి ఏకా(గ చిత్తముతో సర్వ ద్వంద్వములను, గాలి, వాన, ఎండనీడ, మొదలగు వానిని సహించుచు శాంతచిత్తముతో తపస్సుతో శ్రీహరినారాధించెను. 4

శ్లో॥ భగవాన్ పునరా(వ్రజ్య మధురాం యవనావృతామ్ ।
హత్వా మ్లేచ్ఛబలం నిన్యే తదీయం ద్వారకాం ధనమ్ ॥ 5

భగవంతుడైన హరి, యవనులచే నా(క్రమించబడిన మధురా నగరమునకు మరలి వచ్చి మ్లేచ్ఛ బలగమును సమూలముగ నిర్మూలించి, వారి ధనమునంతటిని ద్వారకా నగరమునకు చేర్చెను. 5

శ్లో॥ నీయమానే ధనే గోభిర్నృభిశ్చాచ్యుత చోదితైః ।
ఆజగామజరాసంధ స్త్రయోవింశత్యనీకపః ॥ 6

టీ:- భగవానితి. నిన్యే అనయత్ ద్వారకాం(ప్రాపితవాన్.(5-6)

అచ్యుతునిచే (ప్రేరేపితులైన యాదవులు గోవులతో ధనమును తీసుకొని పోవుచుండగ ఇరువదిమూడక్షౌహిణుల బలగముతో జరాసంధుడు వచ్చి పైబడెను. 6

శ్లో॥ విలోక్య వేగ రభసం రిపుసైన్యస్య మాధవౌ ।
మనుష్యచేష్టామాపన్నౌ రాజన్ దుద్రువతు (ర్ద్రుతమ్ ॥ 7

టీ:- విలోక్యేతి. వేగరభసం వేగో(ద్రేకం. 7

ఓ పరీక్షిత్తూ! ఇట్లు వేగముగ మీదెత్తి వచ్చుచున్న జరాసంధుని సైన్యము చూచి బలరామకృష్ణులు మానవ సహజమగు స్థితిని పొంది అతివేగముగ పరుగులంకించిరి. 7

శ్లో॥ విహాయవిత్తం ప్రచురమభీతౌ భీరు భీతవత్ ।
పద్భ్యాం పద్మపలాశాభ్యాం చేరతుర్బహుయోజనమ్ ॥ 8

టీ:- విహాయేతి. భీరుభీతవత్ భీరోరపి భీతవత్ అతిశయేన భీతవదిత్యర్థః. చేరతుః పలాయేతాం బహుయోజనం దేశం. 8

బలరామకృష్ణులు మిక్కిలి భయములేని వారయ్యును. అత్యంతము భీతులైనవారివలె ఆ అధిక విత్తమును వదిలి పద్మదళముల వంటి పాదములతో బహుయోజనములు పరిగెత్తిరి. 8

శ్లో॥ పలాయమానౌతౌ దృష్ట్వా మాగధః ప్రహసన్బలీ ।
అన్వధావద్రథానీకైరీశయో రప్రమాణవిత్ ॥ 9

టీ:- పలాయమానావితి. అప్రమాణమిత్ ప్రమాణమియత్తా. తన్న వేత్తీతి. తథా. 9

బలవంతుడగు జరాసంధుడు పరుగెత్తుచున్న ఆ ఇరువురిని చూచి ఎకసెక్కముగ నగుచు దేవదేవుల శక్తినెరుగనివాడై రథాది బలగముతో వెంటనంటెను. 9

శ్లో॥ ప్రాద్రుత్య దూరమశ్రాంతౌ తుంగమారుహతాం గిరిమ్ ।
ప్రవర్షణాఖ్యం భగవాన్నిత్యదా యత్ర వర్షతి ॥ 10

టీ:- ప్రాద్రుత్యేతి. తుంగం ఏకాదశయో జనోన్నతం. ప్రకర్షేణ వర్షత్యస్మిన్నితి ప్రవర్షణ ఇత్యాఖ్యా యస్య తం తథా భగవానింద్రః. 10

విరామములేక పరుగెత్తిన ఆ బలరామకృష్ణులు ఇంద్రునివల్ల నిత్యము వర్షము కలిగిన, పదకొండు ఆమడల ఎత్తైన ప్రవర్షణమను పేరుగల పర్వత శిఖరమునధిరోహించిరి. 10

శ్లో॥ గిరౌ నీలినావాజ్ఞాయ నాధిగమ్య పదంనృప ।
దదాహ గిరిమేధోభిస్సమంతాదగ్ని ముత్సృజన్ ॥ 11

ఓ రాజా! జరాసుతుడు పర్వతమున దాగిన బలరామకృష్ణులను పసిగట్టజాలక ఆ పర్వతము చుట్టు ఎగసిపడు మంటలుగల అగ్నిని రగుల్గొల్పెను. 11

టీ:- గిరావితి. తత్రవిచిన్వన్నపి తయోః పదం నిలయనం స్థానం అనధిగమ్య. 11

శ్లో॥ తత ఉత్పత్య తరసా దహ్యమాన తటాదుభౌ ।
దశైక యోజనోత్తుంగాన్ని పేతతురథో భువి ॥ 12

శ్లో॥ అలక్ష్యమాణౌరిపుణాసాను గేన యదూత్తమౌ ।
స్వపురం పునరాయతాం సముద్రపరిఘాంన్నృప ॥ 13

శ్లో॥ సోఽపిదగ్ధావితి మృషా మన్వానో బలకేశవౌ ।
బలమాకృష్య సుమహాన్ మగధాన్ మాగధోయయౌ ॥ 14

టీ:- తత ఇతి. తతోగిరేః దశ చ ఏకం చ యాని యోజనాని తావదుత్తుంగాత్. మాగధసంరోధదేశమతి క్రమ్య పరతః అధః నిపేతతుః (12-14)

శ్లో॥ ఆనర్తాధిపతి శ్రీమాన్ రైవతో రేవతీం సుతామ్ ।
బ్రహ్మణాచోదితః ప్రాదాద్బలాయేతి పురోదితమ్ ॥ 15

టీ:- అథః శ్రీకృష్ణస్య వివాహం నిరూపయితుం బలదేవవివాహం నవమస్కంధోక్తమనుస్మారయతి.- ఆనర్తేతి. 15

అనంతరము మంటలు చుట్టూరా తటములను దహించుచుండగ శ్రీకృష్ణబలరాములు పదకొండామడల ఎత్తుగల పర్వత శిఖరము చెరియ నుండి వెంటనే ఎగిరి భూమిపైకి దూకిరి.

ఓ రాజా! శత్రువులచే చూడబడకయే ఆ యదుశ్రేష్ఠులు సముద్రమే అగడ్తగాగల స్వపురమును ద్వారకను చేరుకొనిరి.

జరాసుతుడు బలకేశవులు ఆ అగ్నియందు హతులైనారను అసత్యమునుతలచి తన సైన్యమును మరలించుకొని మగధకు పోయెను. (12-14)

శ్రీకృష్ణుని వివాహమునకు పూర్వము బలదేవుని వివాహము నవమ స్కంధమున చెప్పిన దానిని స్మరింపజేయుచున్నాడు. ఆనర్తనమనునది దేశము. ఆనర్తనుడను రాజుకు పుత్రుడు శ్రీమాన్ రైవతుడు. తన సుతయగు రేవతిని బ్రహ్మచే ప్రేరితుడై బలదేవునకిచ్చి పరిణయము గావించెననుకథ నవమ స్కంధాంతమున కలదు. 15

శ్లో॥ భగవానపి గోవింద ఉపయేమే కురూద్వహ ।
వైదర్భీం భీష్మకసుతాం శ్రియో మాత్రాం స్వయంవరే ॥ 16

టీ:- భగవానితి. లక్ష్మ్యాః మాత్రాం కళాం . 16

ఓ కురువంశ తిలకమా! భగవంతుడైన గోవిందుడుకూడ విదర్భరాజగు భీష్మకసుతను రుక్మిణిని లక్ష్మీకళాంశను స్వయంవరమున వివాహమాడెను. 16

శ్లో॥ ప్రమథ్య తరసా రాజ్ఞస్సాల్వాదీన్ చైద్య పక్షగాన్ ।
పశ్యతాం సర్వలోకానాం తార్క్ష్యపుత్రస్సుధామివ ॥17

టీ:- ప్రమథ్యేతి. గరుడో యథా దేవాన్ ప్రమథ్య సుధాం అమృతం ఆహరత్ తథేతి. 17

దేవతలనందరినీ జయించి గరుడడు అమృతభాండము నపహరించినట్లుగ శిశుపాలవర్గీయులగు సాల్వాదులను పీచమడిచి సమస్త లోకములు చూచుచుండగ రుక్మిణిని అపహరించి పరిణయము చేసికొనెను. 17

**పరీక్షిన్మహారాజోవాచ**

శ్లో॥ భగవాన్ భీష్మ కసుతాం రుక్మిణీం రుచిराననామ్ ।
రాక్షసేన విధానేన ఉపయేమ ఇతి శ్రుతమ్ ॥ 18

టీ:- భగవానితి.'రాక్షసో యుద్ధహరణాది' తి స్మృతేః. రాజ్ఞః ప్రమథ్యేతి త్వదుక్త్యా రాక్షసేన విధానేనోపయేమే పరిణీతవానితి శ్రుతం పూర్వమేవ సామాన్యత ఏవ శ్రుతమ్. 18

**పరీక్షిన్మహారాజు అడిగెను.**

శ్రీకృష్ణుడు రాక్షస విధానమున రుక్మిణిని వివాహమాడినట్లు సాధారణముగ వినియున్నాము. విశేషమును వినగోరుచున్నాము. 18

శ్లో॥ భగవన్ శ్రోతుమిచ్ఛామి కృష్ణస్యామిత తేజసః ।
రుక్మిణ్యా గ్రహణం పాణేః ప్రమథ్యాన్యాన్ స్వయంవరే ।
యథా మాగధసాల్వాదీన్ జితాకన్యా ముపాహరత్ ॥ 19

టీ:- భగవన్నితి. విశేషం తు శ్రోతుమిచ్ఛామి. 19

భగవన్ శుకమహర్షీ! అమిత తేజోవంతుడగు శ్రీకృష్ణ భగవానుని పాణిగ్రహణమును గూర్చి విస్తరముగ వినగోరుచున్నాము. స్వయంవరమున ఇతర రాజులను హతముచేసి, మాగధ సాల్వాదులను కూడ జయించి కన్యను ఎట్లపహరించెనో తెలుపుము. 19

శ్లో॥ బ్రహ్మన్ విష్ణు కథాః పుణ్యాః మాధ్వీర్లోకమలాపహాః ।
కోను తృప్యేత శృణ్వానః శ్రుతజ్ఞో నిత్యనూతనాః ॥ 20

ఓ మహర్షీ! విష్ణుకథలు పుణ్యప్రదములు. మహా ఫలములు. వీనుల విందులు. విను వారికి పాపప్రక్షాళనములు. నిత్య నూతనము లగు ఆ కథా సారమునెరిగిన వాడెవ్వడు తృప్తిని పడయగలడు? 20

**రుక్మిణీ కళ్యాణ కథా ప్రారంభఘట్టః**

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ రాజాసేద్భీష్మకో నామ విదర్భాధిపతిర్మహాన్ ।
తస్య పంచాభవన్ పుత్రాః కన్యైకాచ వరాననా ॥ 21

**రుక్మిణీ కళ్యాణ కథా ప్రారంభ ఘట్టము.**

**శ్రీ శుకులు చెప్పిరి.**

విదర్భదేశమును పరిపాలించు మహారాజు భీష్మకుడను పేరు కలవాడు. ఆయనకు ఐదుగురు కుమారులు. సౌందర్యవతియగు ఒక కూతురు కలదు.

శ్లో॥ రుక్మ్యగ్రజో రుక్మరథో రుక్మబాహు రనంతరః ।
రుక్మకేశో రుక్మమాలీ రుక్మిణ్యేషాం స్వసా సతీ ॥ 22

అందు పెద్దవాడు రుక్మి, రుక్మరథుడు, రుక్మబాహువు, రుక్మకేశుడు, రుక్మమాలి అతని అనుజులు. అనుజ రుక్మిణియను ఈ బాలిక.

శ్లో॥ సోపశ్రుత్య ముకుందస్య రూపవీర్య గుణశ్రియః ।
గృహాగతైర్గీయమానాస్తం మేనే సదృశం పతిమ్ ॥ 23

రుక్మిణి ముకుందుని రూప, వీర్య గుణ సంపదలను తమ గృహమునకు వచ్చి గానము చేయువారి వలన విని, అతడే తనకు పతి కాదగిన వాడని భావించెను.

శ్లో॥ తాం బుద్ధిలక్షణౌదార్య రూపశీల గుణాశ్రయాం ।
కృష్ణస్స్వసదృశీం భార్యాం సముద్వోఢుం మనోదధే ॥ 24

టీ:- శ్రవణౌత్సుక్యమావిష్కరోతి.- బ్రహ్మన్నితి. పుణ్యాః మహాఫలాః మాధ్వీః శ్రుతి సుఖాః. లోకస్య మలాపహాశ్చ శృణ్వానః శృణ్వన్నిత్యర్థః శ్రుతజ్ఞః శ్రుతసారవిత్. నిత్యనూతనాః ప్రతిక్షణమాశ్చర్యవత్ప్రతీయ మానాః. (20-24)

అట్లే కృష్ణుడుకూడ బుద్ధి, లక్షణ, ఔదార్య రూపశీల గుణ సంపదలతో రుక్మిణియే తనకు తగినదానినిగా నెరింగి వివాహ మాడ ముచ్చటపడెను. (21-24)

శ్లో॥ బంధూనామిచ్ఛతాం దాతుం కృష్ణాయభగినీం నృప ।
తతోనివార్య కృష్ణద్విడ్రుక్మీచైద్య మమన్యత । 25

టీ:- బంధూనామితి. చైద్యమమన్యత తస్యాః వరమిత్యర్థః. 25

ఓ రాజా! బంధువులు కూడ తన చెల్లెను కృష్ణునికిచ్చుటకు ఇష్టపడుచుండగ, కృష్ణ ద్వేషియగు రుక్మి మాత్రము వారిని వారించి, చైద్యుని వరునిగ ఆమెకు చేయుటకు ఇచ్ఛగించెను. 25

శ్లో॥ తదవేత్యాసితాపాంగీ వైదర్భీ దుర్మనాభృశమ్ ।
విచింత్యాప్తం ద్విజం కంచిత్కృష్ణాయ ప్రాహిణోద్ద్రుతమ్ ॥26

టీ:- తదితి. అవేత్య జ్ఞాత్వా అసితాపాంగీ నీలకటాక్షా కృష్ణాయ కృష్ణమానేతుం. ప్రేషయామాస. 26

ఆ విషయము తెలిసికొన్న నల్లని క్రీగన్నులుకల రుక్మిణి మిక్కిలి పరితపించినదై, వెంటనే ఒక ఆప్తుడగు బ్రాహ్మణుని శ్రీకృష్ణుని పిల్చుకొని వచ్చుటకై పంపెను. 26

శ్లో॥ ద్వారకాంస సమభ్యేత్య ప్రతిహారైః ప్రవేశితః ।
అపశ్యదాద్యం పురుషమాసీనం కాంచనాసనే ॥ 27

టీ:- ద్వారకామితి. ప్రతిహారైః ద్వారపాలైః. 27

ఆ విప్రుడు ద్వారకకు పోయి అచ్చటి ద్వారపాలకులతో ప్రవేశ పెట్టబడినవాడై, బంగరు గద్దెపై సుఖాసీనుడైయున్న ఆదినారాయణుని సందర్శించెను. 27

శ్లో॥ దృష్ట్వా బ్రహ్మణ్య దేవస్తమరుహ్యా నిజాసనే ।
ఉపవేశ్యార్హయాం చక్రే యథాత్మానం దివౌకసః ॥ 28

టీ:- దృష్ట్వేతి. ఆత్మానం శ్రీకృష్ణం. 28

బ్రాహ్మణ్య దేవుడగు శ్రీకృష్ణ భగవానుడు ఆ విప్రుని చూచి ఆసనమునుండి తానుదిగి దేవతలు తనను వలెఆ బ్రాహ్మణుని నిజాసన సుఖోపవిష్టునిగ చేసి యుక్తమగు ఉపచారములు చేసెను. 28

శ్లో॥ తం భుక్తవంతం విశ్రాంతముపగమ్య సతాం గతిః ।
పాణినాభిమృశన్ పాదావవ్యగ్రస్తమ పృచ్ఛత ॥ 29

భోజనాది సత్కారముల గ్రహించి విశ్రాంతిని దీసుకొన్న ఆ బ్రాహ్మణుని సమీపించి, సత్పురుషులకు గతియగు ఆ పరమాత్మ, ఏకాంతమున పాదములనొత్తుచు ఇట్లడిగెను. 29

**శ్రీ కృష్ణ ఉవాచ**

శ్లో॥ కచ్చిద్విజవరశ్రేష్ఠ! ధర్మస్తేవృద్ధ సమంతః ।
వర్తతేనాతి కృచ్ఛ్రేణ సంతుష్ట మనసస్తదా ॥ 30

టీ:- తమితి.అభిమృశన్ శనైశ్శనైః సంమర్దయన్.(29-30)

**శ్రీ కృష్ణ పరమాత్మ పలికెను**

బ్రాహ్మణులలో శ్రేష్ఠుడైనవాడా! వృద్ధ సమ్మతమగు మీ ధర్మాచరణము చక్కగ సాగుచున్నది కదా! మీరందరు కృచ్ఛ్ర చాంద్రాయణ వ్రతములతో నిరంతరము సంతుష్టులగుచున్నారు కదా! 30

శ్లో॥ సంతుష్టోయదివర్తేత బ్రాహ్మణోయేనకేనచిత్ ।
అహీయామానస్స్వధర్మాత్సాహ్యస్యాఖిల కామధుక్ ॥ 31

టీ:- సంతుష్ట ఇతి. సధర్మోఽస్య బ్రాహ్మణస్య అఖిలకామదోగ్ధాభవతి యద్వా. సబ్రాహ్మణోఽస్య విశ్వస్య అఖిలకామధుగితి. 31

బ్రాహ్మణుడు ఏ విధముగానైనను సంతృప్తుడుగ నున్నచో ఆతని యుదారమగు ధర్మాచరణము లోకమునకు సకల అభీష్టములను ప్రసాదించునది యగును. 31

శ్లో॥ అసంతుష్టోసకృల్లోకాన్నాప్నోత్యపి సురేశ్వరః ।
అకించనోఽపిసంతుష్టః శేతౌసర్వాంగవిజ్వరః ॥ 32

టీ:- అసంతుష్ట ఇతి. లోకానాప్నోతి లోకాల్లోకాంతరం పర్యటక్ నైకత్ర నిర్వృతస్తిష్ఠతీత్యర్థః. నాప్నోతీతి పాఠే సుర్వేశ్వరోఽపి భూత్వా లోకాన్నాప్నోతి. ఉత్తమాన్ లోకాన్ ప్రాప్తోఽపి. అప్రాప్త ఇవ క్లిశ్యతీత్యర్థః. శేతే సుఖమాస్త ఇత్యర్థః. తదేవాహ - సర్వేష్వంగేషు వాక్పాణ్యాదిషు. విజ్వరః తాపరహితః. 32

బ్రాహ్మణుడు అసంతుష్టుడగుచో సురేంద్రుడు కూడ లోక పర్యటనము చేయుచు నిచ్చటను సుఖముగ నుండజాలడు. ఉత్తమ లోకములను పొందియు పొందని వాని వలే క్లేశముల ననుభవించునని భావము. అనామకుడు కూడ విప్రుడు తృప్తుడగుచు సర్వాంగముల యందు తాప రహితుడై సుఖానుభవమును పొందును. 32

శ్లో॥ విప్రాన్ స్వలాభ సంతుష్టాన్ సాధూన్భూత సుహృత్తమాన్ ।
నిరహంకారిణ శ్శాంతాన్ నమస్యే శిరసా సకృత్ ॥ 33

టీ:- విప్రానితి. స్వలాభః స్వత ఏవ ప్రాప్తో లాభః. ఆత్మలాభో వా. తేన సంతుష్టాన్ పూర్ణాన్. సాధూన్ స్వధర్మ నిష్ఠాన్. 33

సహజముగ ప్రాప్తించిన దానితో తృప్తిచెందు విప్రులకు, సకల భూతకోటికి హితులగు సాధువులకు, గర్వహితులు శాంతస్వభావులగు వారికి శిరస్సువంచి మాటిమాటికి నమస్కరింతును. 33

శ్లో॥ కశ్చిద్వః కుశలం బ్రహ్మన్ రాజతో యస్యహి ప్రజాః ।
సుఖం వసంతి విషయేపాల్యమా నాస్సమే ప్రియః ॥ 34

టీ:- కచ్చిదితి. యస్య రాజ్ఞో విషయే దేశే. 34

ఓ బ్రాహ్మణోత్తమా! మీకు కుశలమే కదా. ఏ రాజు యొక్క దేశమునందు ప్రజలు చక్కగా పాలింపబడుచు సుఖముగ నుందురో ఆరాజు నాకు మిక్కిలి ప్రీతి పాత్రుడు. 34

శ్లో॥ యత్త్వమాగతో దుర్గం నిస్తీర్యేహ యదిచ్ఛయా ।
సర్వంనో బ్రూహ్యగుహ్యం చేత్కిం కార్యం కరవామతత్ ॥ 35

టీ:- యత ఇతి. యతః స్థానాత్ యదిచ్ఛయా యస్య కార్యస్యేచ్ఛయా. దుర్గం సముద్రం. 35

సముద్రమును తరించి నీవు ఎచటినుండి ఇచటికి ఏమిఆశించి వచ్చితివో రహస్యము కానిచో సమస్తమును వివరింపుము. మీకు ఏకార్యమును నేను చేయవలసియున్నదో కూడ చెప్పవలసినది. 35

శ్లో॥ ఏవం సంపృష్ట సంప్రశ్నో బ్రాహ్మణః పరమేష్ఠినా ।
లీలాగృహీతదేహేన తస్మై సర్వమవర్ణయత్ ॥ 36

ఈవిధముగ, వినోదార్థము మానవస్వరూపమును పొందిన పరమేశ్వరుడగు కృష్ణునిచే ప్రశ్నింపబడిన బ్రాహ్మణుడు విషయము నంతటిని శ్రీకృష్ణునకు వివరముగ చెప్పెను.

శ్లో॥ విదర్భాధిపతేః పుత్రీ రుక్మిణీ తవ కింకరీ ।
విజ్ఞాపయతితే కించిత్ ప్రస్తుతోద్వాహ మంగళా ॥ 37

శ్లో॥ తయా సంప్రేషితోఽహం తే సకాశం భీష్మ కన్యయా ।
తస్యాస్సందేశ మాకర్ణ్య క్రియతాం యదనంతరమ్ ॥ 38

శ్లో॥ రుక్మిణ్యా స్వయ మేకాంతే లిఖిత్వా దత్తపత్రికామ్ । ముద్రామున్ముచ్య కృష్ణాయ ప్రేమచిహ్న మదర్శయత్॥ రుక్మిణీ దేవిచే స్వయముగా ఏకాంతమున వ్రాయబడిన, ఈయబడిన ప్రేమలేఖను, ప్రేమ చిహ్నముగ సమర్పించిన ముద్రికను, భద్రముగ దాచిన దానిని విడదీసి ప్రదర్శించెనని శ్రీధరులవారనిరి.

టీ:- ఏవమితి. సంవృష్టః సంప్రశ్నః ప్రష్టవ్యోఽర్థో యస్యసః. పరమేష్ఠినా పరమేశ్వరేణ బంధూనామభిప్రేతం రుక్మిణశ్చేష్టిత మిత్యాదిసర్వం. శ్లో. రుక్మిణ్యాస్వయమేకాంతే లిఖిత్వా దత్తపత్రికామ్, ముద్రాముమ్ముచ్య కృష్ణాయ ప్రేమచిహ్నా మదర్శయత్. శ్రీధరీయోఽయం శ్లోకః. (36-38)

### రుక్మిణ్యువాచ

శ్లో॥ శ్రుత్వా గుణాన్ భువన సుందర శృణ్వతాంతే
నిర్విశ్య కర్ణ వివరైర్హరతోఽంగ తాపమ్ ।
రూపం దృశాం దృశిమతా మఖిలార్థం లాభం
త్వయ్యచ్యుతా విశతి చిత్తమపత్రపం మే ॥ 39

టీ:- బ్రాహ్మణః శ్రీకృష్ణాజ్ఞయా వాచయతి.- శ్రుతేతి అయమర్థః హే అచ్యుత ! హే భువన సుందరేతి ఔత్సుక్యం దర్శయతి- క్వ తవ మహిమా? క్వ చాహం కులరూప శీలాదియుక్తా? తథాపి. అపగతా త్రపాయస్మాత్తత్. మే చిత్తం త్వయ్యావిశతి ఆసజ్జతే. తత్కుతస్త త్రాహ- శృణ్వతాం కర్ణవివరైరంతః ప్రవిశ్య అంగతాపం. అంగేతి పృథక్ సంబోధనం వా. హరతస్తవ గుణాన్ శ్రుత్వా తథా దృశిమతాం చక్షుష్మతాం దృశామఖిలార్థలాభాత్మకం రూపంచ శ్రుత్వేతి. 39

విదర్భాదిపతి పుత్రిక మీకు పరమసేవకురాలగు రుక్మిణీ దేవి మంగళకరమగు వివాహమును గూర్చి ప్రస్తుతించుచు మీకేదో విన్నవించుకొనుచున్నది.

ఆ భీష్మసుతతో నేను మీకడకు పంపబడితిని. ఆమె సందేశమును విని అనంతరకార్యాసక్తులు కాగలరు. (36-38)

### రుక్మిణి పలికెను

బ్రాహ్మణుడు శ్రీకృష్ణుని ఆజ్ఞతో చెప్పుచున్నాడు.- ఓ అచ్యుతా! ఓ భువనసుందరా ! అని ఉత్సాహమును ప్రదర్శించుచున్నాడు. ఓ భువన సుందరా! కర్ణాకర్ణిక మీ గుణములు నా చెవిసోకి హృదయమున ప్రవేశించుటచే మదనతాపమునకు గురియైతిని. ఓ అచ్యుతా! మీరూపమును చూచిన వారి నేత్రములు ధన్యములు. నామనస్సు సిగ్గు విడిచి మీయందు లగ్నమైనది. 39

శ్లో॥ కాత్వాముకుంద మహతీ కులరూపశీల విద్యా
వయోద్రవిణ ధామభిరాత్మ తుల్యమ్ ।
ధీరా పతిం కులవతీ నవృణీత కన్యాకాలే
నృసింహ నరలోక మనోభిరామమ్ ॥ 40

టీ:- అహో కులకన్యానామిదమతిధార్ష్ట్యమితి మాశంకిరిత్యాహ - కేతి. హే ముకుంద హే నృసింహ నరశ్రేష్ఠ. కా నామకన్యా కులవతీ? తథా మహతీ రూపగుణోదారా. తథా ధీరా ధీమతీ. త్వా త్వాం. పతిం న వృణీత నమయ్యేవ కేవలం దోష శంకేతి భావః. కథంభూతం? గుణ శీలాదిభిరాత్మనైవ తుల్యం. నిరుపమమిత్యర్థః. ద్రవిణం ద్రవ్యసంపత్. ధామ ప్రభావః. తథా నరలోకస్య మనసామభి రామోఽభిరమణం యస్మాత్తం. కించ కాలే వివాహావసరే. 40

ఆహా! కులకన్యలకు ఇంత తెగింపా అని సందేహించరాదు. ఓ ముకుందా! నృసింహా! మానవ లోకాభిరాముడవగు నిన్ను, వివాహ సమయమాసన్నమైనపుడు వరించనికన్య కులవతియయ్యు ప్రయోజనమేమి? గొప్ప కులము రూపము శీలము విద్య వయస్సు ధనము కలిగియుండియు ధీరయై నిన్ను పతిగా వరించనచో ఫలమేమి? 40

శ్లో॥ తన్మేభవాన్ ఖలు వృతః పతిరంగజాయా
మాత్మార్పితశ్చ భవతోఽత్ర విభో విదేహి ।
మావీర భాగమాభిమర్శతు చైద్య ఆరా
ద్గోమాయు వన్మృగపతే ర్బలిమంబుజాక్ష ॥ 41

టీ:- తదితి. హేవిభో ! తత్తస్మాన్మే మయా భవాన్ ఖలు పతిర్వృతః

అందువలన ఓ ప్రభూ! నేను నిన్ను పతిగా వరించితిని. స్వయముగా ఆత్మార్పణము గావించుకొంటిని. మీరు వెంటనే వచ్చి మీ భార్యగా నన్ను స్వీకరింపుడు. మీకు వరణీయనగు నన్ను ఆ శిశుపాలుడు దూరము నుండి వచ్చి ఓ అంబుజాక్ష సింహమునకు బలకావలసిన మృగమును నక్క స్పృశించునట్లు తాకక ముందే మీ పత్నిగా నన్ను స్వీకరింపుడు. 41

ఆత్మాచ భవతోఽర్పితః అతస్త్వమత్రాగత్య మాం భవతో జాయాం విధేహి విపక్షే బాధకం ద్యోతయంత్యాహ – మావీరభాగమితి. వీరస్య తవ భాగంమాం. ఆరాత్ శీఘ్రమాగత్య చైద్యః శిశుపాలః మాభిమర్శతు మాస్పృశతు మృగపతేః సింహస్య బలిం భాగం గోమాయుః సృగాల ఇవేతి. 41

శ్లో॥ పూర్తేష్ట దత్తనియమవ్రత దేవవిప్ర
గుర్వర్చనాదిభిరలం భగవాన్ పరేశః ।
ఆరాధితో యది గదాగ్రజ ఏత్య పాణిం
గృహ్ణాతుమేన దమఘోష సుతాదయోఽన్యే ॥ 42

టీ:– అనేక జన్మకృతైః సుకృతైరిద మేవ మే భూయాదితి ప్రార్థయతే – పూర్తేతి. పూర్తం కూపాది. ఇష్టమగ్ని హోత్రాది. దత్తం హిరణ్యాది దానం. నియమః తీర్థాటనాది. వ్రతం కృచ్ఛ్రాది. 42.

శ్లో॥ శ్వోభావినిత్వ మజితోద్వహనే విదర్భాన్
గుప్తస్సమేత్య పృతనా పతిభిః పరీతః ।
నిర్మథ్యచైద్య మగధేశ బలం ప్రసహ్య
మాం రాక్షసేన విధినో ద్వహ వీర్యశుల్కామ్ ॥ 43

అనేక జన్మములందు చేసిన పుణ్యఫలముగా నా పాణిగ్రహణము చేయుమని వేడుకొనుచున్నది.

ఓ భగవాన్! పరాత్పర! గదాగ్రజ! సప్త సంతానాలైన కూప తటాకాది నిర్మాణములు, ఇష్టాపూర్త్యాది యోగములు, హిరణ్యాది దానములు, తీర్థయాత్రాచరణాది నియమములు, చాద్రాయణాది కృచ్ఛ్ర వ్రతములు, విప్రగురుదేవ అర్చనాదులు ఇక చాలును. ఇంక హృదయ పూర్వకముగ నిన్ను మాత్రమే ఆరాధించుచున్నాను. దమఘోష సుతుడగు శిశుపాలుడు ఇచటికి రాకముందే నీవు వచ్చి నా పాణిగ్రహణమును చేయుము. 42

బంధువులందరు చైద్యునకీయ తలపెట్టిన నీ విషయమున నేనేమి చేయుదునని ఉదాసీనము చేయకుము. ఓ అజితా! రేపు జరుగబోవు స్వయంవరమునకు సేనాపతులతో కూడ రహస్యముగ విదర్భకు విచ్చేసి శిశుపాల, జరాసంధ బలగములను సంహరించి

టీ:- నను చైద్యాయ భంధుభిరర్పితాయా త్వయి కిమధునా కరణీయ మిత్యపేక్షాయామాహ. - శ్వోభావినీతి. హే అజిత శ్వోభావిని ఉద్వహనే వివాహే. ప్రథమంగుప్తః అలక్షిత ఏవగత్య. పశ్చాత్పృతనా పతిభిః పరివృతస్సన్. చైద్యాదిబలం నిర్మథ్య. ప్రసహ్య బలాత్. వీర్య ప్రదర్శన మేవ శుల్కం వైవాహికం దేయం యస్యాస్తాం మాం. అనేన రాక్షసవిధినా. ఉద్వహేతి ఉపదేశరహస్యం. 43

వీర్యశుల్కముగ బలప్రయోగముతో, రాక్షస విధానమున నన్ను పరిణయమాడుము. 43

శ్లో॥ అతః పురాంతరచరామనిహత్య బంధూన్
త్వాముద్వహే కథమితి ప్రపదామ్యుపాయమ్ ।
పూర్వేద్యురస్తి మహతీ కులదేవయాత్రా
యస్యాం బహిర్నవ వధూర్గిరిజా ముపేయాత్ ॥ 44

టీ:- నను భవతు శిశుపాలాదిబలప్రమథనం అంతఃపుర మధ్యగతా యాస్తవ హరణే త్వద్బంధువధోఽపి ప్రసజ్యేతేత్యత ఆహ - అంతః పురేతి. పురాద్బహిర్వర్తమానాం. గిరిజాం అంబికాం అంబికాగృహాదేవ మమ హరణం సుకరమితి. 44

అంతఃపురమున చైద్యబలముతో కలిసి తిరుగు నీ బంధువులను కూడ చంపి ఎట్లు నిన్ను పరిణయమాడ గలనని అందురేమో వినుడు. అందుకు ఉపాయము కలదు. స్వయంవరమునకు పూర్వదినమున మా కుల దేవత అంబిక దేవాలయమునకు యాత్రగా పోవలసి యున్నది. నవవధువు గిరిజామాతను దర్శించి ఆశీస్సులనొందుట మా ఆచారము. ఆ గిరిజాలయము నుండి నన్నపహరించుట సులభతరము. 44

శ్లో॥ యస్యాంఘ్రి పంకజరజస్స్నపనం మహాంతో
వాంఛంత్యుమాపతిరివాత్మత మోపహత్యై ।
యర్హ్యంబుజాక్ష నలభేయ భవత్ప్రసాదం
జహ్యామసూన్ వ్రతకృశాన్ శతజన్మ భిస్స్యాత్ ॥ 45

ఓ అంబుజాక్షా! మీ పాదపంకజ రజమును తమోపనోదనము కొరకు శివుడు వాంఛించినట్లుగా మహానుభావులు ఆ పాదరజమున తానమాడుటకు ఇష్టపడుదురు. అట్టి నీ యొక్క కరుణకు పాత్రురాలిని కాజాలనిచో ఉపవాసాది వ్రతములతో కృశించిన నా ఈ ప్రాణములను

టీ:- నను కిమ నేన నిర్బంధేనానర్థకారిణా? చైద్యోఽపి తావత్ప్రఖ్యాత గుణకర్మా యోగ్య ఏవ వర ఇతి తత్రాహ- యస్యేతి. హే అంబుజాక్ష యస్య భవతోఽంఘ్రిపంకజరజోభిః స్నపనం. ఆత్మన స్తమసోఽపహత్యై. ఉమాపతిరివమహాంతః వాంఛంతి. తస్య భవతః ప్రసాదం యద్యహం న లభేయ నప్రాప్నుయాం. తర్హి వ్రతైరుపవాసాదిభిః. కృశాన్ అసూన్ ప్రాణాన్. జహ్యాం త్యజేయం. తతః కిమత ఆహ. శతజన్మభిరతి. ఏవమేవ వారం వారం జహ్యాం. యావచ్ఛత జన్మభిరపి తవ ప్రసాదస్స్యాదితి. 45

వదులుదును. ఇంకను ఏమని చెప్పను. శత జన్మల పర్యంతము నీ అనుగ్రహము లభించునంతవరకు ఇట్లే ప్రాణత్యాగము చేయుచుందును. 45

బ్రాహ్మణోవాచ

శ్లో॥ ఇత్యేతే గుహ్య సోదేశా యదుదేవ మయాహృతాః ।
విమృశ్య కృత్యం యచ్చాత్రక్రియతాం తదనంతరమ్ ॥ 46

టీ:- ఇతీతి. అత్రయత్కృత్యం. కరణీయం తద్విమృశ్య క్రియతాం తచ్చానంతరమేవ క్రియతామితి. 46

బ్రాహ్మణుడు అనుచున్నాడు

ఓ యదుదేవా ! ఈ విధమైన రహస్య సందేశములను నేను తెచ్చితిని. ఈ విషయమున బాగుగ నాలోచించి చేయవలసిన కార్యమును వెనువెంటనే చేయుడు. 46

**ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే, ద్విపంచాశత్తమోఽధ్యాయః**

**శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు**
**యాభైరెండవ అధ్యాయము సమాప్తము**

## త్రిపంచాశత్తమో௨ ధ్యాయః

శ్లో॥ త్రిపంచాశత్తమేగత్వావిదర్భా నద్భుతే హితః ।
రుక్మిణీమాహరత్కృష్ణో మిషతాం ద్విషతాం బలాత్ ॥

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ వైదర్భ్యాస్సతు సందేశం నిశమ్య యదునందనః ।
ప్రగృహ్యా పాణినాపాణిం ప్రహసన్ ద్విజమబ్రవీత్ ॥ 1

శ్లో॥ యథావినిద్రామచ్చిత్తా రుక్మిణీ రుచిరాననా ।
తథాహమపి తచ్చిత్తో నిద్రాం చ నలభేనిశి ॥ 2

టీ:- త్రిపంచాశత్తమేగత్వావిదర్భా నద్భుతేహితః రుక్మిణీమాహర త్కృష్ణో మిషతాం ద్విషతాం బలాత్ .(1-2)

శ్లో॥ వేదాహం రుక్మిణో ద్వేషాన్మమోద్వాహౌ నివారితః ।
తామానయిష్య ఉన్మథ్యరాజన్యా పశదాన్ మృథే ।
మత్పరామనవద్యాంగీ మేధ௨ సోగ్ని శిఖామివ ॥ 3

## 53వ అధ్యాయము.

ఈ యాబదిమూడవ అధ్యాయమునందు అద్భుతాచరణము నందు ఆసక్తి గల శ్రీకృష్ణుడు విదర్భను చేరి కపటులగు శత్రువులను బలముచే నిగ్రహించి రుక్మిణీదేవిని అపహరించెను.

**శ్రీ శుకులు పలికిరి**

యదునందనుడు రుక్మిణియొక్క ఆ సందేశమునువిని బ్రాహ్మణ హస్తమును తన కరముతో గ్రహించి ఆదరమున నవ్వుచూ పలికెను.

ఓ ద్విజవరా! సుందరి రుక్మిణి ఏ విధముగ నన్ను తలంచుచు నిద్రలేక యున్నదో అట్లే నేనును ఆమె యందు మనస్సు తగిలి రాత్రులందు నిద్ర పొందజాలకున్నాను. (1-2)

ఓ విప్రవరా! రుక్మిణి సోదరులు నాయందలి ద్వేషముతో నా వివాహమును అడ్డగించిరని ఆమె చెప్పక పోయినను నేనెరుగుదును. నీచులగు ఆ రాజులను దునిమి నన్ను వరించిన ఆ సుందరాంగిని ఎగయుచున్న అగ్నికీలనువలె తీసుకొని రాగలను. 3

టీ:- నిద్రాయా అలాభే కారణాంతరం. వేదేతి. ఉద్వాహో నివారిత ఇతి. తయా అకథితమపి అహం జానామీతి. ఆనయష్యే ఆనయిష్యామి రాజన్యాపశదాన్ రాజసుహీనాన్ ఉన్మథ్య ఆనయనే దృష్టాంతః- ఏధస ఇతి. 3

శ్లో॥ ఉద్వాహర్క్షం సవిజ్ఞాయ రుక్మిణ్యా మధుసూదనః ।
రథస్సంయుజ్యతామాశు దారుకేత్యాహ సారథిమ్ ॥ 4

మధుసూదనుడు ఎల్లుండి రాత్రి రుక్మిణి వివాహ సుముహూర్త మని తెలిసికొని వెంటనే రథము నాయత్తము చేయమని సారథియగు దారుకుని ఆజ్ఞాపించెను. 4

టీ:- ఉద్వాహరక్షమితి. పరశ్వోరాత్రౌ, వివాహనక్షత్రమితి జ్ఞాత్వా. 4

శ్లో॥ సచాశ్వైస్సైన్య సుగ్రీవమేఘపుష్పవలాహకైః ।
యుక్తం రథముపానీయ తస్థౌప్రాంజలి రగ్రతః ॥ 5

దారుకుడును సైన్య, సుగ్రీవ, మేఘపుష్ప వలాహకములను నాలుగు అశ్వములను పూన్చిన రథమును దెచ్చి అంజలి ఘటించి కృష్ణుని యెదుట నిల్చెను. 5

టీ:- స ఇతి. సైన్యేత్యాదీని చత్వారి అశ్వనామాని. 5

శ్లో॥ ఆరుహ్యస్యందనం శౌరిర్ద్విజమారోప్య తూర్ణగైః ।
ఆనర్తాదేక రాత్రేణ విదర్భానగమద్ధయైః ॥ 6

శ్రీకృష్ణుడు తాను రథమునెక్కి ద్విజుని కూడ ఎక్కించుకొని వడిగల హయములతో ఆనర్తము నుండి ఒకే రాత్రియందు విదర్భ దేశమును చేరెను. 6

టీ:- ఆరుహ్యేతి. తస్యాం రాత్ర్యాం ప్రస్థాయ ప్రాతర్విదర్భదేశా నగమత్. శ్వో భావిని త్వమజితోద్వహనే విదర్భాన్ గుప్తస్సమేత్యేతి రుక్మిణీసందేశాత్. 6

శ్లో॥ రాజా స కుండినపతిః పుత్రస్నేహ వశంగతః ।
శిశుపాలయ తాం కన్యాం దాస్యన్ కర్మాణ్య కారయత్ ॥7

టీ:- రాజేతి. పుత్రస్యరుక్మిణః స్నేహేన తద్వశమనుగచ్ఛతీతి తథా. అనేన శిశుపాలే అనౌద్వాహికాభిరుచిం ద్యోతయతి కర్మాణి పురాలంకార పితృదేవతార్చనాదీని. 7

కుండిన దేశాధిపతి కుమారులపైగల మోహమునకు వశుడై తనకు ఇష్టములేకున్ననూ రుక్మిణిని శిశుపాలునకిచ్చి వివాహము చేయగోరి పురము నలంకరింప జేసి నాందీ పుణ్యాహ, దేవతార్చనలను గావించెను. 7

శ్లో॥ పురం సంమృష్టసంసిక్త మార్గరథ్యా చతుష్పథమ్ ।
చిత్రధ్వజ పతాకాభి స్తోరణై స్సమలంకృతమ్ ॥ 8

టీ:- తాన్యేవాహ- చతుర్భిః. పురమితి. సంమృష్టాః సంసిక్తాశ్చ మార్గాదయోయస్మిన్‌తత్. చిత్ర ధ్వజేషు పతాకాస్తాభిస్సమలంకృతమకారయత్. 8

పురమార్గములను చతుష్పథములను (నాలుగు మార్గముల కూడళ్ళను) పరిమళ ద్రవ్యములతో కలిపి కల్లాపి చల్లించి రంగవల్లులను దీర్చి చిత్ర విచిత్ర ధ్వజపతాక తోరణములతో నలంకరింపజేసెను. 8

శ్లో॥ స్రగ్గంధ మాల్యాభరణైర్విరజాంబర భూషితైః ।
జుష్టం స్త్రీపురుషైశ్శ్రీమద్గృహైరగరుధూపితైః ॥ 9

టీ:- స్రగితి. స్రగ్గంధమాల్యాభరణైరిత్యత్ర మత్వర్థో ద్రష్టవ్యః. యద్వా- స్రగ్గంధమాల్యాన్యాబిభ్రతీతి తథా తైః. తథా విరజైరంబరైశ్చ భూషితైః శ్రీపురుషైర్జుష్టం తథా శ్రీమద్భిః గృహైశ్చ జుష్టం . 9

సువాసనలీను పుష్పమాలలు, సుగంధములు, ఆభరణములు, పట్టుపుట్టములను అలంకరించుకొనిన స్త్రీ పురుషులు తమతమ గృహములను అగరు ధూపములతో గుబాళింపజేసిరి. 9

శ్లో॥ పితృదేవాన్ సమభ్యర్చ్య విప్రాంశ్చ విధివన్నృప ।
భోజయిత్వా యథాన్యాయ్యం వాచయామాస మంగళమ్॥ 10

టీ:- పితృదేవానితి. యథాన్యాయ్యం అన్యాంశ్చ కన్యాం ప్రతి మంగళం వాచయామాస. 10

ఓ రాజా! పితృదేవతలను నాందీ శ్రద్ధాదులతోడను, విధి ప్రకారము విప్రులను అర్చించి భోజన భాజనముల సమర్పించి కన్యకకు సౌమంగల్యము కొరకు మంగళాశాసనముల గావించెను. 10

శ్లో॥ సుస్నాతాం సుదతీం కన్యాం కృతకౌతుక మంగళామ్ ।
అహతాంశుకయుగ్మేన భూషితాంభూషణోత్తమైః ॥ 11

టీ:- సుస్నాతామితి. కృతం కౌతుకేన వివాహసూత్రేణ మంగళం యస్యాస్తాం. అహతం నవీనం. భూషణోత్తమైశ్చ భూషితాం. 11

కన్యకయగు రుక్మిణికి మంగళ స్నానాదుల నిర్వర్తింపజేసి వివాహ సూత్ర ప్రకారము రెండు పట్టు చీరలను ధరింపచేసి, ఆభరణాదులతో విశేషముగ నలంకరించిరి. 11

శ్లో॥ చక్రుస్సామర్గ్యజుర్మంత్రైర్వధ్వారక్షాం ద్విజోత్తమాః ।
పురోహితో థర్వవిద్వైజుహావ గ్రహశాంతయే ॥ 12

శ్లో॥ హిరణ్యరౌప్యవాసాంసితిలాంశ్చ గుడమిశ్రితాన్ ।
ప్రాదాద్ధేనూశ్చ విప్రేభ్యో రాజా విధి విదాం వరః ॥ 13

టీ:- చక్రురితి. వధ్వాః తస్యాః కన్యాయాః అథర్వవిత్ అథర్వణ వేదమంత్రవిత్. (12-13)

బ్రాహ్మణోత్తములు వధువగు రుక్మిణీదేవికి సామ, ఋక్ యజుర్వేద మంత్రపాఠములతో రక్షను కలుగజేసిరి. అథర్వవేద విదులగు పురోహితులు నవగ్రహాది శాంతి కొరకు హోమములు చేసిరి. విధివిధానములను బాగుగా నెరిన వారిలో శ్రేష్ఠుడునగు రాజు భీష్మకుడు, బంగారమును, రౌప్యములను, వస్త్రములను, గుడ మిశ్రితములగు నువ్వులను ఆవులను బ్రాహ్మణోత్తములకు దానములుగా నిప్పించెను. (12-13)

శ్లో॥ ఏవం ఛేదిపతీ రాజా దమఘోషస్సుతాయ వై ।
కారయామాస మంత్రజ్ఞైస్సర్వ మభ్యుదయోచితమ్ ॥ 14

టీ:- ఏవమితి. అభ్యుదయే ఉచితం. 14

ఈ విధముగనే ఛేదిపతియగు దమఘోష మహారాజు కూడా తన కుమారునకు శిశుపాలునకు వివాహ మంగళమునకు తగిన స్నానాది అలంకారములను, మంత్రవేత్తలగు బ్రాహ్మణులచే అభ్యుదయమిక కర్మల నాచరింపజేసెను. 14

శ్లో॥ మదచ్యుద్భిర్గజానీకైస్స్యందనైర్హేమ మాలిభిః ।
పత్త్యశ్వైస్సంకులైస్సైన్యైః పరీతః కుండినంయయౌ ॥ 15

టీ:- మదచ్యుద్భిరితి. తతశ్చ తురంగసైన్యైః పరితః పరివృతః కుండినం భీష్మకపురం యయౌ. మదంచ్యవంతే మదచ్యుతః తైః స్యందనైః రథైః హేమరచితా మాలా విద్యంతే యేషు తైః. 15

మత్తగజములతోడను, బంగరు వర్ణమాలికలచే నలంకృతములైన అరదములతోడను, సైన్యము, అశ్వములతో కూడినవాడై దమఘోషుడు కుండిన నగరమునకు పోయెను. 15

శ్లో॥ తం విదర్భాధిపసమ్యక్సమభ్యేత్యాభి పూజ్యచ ।
నివేశయామాసముదా కల్పితాన్య నివేశనే ॥ 16

విదర్భాధిపుడగు భీష్మకుడు దమఘోషుని మంగళ వాద్య విశేషములతో నెదుర్కొని పూజించి ఆనందముతో విడిదికి గొనిపోయి విశ్రాంతి కల్పించెను.

శ్లో॥ తత్రసాల్వో జరాసంధో దంతవక్త్రో విదూరథః ।
ఆజగ్ముశ్చైద్య పక్షీయాః పౌండ్రకాద్యాస్సహస్రశః ॥ 17

టీ:- తమితి. కల్పితం నిర్మితం యదన్యత్ నివేశనం తస్మిన్. (16-17)

అచట శిశుపాలుని తమ్ముడు, సాల్వుడు, జరాసంధుడు, కరూశ దేశాధిపతి దంతవక్త్రుడు, వాని సోదరుడు విదూరథుడు, పౌండ్రకులు మొదలగువారు వేలకొలది చైద్యునిపక్షమువారువచ్చి విడిసిరి. (16-17)

శ్లో॥ కృష్ణరామద్విషోయత్తాః కన్యాం చైద్యాయసాధితుమ్ ।
యద్యాగత్య హరేత్కృష్ణో రామాద్యైర్యదుభిర్వృతః ।
యోత్స్యామస్సహితాస్తేన ఇతి నిశ్చిత మానసాః ॥ 18

వీరందరు కృష్ణ బలరాములకు శత్రువులు. శ్రీకృష్ణుడు బలరామాదులతో వచ్చి రుక్మిణిని అపహరించునేమోయను శంకతో కన్యకను రక్షించుటకై అందరముకలసి పోరుసల్పుదమని నిశ్చయించు కొని వచ్చిరి. 18

శ్లో॥ శ్రుత్వైతద్భగవాన్రామో విపీక్షయన్నృపోద్యమమ్ ।
కృష్ణం చైకం గతం హర్తుం కన్యాం కలహశంకితః ॥ 19

శ్లో॥ బలేనమహతా సార్ధం భ్రాతృస్నేహ పరిప్లుతః ।
త్వరితః కుండినం ప్రాయాద్గజాశ్వరథపత్తిభిః ॥ 20

టీ:- కృష్ణేతి. యది శ్రీకృష్ణో హరేదితి శంకితాః కన్యాం సాధయితు మిత్యర్థః. (18-20)

భగవంతుడు బలరాముడు శత్రుపక్షరాజుల ఈ ప్రయత్నమును విని కన్యను రుక్మిణిని అపహరించుటకు తమ్ముడు కృష్ణుడు ఒంటరిగా పోయినట్లు విని కలహమును శంకించినవాడై, సోదర స్నేహ పరిపూర్ణ మనస్కుడై విశేష బలగముతోకూడి గజ, అశ్వ, రథ పదాదులతో త్వరితముగ కుండిన నగరమునకు పోయెను. (19-20)

శ్లో॥ భీష్మ కన్యావరారోహాకాంక్షంత్యాగమనం హరేః ।
ప్రత్యాపత్తిమపశ్యంతీ ద్విజస్యా చింతయత్తదా ॥ 21

టీ:- సూర్యోదయాత్పూర్వమేవౌత్సుక్యేన రుక్మిణ్యచింతయదిత్యాహ - భీష్మకన్యేతి. ప్రత్యాపత్తిం ప్రత్యాగమనం. 21

భీష్మకన్య రుక్మిణి సూర్యోదయమునకు పూర్వమే శ్రీహరి రాకను కోరినదై, అప్పటికిని బ్రాహ్మణుడు మరలిరాలేదేమని ఇలా చింతించెను. 21

శ్లో॥ అహో(త్రియామాం తరితా ఉద్వాహో మే௨ల్పరాధసః ।
నాగచ్ఛత్యరవిందాక్షో నాహం వేద్మ్యత్ర కారణమ్ ॥ 22

టీ:- అహోఇతి. త్రియామారాత్రిస్తావన్మాత్రేణాంతరితః. అల్పరాధసః మందభాగ్యాయాః. 22

అహో! దురదృష్టవంతురాలినగు నా వివాహము నాల్గవ జాము ననే కదా! ఆ పద్మదళాయ నేత్రుడింకను రాలేదేమి? కారణమేమియై యుండునో? ఎరుగను కదా! 22

శ్లో॥ సో௨పినావర్తతే௨ద్యాపి మత్సందేశహరో ద్విజః ।
అపిమయ్యనవద్యాత్మా దృష్ట్వా కించిజ్జుగుప్సితమ్ ॥
మత్పాణిగ్రహణే నూనం నాయాతిహి కృతోద్యమః ॥ 23

టీ:- స ఇతి. జుగుప్సితం ధార్ష్ట్యాది. అపీతి శంకాయాం. నాయాతి హి కృతోద్యమఇతి. అస్యార్థః. అదౌ కృతోద్యమత్వాత్తం న ప్రస్థాపితవాన్. ప్రస్థాపనావసరే వా కించిన్మయి జుగుప్సితం మత్వా. ప్రత్యాచష్ట. అతః సో௨పి ద్విజోనూనం నాయాతీతి. 23

నా సందేహమును గొనిపోయిన బ్రాహ్మణుడు ఇంతవరకు రాలేదు. ఆ మహానుభావుడు కృష్ణుడు నా ఈ కాంక్షను జుగుప్సితముగా భావించెనో ఏమో! అందుకే నా పాణిగ్రహణమునకు ప్రయత్నింపక రాలేదా? ఆ ద్విజునికూడా ప్రతి సందేశమిచ్చి పంపలేదా? 23 (ఆ బ్రాహ్మణుని పేరు హరద్విజుడు అని కొందరంటారు.) (పోతన 'అగ్నిద్యోతనుడు' అని నామ్నీకరించాడు)

శ్లో॥ దుర్భగాయా న మే దాతానానుకూలో మహేశ్వరః ।
దేవీ వా విముఖీ గౌరీ రుద్రాణీ గిరిజాసతీ ॥ 24

టీ:- యద్వా తతో నిర్గతో௨పి శ్రీకృష్ణోమద్దైవవై ముఖ్యాత్ క్వచిత్ప్రతి బద్ధో భవేదిత్యాహ - దుర్భగాయా ఇతి. 24

నా విషయమున దైవమగు పరమేశ్వరుడు కూడా విముఖుడుగానున్నాడా? పరమేశ్వరి గౌరి, రుద్రాణి, గిరిజామాత కూడా విముఖురాలైనదా? 24

శ్లో॥ ఏవం చింతయతీ బాలా గోవిందహృతమానసా ।
న్యమీలయత కాలజ్ఞా నేత్రే అశ్రుకలాకులే ॥ 25

టీ:- ఏవమితి. కాలజ్ఞా అధునా గోవిందాగమనకాల ఇతి మన్వానా. కించిదాశ్వస్తచిత్తా సతీ చింతాస్తబ్ధే లోచనే నిమిలితవతీత్యర్థః. 25

ఇట్లు చింతాకులయగు బాలరుక్మిణి గోవిందునియందు చిత్తముగలదై, ఇది గోవిందుడు వచ్చుకాలమని తెలిసి, కొంచెము ఊరటగొనిన మనస్సుతో కన్నీరు నిండిన నేత్రములతో స్తబ్ధయై కన్నులను మూసుకొనెను. 25

శ్లో॥ ఏవం వధ్వాః ప్రతీక్షంత్యాః గోవిందాగమనం నృప ।
వామ ఊరుర్భుజో నేత్రమస్ఫురన్ప్రియశంసినః ॥ 26

టీ:- ఏవమితి. ప్రియశంసినః ప్రియసూచకాః. 26

ఓ రాజా ! గోవిందుని రాకకై ఎదురు చూచుచున్న వధువు రుక్మిణి యొక్క ఎడమతొడ, భుజము, నేత్రములు ప్రియమును సూచించుచున్నవై అదిరెను. 26

శ్లో॥ అథ కృష్ణ వినిర్దిష్ట స్స ఏవద్విజ సత్తమః ।
అంతఃపురచరాం దేవీం రాజపుత్రీం దదర్శహ ॥ 27

టీ:- అథేతి. పురోపవనం ప్రాప్తేన శ్రీకృష్ణేన వినిర్ధిష్టః ప్రాప్తం మాం కథయే త్యాదిష్టః. 27

ఆ సమయముననే అంతఃపురోద్యానమును చేరి ఆ విషయమును రుక్మిణికెరిగింపు మని ఆదేశించి పంపిన ద్విజవరుడు అంతఃపురముననున్న రాజసుతను రుక్మిణిని దర్శించెను. 27

శ్లో॥ సాతం ప్రహృష్ట వదనమవ్యగ్రాత్మగతిం సతీ ।
ఆలక్ష్య లక్షణాభిజ్ఞా సమపృచ్ఛచ్ఛుచిస్మితా ॥ 28

టీ:- సేతి. నవ్యగ్రా ఆత్మనో దేహస్య గతిర్యస్య తం లక్షణాభిజ్ఞా దూతస్య లక్షణం తత్కాలకర్మభిరభిజానాతీతి తథా. 28

ప్రసన్నముఖుడు, కలవరపాటు లేనివాడునగు ఆ ద్విజుని రుక్మిణీదేవిచూచి ముఖచేష్టల లక్షణములనెరిగినది కావున చిరునగవుతో అతని నడిగెను. 28

శ్లో॥ తస్యా ఆవేదయత్ప్రాప్తం శశంస యదునందనమ్ ।
ఉక్తం చ సత్య వచనమాత్మోపనయనం ప్రతి ॥ 29

టీ:- తస్యా ఇతి. తస్యై ప్రాప్తం యదునందనం ఆవేదితవాన్. తచ్చ శశంస. ఆత్మోపనయనంప్రతి ఆత్మనా స్వయం కృష్ణస్య ఆనయనం. ప్రతితేన ద్విజేన సత్యవచనం చోక్తమితి.ఆత్మనః ప్రాణేశ్వరస్యేతి వా. యద్వా. ఆత్మనః తస్యా ఉపనయనం ప్రతి శ్రీకృష్ణేన యదుక్తం సత్య వచనం. తామానయిష్య ఇత్యాది. తచ్చ శశంస అవర్ణయదిత్యర్థః. 29

ఆ రుక్మిణీ దేవికి యదుశ్రేష్ఠుడు శ్రీకృష్ణుడు ఆమె కొరకు వచ్చి అంతఃపుర ఉపవనమున విడిసిన విషయమును చెప్పెను. తనకొరకే శ్రీకృష్ణుని పిలుచుకొని వచ్చిన సత్యవచనమును వర్ణించిచెప్పెను. 29

శ్లో॥ తమాగతం సమాజ్ఞాయ వైదర్భీ హృష్టమానసా ।
నపశ్యంతీ బ్రాహ్మణాయ ప్రియమన్యన్ననామ సా ॥ 30

శ్లో॥ ప్రాప్తౌశ్రుత్వా స్వదుహితురుద్వాహ ప్రేక్షణోత్సుకౌ ।
అభ్యయాత్తూర్య ఘోషేణ రామకృష్ణౌ సమర్హణైః ॥ 31

శ్లో॥ మధుపర్కము పానీయవాసాంసి విరజాసిసః ।
ఉపాయనాన్యభీష్టాని విధివత్సమపూజయత్ ॥ 32

విదర్భ రాజతనయ కృష్ణుడు వచ్చినట్లుగా తెలిసికొని ఆనంద పారవశ్యముతో ఆ ద్విజునకు ఆనందము కలిగించు బహుమానము నేమీయవలయునో తెలియక అప్పటికే శ్రీకృష్ణునికి సర్వసమర్పణమైన తాను ఆయన పాదపద్మములకు నమస్కరించెను.

తన కూతురు వివాహమును చూడగోరి బలరామకృష్ణులు వచ్చిరని విని భీష్మకుడు తూర్యాది మంగళవాద్యములను వెంట బెట్టుకొని యోగ్యమగు అర్ఘ్య పాద్యాదులతో ఎదురేగెను.

ఆ విదర్భాధిపతి మధుపర్కమును వస్త్రమాల్యములను అమితములగు బహుమతులను వెంటగొనిపోయి విధి పూర్వకముగ పూజించెను. (30-32)

టీ:- తమితి. తం శ్రీకృష్ణం అస్మిన్ కాలే సర్వస్యార్పణమప్య పర్యాప్తమితి తదుచితం ప్రియమపరం న పశ్యంతీతి తథా కేవలం ననామ పశ్చాద్బహుదదావిత్యర్థః యద్వా . మాం శ్రియం యే నమంతి. తే తావత్సర్వసంపదామాస్పదా భవంతి. కిం పునర్మయి ప్రణతాయా మితి. తతో౽ధికర్యత్. ప్రియం న పశ్యంతీ ననామేతి. (30-32)

శ్లో॥ తయోర్నివేశనం శ్రీమదుపకల్ప్య మహామతిః ।
ససైన్యయో స్సానుగయోరాతిథ్యం విదధేయథా ॥ 33

మహాబుద్ధిశాలియగు భీష్మకుడు బలరామకృష్ణులకు విడిదిని కల్పించి, శ్రీకృష్ణుడు తప్పక తన కూతురిని పరిణయమాడుటకే వచ్చియుండెనని మనస్సున భావించి ససైన్యయుతులై వారికి వరోచితములైన పద్ధతుల ప్రకారము ఆతిథ్యమునొసగెను. 33

టీ:- తయోరితి. మహామతిరిత్యనేన శ్రీకృష్ణోబాఢం కన్యాముద్వోఢు మేవాగతః స్యాదితి వరోచితేన విధినా సమపూజయదితి సూచితం. యథా యథావత్. 33

శ్లో॥ ఏవం రాజ్ఞాం సమేతానాం యథావీర్యం యథావయః ।
యథాబలం యథావిత్తం సర్వైః కామైస్సమర్పయత్ ॥ 34

ఇట్లు స్వయంవరమునకై వచ్చిన రాజులందరకు వారివారి బల, పరాక్రమ, వయో, ధనములకు యోగ్యమైన రీతిలో ఉపాయనముల నర్పించెను. 34

టీ:- ఏవమితి. సమేతానాం రాజ్ఞాం మధ్యే వీర్యాద్యనతిక్రమ్య తం తం సమర్పితవానిత్యర్థః. 34

శ్లో॥ కృష్ణమాగత మాకర్ణ్య విదర్భ పురవాసినః ।
ఆగత్య నేత్రాంజలిభిః వపుస్తన్ముఖ పంకజమ్ ॥ 35

విదర్భ పురజనులు కృష్ణుడు వచ్చినాడని విని కనులను దోసిళ్లతో (కన్నులు పెద్దవి చేసుకొని) శ్రీకృష్ణుని ముఖపద్మమును పానము చేసిరి. కనువిందుగా తనివితీరా కాంచిరని భావము. 35

టీ:- శ్రీకృష్ణే భావికర్మ సూచకం జనానురాగం దర్శయతి.- త్రిభిః కృష్ణ మితి. 35

శ్లో॥ అస్యైవ భార్యాభవితుం రుక్మిణ్యర్హతి నాపరా ।
అసావప్యనవద్యాత్మా భైష్మ్యాస్సముచితః పతిః ॥ 36

రుక్మిణీదేవి ఈ కృష్ణునకు మాత్రమే భార్యయగుట సముచితము. మరియొకరనర్హులు. అట్లే మహాత్ముడగునితడు మాత్రమే భీష్మకసుతకు యోగ్యుడగు భర్తయని తలంచిరి. 36

టీ:- అస్యేతి. అస్యైవ రుక్మిణ్యేవ అర్హత్యేవ. అసావేవ భైష్మ్యా ఏవ సముచిత ఏవేతి షడవధారణాని తత్రైకస్మిన్ వ్యతిరేక ప్రదర్శన ముపలక్షణార్థం. నాపరేతి న చ వాక్యభేదదోషః. అనూద్యవిధేయవిది భేదేన విభిన్నానామేకవాక్యానాం సహస్రయోగాత్. గృహం సంమార్ఙ్త్యాది వదితి. 36

శ్లో॥ కించిత్సుచరితం యన్నస్తేన తుష్టస్త్రి లోక కృత్ ।
అనుగృహ్ణాతు గృహ్ణాతు వైదర్భ్యాః పాణిమచ్యుతః ॥ 37

విదర్భవాసులమగు మేమేదో కొంచెము పున్నెము చేసుకొని యున్నాము. అందుచే ముల్లోకరక్షకుడగు ఈమహాత్ముడు ఆనందించినవాడై మా విదర్భ రాజతనయను పాణిగ్రహణమునకై అనుగ్రహించి వివాహము చేసికొనుగాక. 37

శ్లో॥ ఏవం ప్రేమకళాబద్ధావదంతి స్మ పురౌకసః ।
కన్యాచాంతః పురాత్ప్రాగాద్భటైర్గుప్తాంబి కాలయమ్ ॥ 38

టీ:- కించిదితి. అయమేవానుగ్రహ ఇతి నిర్దిశంతి - గృహ్ణాతీతి. (37-38)

ఈ విధముగ ప్రేమరసైకతత్పరులగు వైదర్భ పురవాసులు పలుకుచుండిరి. ఇంతలో కన్యాంతఃపురముందు భాగము నుండి, భటులతో రక్షింపబడునదై రుక్మిణీ అంబికాలయమునకు పయనమయ్యెను. 38

శ్లో॥ పద్భ్యాం వినిర్యయౌ ద్రష్టుం భవాన్యాః పాదపల్లవమ్ ।
సాచానుధ్యాయతీ సమ్యఙ్ముకుంద చరణాంబుజమ్ ॥ 39

శ్లో॥ యతవాఙ్మాతృభిస్సార్థం సఖీభిః పరివారితా ।
గుప్తా రాజభటైశ్శూరైస్సన్నద్ధైరుద్యతాయధైః ॥ 40

టీ:- తస్యా ఆగమనం విశినష్టి ద్వయేన - పద్భ్యామితి.(39-40)

భవానీమాత పాదపల్లవములను తిలకించుటకై ముకుంద చరణారవిందముల మనస్సున ధ్యానించుచు పాదచారియై రుక్మిణి బయలుదేరెను.

చెలికత్తెలు పరివేష్టించి యుండగ మాతృమూర్తులతో కలసి ఆయుధురాలైన శూరులగు భటులచే రక్షింపబడుచు బయలుదేరెను.

శ్లో॥ మృదంగశంఖ పణవ తూర్యభేర్యశ్చ జఘ్నిరే ॥ 41

టీ:- మృదంగేతి. అపి చ. మృదంగాదయః జఘ్నిరే అహతాః వాదితా ఇత్యర్థః. 41

ఆ సమయమున మృదంగ శంఖ పణవ తూర్య భేరులు మ్రోగింపబడెను. (39-41)

శ్లో॥ నానోపహారబలిభిర్వార ముఖ్యాస్సహస్రశః ।
స్రగ్గంధ వస్త్రాభరణైర్ద్విజపత్న్య స్స్వలంకృతాః ॥ 42

శ్లో॥ గాయంతశ్చ స్తువన్తశ్చ గాయకా వాద్య వాదకాః ।
పరివార్య వధూం జగ్ముస్సూత మాగధవందినః ॥ 43

టీ:- నానేతి. వారముఖ్యా గణికోత్తమాః. (42-43)

వేలకొలదిగా వారవనితలు బలులకొరకు వివిధ ఉపహార ద్రవ్యములను తీసుకొనిరాగ, చక్కగ అలంకృతులైన విప్రపత్నులు పుష్పమాలికలు, గంధము, వస్త్ర, ఆభరణములను తీసుకొనిరాగ, గాయకులు గానముల స్తుతింపుచుండగ, వాద్యకారులు వాద్య విశేషములను ప్రయోగించుచుండగ సూతులు వందిమాగధులు వధువును బరాబరులు తీర్చుచుండగ అంబికాలయమునకు వెళ్లిరి. (42-43)

శ్లో॥ ఆసాద్య దేవసదనం ధౌతపాదకరాంబుజా ।
ఉపస్పృశ్య శుచి శ్శాంతా ప్రవివేశాంబికాంతి కమ్ ॥ 44

టీ:- ఆసాద్యేతి. ఉపస్పృశ్య ఆచమ్య. 44

రుక్మిణీదేవి సదనముచేరి, కాళ్లుచేతులు కడుగుకొని ఆచమించి శుచియై శాంతచిత్తముతో గౌరి పాదసన్నిధిని చేరుకొనెను. 44

శ్లో॥ తాంవైప్రవయసోబాలాం విధిజ్ఞా విప్రయోషితః ।
భవానీం వందయాంచక్రుర్భవ పత్నీం భవాన్వితామ్ ॥ 45

టీ:- తామితి. ప్రవయసోవృద్ధాః. భవాన్వితామితి. భవస్యోపసర్జనత్వం స్త్రీ కర్మోచితముక్తం. 45

స్త్రీ కర్మ విధివిధానములనెరిగిన వృద్ధ బ్రాహ్మణ వనితలు రుక్మిణీదేవితో పరమేశ్వరయుతమైన పార్వతీమాత పాదపద్మములకు నమస్కారము చేయించిరి. 45

శ్లో॥ నమస్యేత్వాంబికేఽభీక్ష్ణం స్వసంతానయుతం శివం ।
భూయాత్పతిర్మే భగవాన్ కృష్ణస్తదనుమోదతామ్ ॥ 46

శ్లో॥ ఇతి సంప్రార్థయంతీ తాందేవీం దేవముమాపతీం ।
పూజయామాస విధివద్ద్విజపత్నీ పురస్కృతమ్ ॥ 47

టీ:- నమస్య ఇతి. రుక్మిణ్యా తదైవ దృష్టోఽయం మంత్రః స్వసంతానయుతం గణేశాదిసహితం. ఆత్మారామోఽసౌ కథం త్వత్పతిర్భవేదితి చేదత ఆహ - తదనుమోదతామితి. భవతీ శ్రీకృష్ణ ఏవవా. (46-47)

అమ్మా అంబికా ! నీ కుమారుడగు గణపతి, పతియగు భవునితో కూడియున్న నిన్ను మాటిమాటికి నమస్కరించుచున్నాను. శ్రీకృష్ణ భగవానుడు నాకు భర్తయగునట్లు ఆశీర్వదించి అంగీకరింపుము.

అని పార్వతిని, ఉమాపతిని ప్రార్థించుచున్నదై విప్ర వనితలతో కూడి యథావిధిగ పూజింపదొడగెను. (46-47)

శ్లో॥ అద్భిర్గంధాక్షతైర్ధూపైర్వాసస్స్రఙ్మాల్య భూషణైః ।
నానోపహారబలిభిః ప్రదీపావళిభిః పృథక్ ॥ 48

టీ:- అద్భిరితి. వాసస్స్రగ్గంధాదిభిరంబికాం సమపూజయత్. 48

శ్లో॥ విప్రస్త్రియః పతిమతీస్తథాతైస్సమపూజయత్ ।
లవణాపూ పతాంబూలకంఠసూత్ర ఫలేక్షుభిః ॥ 49

టీ:- విప్రస్త్రియ ఇతి. తథా విప్రస్త్రియోఽపి. తైర్ద్రవ్యైర్లవణాదిభిశ్చ సమపూజయదితి. 49

నీటితోడను గంధ, అక్షత, ధూపదీపములు, వస్త్ర, పుష్ప మాల్యములు, వివిధ ఆభరణములు, అనేక విధ దీపాలంకరణములు, నైవేద్యములతోడను వేర్వేరుగ సౌమంగల్య వతులగు విప్ర వనితలతో సహా లవణ, భక్ష్యములు, తాంబూలములు, మంగళసూత్రము, ఫలములు, చెరుకుగడలతోడను పూజించిరి. (48-49)

శ్లో॥ తస్యైస్త్రియస్తాః ప్రదదుశ్శేషాన్ యుయుజు రాశిషః ।
తాభ్యో దేవ్యై నమశ్చక్రే శేషాంశ్చ జగృహే వధూః ॥ 50

టీ:- తస్యా ఇతి. శేషాన్ నిర్మాల్యం. 50

ఆ విప్రవనితలందరు రుక్మిణికి అమ్మవారి నిర్మాల్యమును ప్రసాదముగనిచ్చి ఆశీర్వచనములు చేసిరి. రుక్మిణియు భవాని మాతకు, సౌమాంగల్యవతులైన ద్విజ పత్నులకు నమస్కారములు చేసెను. ఇతర స్త్రీలను యథావిధిగ సాదరముతో సత్కరించెను. 50

శ్లో॥ మునివ్రతమథ త్యక్త్వా నిశ్చక్రామాంబికా గృహాత్ ।
ప్రగృహ్య పాణినా భృత్యాం రత్నముద్రోపశోభినా ॥ 51

టీ:- మునివ్రత మితి. మునివ్రతం మౌనాది. భృత్యాం సఖీం. 51

అనంతరము రుక్మిణి మౌనవ్రతమునువీడి రత్నాంగులీయకముతో రాణించు హస్తముతో చెలికత్తియల చేతిని పట్టుకొని అంబికాలయము నుండి వెలుపలికి వచ్చెను. 51

శ్లో॥ తాం దేవమాయామివ వీరమోహినీం
సుమధ్యమాం కుండలమండితాననామ్ ।
శ్యామాం నితంబార్పిత రత్నమేఖలాం
వ్యంజత్త్సనీం కుంతల శంకితేక్షణామ్ ॥ 52

టీ:- తామితి. తాం విలోక్య వీరాముముహురితి తృతీయేనాన్వయః. శ్యామాం అజాతరజస్కాం కుంతలేభ్యః శంకితే ఇవ చపలే ఈక్షణే యస్యాస్తాం. 52

వీరులను మోహపరవశులచేయు దేవమాయవలె నున్న సుమధ్యమను, రత్నపు తటాకములచే ప్రకాశించుచున్న ముఖముగల దానిని, కౌమార వయస్సున సోయగము గల దానిని, రత్నమయమగు మొలనూలును నితంబముల పైభాగమున ధరించిన దానిని, సువ్యక్తమగు స్తనయుగము కల దానిని, జారియున్న ముంగురుల మధ్య నుండి గొంకు చూపులు చూచు దానిని, 52

శ్లో॥ శుచిస్మితాం బింబఫలాధరద్యుభి
శ్శోణాయమాన ద్విజకుందకుట్మలామ్ ।
పదాచలంతీం కలహంస గామినీం
శింజత్కలా నూపురధామ శోభినా ।
విలోక్య వీరా ముముహుస్సమాగతా
యశస్విన స్తత్కృత హృచ్ఛయార్దితాః ॥ 53

చిరునగవుతో దొండపండువంటి ఎఱ్ఱని పెదవుల కాంతితో ఎరు పెక్కిన మల్లెమొగ్గలవంటి పలువరుస గల దానిని, కల హంసవంటి నడకలతో అవ్యక్త మధురముగ ధ్వనించుచున్న అందియల సవ్వడులతో పాదచారియై వచ్చుచున్న ఆ రుక్మిణీ దేవిని స్వయంవరమునకు సమాగతులైన యశోవంతులగు వీరులు, ఆమెచే కంపింపచేయబడిన హృదయముకలవారై చూచి, పారవశ్యమునందిరి. (53)

టీ:- శుచిస్మితామితి. ద్విజా ఏవ కుందానాం కుట్మలాని ముకుళాని బింబఫలవత్ యోఽధరః తస్య ద్యుతిభిః శోణాయమానాని తాని యస్యాస్తాం. కలా శోభా తద్యుక్తం నూపురం శింజచ్చ తత్కలానూపురం చ. తస్య ధామ దీప్తిః తేన శోభితుం శీలం యస్య తేన. పదా చలంతీం విలోక్య ముముహుః. 53

శ్లో॥ యాంవీక్ష్య తే నృపతయస్తదుదారహాస
వ్రీడావలోకహృతచేతసఉఝ్జితాస్త్రాః ।
పేతుః క్షితౌ రథ గజాశ్వగతా విమూఢాః
యత్రాచ్ఛలేన హరయేఽర్పయతీం స్వశోభామ్ ॥ 54

స్వయంవరమునకై వచ్చిన రాజులందరు ఆ రుక్మిణీదేవి చిర్నగవు, సిగ్గుతో కూడిన చూపులతో హరించబడిన మనస్సుగలవారై ఆయుధములు హస్తములనుండి జారిపోగా, రథ,గజ,అశ్వములపై నున్నవారి మతులుపోయి, యాత్రా నెపముతో తన అందమును హరికర్పించుట జూచి పుడమిపైబడిపోయిరి. (54)

టీ:- నకేవలం ముముహుః పేతుశ్చేత్యాహ-యామితి. యత్రామిషేణ. హరయే స్వ లావణ్యం సమర్పయతీం యాం వీక్ష్య క్షితౌ పేతుః. 54

శ్లో॥ సైవం శనైశ్చలయతీ చరణాబ్జకోశౌ
ప్రాప్తిం తదా భగవతః ప్రసమీక్షమాణా ।
ఉత్సార్య వామకరజైర లకానపాంగైః
ప్రాప్తాన్ హ్రియైక్షత నృపాన్ దదృశేఽచ్యుతమ్ ॥ 55

ఆ రుక్మిణీదేవి ఈ విధముగ పద్మనిధులవంటి పాదములను మెల్లమెల్లగ వేయుచు అచటికి వచ్చియున్న భగవంతుని చూడదలచినదై వామకరమున ముఖముమీదకు జారిన ముంగురులను తొలగించుకొనుచు క్రీగన్నులతో అచట నున్న రాజులను లజ్జతో చూచుచు అచ్యుతుని కూడ దర్శించెను. (55)

టీ:- సేతి సా తాన్ ప్రాప్తాన్ హ్రియా ఐక్షత. తథైవాచ్యుతం చ దదర్శేత్యుత్తరేణాన్వయః. చలత్పద్మ కోశతుల్యౌ చరణౌ. చాలయంతీ. 55

శ్లో॥ తాం రాజపుత్రీం రథమారురుక్షతీం
జహార కృష్ణో ద్విషతాం సమీక్షతామ్ ।
రథం సమారోప్య సుపర్ణలక్షణం రాజన్య
చక్రం పరిభూయ మాధవః ॥ 56

రథముపైనెక్కబోవు ఆరాజకుమారి రుక్మిణిని శ్రీకృష్ణుడు శత్రువర్గము చూచుచుండగనే, గరుడధ్వజముగల తన అరదముపై నెక్కించుకొని రాజ సమూహమును ధిక్కరించి అపహరించెను. (56)

టీ:- తామితి. సుపర్ణ లక్షణం గరుడధ్వజం. 56

శ్లో॥ తతో యయౌ రామపురోగమశ్శ
నైస్సృగాలమధ్యాదివ భాగహృద్ధరిః ।
తం మానిన స్స్వాభిభవం యశః
క్షయం పరే జరాసంధముఖా న సేహిరే ।
అహో ధిగస్మాన్ యశ ఆత్తధ్వనినాం
గోపైర్హృతం కేసరిణాం మృగైరివ ॥ 57

అనంతరము బలరామాదులు ముందు మెల్లగ నడుచుచుండ నక్కల మధ్య నుండి మేకను వలె మాధవుడు హరించెను. తమ స్వాభిమానమును యశస్సు హరించిన కృష్ణుని శత్రువులు జరాసంధాదులు సహింపజాలకపోయిరి. అహో! కీర్తి మంతులమగు మమ్ములను గూర్చి ధిక్కారము. ధనుర్ధారులగు సింహకిశోరముల నుండి జింకను వలె గోపాలురచే ఆకీర్తి హరింపబడినదని ఆక్రోశించిరి. 57

టీ:- తత ఇతి. హరిః సింహః. అసహమానానాం తేషాం ఆక్రోశమాహ–అహో ధిగస్మాన్ యతోఽస్మాకం. యశో గోపైర్హృతమితి. (57)

ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే, త్రిపంచాశత్తమోఽధ్యాయః

శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు
యాభైమూడవ అధ్యాయము సమాప్తము

## చతుఃపంచాశత్తమోఽధ్యాయః

శ్లో ।। చతుఃపంచాశత్తమే తు జిత్వారాజ్ఞోవిపక్షగాన్।
రుక్మిణంచ విరూప్యాథ భైష్మ్యాః పాణిం పురేఽగ్రహీత్।।

శ్లో।। ఇతి సర్వేసుసంరబ్ధా వాహానారుహ్యా దంశితాః।
స్వైస్వైర్బలైః పరిక్రాంతా అన్వీయుర్ధృత కార్ముకాః।। 1

టీ:- ఇతీతి ఆహో ధిగస్వానిత్యేవం వదంతః సు సంరబ్ధాః క్రోధావిష్టాః దంశితాఃకృతసన్నాహాః.పరిక్రాంతాః పరివృతాః. అన్వీయుః అన్వధావన్. 1

శ్లో।। తానపతత అలోక్య యాదవానీక యూధపాః ।
తస్థుస్తత్సంముఖా రాజన్విష్ఫార్య స్వధనూంషి తే ।। 2

టీ:- తానితి. విష్ఫార్య టంకారం కృత్వా. 2

శ్లో।। అశ్వపృష్ఠే గజస్కంధే రథోపస్థే చ కోవిదాః ।
ముముచుశ్శరవర్షాణి మేఘా అద్రిష్వపో యథా ।। 3

## 54వ అధ్యాయము.

ఈ ఏబదినాల్గవ అధాయ్యము నందు పరపక్షపు రాజన్యులను జయించి, శ్రీకృష్ణుడు రుక్మిని విరూపునిజేసి, ద్వారకనుజేరి భీష్మకసుత పాణిగ్రహణము నాచరించెను.

రుక్మి మొదలగువారు తమతమ పరాక్రమమును ఛీత్కరించుకొనుచు, ఆగ్రహముతో ఊగిపోవుచు, వాహనములనెక్కి యుద్ధసన్నాహములతో, స్వబలగములతోడను ఆయుధముల నెక్కుబెట్టుకొని శ్రీకృష్ణుని వెంటబడిరి. 1

వెంటబడివచ్చు రుక్మి సైన్యమును చూచి యాదవ సైన్యము కూడా తమతమ ధనుష్టంకారముల గావించుచు వారినెదుర్కొనెను. 2

మేఘములు పర్వతములపై కుంభవృష్టి కురిసినట్లుగ అశ్వ గజ రథములపై నుండి యుద్ధము చేయు నేర్పరులగు రుక్మిణ మొదలైనవారి బలగములు యాదవసైన్యములపై బాణ వర్షమును

టీ:- అశ్వపృష్ఠ ఇతి. పరేషాం శరాణాం బాహుళ్యే. యాదవానామ చలత్వే చ దృష్టాంతః- మేఘా ఇతి. 3

గుప్పించిరి. మేఘ వర్షమెంతైనను పర్వత సదృశులగు కృష్ణ బలగము చలించలేదని భావము. 3

శ్లో॥ పత్యుర్బలం శరాసారైశ్ఛన్నం వీక్ష్యసుమధ్యమా ।
సవ్రీడమైక్షత్తద్వక్త్రం భయవిహ్వలలోచనా. ॥ 4

టీ:- పత్యురితి. ఐక్షత్ ఐక్షత. 4

శ్రీకృష్ణుని బలగము బాణవర్షమున కప్పబడుటను చూచిన సుందరి రుక్మిణి భీతచిత్తయై బెదరిన చూపులతో సిగ్గుతో యదునందనుని ముఖమునవలోకించెను. 4

శ్లో॥ ప్రహస్య భగవానాహ మాస్మ భైర్వామలోచనే ।
వినంక్ష్యత్యధునైవై తత్తావకైశ్శాత్రవం బలమ్॥ 5

టీ:- ప్రహస్యేతి. మాస్మభైః భయం మాకురు. హే వామలోచనే వరాక్షి, తావకైః త్వదీయైః కృత్వా 5.

భగవంతుడగు శ్రీకృష్ణుడు చిరునగవుతో ఓ వరాక్షీ! భయపడకుము. ఇప్పుడే నీ శాత్రవ బలమంతయు నశించగలదు. చూచుచుండమని పల్కెను. 5

శ్లో॥ తేషాం తద్విక్రమం వీరా గదసంకర్షణాదయః ।
అమృష్యమాణా నారాచైర్జఘ్నుర్హయగజాన్రథాన్ ॥ 6

టీ:- తేషామితి. స చాసౌవిక్రమశ్చ తం. 6

గద, సంకర్షణాది యదువీరులు పరసైన్య పరాక్రమమును సహింపనివారై బాణములతో ఆయుధములతోడను అశ్వగజముల నన్నింటిని ధ్వంసము చేసిరి. 6

శ్లో॥ పేతుశ్శిసిరాంసి రథినామశ్వినాం గజినాం భువి ।
సకుండలకిరీటాని సోష్ణీషాణిచ కోటిశః ॥ 7

టీ:- పేతురితి. ఉష్ణీషాణి శిరోవంతంసవస్త్రాణి, తత్సహితాని శిరాంసి. 7

అశ్వ, గజరథములనధిరోహించిన సైన్యము యొక్క కుండల, కిరీట, తలపాగలతోడి కోట్లాది శిరములు భూమి మీద తెగిపడెను. 7

శ్లో॥ హస్తాస్సాసి గదేష్వాసాః కరభా ఊరవోఽంఘ్రయః।
అశ్వాశ్వతరనాగోష్ట్ర ఖరమర్త్య శిరాంసి చ॥ 8

శ్లో ॥ హన్యమానబలానీకా వృష్ణిభిర్జయకాంక్షిభిః।
రాజానో విముఖా జగ్ముర్జరాసంధ పురోగమాః॥ 9

టీ:- హస్తాఇతి. కరభాః ప్రకోష్ఠా ఊరువిశేషణం వా (8,9)

ఖడ్గ, గద బాణములను పట్టుకొన్న మణికట్లతో హస్తములు, ఊరువులు, పాదములు, అశ్వములు, కంచరగాడిదలు, గజములు, ఒంటెలు, గాడిదల పదాతుల శిరములు కూడా కోట్లాదిగా తెగిపడెను.

జయకాంక్ష కలిగిన యదుబలములచే చంపగా మిగిలిన జరాసంధాది బలగములు రాజులును యుద్ధవిముఖులై జరాసంధ పురోగములై పారిపోయిరి.(8,9)

శ్లో॥ శిశుపాలంసమభ్యేత్య హృతదారమివాతురమ్ ।
నష్టత్విషం గతోత్సాహం శుష్యద్వదనమబ్రువన్ ॥ 10

టీ:- శిశుపాలమితి. అప్రాప్తదారమేవతం. హృతదారమివఆతురం. 10

భార్యను పోగొట్టుకొనిన వానివలె ఆతుర పడుచున్న కల తప్పిన, నిరుత్సాహియైన వాడిన ముఖము కల్గిన శిశుపాలును సమీపించి జరాసంధులు పల్కిరి. 10

శ్లో॥ భోభో పురుష శార్దూల దౌర్మనస్యమిదం త్యజ ।
న ప్రియా ప్రియయోరాజన్నిష్ఠా దేహిషు దృశ్యతే ॥ 11

టీ:- భోభో ఇతి. నిష్ఠాస్థైర్యం. 11

ఓ పురుష శార్దూలమా ! ఈ దుర్మార్గపుటాలోచనను మానుకొనుము. ప్రియాప్రియులయందు మానసిక స్థైర్యము ఇతర ప్రాణులందు కనిపించదు. 11

శ్లో॥ యథాదారుమయి యోషిన్నృత్యతే కుహకేచ్ఛయా ।
ఏవమీశ్వరతంత్రోఽయమీహతేసుఖదుఃఖయోః ॥ 12

టీ:- యథేతి. కుహకోనర్తయితా. త్యస్యేచ్ఛయా దుఃఖేఽపి ఈవామానత్వేన పారవశ్యం వ్యక్తం దర్శితం. 12

చెక్కబొమ్మయగు స్త్రీ ఏవిధముగా ఆ బొమ్మలనాడించు టక్కరి ఇష్టప్రకారం నాట్యము చేయునో అట్లే ఈశ్వర పరతంత్రమైన ఈ లోకము సుఖదుఃఖములను అనుభవించును. 12

శ్లో॥ శౌరేస్సప్త దశాహం వై సంయుగాని పరాజితః ।
త్రయోవింశతిభిస్సైన్యైర్జిగ్య ఏకమహం పరమ్ ॥ 13

టీ:- అత్ర చాహమేవ దృష్టాంత ఇత్యాహ--జరాసంధః . శౌరేరితి. శౌరేః కృష్ణాత్సకాశాత్. ఏకం సంయుగం పరం కేవలం అంతిమం వాజిగ్యే జితవానహం 13

ఓ శిశుపాలా ! ఈ విషయమున నేనే దృష్టాంతము. ఇరువది మూడువేల అక్షౌహిణుల బలగముతో పదిహేడు మారులు కృష్ణునిపై దండెత్తి పోయి పరాజితుడనైతిని. చివరకు ఒక్క మారు మాత్రమే నేను గెలిచితినని జరాసంధుడనెను. 13

శ్లో॥ తతాప్యహం న శోచామి నప్రహృష్యామి కర్హిచిత్ ।
కాలేన దైవయుక్తేన జానన్ విద్రావితం జగత్॥ 14

టీ:- తథేతి. దైవం అదృష్టం తద్యుక్తేన. 14

అయినను నేను దుఃఖించుట లేదు. ఎప్పుడును సంతోషించనూ లేదు. విధికి లోబడినదైన ఈ జగత్తు కాలానుసారము పరుగెత్తుచున్నది. 14

శ్లో॥ అధునాపి వయం సర్వే వీరయూథపయూథపాః।
పరాజితాః ఫల్గుతం త్రైర్యదుభిః కృష్ణ పాలితైః ॥ 15

టీ:- అధునేతి. ఫల్గుతంత్రైః స్వల్ప సైన్యైః. 15

నేడును వీరుల బృందములు కల్గియున్న మనమందరము స్వల్ప సైన్యముగల కృష్ణుని రక్షణమునున్న యాదవులచే పరాజితులమైతిమి. 15

శ్లో॥ రిపవో జిగ్యురధునా కాల ఆత్మానుసారిణి ।
తదా వయం చ జేష్యా మో యదా కాలః ప్రదక్షిణః ॥ 16

కాలము ఆత్మానుసారమైనది. కావున నేడు శత్రువులకు కాలమనుకూలించి నందున వారు జయించిరి. అట్లే ప్రదక్షణ పూర్వకమైన కాలము మనకు అనుకూలించినపుడు మనము కూడ విజేతలమగుదుము.

శ్లో॥ ఏవం ప్రబోధితో మిత్రైశ్చైద్యో౽గాత్సా నుగః పురమ్ ।
హతశేషాః పునస్తే౽పి యయుస్స్వస్వపురం నృపాః॥ 17

ఈవిధముగ మిత్రులచే ప్రబోధితుడై చైద్యుడు తన పరివారముతో స్వ నగరమునకు మరలిపోయెను. హత శేషులగు ఇతర రాజులుకూడ తమ తమ పురములకు మరలిపోయిరి.

శ్లో॥ రుక్మీతు రాక్షసోద్వాహం కృష్ణద్విడసహన్ స్వసుః ।
పృష్ఠతో౽న్వగమత్కృష్ణ మక్షౌహిణ్యా వృతోబలీ ॥ 18

కృష్ణ ద్వేషి యగు రుక్మి మాత్రము చెల్లెలు రుక్మిణి యొక్క రాక్షస వివాహమును సహింపజాలక అక్షౌహిణీ బలయుతుడై కృష్ణుని వెంబడించి పోయెను. (16,17,18)

శ్లో॥ రుక్మ్యమర్షీ సుసంరబ్ధశ్శృణ్వతాం సర్వ భూభుజామ్ ।
ప్రతిజజ్ఞే మహాబాహుర్దంశితస్సశరాసనః ॥ 19

కోపావేశి యగు రుక్మి మాత్రము కవచబాణములను ధరించినవాడై సమస్త రాజసమూహము వినుచుండగా ప్రతిజ్ఞ చేసెను.(19)

శ్లో॥ అహత్వా సమరే కృష్ణమప్రమోచ్య చ రుక్మిణీమ్ ।
కుండినం న ప్రవేక్ష్యామి సత్యమే తద్బ్రవీమివ ॥ 20

యుద్ధమున కృష్ణుని చంపకుండగా, రుక్మిణిని విడిపించకుండగా నేనుండిన నగరము ప్రవేశించను. ఇది ముమ్మాటికి సత్యము. (20)

శ్లో॥ ఇత్యుక్త్వా రథమారుహ్య సారథిం ప్రాహసత్వరః ।
చోదయాశ్వాన్యతః కృష్ణస్తేన మే సంయుగోభవేత్ ॥ 21

అని పలికి రథమునెక్కి కృష్ణుడున్న చోటికి రథమును గొనిపొమ్ము. నేడు అతనితో నాకు సమరము జరుగును అని త్వరితుడై సారథితో పల్కెను. 21

టీ:- రిపవ ఇతి. ప్రదక్షిణః అనుకూలస్యాత్. (16-21)

శ్లో॥ అద్యాహం నిశితైర్బాణైర్గోపాలస్య సుదుర్మతేః ।
నేష్యే వీరమదం యేనస్వసా మే ప్రసభం హృతా ॥22

నా సోదరిని బలాత్కరించి అపహరించిన, దుష్టబుద్ధి కలిగిన ఆలకాపరియొక్క వీరమథమును నేడు నేను నిశితమగు నా నారాచములతో అణచివేతును. 22

శ్లో॥ వికత్థమానః కుమతిరీశ్వరస్యా ప్రమాణవిత్ ।
రథేనైకేన గోవిందం తిష్ఠతిష్ఠేత్యు పాద్రవత్ ॥ 23

ఈశ్వర తత్త్వమెరగని బుద్ధిహీనుడు రుక్మి ఆత్మశ్లాఘను చేసుకొనుచు కేవల రథమాత్రుడై గోవింద నిలు నిలుమని అరుచుచు వెంటపడెను. 23

శ్లో॥ ధనుర్వికృష్య సుదృఢం జఘ్నేకృష్ణం త్రిభిశ్శరైః ॥ 24

టీ:- అద్యేతి. గోపాలస్య వేదపాలకస్యేతి వాస్తవోஉర్థః. తదా సుదుర్మతేరితి. శోభానా అనుగ్రహవతీ దుష్టేష్వపి మతిరస్య తస్యేతి. (22-24)

ధనస్సును ఆకర్ణాంతములాగి మూడుబాణములతో కృష్ణుని కొట్టెను. 24

శ్లో॥ ఆహ చోర క్షణం తిష్ఠ యదూనాం కులపాంసన ।
యాసి స్వసారం మే ముషిత్వా ధ్వాంక్షవద్ధవిః ॥ 25

టీ:- ఆహేతి. యదూనాం కులపాంసన కులదూషణేతిలౌకికార్థః వాస్తవార్థస్తు. యదూనాం కులస్యప హే యదుకులపతే. అంసన స్వయం చ రిపుహననచతుర. అంసన మాఘాత ఇత్యస్మాద్ధాతోః కర్తరిల్యుట్ ప్రత్యయో నందాదివిహితః. ధ్వాంక్షః కాకః సయథా హవిః ముష్ణాతి తద్వత్. వస్తుతః అధ్వాంక్షవదితి ఛేదః సహస్రాక్షవదిత్యర్థః సింహతార్క్ష్య వద్వా. 25

ఓ యదుకులపాంసన! యాదవకులమునకు అపకీర్తిని కూర్చువాడా ! మరియు వాస్తవ అర్థమున యదుకులప + అంసన అని పదవిభాగము. యాదవ కులపతి! స్వయముగారిపుసంహరణ దక్షుడా! అని. చోరుడా! క్షణకాలము నిల్వుము. హవిస్సును దొంగలించిన కాకివలె నా చెల్లెలిని అపహరించి ఎచటికి పోగలవు. అని పల్కెను.( ఇచట ధ్వాంక్షమనగా కాకి ముషిత్వా+అధ్వాంక్షవత్ అని పద విభాగము చేసినచో అధ్వాంక్షుడనగా ఇంద్రుడని లేదా సింహము లేదా గరుడుడనియు అర్థము. సందర్భానుసారముగా ఇంద్రుడు హవిస్సును గ్రహించినట్లుగా నీవు నా సోదరిని లక్ష్మీస్వరూపయగు రుక్మిణిని కొనిపోవుచున్నావని అర్థము.) 25

శ్లో॥ హరిష్యేஉద్య మదం మంద మాయినః కూట యోధినః ।
యావన్న మే హతో బాణైశ్శ యీథాముంచ దారికామ్ ॥ 26

ఓ యాదవుడా! కపటయుద్ధముచేయు మోసకారివైన నీ మదమును నేనణచి వేయుదును. నా సోదరిని విడువుము. లేనిచో నాబాణములతో హతుడవైతివని పలికెను. 26

శ్లో॥ స్మయన్కృష్ణో ధనుశ్ఛిత్త్వాషడ్భిర్వివ్యాధరుక్మిణమ్ ।
అష్టభిశ్చతురోవాహాన్ ద్వాభ్యాం సూతంధ్వజంత్రిభిః॥ 27

శ్రీకృష్ణుడు చిరునవ్వునవ్వి ఆరుశరములతో రుక్మి ధనస్సును ఛేదించి, ఎనిమిది బాణములతో నాల్గు గుర్రములను, రెండిటితో సూతుని, మూడింటితో టెక్కమును పడగొట్టి విస్మయపరిచెను. 27

శ్లో॥ స చాన్యద్ధనురాదాయ కృష్ణం వివ్యాధ పంచభిః ।
తైస్తాడితశ్శరౌఘైస్తచ్చిచ్ఛేద ధనురచ్యుతః ॥28

ఆ రుక్మియు మరియొక ధనస్సును అందుకొని అయిదు శరములతో కృష్ణుని వేధించెను. ఆ శరములతో బాధితుడైన శ్రీకృష్ణుడు వాని వింటిని బాణములతో ఛేదించెను. 28

శ్లో॥ పునరన్య దుపాదత్త తదప్యచ్ఛిన దవ్యయః ।
పరిఘం పట్టసం శూలం చర్మాసీ శక్తితోమరౌ ॥29

మరల రుక్మి వేరొక ధనస్సును, అడ్డకత్తిని ఇంకను బల్లెమును, విచ్చుకత్తులను చిల్లకోలలను ప్రయోగించగా అవ్యయుడు కృష్ణుడు ఛేదించివేసెను. 29

శ్లో॥ యద్యదాయుధ ధత్తమాతత్సర్వం చాచ్ఛిన ద్విభుః ॥ 30

ఇంకను కృష్ణ భగవానుడు రుక్మి గ్రహించిన బాణములన్నింటిని తుంచివేసెను. 30

శ్లో॥ తతో రథాదవప్లుత్య ఖడ్గ పాణిర్జిఘాంసయా ।
కృష్ణమభ్యద్రవత్క్రుద్ధః పతంగ ఇవ పావకమ్ ॥ 31

తరువాత రుక్మి రథమునుండిదిగి కృష్ణుని చంపదలచి కత్తిని చేబూని మిణుగురుపురుగు మంటలను సమీపించునట్లు కృష్ణుని సన్నిధికి పరుగెత్తెను. 31

శ్లో॥ తస్య చాపతతః ఖడ్గం తిలశశ్చర్మ చేషుభిః ।
ఛిత్వాసిమాదదే తిగ్మం రుక్మిణం హంతు ముద్యతః ॥32

శ్లో॥ దృష్ట్వాభ్రాతుర్వధోద్యోగం రుక్మిణీ భయవిహ్వలా ।
పతిత్వా పాదయోర్భర్తు రువాచ కరుణం సతీ ॥ 33

శ్లో॥ యోగేశ్వరాప్రమేయాత్మన్ దేవ దేవ జగత్పతే ।
హంతుంనార్హసి కల్యాణ భ్రాతరంమే మహాభుజ ॥ 34

టీ:- హరిష్య ఇతి. హే మంద, స్థిరేత్యర్థః (26 - 34)

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ తయా పరిత్రాస వికంపితాంగయా
శుచావిశుష్యన్ముఖ రుద్ధకంఠయా ।
కాతర్య విస్రంసిత హేమమాలయా
గృహీతపాదః కరుణోన్యవర్తత॥ 35

టీ:- తయేతి. పరిత్రాసేన వికంపితాన్యంగాని యస్యాః తయా శుచాశోకేన విశుష్యత్ ముఖం యస్యాః. రుద్ధః కంఠోయస్యాః సా చ తయా. కాతర్యేణ వైక్లబ్యేన విస్రంసితా హేమమయీమాలా యస్యాస్తయా. గృహితౌ పాదౌ యస్యసః. 35

అట్లు పరుగెత్తి వచ్చుచున్న రుక్మి యొక్క ఖడ్గమును కవచమును బాణములచే కృష్ణుడు నుజ్జునుజ్జుగచేసి తీక్ష్ణమగు రుక్మిని చంపుటకై వాడియగు కరవాలమును గ్రహించెను. 32

అట్లు తనఅన్నను చంపగోరు కృష్ణుని ప్రయత్నము చూచి రుక్మిణి భయభీతయై భర్త పాదములపై పడి దీనముగ ఇట్లనెను.

యోగీశ్వరా! అప్రమేయాత్మ! జగత్పతీ! దేవ దేవ! మహాభుజ! కల్యాణ ప్రద! నా అన్నను చంపవలదు. (33,34)

భయముతోకంపించుచున్న శరీరము కల్గినట్టి, శోకముతో వాడిపోయిన ముఖము కల్గినట్టి, గద్గదమైనకంఠముకల్గినట్టి, భయముతో జారిపోవుచున్న కంఠమునందలి బంగారు గొలుసు కల్గినట్టి రుక్మిణి చేత పట్టుకొనబడిన పాదములు కలవాడై కృష్ణుడు దయాళువై రుక్మిని చంపు ప్రయత్నమునుండి విరమించెను. 35

శ్లో॥ ఛేలేనబద్ధ్వా తమసాధుకారిణం
సశ్మశ్రుకేశం ప్రవపన్ వ్యరూపయత్ ।
తావన్మమర్దుః పరసైన్యముద్ధతం
యదుప్రవీరా నళీనీం యథా గజాః ॥ 36

అకృత్యమగు రుక్మిని వల్లెవాటుతో బంధించి కృష్ణుడు మీసములను కేశములను కాట్లు కాట్లుగ కత్తితోతెగ గీచి వికారరూపుని చేసెను. ఇంతలో యదువీరులు ఉన్మత్తులై వెంటబడ్డటి అతని సైన్యమును గజములు తామరకొలనులను ధ్వంసముచేసినట్లుగా మర్దించిరి. 36

టీ:- చేలేనేతి. సశ్మశ్రుకేశం సహితాని స్థానే స్థానే అవశిష్టాని శ్మశ్రూణి కేశాశ్చ యథా భవంతి. తథా. తేనైవ అసినా ప్రవపన్ ముండయున్, వ్యరూపయత్ విరూపమకరోత్. 36

శ్లో॥ కృష్ణాంతికముప వ్రజ్య దదృశుస్తత్ర రుక్మిణమ్ ।
తథా భూతం హతప్రాయం దృష్ట్వాసంకర్షణో విభుః ।
విముచ్య బద్ధం కరుణో భగవాన్ కృష్ణమబ్రవీత్ ॥ 37

బలరామ దేవుడు కృష్ణుని దగ్గరకు వచ్చి మీసాలు కేసములు గొరగబడిన రుక్మిని అచట హతప్రాయునిగ చూచి బంధనములను విడిపించి సదయుడై కృష్ణునితో నిట్లు పలుకజొచ్చెను.

శ్లో॥ అ సాధ్విదం త్వయాకృష్ణ కృతమస్మిన్ జుగిప్సితమ్ ।
వపనం శ్మశ్రు కేశానాం వైరూప్యం సుహృదోవథః ॥38

కృష్ణా! నీవు చేసిన పని మంచిదికాదు. మిక్కిలి జుగుప్సాకరము. శ్మశ్రు కేశములను వపనము చేసి వికృతరూపమును గావించుట మిత్ర వధతోసమానము. (37,38)

టీ:- కృష్ణాంతికమితి. తథాభూతం హతప్రాయమిత్యుత్తర వ్యాకేఽప్య నుషంగః. 37 - 38

శ్లో॥ మైవాస్మాన్ సాధ్వ్యసూయేథాః భ్రాతుర్వైరూప్య చింతయా ।
సుఖదుఃఖప్రదోనాన్యోయత స్స్వకృతభుక్పుమాన్ ॥ 39

టీ:- రుక్మిణీం సాంత్వయతి - మైవాస్మానితి. 39

అమ్మా రుక్మిణీ! అన్నను వికృతాకారునిగ చూచి చింతించుచూ మమ్ములను అసహ్యించుకొనకుము. మానవుడు తాను చేసిన పుణ్య పాపకర్మల ఫలితమును తానే యనుభవించును. మరొకరందుకు కారణము కాదు. అని బలదేవుడు రుక్మిణిని ఓదార్చెను. 39

శ్లో॥ బంధుర్వధార్హదోషోఽపి న బంధుర్వధమర్హతి।
త్యాజ్యస్తేనైవ దోషేణ హతః కింహన్యతేపునః ॥ 40

టీ:- పునఃకృష్ణమాక్షిపతి - బంధురితి. 40

కృష్ణా ! బంధువు చంపతగినంత తప్పిదము చేసినను వధియింప నర్హుడుకాదు. ఆతప్పిదముతోడనే అతనిని వదిలివేయతగును. ఎందుకనగ దోషముచేసి కుంచించుక పోవువానిని మరల చంపుట యుక్తముకాదు కదా! అని కృష్ణుని మందలించెను. 40

శ్లో॥ క్షత్రియాణామయం ధర్మః ప్రజాపతి వినిర్మితః ।
భ్రాతాపి భ్రాతరం హన్యాద్యేన ఘోరతరస్తతః ॥ 41

టీ:- పునర్దేవిం ప్రత్యాహ- క్షత్రియాణామితి యేన ధర్మేణ భ్రాతాపి భ్రాతరం హన్యాత్. తత్తస్మాద్ఘోరతరః అతిదారుణః ధర్మశ్చ అతః కోఽస్మాకమపరాధ ఇతి భావః. 41

అమ్మా రుక్మిణీ! క్షత్రియ ధర్మము విధివినిర్మితము. ఘోరతరమైన అకృత్యముగావించినపుడు సోదరునైనను సోదరుడు చంపవచ్చును. అందువలన ప్రస్తుత సందర్భమున మాదోష మేమికలదని ఊరడించెను. 41

శ్లో॥ రాజ్యస్య భూమేర్విత్తస్యస్త్రియో మానస్య తేజసః ।
మానిసోఽన్యస్యవాహేతోః శ్రీమదాంధాఃక్షిపంతి హి ॥ 42

మరల కృష్ణునితో, కృష్ణా! ధనమదాంధులు రాజ్య, భూ, ధన, స్త్రీ, అభిమాన, సువర్ణము, ఇంకను ఇతరమగు ప్రబల కారణములతో గౌరవార్హులగు వారిని హింసించుచుందురు. ఇది లోక సహజము.

టీ:- పునః కృష్ణం ప్రత్యాహ - రాజ్యస్యేతి. తథా ప్యస్మాకమే తదనుచితమితి భావః. 42

అయినను మనవంటివారు ఇట్లాచరించుట అనుచితము అని పలికెను. 42.

శ్లో॥ తవేయం విషమాబుద్ధి స్సర్వ భూతేషు దుర్హృదామ్ ।
యన్మన్యసే సదాభద్రం సుహృదాం భద్రమజ్ఞవత్ ॥ 43

టీ:- పునర్దేవీం ప్రత్యాహ - తవేతి. సర్వభూతేషు దుర్హృదా మహితానాం భ్రాతౄణాం అజ్ఞవత్ యత్ భద్రం మన్యసే ఇచ్ఛసి. ఇయం తవ విషమా అనమీచీనాబుద్ధిః కుతః. యంత స్తదేవసుహృదామాభద్రమితి. యద్వా సర్వభూతేషు దుర్హృదామపి స్వసుహృదాం భద్ర మే వేదం దండరూపం ముండనం అభద్రం యన్మన్యసే. తవేయం విషమా బుద్ధిరితి. అథవా సర్వభూతేషుమధ్యే దుర్హృదాం శిశుపాలాదీనాం. అభద్రం సుహృదాం భద్రం చ యన్మన్యసే తవేయం విషమా బుద్ధిః సమాన భవతి. అజ్ఞవత్ అజ్ఞానమివ. 43

బలరాముడు మరల రుక్మిణీదేవితో పలుకుచున్నాడు. సకల ప్రాణులలో అనిష్టులగు సోదరుల విషయమున అజ్ఞునివలె ఇట్లు చేయుట యుక్తమని తలచినచో అదినీ మంచి బుద్ధి కాదు. ఎందుకనగ ఆ బుద్ధియే నీస్నేహితులకు అనిష్టకారియగును. లేదా సర్వప్రాణులలో దుర్జనులగు నీస్నేహితులకు దండనరూపమగు ముండనము యుక్తమైన దైనను అయుక్తముగ తలంచుచో నీది విషమబుద్ధియగును. అథవా సమస్తప్రాణులలో దుర్జనులగు శిశుపాలాదుల విషయమున యుక్తమైన దిగను సజ్జన మిత్రుల విషయమున అయుక్తమైనదిగను తలంచినచో అదియును అజ్ఞులవలె అట్టి బుద్ధి సమమైనదికాదు. 43

శ్లో॥ ఆత్మమోహోనృణా మేషకల్ప్యతే దేవమాయయా।
సుహృద్దుర్హృదుదాసీన ఇతిదేహాత్మమానినామ్ ॥44

టీ:- కుత ఇత్యత అహ - ఆత్మమోహ ఇతి. 44

దేహమే ఆత్మయని తలంచు మానవులకు తనవాడు, పరుడు, తటస్థుడను భావము దైవమాయచే ఆత్మ మోహమును కల్పింపబడుచున్నది. 44

శ్లో॥ ఏక ఏవ పరోహ్యాత్మా సర్వేషామపి దేహినాం ।
నానేవగృహ్యతేమూఢైర్యథాజ్యోతిర్యథా నభః ॥ 45

టీ:- పరమార్థమాహ - ఏక ఏవేతి. పరః శుద్ధః జ్యోతిశ్చంద్రాది ర్యథోదకేషు నభో యథా ఘటాదిష్వతి. 45

పరమార్థమేమనగ సర్వప్రాణులలోని పరిశుద్ధమగు ఆత్మ ఒక్కటియే! నీటియందు ఘటాదులందును ఆకాశము, చంద్రుడు వేరు వేరుగ కనిపించినట్లుగ మూఢులచే ప్రతి దేహియందు ఆత్మ భిన్న భిన్నముగ గ్రహింపబడుచున్నది. 45

శ్లో॥ దేహ ఆద్యంత వానేషద్రవ్య ప్రాణగుణాత్మకః ।
ఆత్మన్యవిద్యయాక్లిప్తస్సంసారయతి దేహినమ్ ॥ 46

టీ:- కుతస్తర్హి న చంద్రాదినదాత్మానమేకం శుద్ధం చ ప్రతీమస్తత్రాహ - దేహ ఇతి. ద్రవ్యమధిభూతం. ప్రాణాఇంద్రియాణి అధ్యాత్మం గుణశబ్దేనాధిదైవం. తత్త్రితయాత్మకః దేహోపాధినా శుద్ధోన ప్రతీయత ఇత్యర్థః. 46

జీవుల ఉనికికి అనుకూలమైన ఉపాది శరీరము. అందంతటను వ్యాప్తమైనవాడు పరమాత్మ. ఈ ఆత్మ శరీరమునందలి భౌతికమైన సర్వధాతువులకు ఆధిభౌతికముగా, ఆత్మను అధిష్ఠించిన ప్రాణము, ఇంద్రియాలు మొదలైన విధముగా ఆధ్యాత్మికముగా, సత్త్వరజస్తముము లనే శబ్దాది పంచతన్మాత్రల రూపమున ఆధిదైవికముగా, అనగా ఈ మూడింటి కలయికతో కూడిన శరీరముచే పరిశుద్ధుడుగ ప్రకాశించుటలేదు. అనగా దేహమే ఆత్మ ఆనే అజ్ఞానము, అవిద్యచేత ప్రాపంచిక వ్యామోహములో జీవుడు పడిపోవుచున్నాడు. చంద్ర, సూర్య, అగ్నులవలె ఏకము శుద్ధముగ ఆత్మను భావించుటలేదు. 46

శ్లో॥ నాత్మనోఽన్యేనసంయోగోవియోగశ్చాసతాసతి ।
తద్ధేతుత్వాత్తత్ప్రసిద్ధే ర్దృగ్రూపాభ్యాంయథారవేః ॥ 47

ఉపాధి సంబంధము వలన ప్రాపంచిక జీవయాత్ర గడుపటలో పలువిధములగు కర్మలు చేయవలసి వచ్చుట వలన ఆత్మ యొక్క ఏకత్వము పరిశుద్ధత్వములు (అజ్ఞానముచేత) భాసించవు.

టీ:- నను దేహసంబంధేనాపి సంసారే సతి శుద్ధత్వం గతమేవ తత్రాహ-నేతి. హే సతి అన్యేన అధిభూతాదినా. ఆత్మనః సంయోగవియోగౌ న స్తః కుతః అసతా అసత్వాదన్యస్యేత్యర్థః కుతోஉసత్త్వం తత్రాహ--తద్ధేతుత్వాదితి. తస్యానస్య భూతేంద్రియాదేః ప్రసిద్ధేః ప్రకాశస్య తద్ధేతుత్వాత్ ఆత్మహేతుకత్వాత్. నను దేవైరధిష్ఠి తేభ్య ఇంద్రియేభ్యో భూతానాం ప్రతీతిః.ప్రసిద్ధా . భూతప్రతీత్యా చ తత్ప్రసిద్ధిః నాత్మన ఇత్యత ఆహ - దృగ్రూపాభ్యాం యథా రవేః యథా ప్రకాశ్య ప్రకాశకత్వేన వర్తమానయోరపి చక్షూరూపయోః రవేస్సకాశాత్ప్రసిద్ధిః ద్వయోరపి తైజసత్వాత్. తదభేదశ్చ. తథా భూతేంద్రియాదీనాం పరస్పరాధీనసిద్ధానామపి చైతన్యాధీన ఏవ ప్రకాశః. తత్కార్యత్వాచ్చ తద్వ్యతిరేకేణాసత్త్వం చేత్యర్థః. తథా చ. ద్వాదశే వక్షతి.

శ్లో. "దీపశ్చక్షుశ్చ రూపం చ జ్యోతిషో న పృథగ్భవేత్, ఏవం ధీః ఖాని మాత్రాశ్చ సస్యురన్యతమాదృతా ఇతి. యద్వా. రవేః ప్రసిద్ధాభ్యామేవ దృగ్రూపాభ్యాం పరస్పర ప్రసిద్ధిర్యథా తద్వది"తి. 47

ఆత్మకు ఇతరములైన అనగా ద్రవ్య ప్రాణేంద్రియ గుణ తన్మాత్రలు మొదలైనవాని యొక్క సంయోగ వియోగములు లేకపోయినప్పటికి ద్రవ్యాదులు కారణమైనందువలన పరమాత్మ ప్రసిద్ధి చేత కాంతిని గ్రహించ గలిగిన కన్నులను సూర్యుడు ప్రకాశింప చేసినట్లుగ, ప్రకాశములు, ప్రకాశకుడైన సూర్యుడు ప్రకాశింపచేయు అతని కాంతియు తేజోవంతములైనందున రెంటికి అభేదము. అట్లే భూతములు ఇంద్రియములు మొదలగు వానికి ఒకదానికొకటి అధీనమైనను, ఒకదానినుండి మరొకటి సిద్ధించినను ఇవన్నియు పరమాత్మ చైతన్యమై మాత్రమే ప్రకాశించుచున్నవి.

ఈ దేహేంద్రియాది సర్వ ప్రకాశములు ప్రకాశుడైన పరమాత్మ యొక్క కార్యరూపములైనందు వలన పరమాత్మకంటె (కార్యపరంగా) భిన్నములైనందు వలన ఇవి సత్య పదార్థములు కావు అని చెప్పుచున్నాడు. ఈ విషయము ద్వాదశ స్కంధమున విశదపరచబడినది. దీపము, కన్నులు, రూపము అనునవి ప్రకాశముకంటే భిన్నములు కావు. అట్లే బుద్ధి, ఇంద్రియాలు పంచతన్మాత్రలు వేరువేరుగ స్వీకరింపబడవు. ప్రసిద్ధములైన సూర్యునికి నేత్రములకు పరస్పర ప్రసిద్ధి కల్గినట్లుగ భావము. 47

శ్లో॥ జన్మాదయస్తు దేహస్య విక్రియానాత్మనః క్వచిత్ ।
కలానామేవ నైవేందోర్మృతి రస్య కుహూరివ ॥ 48

టీ:- దేహసంబంధాభావదేవ నాత్మనో జన్మాదయోఽపీతి వక్తుం జన్మాదీనాం దేహధర్మత్వమాహ. జన్మాదయ స్త్వితి. కథం తర్హి జాతోఽహం బాలోఽహం వృద్ధోఽహమితి ఆత్మని జన్మాదిప్రతీతిరత ఆహ- నాత్మన ఇతి. సదృష్టాంతమాహ - కలానామేవేతి. ఇందోః కలానామేవ జన్మాదయో నైవేందోర్యథా తద్వత్ యథా చ కలానాశాదేవ కుహూరమావాస్యా ఇందుక్షయ ఉచ్యతే తద్వదస్యాత్మనో దేహనాశాదేవ మృతివ్యవహార ఇత్యర్థః 48

ఆత్మకు దేహసంబంధము లేకపోయినప్పటికి నేను పుట్టితిని, నేను బాలుడను అను జన్మాది విషయములు ఉన్నట్లు చెప్పుటకు జన్మాదులయొక్క దేహధర్మములే కారణమని చెప్పుచున్నాడు. చంద్రుని యొక్క కళలకు మాత్రమే జన్మాదులు(వృద్ధినాశములు) ఉండును కాని వాస్తవముగ చంద్రునియందు ఎట్టివృద్ధి నాశములు లేవు. అట్లే చంద్రుని కళలు నాశనమైన(క్షీణించిన) పిమ్మట చంద్రుడే క్షీణించి నశించినా కుహూ అనెడుఅమావాస్యనాడు చంద్రుడే సంపూర్ణముగా నశించినాడని చెప్పుదురు. అట్లే ఈ ఆత్మ కూడా దేహనాశనమువలననే నశించునను వ్యవహారము కలదు. అని దీనికి దృష్టాంతము చూపబడినది. (అనగా చంద్రునికి నాశనము లేనట్లే ఆత్మ అవినాశి అని అర్థము) 48

శ్లో॥ యథా శయాన ఆత్మానం విషయాన్ ఫలమేవచ ।
అనుభుఙ్క్తేఽప్య సత్యర్థే తదాప్నోత్య బుధో భవమ్ ॥ 49

టీ:- నన్వాత్మనో దేహాదిసంబంధాభావే కథం భోక్తృభోగ్యభోగప్రతీతి రిత్యాశంక్య స్వప్నదృష్టాంతేన సమర్థయతి - యథేతి. ఆత్మానాం భోక్తారం విషయాన్ భోగ్యాన్ ఫలం భోగం. అసత్యప్యర్థే. అనుభుఙ్క్తే తథా అబుధః సంసారం ప్రాప్నోతీతి. 49

ఒకవేళ ఆత్మకు దేహము మొదలైన వానియొక్క సంబంధము లేనిచో భోక్త, భోగ్యము భోగము, అను ప్రతీతి ఎట్లు కలుగగలదని శంకించి స్వప్న దృష్టాంతముతో సమర్థించుచున్నాడు. వ్యక్తిని భోక్తగ విషయములను భోగ్యములుగ ఫలము భోగముగ చెప్పబడినను వాస్తవముగ ఇవి సత్యమైన విభాగములుకావు. వీటిని సత్యమైనవని భోగించుచూ అజ్ఞాని సంసారిక సంబంధమును(వ్యామోహమును) పొందుచున్నాడు. (అసత్యమును సత్యమని భ్రమించుటవలననే సంసారిక బంధముకల్గుచున్నదని భావము) 49

శ్లో॥ తస్మాదజ్ఞానజం శోక మాత్మ శోకవిమోహనమ్ ।
తత్త్వజ్ఞానేన నిర్హృత్యస్వస్థాభవ శుచిస్మితే ॥ 50

టీ:- తస్మాదితి. ఆత్మానం శోషయతి విమోహయతి చేతి తథా తం నిర్హృత్య అపహృత్య. 50

కనుక ఓ రుక్మిణీ ! అజ్ఞానమువల్ల జనించిన శోకమును ఆత్మశోకముగ భ్రమపడుటజరుగుచున్నది. తత్త్వజ్ఞానములచే అజ్ఞానము తొలగించుకొని (ఆత్మజ్ఞానముచే సర్వ దుఃఖముల నుండి విముక్తిని పొంది) సుఖివి (ముక్తురాలివి) కమ్ము. 50

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఏవం భగవతా తన్వీ రామేణ ప్రతిబోధితా ।
వై మనస్యం పరిత్యజ్య మనోబుద్ధ్యా సమాదధే ॥ 51

టీ:- ఏవమితి సమాదతే సమాహిత మకరోత్. 51

**శ్రీశుకులు పలికిరి.**

ఈవిధముగ రుక్మిణి భగవంతుడగు బలరామునిచే ప్రబోధింపబడినదై అసహనత్వమును వదిలిన బుద్ధితో మనస్సు నూరట పరచుకొనెను. 51

శ్లో॥ ప్రాణావశేష ఉత్సృష్టో రుక్మీహతబలప్రభః ।
స్మరన్విరూపకరణం వితథాత్మ మనోరథః ॥ 52

టీ:- రుక్మిణస్త్వేవం శ్రుతవతోఽపి నాజ్ఞానం నివృత్తమితి దర్శయన్నాహ - ప్రాణావశేష ఇతి. 52

శక్తిహీనుడైన రుక్మి ప్రాణములతో వదిలిపెట్టబడెను. ఇన్ని విషయములు విన్నను అతనికి అజ్ఞానము నశించలేదు. తన వికృతాకారమును తలంచుకొని తన మనోరథమునెరవేరనందుకు చింతించెను. 52

శ్లో॥ అహత్వాదుర్మితం కృష్ణమప్రత్యూహ్యాయవీయసీం ।
యత్రభోజకటం నామ నివాసాయాభవత్పురమ్ ॥ 53

దుర్మతియగు కృష్ణుని చంపక (అహత్వా=తెలిసి కొనక) సోదరిని విడిపించక (అప్రత్యూహ్యా=ప్రబోధింపక) కుండిన నగరమును

ప్రవేశింపనని పల్కుచూ రోషముతో అవమానింపబడి భోజకటమను పురము తనకు వాసయోగ్యముగ నెంచుకొని నివసించెను. 53

శ్లో॥ భగవాన్ భీష్మకసుతామేవం నిర్జిత్య భూమిపాన్ ।
పురమానీయ విధివదుపయేమే కురూద్వహ ॥ 54

ఓ పరీక్షిత్తా ! ఈవిధముగ సకల రాజన్యులను జయించి, భగవానుడు శ్రీకృష్ణుడు భీష్మకసుతను రుక్మిణిని పట్టణమునకు కొనివచ్చి శాస్త్ర ప్రకారముగ వివాహము చేసుకొనెను. 54

శ్లో॥ తదామహోత్సవో నృణా యదుపుర్యాం గృహే గృహే ।
అభూదనన్యభావనాం కృష్ణే యదు పతౌనృప ॥55

ఓమహారాజా ! అపుడుయాదవుల పురమున ప్రతిగృహమున పండుగ అయ్యెను. వాసుదేవునియందు అందరు మమతానురాగములు కలవారైరి. 55

టీ:- అహత్వేతి అహత్వ అజ్ఞాత్వా అదుర్మతిమితి చ సత్యోఽర్థః అప్రత్యూహ్య అనావర్త్య అప్రతిబుద్ధ్వేతి సత్యం. యవీయసీం స్వసారం. యత్రవిరూపిత స్తత్రైవావసత్. యత్ర చ భోజకటం నామపురం అభవత్. (53 - 55)

శ్లో॥ నరనార్యాశ్చ ముదితాః ప్రమృష్ట మణికుండలాః ।
పారిబర్హ్యముపాజహ్రుర్వరయోశ్చిత్ర వేషయోః ॥ 56

పట్టణమునందలి స్త్రీ, పురుషులు ధగ ధగ మెరిసిపోవు మణికుండలమును ధరించినవారై ఆనందముతో వివాహాలంకృతులైన వధూవరులకు ఉపాయనముల (బహుమతులు) సమర్పించిరి. 56

టీ:- నరా ఇతి. వరయోః వధూవరయోః దేయముపస్కరం. 56

శ్లో॥ సావృష్ణి పుర్యుత్తభితేంద్రకేతుభి
ర్వి చిత్ర మాల్యాంబర రత్న తోరణైః ।
బభౌ ప్రతిద్వార్యుపక్లప్త మంగళై
రాపూర్ణ కుంభాగరుధూపదీపకైః ॥ 57

టీ:- సేతి . ఉత్తభితైరింద్రకేతుభిః ధ్వజవిశేషైరుపక్లిప్తాని మంగళాని లాజాంకుర పుష్పప్రకారాదీని తైః. 57

యదుపురమునందలి ప్రతిగృహమును మంగళసూచకమగు ధ్వజ పతాకములతో విరాజిల్లెను. విచిత్ర వర్ణ పుష్పమాలికలు రత్నతోరణములచే నలంకరింపబడెను. ప్రతి ద్వార దేశమును పూర్ణకుంభములతో అగరుధూపములతోడను కళకళలాడుచుండెను. 57

శ్లో॥ సిక్తమార్గాం మదచ్యుద్భి రాహూతప్రేష్ఠ భూభుజామ్ ।
గజైర్ద్వార్సు పరామృష్ట రంభాపూగోప శోభితామ్ ॥ 58

టీ:- సిక్తేతి. ఆహూతాః ప్రేష్ఠాః భూభుజః. తేషాం. గజైః పరామృష్టాః ఉచ్ఛ్రితాః రంభాశ్చ పూగాశ్చ తైరుపశోభితాం. యద్వా తైరేవ గజైః పరామృష్టాః సంస్పృష్టాః రంభాశ్చ పూగాశ్చ తైరుపశోభితాం. 58

ఇంకను ఆ పుర మార్గములు సుగంధ ద్రవ్య మిళితమగు జలముతో అలుకబడెను. ప్రతి ద్వారము ఆహూతులగు రాజులయొక్క మదగజములతో స్పృశింపబడుచున్న అరటిపూగ వృక్షములతో నలంకృతమైయుండెను. 58

శ్లో॥ కురుసృంజయ కైకేయ విదర్భ యదు కుంతయః ।
మిథో ముముదిరే తస్మిన్ సంభ్రమాత్పరి ధావతామ్ ॥59

ఆ యదుపురమున కురు, సృంజయ, కైకేయ, విదర్భ యదు కుంతలమునుండి వచ్చిన బంధుజనము కలిసిమెలిసి ఇటునటు పరుగులుతీయుచు ఆనందించుచుండిరి. 59

శ్లో॥ రుక్మిణ్యా హరణం(శ్రుత్వాగీయమానం తతస్తతః ।
రాజానో రాజకన్యాశ్చ బభూవుర్భృశ విస్మితాః ॥ 60

రుక్మిణీహరణమును కీర్తనలతో కొందరచట గానము చేయుచుండగ విని కల్యాణమును చూడవచ్చిన రాజులు రాజకన్యలును మిక్కిలిగ ఆశ్చర్యపడుచుండిరి. 60

శ్లో॥ ద్వారకాయామభూద్రాజన్ మహాన్మోదః పురౌకసామ్ ।
రుక్మిణ్యారమయో పేతం దృష్ట్వా కృష్ణం శ్రియఃపతిమ్ ॥ 61

ఓరాజా ! లక్ష్మీదేవి వంటి రుక్మిణితో కూడిన శ్రీపతి కృష్ణుని చూచి ద్వారక యందలి పురజనుల ఆనందము మేర మీరినదయ్యెను. (61)

టీ:- కురుసృంజయేతి. సంభ్రమాదౌత్సుక్యాత్పరిధావతాం బంధూనాం మధ్యేమిథః సమేత్య ముముదిరే ముదం ప్రాపురితి. (59,60,61)

ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,
చతుఃపంచాశత్తమోఽధ్యాయః

శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు
యాభైనాలుగవ అధ్యాయము సమాప్తము

## పంచపంచాశత్తమోఽధ్యాయః

### ప్రద్యుమ్న జనన, శంబరాసురవధాది కథా ప్రారంభఘట్టము.

శ్లో॥ పంచపంచాశత్తమేతు ప్రద్యుమ్నోఽజని కృష్ణః ।
శంబరేణ హృతస్సోఽథ హత్వాతం కాంతభూగతః ॥

శ్లో॥ ప్రద్యుమ్నహాని లాభాద్యైః శంబరాహరణాదినా ।
కుటుంబినామపత్యాది సుఖదుఃక మసూచయత్ ॥

## 55 వ అధ్యాయము

### పద్యుమ్న జనన శంబరాసురవధాది కథా ప్రారంభఘట్టము.

ఈయేబదిఐదవ అధ్యాయమునందుకృష్ణుని వలన రుక్మిణీ గర్భమున ప్రద్యుమ్న జననము, ఆ ప్రద్యుమ్నుని శంబరాసురుడు అపహరించుటయు, అనంతరము మాయావతిచే పెంచబడిన ప్రద్యుమ్నుడు శంబరుని చంపి మాయావతితో ద్వారకకు వచ్చుటయు వర్ణింపబడినది.

ప్రద్యుమ్నుని శంబరుడు అపహరించుట వలన కల్గిన హానిలాభాదుల చేత, గృహస్థులకు సంతానాది సుఖదుఃఖములు సూచితములగుచున్నది. శ్రీకృష్ణునకు జాంబవతీ మొదలగువారి విహహాదులకు పూర్వమే ప్రద్యుమ్న జననము కల్గినది. అనంతరము వారితో విహహము. ఆ తరువాత శంబరాసురుని గృహము నుండి ప్రద్యుమ్న ప్రత్యాగమనము. అందువల్ల పుత్రకథన ప్రస్తావనమున కూడ మొదట ప్రద్యుమ్నుడు జనించగనే శంబరుడు అపహరించినట్లుగ నిరూపించబడినది. ప్రత్యాగమనమని అనంతరకాలమున జరిగినదని కథా పర్యవసానము వర్ణితమైనది.

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ కామస్తువాసుదేవాంశో దగ్ధః ప్రాగుద్ర మన్యునా ।
దేహోప పత్తయే భయాస్తమేవ ప్రత్యపద్యతా ॥1

టీ:- కామయితి. వాసుదేవాధిష్ఠిత చిత్తప్రభవత్వా ద్వాసుదేవాంశః. సృష్టిహేతుత్వాచ్చ. దేహోపపత్తయే దేహప్రాప్తయే. 1

**శ్రీ శుకులు పలికిరి.**

వాసుదేవాంశతో సంజాతుడైన మన్మథుడు శివుని ఆగ్రహాగ్నికి ఆహుతి అయ్యెను. సృష్టికి కారణభూతుడు కాముడు కావున పునః దేహప్రాప్తికై శ్రీకృష్ణుడు అతనినే పుత్రునిగ పొందెను. 1

శ్లో॥ సహేవ జాతో వైదర్భ్యాం కృష్ణ వీర్యసముద్భవః ।
ప్రద్యుమ్న ఇతి విఖ్యాతస్సర్వతోఽనవమః పితుః ॥ 2

టీ:- స ఇతి. అనవమః అన్యూనః 2

ఆ కాముడే కృష్ణవీర్య సముద్భవుడై రుక్మిణి గర్భమునందు జన్మించెను. ప్రద్యుమ్న నామముతో ప్రసిద్ధిని పొందెను. తండ్రియంతటి శక్తి సామర్థ్యములు సంపూర్ణముగ కలవాడు. 2

శ్లో॥ తం శంబరః కామరూపే హృత్వాతో కమనిర్దిశం ।
సవిదిత్వాత్మనశత్రుం ప్రాస్యోదన్వత్య గాద్గృహమ్ ॥ 3

టీ:- తమితి. స ప్రసిద్ధః కామశత్రుః శంబరః తమాత్మనః శత్రుం విధిత్వా సముద్రే ప్రాస్య ప్రక్షిప్య గృహమగాధితి. 3

కామరూపియగు శంబరుడు ఆ బాలకుని తనకు శత్రువుగ భావించి, అపహరించి సముద్ర మధ్యమున పడవేసి గృహమునకు పోయెను. 3

శ్లో॥ తనిర్జగార బలవాన్మీనస్సోఽ ప్యపరైస్సహ ।
వృతో జాలేనమహతా గృహీతో మత్స్యజీవిభిః ॥ 4

టీ:- తమితి. నిర్జగార గిలితవాన్ 4

సముద్రమునందలి ఒక పెద్ద బలకరమగు చేప ఆ బాలకుని మింగెను. మత్స్య జీవనులైన జాలరులచే ఇతర చేపలతో పాటు ఆ చేపయు వలపరిచి పట్టుకొనబడెను. 4

శ్లో॥ తం శంబరాయ కైవర్తా ఉపాజహ్రురుపాయ నమ్ ।
సూధ మహానసం నీత్వా పద్యన్ స్వదితినాద్భుతమ్ ॥5

టీ:- తమిది. స్వధితినా శస్త్రికయా అవర్ధ్యఖండితవంతః 5

శ్లో॥ దృష్ట్వా తదుదరే బాలం మాయావత్యైన్స వేదయన్ ।
నారదోఽకథయత్సర్వం తస్యాసంకిత చేతనః ।
బాలస్య తత్వముత్పత్తిం మత్స్యోదరనివేశనమ్ ॥ 6

టీ:- దృష్వేతి. తత్వాం కామోఽయం తవ భర్తేతి. ఉత్పత్తిం శ్రీకృష్ణాద్రుక్మిణ్యాం ఉత్పన్న ఇతి. 6

శ్లో॥ సా చ కామస్య వై పత్నీ రతి రాగనమ యశస్వినీ ।
పత్యుర్నిర్దగ్ధ దేహస్య దేహోత్పత్తిం నిరీక్షతీ. ॥ 7

టీ:- సేతి. యశస్వినీ పతివ్రతా భర్తుః దేహోత్పత్తిం ప్రతీక్షమాణా. 7

శ్లో॥ నిరూపితా శంబరేణ ససూపౌదన సాధనే ।
సాచతం సుందర వరం శిశుంబుద్ధ్వా చక్రే స్నేహం తదార్భకే॥8

టీ:- నిరూపితేతి. తంశిశు కామదేవం బుద్ధ్వా మత్వా . 8

మత్స్యకారులు ఆ పెద్ద చేపను గొనిపోయి శంబరాసునకు ఉపాయనముగ సమర్పించుకొనిరి. వంటవారు వంటశాలకు తీసుకొనిపోయి గండ్రగొడ్డలితో దాని యుదరమును కోసి ఆశ్చర్యపడిరి. 5

అందు బాలుని చూచి వంటవారు శంబరుని కూతురు మాయావతికి తెలిపిరి. ఆమె ఆ అద్భుతమునకు నివ్వెర పోవుచుండగ నారదమహర్షి వచ్చి ఆ బాలకుడు రుక్మిణీ కృష్ణుల పుత్రుడను విషయమును, శంబరాసురుడపహరించిసంద్రమున పడవేయుటయు ఆ మీదట మత్స్య ఉదరమున ప్రవేశించినయుదంతమును చెప్పెను. 6

ఆ మాయావతియే పూర్వజన్మమున మన్మథుని సతి రతి. ఆ యశస్విని మాయావతిగ శంబరునకు జన్మించి దగ్ధదేహుడగు భర్త దేహోత్పత్తిని ప్రతీక్షించుచుండెను. 7

శంబరుని వంటశాలలో లభించిన సుందరుడగు ఆ బాలుని చూచి మాయావతి తన భర్త కామదేవునిగ తలచి ఆనందపరవశమైనది. కాముడు బాలుడగుటచే ఆమె అతనితో మిక్కిలి చనువుగ ప్రవర్తించెను. 8

శ్లో॥ నాతి దీర్ఘేణకాలేన సకార్ష్ణి చూఢ యౌవనః ।
జనయామాస నారీణాం వీక్షంతినాం చ విభ్రమమ్ ॥ 9

టీ:- నాతిదీర్ఘేణేతి. విభ్రమం సంమోహం. 9

అనతి కాలముననే ఆ బాలకుడు యౌవనవంతుడయ్యెను. తన సౌందర్యముతో తనను వీక్షించు యువతీ సముదాయమునకు సంమోహనము కల్గించుచుండెను. 9

శ్లో॥ సా తం పతిం పద్మదళాయతేక్షణం
ప్రలంబబాహుం నరదేవసుందరం ।
సవ్రీడి హాసోత్తభి తభ్రువేక్షతీ
ప్రేత్యోపతస్థే రతిరంగ సౌరతైః ॥ 10

పద్మదళనేత్రుడు, ఆజానుబాహుడు, సుందరుడునగు తన పతినిచూచి ఓ రాజా! ఆ మాయవతి సిగ్గుతో చిర్నగవుతో కనుబొమ్మల సోయగముతో రతిర్భూత ప్రేమ భావముతో చూచుచు సేవించు చుండెను. 10

శ్లో॥ తామాహ భగవాన్కార్ష్ణిర్మాతస్తే మతిరన్యథా ।
మాతృభావ మతిక్రమ్య వర్తసే కామినీ యథా ॥11

టీ:- సేతి. అంగహే రాజన్ సౌరతైఃభావైః ఉపతస్థే అభజత్. (10,11)

భగవంతుడగు కృష్ణ సుతుడు అమ్మా ! నావిషయమున నీమతి మరొక విధముగనున్నది. మాతృభావము నతిక్రమించి కాముకు రాలివలె ప్రవర్తించుచున్నావని పల్కెను. 11

**రతిరువాచ**

శ్లో॥ భగవాన్నారాయణ సుశ్శంబరేణ హ్నాతోగృహత్ ।
అహంతేఽధికృతా పత్నీ రతిః కామోభవాన్ ప్రభో ॥ 12

**రతీదేవి అనుచున్నది.**

ఓ ప్రభూ! నీవు నారాయణదేవుని సుతుడవు. మనసిజుడవు. శంబరాసునిచే శైశవమున గృహము నుండి అపహరింపబడితివి. నేను పూర్వజన్మమున నీ భార్యయగు రతిని. 12

శ్లో॥ ఏష త్వానిర్దిశం సింధౌప్రాక్షిపచ్చంబరోఽసురః ।
మత్స్యోఽగ్రసేత్తదుదరా దిహప్రాప్తో భవాన్ప్రభో ॥ 13

శంబరాసురుడు అందగాడైన నిన్ను సముద్రమున పడవేసెను. ఓ స్వామీ ! నిన్నొక పెద్దచేప మ్రింగినది. తద్వారా నీవు మాకు లభించితివి. 13

టీ:- భవానితి. అధికృతా పత్నీత్యత్ర హేతుః - రతిరహంభవాన్ కామ ఇతి. (12,13)

శ్లో॥ తమిమంజహి దుర్ధర్షం దుర్జయం శత్రు మాత్మనః ।
మాయాశతవిదం త్వంషమాయాభిర్మోహనాదిభిః ॥ 14

నీవును మోహనాది మాయాతంత్రములతో, మాయాశతవేత్త, అజేయుడు, దండించుటకసాధ్యుడునగు నీ శత్రువును వెంటనే సంగరమున సంహరింపుము. 14

టీ:- తమితి. దుర్జయత్వే హేతుః - మాయాశతవిదమితి. కథంతర్హి హంతవ్యస్తత్రాహ.- మాయాభిరితి. 14

శ్లో॥ పరిశోచతి తేమాతాకురరీవ గతప్రజా ।
పుత్రస్నేహకులాదీనా వివత్సా గౌరివాతురా ॥ 15

సంతతి కోల్పోయిన లకుముకి పిట్టవలె నీ తల్లి రుక్మిణి రోదించుచున్నది. దూడకు దూరమైన ఆవువలె పుత్రస్నేహముతో దీనయై ఆతురతతోనున్నది. 15

శ్లో॥ అభాష్యైవం దదౌ విద్యాం ప్రద్యుమ్నాయ మహాత్మనే ।
మాయావతీ మహామాయాం సర్వమాయా వినాశినీమ్ ॥ 16

మాయావతి ఇట్లు తమ వృత్తాంతమును ఎరుకపరచి, సర్వమాయా వినాశకారియగు మహామాయా విద్యను మహాత్ముడగు ప్రద్యుమ్నునకు ఉపదేశించెను. 16

శ్లో॥ సచ శంబరమాభ్యేత్య సంయుగాయ సమాహ్వయత్ ।
అవిషహ్యైస్తమాక్షేపైః క్షిపన్ సంజనయన్ కలిమ్ ॥17

అపుడు ప్రద్యుమ్నుడు శంబరుని సమీపించి అసహ్యములగు ఆక్షేపణములతో కయ్యమునకు కాలు దువ్వుచు సంగరముకు ఆహ్వానించెను. 17

శ్లో॥ సోఽధిక్షిప్తోదుర్వచోభిః పదాహత ఇవోరగః ।
నిశ్చక్రామ గదాపాణిరమర్షా త్తామ్రలోచనః ॥ 18

ఆ శంబరాసురుడును ప్రద్యుమ్నుని అసభ్యకరములగు మాటలచే తోకత్రొక్కబడిన పామువలె ఉత్తేజితుడై, కోపముతో కండ్లు చంద్రనిప్పులు గ్రక్కుచుండగ గదాపాణియై దండెత్తి వచ్చెను. 18

టీ:- నాత్ర విలంబః కార్య ఇత్యాహ.-పరిశోచతీతి. పరిశోచతి రోదితీత్యర్థః (15-18)

శ్లో॥ గదామావిధ్య తరసా ప్రద్యుమ్నాయ మహాత్మనే ।
ప్రక్షిప్య వ్యవదన్నాదం వజ్రనిష్పేషనిష్ఠురమ్ ॥19

సంగ్రామభూమికి వచ్చిన శంబరుడు గదను గిరగిర త్రిప్పి వేగముగ ప్రద్యుమ్నుని మీదకు విసరెను. పిడుగులు ఒకదానితోనొకటి ఒరిసికొనినంత కర్ణ కఠోరముగ గర్జించెను. 19

శ్లో॥ తామాపతంతీం భగవాన్ ప్రద్యుమ్నో గదయా గదాం ।
అ పాస్య శత్రవే క్రుద్ధః ప్రాహిణోత్స్వాం గదాం నదన్ ॥ 20

భగవంతుడు ప్రద్యుమ్నుడు ఆ మీదకు వచ్చుచున్న గదను తన గదతో తొలగద్రోసి మిక్కిలి కోపనుడై భీకర నాదమును చేయుచు తన గదను శత్రువుపై ప్రయోగించెను. 20

టీ:- గదామితి. వజ్రస్య నిష్పేషే నిర్ఘాతే యథా నిష్ఠురస్తీవ్రో నాదో భవతి. తధాభూతాం నాదం వ్యనదత్ సామాన్యవిశేషతయా వ్యాప్యవ్యాపకత్వం. ఓదనం పాకం పచతీతి వత్ అనిష్ఠురం నాదమ కరోదిత్యర్థః (19-20)

శ్లో ॥ స చ మాయం సమాశ్రిత్య దైతేయాం మయదర్శితాం ।
ముమోచాస్త్రమయం వర్షం కార్ష్ణౌ వైహాయసోఽసురః॥21

టీ:- స ఇతి. వైహాయసః ఆకాశేస్థితః. 21

శంబరాసురుడు ఆకసమున మయాదర్శితమగు రాక్షసమాయ నాశ్రయించి ప్రద్యుమ్నుని మీద బాణవర్షమును గురిపించెను. 21

శ్లో ॥ బాధ్యమానోఽస్త్రవర్షేణరౌక్మిణేయో మహారథః ।
సత్త్వాత్మికం మహావిద్యాం సర్వమాయోపమర్దినీమ్ ॥22

టీ:- బాధ్యమాన ఇతి. సత్త్వాత్మికాం సత్వగుణమయిం ప్రాయుఙ్క్తే త్యుత్తరస్యానుషంగః. 22

అస్త్రవర్షముతో బాధితుడైన మహారథి రుక్మిణీ సుతుడు సర్వమాయా విమర్దినియగు సాత్వకమనుమహావిద్యను ప్రయోగించెను. 22

శ్లో ॥ తతో గౌహ్యకగాంధర్వపైశాచోరగరాక్షసీః ।
ప్రాయు శతశోదైత్యః కార్ష్ణిర్వ్య ధమయత్సతాః ॥ 23

టీ:- తత ఇతి. తాః మాయాః వ్యధమయత్. వ్యనాశయత్. 23

అనంతరము రాక్షసుడగు శంబరుడు గుహ్యక, గాంధర్వ, పైశాచిక, సర్ప, రాక్షసములను వేలకొలది అస్త్రములను కృష్ణ కుమారునిపై ప్రయోగించెను. వానినన్నింటిని ప్రద్యుమ్నుడు సునాయాసముగ నాశనము చేసెను. 23

శ్లో ॥ నిశాతమసి ముద్యమ్య సకిరీటం సకుండలం ।
శంబరస్య శిరః కాయాత్తామ్రశ్మశ్రుజహార తత్ ॥ 24

ప్రద్యుమ్నుడు వాడియగు కరవాలమును గ్రహించి శంబరుని శరీరమునుండి కిరీట కుండలయుతము ఎఱ్ఱని మీసములను కల్గిన శిరస్సును ఖండించి వేరుచేసెను. 24

శ్లో ॥ ఆకీర్యమాణో దివిజైస్తువద్భిః కుసుమోత్కరైః ।
భార్యయాంబరాచారిణ్యా పురం నీతో విహాయసా ॥ 25

ఆసమయమున దేవతలు స్తోత్రము చేయుచు పూలవాన కురిపించుచుండగ ఆకాశ గమనముతో భార్యాయుతుడైన కృష్ణ కుమారుడు పట్టణమునకు బయలుదేరెను. 25

టీ:- నిశాతమితి. తామ్రాణి శ్మశ్రూణి యస్మిన్ తత్. (24-25)

శ్లో ॥ అతఃపురవరం రాజన్ లలనాశతసంకులం ।
వివేశపత్న్యా గగనాద్విద్యుతేవ వలాహకః ॥ 26

ఓ రాజా ! మెరుపుతీగతోడి వలాహకమను మేఘమువలె ప్రద్యుమ్నుడు పత్నీయుతుడై యువతీ శతసంకులమగు అంతఃపురమును ప్రవేశించెను. 26

శ్లో ॥ తందృష్ట్వా జలదశ్యామం పీతకౌశేయవాససం ।
ప్రలంబబాహుం తామ్రాక్షం సుస్మితం రుచిరాననమ్ ॥ 27

టీ:- అంతఃపురేతి. విద్యుతా సహవలాహకో మేఘఇవ. (26-27)

శ్లో ॥ అలంకృత ముఖాంభోజం నీలవక్రాలకాళిభిః ।
కృష్ణం మత్వాస్త్రియో హ్రీతా నిలీయుస్తత్ర తత్రహ ॥ 28

టీ:- అలమకృతేతి. నీలాశ్చ వక్రాశ్చ యే అలకాః తఏవ ఆళయః తైః. హ్రీతాః లజ్జితాః 28

మేఘశ్యాముడు, పీతాంబరధారి, ఆజానుబాహువు, ఎఱ్ఱని జీరల కన్నులు కలవాడు, చిర్నగువుతో ముద్దులొలుకు మోము కలవానిని, నీలమై వంకరలుదిరిగిన ముంగురలతో అలంకృతమైన ముఖపద్మములు కలవానిని ఆ పురములోని స్త్రీలు చూసి అతడే కృష్ణుడని తలచి సిగ్గుపడుచు అచ్చటచ్చట దాగుకొనిరి. (27-28)

శ్లో ॥ అవధార్య శనైరీషద్వైలక్షణ్యేన యోషితః ।
ఉపజగ్ముః ప్రముదితాస్సస్త్రీరత్నం సివిస్మితాః ॥ 29

శ్లో ॥ అథతత్రా సితాపాంగి వైదర్భి వల్గుభాషిణీ ।
అస్మరత్స్వసుతం నష్టం స్నేహస్నుతపయోధరా ॥ 30

టీ:- ఆవధార్యేతి. శ్రీకృష్ణో న భవతీ త్యవధార్య. సస్త్రీరత్నం స్త్రీ శు రత్నం సైవ రతిః తత్సహితం (29-30)

శ్లో॥ కోన్వయం నరవైడూర్యః కస్యైవాకమలేక్షణః ।
ధృతః కయా వాజఠరేకయాలబ్ధోఽకేనవా ॥ 31

టీ:- సుతం స్మరంత్యాహ- క ఇతి. నరవైడూర్యః పురుష శ్రేష్ఠః. 31

శ్లో॥ మమచాప్యాత్మజో నష్టోనీతోఽయంసూతికాగృహాత్।
ఏతత్తుల్య వయోరోపోయది జీవతి కుత్రచిత్ ॥ 32

టీ:- మమేతి. ఏతేన తుల్యం వయోరూపం చ యస్య స భవేదితి. 32

మెల్లమెల్లగ శ్రీకృష్ణునికంటే కొంచెము విలక్షణమగు రూపమును పసిగట్టి నిశ్చయించుకొన్న ఆ శ్రీ బృందము ఆశ్చర్య చకితులై స్త్రీ రత్నమగు మాయావతి (రతి) ని సమీపమునకు వచ్చిరి. 29

పిమ్మట నల్లనిక్రీగన్నులు గలట్టి, సుభాషిణియగు విదర్భరాజ తనయ రుక్మిణి అతనిని చూచి ప్రేమతో పొంగివచ్చు చనుపాలతో నష్టమైన తన కుమారుని స్మరించెను. రుక్మిణీదేవి ఆతడు (ప్రద్యుమ్నుడు) శ్రీకృష్ణుడు కాడని నిర్ధారణ పొంది, స్త్రీ రత్నము (రతీదేవి) తో కూడివచ్చిన వానిని చూచెను. 30

ఇంకను రుక్మిణి సుతుని స్మరించుచు ఇట్లని తలంచెను- ఈ పురుషుడెవడు? ఈ కమలాక్షుడెవరి సుతుడు? ఏ స్త్రీ ఇతనిని గర్భమున మోసింది? ఏ స్త్రీ పురుషులకు ఇతను లభించెను? 31

నా కుమారుడు కూడ నాకు ఎడమయ్యెను. సూతికాగృహము నుండియే అపహరింపబడెను. ఒకవేళ ఎచ్చటనైనబ్రతికియున్నచో ఈ బాలకునితో సమానమగు వయసు సౌందర్యముకలిగియుండును కదా! 32

శ్లో॥ కథం త్వనేన సంప్రాప్తం సారూప్యం శార్‌ఙ్గ ధన్వనః ।
ఆకృత్యా వయోవైర్గత్యా సర్వహాసావలోకనైః ॥ 33

టీ:- తస్య స్వపుత్ర త్వం సంభావయంత్యాహ - కథం త్వితి. 33

శ్లో॥ స ఏవఽసౌభవేన్నూనం యోమేగర్భ ధృతోఽర్భకః ।
అముష్మిన్ ప్రీతి రధికా వామస్ఫురతి మే భుజః ॥ 34

టీ:- తదేవాధికం సంభావయతి.స ఏవేతి. 34

శ్లో ॥ ఏవం మీమాంసమానాయాం వైధర్భ్యాం దేవకీసుతః ।
దేవక్యానక దుందుభ్యా ముత్తమశ్లోక ఆగమత్ ॥ 35

శ్లో ॥ విజ్ఞాతార్థోఽపి భగవాంస్తూష్ణీ మాసజనార్దనః ।
నారదోఽకథయత్సర్వం శంబరాహరణాదికమ్ ॥ 36

ఈ బాలకుడు నాపుత్రుడే కాదగునుకదా. ఎందుకనగ ఇతని ఆకారము, అవయములతీరు, నడక,మాట నగువు, చూపులన్నియు శ్రీకృష్ణుని పోలికలను పునికిపుచ్చుకొనినట్లున్నవి. 33

దానినే నిర్ధారించుచున్నాడు - నేను గర్భమున ధరించిన బాలుడితడే నిశ్చయముగా అయియుండును. ఈ బాలకుని చూడగనే వీనియందు నాకు పుత్ర ప్రేమ అధికమగుచున్నది. అంతేగాక నా ఎడమ భుజము కూడ అదురుచున్నది.(స్త్రీలకు ఎడమ భుజము అదురుట శుభశూచకము) 34

ఇట్లు రుక్మిణిదేవి ఊహించుచుండగ పురుషోత్తముడగు శ్రీకృష్ణుడు తన మాతాపితలగు దేవకీవసుదేవులతో అచటికి వచ్చెను.35

భగవంతుడు కృష్ణుడి విషయమంతయు నెరిగియుండియు ఉదాసీనుడిగ నుందెను. నారదమహర్షి వారికి శంబరాసుడు బాలకుని అపహరించినది మొదలు కథనంతటిని పూసగ్రుచ్చినట్లు వివరించెను. 36

శ్లో॥ తచ్ఛ్రుత్వా మహదాశ్చర్యం కృష్ణాంతఃపుర యోషితః ।
అభ్యనందన్ బహూనబ్దాన్ నష్టం పునరిహాగతం ॥37

మహాశ్చర్యకరమగు ఆ కథను కృష్ణాంతఃపురస్త్రీలు విని సూతికాగృహమున నష్టమైన బాలుడు అనేక సంవత్సరములు గడచిన తర్వాత ద్వారకకు వచ్చిచేరినందులకు అత్యంత మభినందించిరి. 37

శ్లో॥ దేవకీవసుదేవశ్చ కృష్ణరామౌ తథ స్త్రియః ।
దంపతి తౌ పరిష్వజ్యా రుక్మిణీచ యయుర్ముదమ్ ॥38

దేవకీవసుదేవులు, బలరామకృష్ణులు, అట్లే స్త్రీలు, పురమునందలి దంపతులు, రుక్మిణియు వారిని ఆలింగనము చేసుకొని అమితముగ ఆనందించిరి. 38

శ్లో॥ నష్టం ప్రద్యుమ్న మాయాంతమాకర్ణ్య ద్వారకౌ కసః ।
అహోమృత ఇవాయాతో బాలో దిష్ట్యేతి చాబ్రువన్ ॥ 39

ద్వారక యందలి ప్రజలు అపహరింపబడిన ప్రద్యుమ్నుడు మరలి వచ్చెనని విని ఆహా ! ఈ బాలకుడు మానయదృష్టవశమున అమృతప్రాయముగ (జీవించి)వచ్చెనని పల్కిరి. 39

టీ:- ఏవమితి. దేవక్యానక దుందుభిభ్యామిత్యర్థః (35-39)

శ్లో ॥ యం వైముహుః పిత్రుసరూప నిజేశభావా
సన్మాతారో యదభజన్రహూఢభావాః ।
చిత్రంనతత్కలు రమాస్పదబింబబింబే
కామేస్మరేఽశివిషయే కిముతాన్యా నార్యః ॥ 40

టీ:- అతిసౌందర్యేణ ప్రద్యుమ్నమనువర్ణయతి-యమితి. పితా శ్రీకృష్ణః తత్సరూపే ప్రద్యుమ్నే నిజఃఆత్మీయః ఈశః భర్తేతి భావో భావనాయా సాంతాః తన్మాతరః శ్రీకృష్ణపత్న్యోఽపి రహసి ఊఢభావాస్సత్యో యమభజనితి యత్. తత్న ఖలుచిత్రం. కథంతస్మిన్స్మరే స్మర్యమాణత్వే నైవక్షోభకే కామే అక్షివిషయే సతి.కించ 40

ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,
పంచపంచాశత్తమోఽధ్యాయః

ప్రద్యుమ్నుని అతి సౌందర్యమును వర్ణించుచున్నాడు, తండ్రియగు కృష్ణునిసుందర రూపమును పోలిఉన్న ప్రద్యుమ్నుని చూచి శ్రీకృష్ణపతులగు అతని తల్లులు తమ భర్తయేనేమో అన్నభావమును రహస్యముగ పొంది పరవశించుచుండగ లక్ష్మీ విష్ణుల బింబములకు ప్రతిబింబమగు కాముని విషయమున విచిత్రమేమికలదు. ఇక ఇతర స్త్రీల విషయముననేమి చెప్పదగును.

శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు
యాభైఐదవ అధ్యాయము సమాప్తము

## షట్పంచాశత్తమోऽధ్యాయః

## స్యమంతకోపాఖ్యాన కథా ప్రారంభః

శ్లో ॥ షట్పం చాశత్తమేమిధ్యాభియోగేమణిమాహరత్ ।
కన్యాంజాంబవతః ప్రాప్యకృష్ణస్సత్రాజితస్తతః ।
పుత్రాదికామసౌఖ్యస్యనిష్ఠాముక్త్వాతి చంచలాం ।
అర్ధస్యానర్ధతామాహస్యమంతాహరణాదినా ।

శ్రీ శుక ఉవాచ

శ్లో ॥ సత్రాజితస్స్వతనయాం కృష్ణాయకృతకిల్బిషః ।
స్యమంతకేనమణినా స్వయముద్యమ్య దత్తవాన్ ॥ 1

రాజోవాచ

శ్లో ॥ సత్రాజితః కిమకరోద్బ్రహ్మన్ కృష్ణస్యకిల్బిషం ।
స్యమంతకః కుతస్తస్య కస్తాద్దత్తాసుతా హరే ॥2

టీ:- కృతాపరాధఃతచ్ఛాంతయే స్వయమేవోద్యమం కృత్వామణీనా సహ ప్రాదాదితి. 1,2

## 56వ అధ్యాయము

ఈ ఏబదిఆరవ అధ్యాయమునందు మణిని అపహరించినాడను నీలాపనిందతో శ్రీకృష్ణుడు, జాంబవంతుని నుండి జాంబవతియను కన్యను, సత్రాజిత్తు నుండి సత్యభామయను కన్యను పొందెను. పుత్రాదులను పొందుటయే ధ్యేయముగా స్యమంతకమణి హరణాదుల ద్వార, అర్థము అతిచంచలము, అనర్థకారిణియను సందేశమును లోకమునకు చాటెను-సత్యభామా జాంబవతుల వివాహ ప్రస్థానమునకై స్యమంతకమణి కథను నుడివెను.

శ్రీశుకులు పలికిరి.

అపరాధము చేసిన సత్రాజిత్తు తానే అపరాధనివృత్తి కొరకు స్వయముగ యత్నించి తన సుతయగు సత్యభామను స్యమంతకమణితో కూడ సమర్పించుకొనెను. 1

రాజు పలికెను

ఓ మహర్షీ ! కృష్ణుడు సత్రాజిత్తునకు చేసిన అపరాధమేమి? సత్రాజిత్తు ఏమిచేసెను? సత్రాజిత్తునకు స్యమంతకమణి ఎట్లు లభించినది? తన కూతురును హరికి ఎందుకు ఇచ్చెను? 2

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఆసీత్సత్రాజితసూర్యో భక్తస్యపరమస్సఖా ।
ప్రీతస్తస్మైమణి ప్రాదాత్సూర్యస్తుష్టస్స్యమంతకమ్ ॥ 3

టీ:- ఆసిదితి. భక్తస్యసత్రాజితః సూర్యః స్వామ్యపి సఖేవాసిదిత్యర్థః స చ తుష్టస్తస్మై స్యమంతకంనామమణిం ప్రాదాత్. ప్రీతః స్నిగ్ధః 3

**శుకమహర్షి పలుకుచున్నాడు**

సూర్యుడు భక్తుడగు సత్రాజిత్తునకు ప్రభువయ్యును మిత్రునివలె నుండెను. సత్రాజిత్తు సేవలకు ప్రీతుడై అతనికి స్యమంతకమను మణిని ప్రసాందించెను. 3

శ్లో॥ సతంబిభ్రన్ మణింకంఠేభ్రాజమానో యథారవిః ।
ప్రవిష్టో ద్వారకాంరాజన్ తేజసానో పలక్షితః ॥ 4

టీ:- స ఇతి. నోపలక్షితః సత్రాజితోఽసావితి న జ్ఞాతః 4

ఆ సత్రాజిత్తు స్యమంతకమణిని కంఠమున ధరించి సూర్యుని వలె వెలిగిపోవుచు ద్వారకానగరమున ప్రవేశించెను. ఓ రాజా! అతడు సత్రాజిత్తని పురమున నెవ్వరును గుర్తింప జాలాకపోయిరి. 4

శ్లో॥ తం విలోక్య జనాదూరాత్తేజసా ముష్టదృష్టయః ।
దీవ్యతేఽక్షైర్భగవతే శశంసు స్సూర్యశంకితాః ॥5

టీ:- తమితి. దీవ్యతే క్రీడతే స్సూర్యోఽయమితి శంకితాస్సంతః కథయామాసురితి. 5

ద్వారకాపురజనులు దూరమునుండి అతనిని గాంచి అతని తేజస్సుతో కనులు మిరమిట్లు గొలుపుచుండగా సూర్యుడే ఇతడని సందేహించుచు కృష్ణునకు విన్నవించదొడగిరి. 5

శ్లో॥ నారాయణ నమస్తేస్తు శంఖచక్రగదాధర ।
దామోదరారవిందాక్ష గోవింద యదునందన ॥ 6

సూర్యుడు నమస్కారముకొరకు ద్వారకకు వచ్చియుండునని తలచి ఉద్రిక్తులైన భక్తులు భక్తితో సంబోధించు నామములివి-

టీ:- నారాయణేతి. సూర్యనమస్కారార్ధ మాఘతం కల్పయిత్వో ద్రిక్త భక్తీనాం సంభోధనాని నారాయణే త్యాదిని. 6

శంఖచక్రగదాధర! దామోదార! అరవిందాక్ష! యదునందన! గోవింద! ఓ నారాయణ నీకు నమస్కారములు. 6

శ్లో॥ ఏషఅయాతి సవితాత్వాందిదృక్షుర్జగత్పతే ।
ముష్ణన్ గభస్తిచక్రేణ నృణాం చ క్షూంషి తిగ్మగుః ॥ 7

టీ:- ఏష ఇతి. గభస్తి చక్రేణరశ్మిజాలేన. ముష్ణన్ ప్రతిఘ్నన్. తిగ్మాః తీక్ష్ణః గావో రశ్మయో యస్యసః. 7

ఓ జగత్పతీ ! భగవంతుడగు ఈ సూర్యుడు తన కిరణసముదాయముతో దుష్టమానవులను నిరోధించుచు నిన్ను దర్శించుటకై ఇటే వచ్చుచున్నాడు. అని పల్కిరి. 7

శ్లో॥ నన్వన్విచ్ఛంతి తేమార్గం త్రిలోక్యాం విబుధర్షభాః ।
జ్ఞాత్వాద్యగూఢం యదుషుద్రష్టుంత్వయాత్యజః ప్రభో ॥ 8

టీ:- న చేదమఘట మానమిత్యాహుః - నన్వితి. అన్విచ్ఛంతి మృగయంతే. అజః సూర్యః. 8

ఓ ప్రభూ ! ముల్లోకములందు దేవతలు, పండితులు నీ దర్శనమునకై సులభోపాయములను అన్వేషించుచుందురు కదా! నేడు యాదవులలో రహస్యముగనున్న నిన్ను దర్శించుటకు సూర్యుడరు దెంచుచున్నాడు. 8

### శ్రీశుక ఉవాచ

శ్లో॥ నిశమ్య బాలవచనం ప్రహస్యాంబుజ లోచనః।
ప్రాహనాసౌరవిర్దేవస్సత్రాజిన్మణినా జ్వలన్ ॥ 9

టీ:-నిశ్యమేతి. బాలానాం ఆజ్ఞానాం వచనం జ్వలన్ విద్యోతమానః9

### శ్రీశుకులు పలికిరి

అజ్ఞులగు పురజనుల వాక్యలను విని పద్మదళాయనేత్రుడు కృష్ణుడునవ్వి ఈ వచ్చువాడు సూర్యభగవానుడు కాడు. స్యమంతకమను మణిని ధరించుటవలన వెలిగిపోవుచున్న సత్రాజిత్తని వారితో పల్కెను. 9

శ్లో॥ సత్రాజిత్స్వ గృహం శ్రీమత్ కృతకౌతుక మంగళం।
ప్రవిశ్య దేవ సదనేమణిం విప్రైర్న్యవేశయత్ ॥ 10

టీ:- సత్రాజితిది. కృతాని కౌతుకేన ఉత్సవేన మంగళాని యస్మిన్ తత్. విప్రైః కృత్వా. 10

శ్లో ॥ దినేదినే స్వర్ణభారానష్టౌ స సృజతి ప్రభో । 11

టీ:- దినేదినిఇతి. భారప్రమాణం-శ్లో ॥ చతుర్భిర్వ్రీహిభిర్గుంజం గుంజాన్ పంచపణవం పణాన్, అష్టౌధరణమష్టౌచకర్షం తాంశ్చతురః పలం, తులాం పలశతం ప్రాహుర్భారస్స్యాద్వింశతిస్తులా ఇతి. 11

శ్లో । దుర్భిక్షమార్యరిష్టాని సర్వాధివ్యాధయోஉశుభాః ।
న సంతి మాయినస్తత్ర యత్రాస్తేஉభ్యర్చితో మణిః ॥ 12

టీ:- దుర్భిక్షేతి. మారీనామ అకాలమృత్యుః అరిష్టమభద్రం అశుభా దుఃఖహేతవః 12

అట్లుద్వారకను ప్రవేశించిన సత్రాజిత్తు పండుగవేడుకలతో ఉత్సాహభరితముగనున్న తన గృహమును ప్రవేశించి దేవతా మందిరమున ఆమణిని విప్రవరులచే ప్రతిష్ఠింపచేసెను. 10

ఓ ప్రభూ ! ఆ స్యమంతకమణి ప్రతిదినము ఎనిమిది భారముల (బారువ) బంగారమును సృజించును. భారప్రమాణమిది 4 వరిగింజలు = 1గుంజ; 4గుంజలు = 1పణము; 8పణములు = 1ధరణము; 8ధరణములు=1కర్షము; 4కర్షములు=1పలం; 100పలములు= 1తులం; 20 తులములు= 1 భారము-బారువు. (అనగా ఒకరోజుకు 160 తులములు = 1 కిలో 600 గ్రాములు.)

ఆమణి పూజింపబడిన తావున కరువురాదు, అకాలమరణము లుండవు, కష్టనష్టములుండవు, సకల ఆధివ్యాధులుండవు, అమంగళము లుండవు, కపటవర్తనులుండరు. (11-12)

శ్లో॥ ఆయాచితో మణినం క్వాపి యదురాజాయ శౌరినా ।
నైవార్థకాముకః ప్రాదాద్యచ్నా భంగ మతర్కయన్ ॥ 13

టీ:- స ఇతి. క్వాపికదాచిత్ అనేన భగవత్యసమర్ప్య స్వయమగ్ర భోజినః సర్వానిష్టనివర్తకమపి అనిష్టహేతురేవ భవతీతి సూచితం. 13

ఒకానొకసమయమున లోకకళ్యాణార్థము శ్రీకృష్ణునిచే యదురాజునకు ఆమణినీయవలసినదిగ కోరబడెను. సత్రాజిత్తు కృష్ణుని కోరికను లెక్కింపక ధనాశ దానినిరాజునకు ఈయకపోయెను. సర్వారిష్ట నివారకమగు అమూల్యవస్తువును భగవంతునికి సమర్పించక అనుభవింపదలచిన అదియే సర్వానర్థములకు మూలమగును. దానినే క్రింది శ్లోకమున సూచించుచున్నాడు. 13

శ్లో॥ తమేకదామణిం కంఠే ప్రతిముచ్యమహాప్రభం।
ప్రసేనోహయమారుహ్య మృగయాం వ్యచరద్వనే॥ 14

టీ:- తదేవదర్శయితుమహ - తమితి. ప్రతిముచ్య బద్ధ్వా ప్రసేనః సత్రాజిద్భ్రాతా. 14

ఒకనాడు సత్రాజిత్తుసోదరుడు ప్రసేనుడనువాడు మహాకాంతివంతమైన ఆమణిని గళమున ధరించి అశ్వమునెక్కి వేటకొరకై వనమునకు పోయి తిరుగుచుండెను. 14

శ్లో॥ ప్రసేనం సహయం హత్వా మణిమాచ్ఛిద్య కేసరే ।
గిరిం విశన్ జాంబవతానిహతో మణిమిచ్ఛతా ॥ 15

శ్లో॥ సోऽపి చక్రే కుమారస్య మణిక్రీడనం బిలే ।
అపవశ్యన్ భ్రాతరం భ్రాతా సత్రాజిత్పర్యతప్యత॥ 16

టీ:- ప్రసేనమితి. ఆచ్ఛిద్య ఆకృష్య గృహీత్వా .15,16

అరణ్యమున సింహమొకటి హయముతోకూడ ప్రసేనుని చంపి మణిని గ్రహించి పర్వతగుహను ప్రవేశించుచుండగ ఆసింహమును మణిప్రలోభముచేజాంబవంతుడను ఎలుగు చంపెను.

ఆ జాంబవంతుడు గుహయందు తన కుమారునకు దానిని ఆట వస్తువుగచేసెను. తమ్ముడు ప్రసేనుడు కానరాక పోవుటచే సత్రాజిత్తు పరితపించెను. (15-16)

శ్లో॥ ప్రాయః కృష్ణేన నిహతో మణి గ్రీవో వనంగతః।
భ్రాతా మమేతి తచ్ఛ్రుత్వా కర్ణే కర్ణే జపన్ జనాః ॥ 17

మణిని ధరించి వనమునకుపోయిన నా సోదరుని బహుశః కృష్ణుడు చంపియుండవచ్చును.అని తలంచెను. ఆమాటలను కర్ణా కర్ణిగ విని జనులును పల్కుచుండిరి. 17

శ్లో ॥ భగవాన్ తదుపశ్రుత్య దుర్యశో లిప్తమాత్మని।
మార్ష్టుం ప్రసేనపదవీమన్వపద్యత ప్రజః ॥ 18

భగవానుడు శ్రీకృష్ణుడు ఆయపకీర్తితనకు పులుమబడినదనివిని, అట్టి నీలాపనిందను తొలగించుకొనుటకై పురజనులతోకూడి ప్రసేనుని వెదకుటకై వనమునకు పోయెను. 18

శ్లో ॥ హతం ప్రసేనం సాశ్వంచ వీక్ష్య కేసరిణా వనే ।
తం చాద్రిపృష్ఠే నిహతమృక్షేణ దదృశుర్జనా ॥ 19

ఆ వనమున కేసరిచే చంపబడిన ప్రసేనుని, అతని అశ్వమును చూచి జనులు అట్లే పర్వతగుహయందు ఎలుగుతో చంపబడిన ఆ సింహమును కూడ చూచిరి. 19

శ్లో ॥ ఋక్షరాజబిలం భీమమంధేన తమసా వృతం ।
ఏకో విశేష భగవానవస్థాప్య బహిః ప్రజాః ॥ 20

జాంబవంతుడున్న ఆగుహ మిక్కిలి భయంకరమైనది. మరియు చీకటిమయము భగవంతుడు శ్రీకృష్ణుడు పురజనులను గుహవెలుపలనే నిలువుడని పలికి తానొక్కడే అందు ప్రవేశించెను. 20

శ్లో ॥ తత్ర దృష్ట్వా మణిశ్రేష్ఠం బాలక్రీడనకం కృతం ।
హర్తుం కృతమతి సస్మిన్నవతస్థేఽర్భకాంతికే ॥ 21

ఆ గుహలో బాలకునకు ఆటవస్తువుగ చేయబడిన మణిరాజమును చూచి శ్రీకృష్ణ భగవానుడు దానిని గ్రహించుటకై నిశ్చయించుకొని ఆ బాలకుని సమీపమున చేరి నిలిచెను. 21

శ్లో ॥ తమపూర్వం నరం దృష్ట్వా ధాత్రీచుక్రోశ భీతవత్ ।
తచ్ఛ్రుత్వాభ్యద్రవత్క్రుద్ధో జాంబవాన్ బలినాం వరః ॥ 22

ఇంతకుమునుపు చూడని ఆనరుని చూచి బాలకుని ఆడించుచున్న పరిచారిక భీతయై గట్టిగా అరచెను. ఆ ఆర్తనాదమును విని బలవంతుడగు జాంబవంతుడు కోపముతో పరుగుపరుగున అచటికి వచ్చెను. 22

శ్లో ॥ స వై భగవతా తేన యుయుధే స్వామినాత్మనః ।
పురుషం ప్రాకృతం మత్వా కుపితో నానుభావవిత్ ॥23

టీ:- ప్రాయ ఇతి. అజపన్ ఉపాంశు అవోచన్ (17-23)

ఆ జాంబవంతుడు ఆనరుని సామాన్య మానవునిగా తలచి యథార్థమునెరుగక తన స్వామియగు భగవంతునితో యుద్ధముచేసెను. 23

శ్లో॥ ద్వంద్వ యుద్ధం సుతుములముభయోర్విజిగీషతోః।
ఆయుధాశ్మ ద్రుమైర్దోర్భిః క్రవ్యార్థేశ్యేనయోరివ ॥ 24

టీ:- ద్వంద్వయుద్ధమితి. క్రవ్యార్థే ఆమి షార్థే. 24

జయేచ్ఛ కల్గిన ఆయిరువురు (శ్రీకృష్ణ జాంబవంతులకు) ఆ యుద్ధముల తోడను, చెట్లతోడను, బాహా,బాహిగాను, మాంసము కొరకు పోరు డేగలవలె పెను సంగరముజరిగెను. 24

శ్లో॥ ఆసేత్త దష్టావింశాహమితరే తర ముష్టిభిః।
వజ్ర నిష్పేష పరుషైరవి శ్రమ మహర్నిశమ్ ॥ 25

టీ:- ఆసీదితి. అష్టాంవింశాహం అష్టచ వింశతిశ్చ అహాని యస్మిన్ తత్ అష్టావింశత్యహం. వింశతిశబ్దే తిలోపశ్చార్షః. వజ్రస్య నిష్పేషో నిర్ఘాతః తద్వత్ పరుషైః నిష్ఠురైః. 25

ఆ ఇరువురికి పరస్పరము పిడుగుద్దులతోడను, నిప్పులు గ్రక్కుచున్న ఆయుధములతోడను విశ్రాంతి లేక ఇరువదిఎనిమిది దినములు రేయింబవళ్ళు ద్వంద్వ యుద్ధము జరిగెను. 25

శ్లో॥ కృష్ణస్య ముష్టి నిష్పాతైర్నిష్పిష్టాంగోరుబంధనః ।
క్షీణ సత్వస్విన్నగాత్రస్తమహా తీవ విస్మితః ॥ 26

టీ:- కృష్ణస్యేతి. కృష్ణస్య ముష్టినాంనిష్పాతైరాగతైర్వినిష్పిష్టాని విశ్లథాన్యంగానామూరూని బంధనాని యస్య సః. 26

శ్రీకృష్ణ భగవానుని పిడిగుద్దులకు పిప్పియైన అంగములు, సడలిన కీళ్ళ సందులుగల జాంబవంతుడు బలము దిగి శరీరము చెమటలు చిందుచుండగ ఆశ్చర్యచకితుడై స్వామితో అనెను. 26

శ్లో॥ జానేత్వాం సర్వభూతానాం ప్రాణ ఓజసహోబలం।
విష్ణుం పురాణపురుషం ప్రభ విష్ణుమదీశ్వరమ్ ॥27

టీ:- లోకేశో వాయం మత్తో బలీయానితి. విస్మితస్సన్ విమృశ్యాహ - జాన ఇతి. సర్వభూతానాం యఃప్రాణస్తత్ర చ యదోజః సహోబలంచ ఇంద్రియ హృదయదేహబలాని. తత్సర్వం త్వమిత్యహం జానే. కథం తథాత్వమత ఆహ - విష్ణుమిత్యాది. 27

ఓ ప్రభూ ! లోకమున నాకంటే బలవంతుడులేడని నేను తలచుచుంటిని. కాని లోకమునందలి సకల భూతలముల ఇంద్రియ, హృదయ, దేహబలములు నీవేయని తలచుచున్నాను. సమస్త ప్రాణి సృష్టికి మూలము, పురాణ పురుషుడగు విష్ణువుగా నా ప్రభువుగా నిపుడు స్ఫురించుచున్నది. 27

శ్లో॥ త్వంహి విశ్వసృజాంస్రష్టా సృజ్యానామపి యచ్చసత్ ।
కాలఃకలయతా మీశః పరాఆత్మా తథాత్మ నామ్ ॥ 28

టీ:- పురాణత్వే హేతుః. త్వమితి. స్రష్టానిమిత్తం యచ్చ సత్ ఉపాదానం. అతః పురాణః. ప్రభవిష్ణుత్వే హేతుః. కాల ఇతి. అధీశ్వత్వ మప్యత ఏవేత్యాహ- ఈశఃపర ఇతి. న చ తటస్థ ఇత్యాహ - ఆత్మ నామాత్మేతి. 28

విశ్వసృష్టికి మూలమైన బ్రహ్మపుట్టుకకు ప్రధానకారణుడవు నీవే కదా! అందుచేతనే నీవు పురాణపురుషుడవు. ఈకాలమునకు ప్రభువుకూడ నీవే. 28

శ్లో॥ యస్యేషదుత్కలిత రోషకటాక్ష మోక్షై
ర్వర్మాదిశత్క్షుభిత నక్రతి మింగిలో௨ బ్ధిః।
సేతుః కృతస్స్వయశ ఉజ్జ్వలితా చలంకా
రక్షశ్శిరాంసి భువిపేతురిఘుక్షతాని॥ 29

టీ:- యత ఏవం భూతః అతో మమేష్టదైవం రఘునాథ ఏవ త్వమిత్యాహ - యస్యేతి. ఈషదుత్కలిత ఉద్దీపితోయో రోషస్తేన యే కటాక్షమోక్షాః తైః క్షుభితాః నక్రా గ్రాహాస్తిమింగిలా మహామత్స్యాశ్చ యస్మిన్. సో௨ బ్ధిః వర్త్మ ఆదతశత్ దత్తవాన్. తస్మినేవస్వయశ ఏవ సేతుః కృతః. ఉజ్వలితా దగ్ధా చ. యస్యేషుభిః క్షతాని ఛిన్నాని. రక్షసో దశగ్రీవస్య శిరాంసి. భువి పేతుః స ఏవ త్వమితి జానే. 29

ఇట్టివాడవు కనుకనే నా ఇష్టదైవమైన రఘునాథుడవు నిశ్చయముగ నీవే. ఎవని యొక్క కొంచపు కోపరోషితమైన దృష్టిపాతము చేతనేమొసళ్ళు, తిమింగళములచే కల్లోలితము చేయబడిన సముద్రుడు సైతము దారినొసగెనో, తన కీర్తియనెడి సేతువుదానిపై నిర్మింపబడెనో, లంకానగరము ఎవనిచే దగ్ధము చేయబడెనో, లంకాధీశుడగు రావణాసురుని పది తలలు బాణములచే భూమిపై తెగవ్రేయబడెనో ఆ రాఘవుడు నీవేయని దృఢముగ నమ్ముచున్నాను. 29

శ్లో॥ ఇతి విజ్ఞాతవిజ్ఞాన మృక్షరాజాన మచ్యుత్ ।
వ్యాజహార మహారాజ భగవాన్ దేవకీసుతః ॥ 30

శ్లో॥ అభిమృశ్యా రవిందాక్షః పాణినా శమకరేణతు।
తమాహ కృపయా భక్తం మేఘగంభీరయాగిరా॥ 31

టీ:- ఇతీతి. ఇతి విజ్ఞాతం విజ్ఞానంయేనతం. విజ్ఞానశబ్దః కరణసాధనః కర్మ సాధనోవా. ఋక్ష రాజానాం. ఉక్తవాన్ విజ్ఞాయతేవ௨ నేనేతి విజ్ఞానం. 30, 31

ఈవిధముగ తెలుసుకొనబడిన పరతత్త్వము గల జాంబవంతునితో, మహారాజా ! భగవంతుడు దేవకీసుతుడునగు అచ్యుతుడు బదులుపల్కెను. 30

పద్మపత్ర నేత్రుడగు శ్రీకృష్ణుడు శ్రీకరమగు, మంగళప్రదమైన హస్తమున, భక్తుడగు ఋక్షరాజును జాంబవంతుని స్పృశించి, దయతో, మేఘ గంభీరమైన వాక్కులతో పలుకరించెను. 31

శ్లో॥ మణి హేతో రిహ ప్రాప్తావయమృక్షపతే బిలం ।
మిథ్యాభిశాపం ప్రమృజన్నాత్మనో మణినాఽమునా ॥ 32

టీ:- మణీతి. వయం హి బహవో బిలద్వారం ప్రాప్తాః. తత్ర మిథ్యాభిశాపమమునామణినా ప్రమృజన్ ప్రమార్ష్టుమిచ్ఛన్ అహమేక ఏవాంతర్బిలమిహ ప్రాప్య ఇత్యర్థః. 32

ఓ ఋక్షపతీ ! స్యమంతకమణిని వెదకు కారణమున మేము అనేకులము ఈ పర్వతబిలమును చేరితిమి. ఈ మణితో నా నీలాపనందను దూరముచేసుకొనగోరి నేను మాత్రము ఒంటరిగ ఇందు ప్రవేశించితిని. 32

శ్లో॥ ఇత్యుక్త స్స్వాందుహితరం కన్యాం జాంబవతీంముదా।
అర్హణార్థం సమణినా కృష్ణా యోపజహారహ ॥ 33

ఇట్లు కృష్ణునిచే పలుకబడిన జాబవంతుడు మోదభరితుడై తన సుతయగు జాంబవతియను కన్యను ఆ స్యమంతకమణితో సహా సమర్పించుకొనెను. 33

శ్లో॥ అన్యై స్స మణిముఖ్యైశ్చ పూజితో భక్తవత్సలః।
దదౌ తస్మై పరాం ముక్తిం ప్రేత్యా జాంబవతేహరిః ॥34

ఇంకనూ మణిమయాద్యాభరణములతో పూజింపబడిన భక్తవత్సలుడు హరి ప్రేమతో జాంబవంతునకు పరమమగు ముక్తిని ప్రసాదించెను. 34

శ్లో॥ అదృష్ట్వానిర్గమం శౌరేః ప్రవిష్టస్య బిలంజనాః ।
ప్రతీక్ష్య ద్వాదశాహాని దుఃఖితాస్తే పరంయయుః ॥ 35

గుహలో ప్రవేశించిన శౌరి మరలి రాకపోవుటచే పురజనులు పండ్రెండురోజులు బిలద్వారమున వద్ద ఎదురుచూచి దుఃఖితులై ద్వారకకు మరలిపోయిరి. 35

శ్లో॥ నిశమ్యదేవకీదేవి రుక్మిణ్యానక దుందుభిః ।
సుహృదోజ్ఞాతయోఽశోచన్‌బిలాత్కృష్ణ మణిర్గతమ్ ॥ 36

దేవకీవసుదేవులు, రుక్మిణియు, స్నేహితులు, జ్ఞాతులును కృష్ణుడు గుహ నుండి మరలిరాలేదను వార్తను విని మిక్కిలి శోకసంతప్తులైరి. 36

టీ:- ఇతీతి. సహమణినా సమర్పయామాస. (33-36)

శ్లో॥ సత్రాజితం శపంతస్తే దుఃఖితా ద్వారకౌకసః ।
ఉపతస్థుశ్చంద్రభాగాం దుర్గాం కృష్ణోప లబ్ధయే ॥37

ద్వారకా పురవాసులందరు సత్రాజిత్తును శపించుచు దుఃఖితులై కృష్ణుని చూడవలయునను, పొందవలయునను కోరికతో చంద్రభాగ యను నామముతో ప్రసిద్ధినిగన్న దుర్గామాతను సేవించిరి. 37

టీ:- సత్రాజితమితి. శ్రీకృష్ణప్రాప్తయే చంద్రభాగాం నామ దుర్గామభజన్. 37

శ్లో॥ తేషాం తు దేవ్యుపస్థానాత్ప్రత్యాదిష్టాశిషా చ సః।
ప్రాదుర్బభూవ సిద్ధార్ధస్సదారో హర్షయన్ హరిః॥ 38

ద్వారకావాసులందరు దుర్గామాతను ప్రార్థించగ ఆమె ఆశీస్సులతో శ్రీహరి సిద్ధసంకల్పుడై లక్ష్మీరూపయగు జాంబవతితో కూడి వారి కనులముందు ప్రత్యక్షమైఎల్లరకు ఆనందమును కలుగజేసెను. 38

టీ:- తేషామితి. స చ కృష్ణస్తేషాం ప్రాదుర్బభూవ. ఆసవ ఇతి పాఠే అసవ ఇంద్రియాణి తేషాం ప్రేష్య ఇత్యర్థః. తదా దేవ్యా ఉపస్థానాత్. తయా తాన్ ప్రతి ఆదిష్టాదత్తాయా ఆశీః కృష్ణం ద్రక్ష్యథేతి తయా సహైవ. (38)

శ్లో॥ ఉపలభ్యహృషీకేశం మృతం పునరివాగతం ।
సహపత్న్యా మణిగ్రీవం సర్వేజాత మహోత్సవాః॥ 39

లోకమున జనులు మరణించిన ఆత్మీయుడు బ్రతికివచ్చిన ఆనంద పరవశులైనట్లుగ, ద్వారకా పురవాసులు హృషీకేశుని పత్నీయుతముగ, స్యమంతకమణిని ధరించి వచ్చిన వానిని చూచి ఎంతయోముదమందిరి. 39

శ్లో॥ సత్రాజితం సమాహూయ సభాయాం రాజసన్నిధౌ।
ప్రాప్తించాఖ్యాయ భగవాన్ మణింతస్మైన్య వేదయత్ ॥ 40

టీ:- యది లోకేజనాః కించిత్ మృతంబంధుం పునరాగతముపలభంతే. తద్వదుపలభ్య సర్వే జాతమహోత్సవాః. ఆసన్నితి. (39-40)

సత్రాజిత్తును రాజ సభకు పిలిపించి యదురాజ సముఖమున స్యమంతకమణి లభించిన విధమును నివేదించి ఆమణిని సత్రాజిత్తునకు సమర్పించెను. 40

శ్లో॥ స చాతి వ్రీడితో రత్నం గృహీత్వాఽవాఙ్ముఖస్థితః ।
అనుతప్యమానో భవనమగమత్స్వేన పాప్మనా ॥ 41

టీ:- స ఇతి. పాప్మనా అపరాధేన. అనుతప్యమానః అత్రవరాంధక్య మార్షం. 41

ఆ సత్రాజిత్తు రత్నమును తీసుకొని మిక్కిలి లజ్జితుడై తలవంచుకొని నిల్చెను. కృష్ణునిపై నిందమోపిన తన పాపమునకు అత్యంతము పరితపించుచు స్వగృహమునకరిగెను. 41

శ్లో॥ సోఽనుధ్యాయం స్తదేవాఘం బలవద్వి గ్రహకులః ।
కథం మృజామ్యాత్మరజః ప్రసేదేద్వాచ్యుతః కథమ్ ॥ 42

టీ:- స ఇతి. అఘం దోషం. ఆత్మనో రజః మలం అపరాధమితి. 42

సత్రాజిత్తు ఆ పాపమునే మాటిమాటికి తలంచుకొనుచు బలవంతులతోడి విరోధమునకు భయపడెను. ఈ అపకార దోషమును ఎట్లుమాపుకోగలను? ఎట్లు అచ్యుతుడు నాయందుప్రసన్నుడగును?అని ఆలోచించుచుండెను. 42

శ్లో॥ కింకృత్వా సాధుమహ్యంస్యాన్నశపేద్వా జనో యథా ।
అదీర్ఘ దర్శనం క్షుద్రం మూఢం ద్రవిణలోలుపమ్ ॥43

టీ:- కిమితి. కిం కృత్వా కస్మిన్ కృత ఇత్యర్థః. సాధు భద్రం అదీర్ఘ దర్శనం అవిచారకం. క్షుద్రం కృపణం మూఢం. మందమతిం. 43

ఇంకను ఏమి మంచి చేసిన నాకు భద్రమగును. అనాలోచితుడను, కృపణుని, మూర్ఖుని, అర్థాతురుడనగు నేను ఏమి చేసిన జనులు నన్ను శపించకుందురు. 43

శ్లో॥ దాస్యే దుహితరం తస్మై స్త్రీరత్నం రత్నమేవ చ ।
ఉపాయోఽయం సమీచీనస్తస్య శాంతిర్నచాన్యథా ॥ 44

అని ఈవిధముగ ఆలోచించుచూ ఉపాయమును వెదకి నిశ్చయించుకొనెను - శ్రీకృష్ణునకు స్త్రీ రత్నమగు నా దుహితను, పారిబర్హముగ రత్నమును కూడ సమర్పించుకొందును. ఈ ఉపాయమే చక్కగనున్నది. నా పాపమునకు శాంతి మరే విధముగనుకాదు. 44

శ్లో॥ ఏవం వ్యవసితో బుద్ధ్యా సత్రాజిత్స్వసుతాంశుభం।
మణిం చ స్వయముద్యమ్య కృష్ణా యోపజహారహ॥45

టీ:- ఏవం ధ్యాయన్నుపాయం నిశ్చనోతి. దాస్య ఇతి. స్త్రీ రత్నం దుహితరం తావద్దాస్యామి. అనంతరం పారిబర్హత్వేన రత్నమపీతి. (44-45)

సత్రాజిత్తు ఈవిధముగ నిశ్చితబుద్ధియై తన కూతురు సౌమంగల్యవతి యగు సత్యభామను స్యమంతకమణిని వెంటగొని పోయి కృష్ణునకు ఉపాయనముగ సమర్పించుకొనెను. 45.

శ్లో॥ తాం సత్యభామాం భగవానుపయేమే యథావిధి ।
బహు భిర్యాచితాం శీలరూపౌదార్య గుణాన్వితామ్ ॥46

టీ:- తామితి. బహుభిః కృతవర్మాదిభిః. 46

భగవానుడు వాసుదేవుడు కృతవర్మాదులచే యాచింపబడినట్టి, శీల,రూప గుణ ఔదార్యయుత యగు ఆ సత్యభామను శాస్త్రప్రకారముగ పరిణయమాడెను. 46

శ్లో॥ భగవానాహనమణి ప్రతీచ్ఛామోవయంన్నృప ।
తవాస్తాం దేవభక్తస్య వయంచ ఫలభాగినః ॥ 47

టీ:- భగవానితి. మణిం న ప్రతీచ్ఛామః న స్వీకుర్మః దేవస్సూర్యః. తద్భక్తస్యేతి కటాక్షః ఫలభాగిన ఇతి. తవాపుత్రత్వాత్త్వదీయం ధనమస్మాక మేవేతి గూఢోఽభిప్రాయః. 47

ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,
షట్పంచాశత్తమోఽధ్యాయః

ఓ రాజా! సత్రాజిత! మాకు స్త్రీ రత్నము చాలును. స్యమంతకమణిని స్వీకరించుము. సూర్యదేవుని కటాక్షఫలమైన ఈ మణి ఆయన భక్తుడవు మిత్రుడవునగు నీ దగ్గరనే యుండనిమ్ము. మేము తత్ఫలభాగమునను భవించువారము అని పల్కెను. నీకు పుత్ర సంతతి లేదు కావున ఎప్పటికైనను నీ ధనము మాదియేయని గూఢాభిప్రాయము. 47.

శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు
యాభైఆరవ అధ్యాయము సమాప్తము

## సప్తపంచాశత్తమోஉధ్యాయః

శ్లో॥ సప్తపంచాశత్తమే తు పునశ్శతధనోర్వధే ।
ప్రాప్తం స్వదుర్యశోమార్ష్టుం కృష్ణోஉక్రూరాగతాన్మణేః॥
అక్రూర మరరీకృత్యమణేః పాత్రమథాచ్యుతః।
ఉపామంత్రత మేకాంతే సరామోగాధద్రజాహ్వయన్॥

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ విజ్ఞాతార్థోஉపి భగవాన్ దగ్ధానా కర్ణ్య పాండవాన్ ।
కుంతీచ కుల్యకరణే సహరామో యయౌకురూన్ ॥ 1

టీ:- విజ్ఞాతార్థ ఇతి. పాండవాబిల్వ ద్వారేణ జతుగృహాన్నిర్గతా ఇత్యేవం విజ్ఞాతోஉర్థోయేవసః. కుంతీం చ దగ్ధమాకర్ణ్యకుల్యకరణే కులోచితవ్యవహారార్థం. 1

శ్లో॥ భీష్మం నృపం సవిదురం గాంధారీం ద్రోణమేవచ।
తుల్యదుఃఖా సమాగమ్య హా కష్టమితి శోచతుః ॥ 2

## 57వ అధ్యాయము

ఈయాబదిఏడవ అధ్యాయమున మరల శతధన్వుని వధ వల్ల కల్గిన అపకీర్తి నిరాసమునకై శ్రీకృష్ణుడు అక్రూరుని ఆహ్వానించెను. అక్రూరుడు మణితోకూడ నగరమునకువచ్చెను. అక్రూరుని అంగీకారమున అచ్యుతుడు మణిని గ్రహించి, ఏకాంతమున అతని యనుమతిని పొంది బలరామునితో కూడి హస్తినాపురమునకు పోయెను.
(సత్రాజిత్తు కృష్ణుని కోరికను భంగము చేసిన ఫలమును వ్యక్తీకరించుచు కథను ప్రారంభించుచున్నాడు.)

**శ్రీశుకులు పలికిరి**

పాండవులు బిల్వద్వారమున లక్కయింటి నుండి తప్పించుకొనిరను విషయము తెలిసియుండియు శ్రీకృష్ణుడు కుంతీ సహితముగ పాండవులు లక్కయింటి యందు దహింపబడిరనే వార్తను విని కులాచారవిధి ప్రకారం వ్యవహరించుటకై బలరామునితో కలసి హస్తిపురమునకు పోయను. 1

అచట భీష్ముని, ధృతరాష్ట్రుని, విదురుని, గాంధారిని, మరియు ద్రోణాచార్యులను చూచి ఎంత విపత్తు సంభవించినదని వారితో

కష్టమును పంచుకొని శ్రీకృష్ణ బలరాములు రోదించిరి. పాండవుల మరణమునకు శోకించువారు భీష్మాదులుమాత్రమే ఇతరులెవ్వరికి ఆదుఃఖములేదని తలచుటచే శ్రీకృష్ణుడు మొదట వారిని చూచెను. 2

శ్లో॥ లబ్ధ్వాతదంతరం రాజన్ శతధన్వాన మూచతుః।
అక్రూర కృతవర్మాణౌ మణిః కస్మాన్న గృహ్యతే ॥ 3

టీ:- భీష్మ ఇతి. అన్యేషాం తద్గాహదుఃఖాభావాత్ భీష్మాదీన్ సమాగమ్యేత్యుక్తం. (2-3)

ఓరాజా! ఈమధ్య కాలమున అక్రూరకృతవర్మలు శతధన్వుని సమీపించి సత్రాజిత్తునుండి మణిని ఎందుకు పొందలేదని అడిగిరి. 3

శ్లో॥ యోऽస్మభ్యంసం ప్రతిశ్రుత్య కన్యా రత్నం విగృహ్యనః।
కృష్ణాయాదాన్న సత్రాజిత్కస్మాద్భ్రాతర మన్వియాత్ ॥ 4

సత్రాజిత్తు మొదట కన్యారత్నమును మనలో నొకరికిచ్చుట కంగీకరించి, పిమ్మట మనలను లెక్కింపక శ్రీకృష్ణునకిచ్చెను. అందువలన అతనినెందుకు ప్రసేనుని మార్గము ననుసరించునట్లు చేయకూడదు. సత్రాజిత్తు జీవించియుండగ మణిని మనకు ఎందుకు ఇచ్చునని పల్కిరి. 4

శ్లో॥ ఏవం భిన్నమతిస్తాభ్యాం సత్రాజిత మసత్తమః ।
శయానమవధీ ల్లోభాత్స పాపః క్షీణ జీవితః ॥ 5

టీ:- నను జీవన్ సత్రాజిత్ మణిం కథం దాస్యతీతి తత్రోచతుః. య ఇతి. భ్రాతరం ప్రసేనం మృతంకస్మాత్ నాన్వియాత్ నానుగచ్ఛేత్. మ్రియతామిత్యర్థః. (4-5)

ఈవిధముగ వారిలో భిన్నాభిప్రాయము రేకెత్తగ దుష్టుడగు శతధన్వుడు మణి యందలి దురాశతో నిద్రించుచున్న సత్రాజిత్తును వధించెను. 5

శ్లో॥ స్త్రీణాం విక్రోశమానానాం క్రందంతీ నామనాథవత్।
హత్వా పశుం సౌనికవన్మణి మాదాయజగ్మివాన్ ॥ 6

క్షీణజీవితుడగు ఆపాపి శతధన్వుడు స్త్రీలు దిక్కులేని వారివలె ఏడ్చిపెడబొబ్బలుపెట్టుచుండగ కటికవాడు పశువును వలె సత్రాజిత్తును చంపి మణినితీసుకొనిపోయెను. 6

శ్లో॥ సత్యభామాపి పితరం హతం వీక్ష్య శుచార్పితా।
వ్యలపత్తాత తాతేతి హాహతాస్మేతి ముహ్యతీ॥ 7

సత్యభామయు హతుడైన తండ్రిని చూచి దుఃఖార్తయై తండ్రీ తండ్రీయని, అయ్యో అయ్యో హతాస్మి అని విలపించుచూ మూర్ఛితురాలైనది. 7

శ్లో॥ తైలద్రోణ్యాం మృతం ప్రాస్యజగామగ జసాహ్వయం।
కృష్ణాయ వినీతార్థాయ తప్తాచఖ్యౌ పితుర్వధమ్॥ 8

తైలపాత్ర యందు మృతుడగు తండ్రి దేహమును భద్రపరచి సత్యభామ గజపురమునకుపోయెను. అచట విషయమంతయు తెలిసియున్న శ్రీకృష్ణునకు రోదించుచూ తండ్రి వధను గూర్చి వివరించెను. 8

శ్లో॥ తదాకర్ణ్యేశ్వరౌ రాజన్నను సృత్య నృలోకతాం।
అహౌనః పరమం కష్ట మిత్యస్రాక్షౌ విలేపతుః ॥ 9

బలరామకృష్ణులు సత్రాజిత్తు వధనుగూర్చి విని మానవ ధర్మముననుసరించి అయ్యో మనకెంత కష్టము వచ్చినదని కన్నీరు కార్చుచూ విలపించిరి. 9

శ్లో॥ ఆగత్య భగవాంస్తస్మాత్సభార్యస్సా గ్రజః పురం।
శతధన్వాన మారేభే హంతుంహర్తుం చ తం మణిమ్॥ 10

భగవానుడు కృష్ణుడు సత్యభామతో అన్నయగు బలరాముని తోడను ద్వారకకు చేరి శతధన్వుని హతమార్చి మణిని తెచ్చుట కుద్యమించెను. 10

శ్లో॥ సోఽపి కృష్ణోద్యమంజ్ఞాత్వా భీతః ప్రాణపరీప్సయా ।
సాహాయ్యం కృతవర్మాణ మయాచత సచాబ్రవీత్ ॥ 11

టీ:- స్త్రీణామితి. జగ్మివాన్ జగామ. (6-11)

శతధన్వుడు కూడ కృష్ణుని ప్రయత్నమును తెలుసుకొని ప్రాణములయందాశతో భయగ్రస్తుడై కృతవర్మను సాయమునకై యాచించెను. 11 (విని కృతవర్మ ఇలా పలికెను)

(తరువాత తాత్పర్యముతో అన్వయము)

శ్లో॥ నాహమీశ్వరయోః కుర్యాం హేలనం రామకృష్ణయోః ।
కోను క్షేమాయ కల్పేత తయోర్వృజిన మాచరన్॥ 12

టీ:- నేతి. హేలనం ప్రతికూలం. వృజినం అపరాధమ్. 12

నా వలన కాదు బలవంతులగు బలరామకృష్ణులకు ప్రతికూల మాచరించుటకు ఎవరు ఇష్టపడుదురు? నేననగనెంత? వారికి అపరాధము చేసి ఎవరు సుఖముగ జీవించగలరని కృతవర్మ పలికెను. 12

శ్లో॥ కంసస్సహానుగోఽపేతో యద్ద్వేషాత్త్యాజితశ్శ్రియా।
జరాసంధ స్సప్తదశస్సంయుగా ద్విరథో గతః ॥ 13

కంసుడు అనుజులతో సహా కృష్ణుని ద్వేషించి రాజ్యలక్ష్మికి దూరమై మరణించెను. జరాసంధుడును పదిహేడుమారులు యుద్ధమున యత్నించి విరథుడై పారిపోయెను. 13

శ్లో॥ ప్రత్యాఖ్యాతస్సచా క్రూరం పార్ష్ణిగ్రాహ మయాచత్।
సోఽప్యాహ కోవిరుధ్యేత విద్వానీశ్వర యోర్బలం॥14

టీ:- కంస ఇతి. అపేతో మృతః, సప్తదశసంఖ్యాత్ సంయుగాత్. (13,14)

శతధన్వుడు అక్రూరుని పిలచి కాళ్ళు పట్టుకొని సహాయమునకై ప్రార్థించెను. అక్రూరుడు కూడ బలరామకృష్ణుల బలముతెలిసిన వారెవ్వరు వారితో విరోధమును కొనితెచ్చుకోరని పల్కెను. 14

శ్లో॥ య ఇదం తలయా విశ్వంసృజత్యవతి హంతి చ ।
చేష్టాం విశ్వసృజోయస్యన విదుర్మోహితాజయా॥ 15

ఆ బలరామకృష్ణులు తత్త్వమున యిరువురుకారు. ఒక్కటియే. ఆ భగవానుడు లీలావిలాసముతో ఈవిశ్వమును సృష్టించును. స్థితిని కల్పించును, అట్లే లయను పొందించును. ఆయన మాయామోహితులైన వారువిశ్వస్రష్ట చేష్టలను తెలిసికొనజాలరు. 15

శ్లో॥ యస్సప్తహాయనః శైలముత్పాట్యైకేన పాణినా।
దధార లీలయా బాల ఉచ్ఛిలీంధ్రమివార్భకః॥ 16

అమాయకుడైన బాలుడు సులభముగ పుట్టగొడుగును ఎత్తినట్లు (భగవంతుడు కృష్ణుడు) గోవర్ధనగిరిని ఎత్తి చిటికెన వ్రేలిపై ఏడు దినములు ధరించెనుగదా! 16

శ్లో॥ నమస్తస్మై భగవతే కృష్ణాయాద్భుత కర్మణే ।
అనంతాయాధిభూతాయ కూటస్థాయాత్మనే నమః ॥ 17

టీ:- తౌ రామకృష్ణౌ ఏకమేవ తత్వమిత్యభిప్రేత్యాహ- య ఇతి. అజయా మాయాయ. మోహితా అజయేతి. సంధిరార్షః. (15-17)

అట్టి ఆద్భుత కార్యములనాచరించిన, అనంతునకు, అధిభూతునకు, కూటస్థునకు, భగవంతునకు, ఆత్మస్వరూపుడగు శ్రీకృష్ణునకు నమస్కారము. 17

శ్లో॥ ప్రత్యాఖ్యాతస్సతేనాపి శతధన్వా మహామణిం।
తస్మిన్న్యస్యాశ్వ మారుహ్య శతయోజనగంయయా॥ 18

టీ:- ప్రత్యాఖ్యాత ఇతి. అంతర్యామికృష్ణనియుక్తః..తస్మిన్ అక్రూరే మణింన్యస్య యయాపలాయత. 18

అక్రూరునిచే ఈవిధముగ పలకబడిన శతధన్వుడు ఆ మహామణిని అంతర్యామియైన కృష్ణునిచే నియుక్తుడైన అక్రూరుని హస్తమున పెట్టి గుఱ్ఱమునెక్కి నూరామడలదూరముపోయెను. 18

శ్లో॥ గరుడధ్వజమారుహ్యా రథం రామ జనార్దనౌ ।
అన్వయాతాం మహావేగైరశ్వై రాజగ్గురుద్రుహమ్॥ 19

టీ:- గరుడేతి. గరుః శ్వశురః తద్ధంతారం. 19

ఓరాజా ! బలరామ జనార్దనులు మహావేగవంతములగు అశ్వముల పూన్చిన, గరుడధ్వజముగల రథమునెక్కి, తమ మామయగు సత్రాజిత్తును చంపిన ద్రోహియగు శతధన్వుని వెంటబడిరి. 19

శ్లో॥ మిథిలాయా ఉపవనే విసృజ్యపతితం హయం।
పద్భ్యామధావత్సంత్రస్తః కృష్ణోఽప్యన్వద్రవద్రుషా ॥ 20

టీ:- మిథిలాయ ఇతి. శతయోజనగామిత్వాత్తతః పరం గంతుమశక్తః తత్ర పతితః తం హయం విసృజ్య. 20

శతధన్వుడు నూరామడలు పరుగెత్తుటచే అలసి సొమ్మసిల్లి మిథిలానగర ఉద్యానవనమున పడిపోయిన గుఱ్ఱమును వదిలి, భీతిల్లి పరుగెత్తెను. కృష్ణుడు కూడ కోపోద్రేకముతో వాని వెంటనంటి పరుగెత్తెను. 20

శ్లో॥ పదాతేర్భగవాంస్తస్య పదాతిస్తిగ్మ నేమినా।
చక్రేణ శిర ఉత్కృత్యవాససోర్వ్యచినోన్మణిమ్ ॥ 21

పాదచారియై పరుగెత్తుచున్న శతధన్వుని, పాదచారియై వెంబడించుచూ భగవానుడు పదునైన అంచులుకల చక్రముతో వాని శిరమును తెగవేసి, అక్రూరుని హస్తమున మణి కలదని తెలిసిన సర్వజ్ఞుడు కృష్ణుడు బలరాముని అనుమాన నివృత్తికై వాని వస్త్రములందు మణికొరకు వెదికెను. 21

శ్లో॥ అలబ్ధ మణిరాగత్య కృష్ణ ఆహాగ్రజాంతికం ।
వృథాహతశ్శతధనుర్మణిస్తత్ర న విద్యతే ॥ 22

టీ:- పదాతేరితి. వ్యచినోత్ మృగయామాస. అక్రూరే మణిరస్తీతి సర్వజ్ఞతయా విదిత్వాపి.రామవంచనాయ తథా కృతవానిత్యర్థః (21-22)

మణి లభించకపోవుటచే శ్రీకృష్ణుడు అన్న దగ్గరకువచ్చి శతధన్వుడు వ్యర్థముగచంపబడెను. వానివద్ద మణి లేదని చెప్పెను. 22

శ్లో॥ తతాహ బలోనూనం సమణిశ్శతధన్వనా ।
కస్మింశ్చిత్పురుషే న్యస్తమన్వేష పురం వ్రజ॥ 23

టీ:- తత ఇతి. అన్వేష అన్విచ్ఛ. 23

అప్పుడు బలదేవుడు ఆ శతధన్వుడు నిశ్చయముగ ఆమణిని ఎవరి హస్తమునవో న్యాసముగ నుంచి యుండును. వాడెవడో వెదుకవలెను. పురమునకు పోవుదమని పల్కెను. 23

శ్లో॥ అహం వైదేహ మిచ్ఛామిద్రష్టుం ప్రియతమం మమ।
ఇత్యుక్త్వామిథిలాం రాజన్ వివేశ యదునందనః ॥ 24

జరిగిన సంఘటనలద్వారా, మోసము జరిగినదని గ్రహించి, అంతరంగము నెరింగిన బలరామదేవుడు విదేహరాజు నాకు మిక్కిలి ప్రీతిపాత్రుడగు నెయ్యము అతనిని చూడవలయునని యున్నదని పలికి మిథిలకు పోయెను. 24

శ్లో॥ తందృష్ట్వాసహసోత్థాయ మైథిలః ప్రీతమానసః ।
అర్హయా మాసవిధివదర్హణం వై సమర్హణైః ॥ 25

జనకమహారాజు బలరాముని చూచి వెంటనే లేచివచ్చి ఆనందముతో విధి ప్రకారముగ యథోచిత సత్కారములతో అర్చించెను. 25

టీ:- సర్వజ్ఞస్త్వేవం చేష్టితంమద్వంచనాయేతి మత్వా గూఢమన్యు రాహ - అహమితి. (24-25)

శ్లో॥ ఉవాస తస్యాంకతిన్మిథిలాయాం సమావిభుః ।
తతోఽశిక్షద్గదాంకాలే ధార్తరాష్ట్రస్సుయోధనః ॥ 26

శ్లో॥ మానితః ప్రీతి యుక్తేన జనకేన మహాత్మనా॥ 27

బలరాముడు కొన్ని ఏండ్లు ఆ మిథిలయందే నివసించెను. పిమ్మట ఆకాలముననే ధార్తరాష్ట్రుడగు సుయోధనుడు ప్రేమమూర్తి యగు జనకమహారాజుచే అనుమతింపబడి ఆయన దగ్గర కొంత కాలము గదా యుద్ధమును అభ్యసించెను. (26-27)

టీ:- ఉవాసేతి. కతిచిత్సమాః సంవత్సరాన్. 26

టీ:- ప్రాసంగికమహ-తత ఇతి. 27

శ్లో॥ కేశవోద్వారకామేత్య నిధనం శతధన్వనః ।
అప్రాప్తించ మణేః ప్రాహప్రియాయాః ప్రియకృద్విభుః ॥ 28

టీ:- సత్యభామామప్యవంచయదితి సూచయన్నాహ. కేశవ ఇతి. 28

సత్యభామనుకూడ మోసగించెననుట సూచించుటకై నుడువుచున్నాడు. కేశవుడు ద్వారకను చేరి శతధన్వుని మరణవార్తను, మణిలభించకపోవుటగూర్చి, ప్రియురాలు సత్యభామను ప్రియమును చేయగోరువాడై చెప్పెను. 28

శ్లో ॥ తతస్సకారయా మాసక్రియా బంధోర్వ్హా తస్యవై ।
సాకం సుహృద్భిర్భగవాన్యాయాస్స్యు స్సాంపరాయికాః ॥ 29

టీ:- తత ఇతి. బంధోసత్రాజిత్తః సాంపరాయికాః పారలౌకికాః29

అనంతరము భగవంతుడు శ్రీకృష్ణుడు స్నేహితులు, బంధువులతో కలసి తమకు బంధువగు సత్రాజిత్తు యొక్క అంత్యక్రియలను విధి ప్రకారము నిర్వహింపచేసెను. 29

శ్లో ॥ అక్రూరః కృత వర్మాచ శ్రుత్వాశతధనోర్వధం ।
మ్యాశయర్భయవిత్రస్థౌ ద్వారకాయః ప్రయోజకౌ ॥ 30

టీ:- అక్రూర ఇతి. వ్యూషతుః ద్వారకాయస్సకాశాత్ క్వాపి పలాయితౌ ప్రయోజకౌ మణిహరనే శతధన్వనః ప్రవర్తకౌ. తత్రఅక్రూరః కృష్ణాను

మణి అపహరణమున శతధన్వునకు సహాయకారులుగ అక్రూర కృతవర్మలు శతధన్వుని వధనుగూర్చి విని మిక్కిలిగ భయపడినవారై ద్వారకనుండి దూరముగ ఎచ్చటికో పలాయనము చిత్తగించిరి. అందు అక్రూరుడు కృష్ణానుమతి తోడనే పోయెను. ఇక కృతవర్మ భక్త పక్షపాతము ప్రకటించుచు భయపడినట్లుగ నటించువానివలె కృష్ణునిచే

మతేనైవ గతః. కృతవర్మాతు భక్తపక్షపాత ప్రాకట్యభయాదివో పేక్షిత ఇతిగమ్యతే కథామన్యథా సర్వజ్ఞేస్వరవంచనం తయోస్సంభవతీతి. 30

శ్లో॥ అక్రూరే(ప్రోషితేఽ రిష్టా ఆసక్త్వె ద్వారకౌకసాం ।
శారీరామా నసాస్తాపా ముహుర్దైవిక భౌతికాః ॥ 31

టీ:- తదేవం శ్రీవారాణస్యాం దానపతిసమాఖ్యయా మణిహస్తేక్రూరే రుక్మ వేదికైర్మహాధ్వరైర్యజమాన్యే నివసతి సతి. పునః శ్రీకృష్ణేనైవ ప్రస్థాపితోఽ క్రూర ఇతి కర్ణే కర్ణే జపతి సతి జనే. సత్యభామారామాదీ నామప్య విశ్వాసే. జననం గ్రహాయాక్రూరమాహూయ సాక్షేపం శ్రీకృష్ణం ప్రాహ - ఇదంచ భగవన్మతం సం గోప్య కేచన ఋషయోఽ న్యత్కారణం అక్రూరాయనే వర్ణయంతి. తద్యథా శ్రుతం దూషయితుం అనువదతి. అక్రూరే ప్రోషిత ఇతి. 31

శ్లో ॥ ఇత్యంగోపదిశంత్యేకే విస్మృత్య ప్రాగుదాహృతమ్ ।
ముని వాసనివాసే కిం ఘటేతారిష్టదర్శనమ్ ॥ 32

టీ:- దూషయతి-ఇతితీ. అంగ హే రాజన్. శ్రీకృష్ణమాహాత్మ్యం విస్మృత్యేతితదేవహ. -ముని వాసనివాస ఇతి. మునీనాం వాసో యస్మిన్

ఉపేక్షింపబడెను. లేనిచో సర్వజ్ఞేశ్వరులను మోసగించుట వారి తరమా? 30

శ్రీవారణాశిపురమున దానవరాజసమూహముచేత చేయబడుచున్న యాగమున బంగరు గద్దె మీద ఋత్విజులతో యజమాన రూపమున మణిహస్తుడగు అక్రూరుడు కూర్చొని యుండెను. శ్రీకృష్ణుడే అక్రూరుని పంపించెనని యచటి జనులు ఒకరితో నొకరు అనుకొనుచుండిరి. సత్యభామ బలరామాదులు తన ననుమానించుచుండగ జనామోదముకొరకు శ్రీకృష్ణుడు అక్రూరుని పిలిపించి గట్టిగా బలికెను. ఈ భగవంతుని మతమును మరుగుపరచి కొందరు ఋషులు అక్రూరుని పిలిపించుటకు కారణమును ఇలా చెప్పుచున్నారు. ఏమనిన, అక్రూరుడు ద్వారకనువిడిచి పోవుటచే ఆ పురజనులకు, శారీరక, మానసిక, దైవిక, భౌతికములగు బాధలేర్పడి నవని పలిరి. 31

ఓ రాజా! మరికొందరు శ్రీకృష్ణమహాత్మ్యమును మరిచి మౌనిహృదయనివాసియగు శ్రీకృష్ణుని మందిరమగు ద్వారకయందు అక్రూరుడు దూరమైనంత మాత్రమున ఏమి అరిష్టమేర్పడునని పల్కుచుండిరి. ఆ మహానుభావుని (శ్రీకృష్ణుని) ఇచ్ఛలేక ఏమియు జరగదని భావము. 32

స మునివాసః శ్రీకృష్ణః తస్య నివాసే సతి అక్రూరాపగమమాత్రేణా రిష్టదర్శనం కిం ఘటేత? తదిచ్ఛాం వినా న ఘటేతేత్యర్థః 32

శ్లో ॥ దేవేఽవర్శతి కాశీశశ్వఫల్కాయాగ తాయతాం ।
స్వసుతాం గాం దినీంప్రాదాత్తతోఽవర్షత్కాశీషు ॥ 33

ఇంద్రుడు కాశీ దేశమునందు వర్షింపని కారణమున అచ్చటికి శ్వఫల్గుడు కాశీరాజు కోరికపై వచ్చుటచే కాశీరాజు తన కూతురును గాందినిని అతనికిచ్చి వివాహము చేసెను. అపుడు కాశీరాజ్యమందు విస్తారముగ వర్షములు కురిసెను. 33

శ్లో ॥ తత్సుతస్తత్ప్రభాఽసావ క్రూరో యత్రయత్ర సః ।
దేవోఽభివర్షతే తత్ర నోపతాపన మారికాః ॥ 34

టీ:- పునస్తన్మతమే వానువర్ణయతి. దేవ ఇతి. కాశీషుకాశీదేశేషు. దేవే మఘవతి అవర్షతిసతి.(33-34)

గాందిని, శ్వఫల్గుల సుతుడు అక్రూరుడు పిత్రనుగత ప్రభావము కలవాడు కావున అక్రూరుడెచ్చటెచ్చట నుండునో అచ్చటచ్చట దేవేంద్రుడు వర్షములు కురిపించుచుండును. అచ్చోటుల శారీరక, మానసిక, దైవిక, దుష్టతాపములుండవు. 34

శ్లో॥ ఇతి వృద్ధ వచశ్రుత్వానైతా వదిహ కారణం।
ఇతి దూతైత్సమానీయ ప్రాహక్రూరం జనార్దనః॥ 35

టీ:- ఇతీతి. ఇత్యేవం భూతమక్రూరమహిమా ప్రతిపాదనపరం. వృద్ధానాం వాక్యం శ్రుత్వా. సత్యమేవం తథాప్యేతావ దేవకారణం న భవతి. కింతు మణేరప్యపగమ ఇతి మత్వేత్యేతదంతం పరమతం.

ఇటువంటి అక్రూర మహిమా ప్రతిపాదన పరమైన వృద్ధుల వాక్యములను విని శ్రీకృష్ణుడు, అదియునొకవిధముగ నిజమే కాని అక్రూరుని మహిమయే కరవుకాటకములకు కారణము కాదు. అక్రూరుని చెంత మణి యుండుటయు, అది ఇచ్చట లేకపోవుటయు నొకకారణముగ భావించి దూతలను పంపి అక్రూరుని ద్వారకకు రావించి అతనితోననెను. 35

వస్తుతస్తు కృష్ణలీలావశాదేవేష్టారిష్టాదిదర్శనమితి శుకాదిసంమతమితి భావః. 35

శ్లో॥ పూజమిత్యాభి భాష్యైవం కథ మిత్వాప్రియాః కథాః।
విజ్ఞాతాఖిల చిత్తజ్ఞస్స్మయమాన ఉవాచ హ॥ 36

శ్లో॥ నను దానవతేన్యస్తస్స్యయ్యాస్తే శతధన్వనా ।
స్యమంతకమణి శ్రీమాన్ విదితః పూర్వమేవనః॥ 37

టీ:- పూజయిత్యేతి. విజ్ఞాతమఖిలం యేన స చాసౌ. అత ఏవ చిత్తజ్ఞశ్చ. అయంభావః. మహాభాగవతస్యాస్యమాయాదత్తేఽపి మణావపేక్షా నాస్త్యేవ. యస్మాదాహుతో మణినా సహైవాగత ఇతి జ్ఞాత్వేతి.(36-37)

శ్లో॥ సత్రాజితోఽనపత్సత్వాద్గహ్ణీయుర్దు హితుస్సుతాః ।
దానం నినీయాపః పింశాన్విముచ్యర్ణం చ శేషితమ్ ॥ 38

టీ:- తతః కిమత అహ. సత్రాజిత ఇతి. అపః పిండాంశ్చ నినీయ

సకలప్రాణి హృదయగత భావమునెరిగిన శ్రీకృష్ణుడు మహాభాగవత శ్రేష్ఠుడగు అక్రూరునకు స్యమంతకమణిని నేనే స్వయంగ నిచ్చినప్పటికిని దానియందతనికి కోరికలేదు. కావుననే పిలిచిన మాత్రమున మణితోకూడవచ్చినాడని, అక్రూరుని పూజించి ప్రియమగు కథలతో మురిపించి చిరునగవుతో పల్కెను. 36

ఓ అక్రూరా! ఉపాయచతుర! శతధన్వుడు శ్రీమంతమగు స్యమంతకమణిని నీ దగ్గర న్యాసముగనుంచినాడు. అది మీవద్దనే భద్రముగనున్నదను విషయము మాకు ముందేతెలియును. 37

ఓఅక్రూరా! సత్రాజిత్తునకు పుత్ర సంతతిలేదు. కావున అతని కూతురు సత్యభామ సంతానము అంత్యక్రియలాచరించి పిండములను, తిలాంజలులను వదిలి ఋణవిముక్తునిచేసి మిగిలిన అతని ఆధనమును గ్రహింపవలయునని శాస్త్రమున్నది. అస్మృతి ఇది. శ్లో."పత్నీ దుహితరశ్చైవ పితరౌ"॥ ఏమనగ "యజమాని ధనమునకు వారసులు

దత్వా. ఋణం చ విముచ్య అపాకృత్య. శేషితమవతిష్టం. దాయం దుహితుస్సత్యభామాయాః సుతాః గృహ్ణీయురితి శాస్త్రం. శ్లో."పత్నీ దుహితరశ్చైవ పితరౌ భ్రాతరస్తథా, తత్సుతా గోత్రజా బంధు శ్శిష్యాస్స బ్రహ్మచారిణః 38

శ్లో॥ తథాపి దుర్ధరోహ్యన్యైస్త్వయ్యాస్తాం సువ్రతేమణిః ।
కింతు మా మగ్రజస్సమ్యఙ్న ప్రత్యేతి మణిం ప్రతి॥ 39

టీ:- తథేతి. అథగ్రజోఽపిన ప్రత్యేతి న విశ్వసితీతి. 39

శ్లో॥ దర్శయస్వ మహాభాగ ! బంధూనాం శాంతిమావహ।
అవిచ్ఛిన్నామఖాస్తేఽద్య వర్తంతే రుక్మవేదయః ॥ 40

టీ:- దర్శయస్వేతి. నాస్తీతి చ న వక్తవ్యం యతః అవిచ్ఛినాః సంతతాః మఖాః వర్తంత ఇతి. 40

శ్లో॥ ఏవం సామభిరాలబ్ధ శ్శ్వఫల్కతనయో మణిం ।
ఆదాయ వాససాచ్ఛన్నం దదౌసూర్య సమప్రభమ్ ॥ 41

టీ:- ఏవమితి. ఆలబ్ధః ఉక్తఃహృది స్పృష్ట ఇతివా. 41

మొదట భార్య, కుమారులు లేదా కూతుళ్ళు, తల్లిదండ్రులు, అట్లే అన్నదమ్ములు వారి సుతులు గోత్రజులగు బంధువులు, శిష్యులు మరియు సహాధ్యాయులు." 38

అయినను ఆ ధనము ఇతరులవద్దనుండుట అన్యాయము. కాని ఓఅక్రూరా! నీ దగ్గరనే ఆమణియుండుగాక! మా అన్న బలరాముడు మాత్రము ఆ మణి నాదగ్గర లేదనిన నన్ను అంతగా నమ్ముటలేదు. 39

ఓమహాభాగా! అందువలన మా బంధువులకు ఆ మణిని చూపించి మనశ్శాంతిని కలుగజేయుము. ఎందుకనగా మేము నిరంతరము సువర్ణము ప్రధానముగ యజ్ఞ యాగాది కార్యములు నిర్వహించవలసి యున్నది. 40

ఈ విధమైన సామవచనము విని అక్రూరుడు గుండె దిటవు పరుచుకొని, బట్టలలో దాచియుంచిన సూర్యకాంతితో సమానమైన కాంతిగల శ్యమంతకమణిని దీసి శ్రీకృష్ణునకు సమర్పించెను. 41

శ్లో॥ శ్యమంతకం దర్శయిత్వాజ్ఞాతిభ్యో రజ ఆత్మనః ।
విమృజ్యమణినా భూయస్త స్మై ప్రత్యర్పయత్ప్రభుః ॥ 42

టీ:- స్యమంతకమితి. రజః మిధ్యాభి శాపం సంమృజ్య. అన్యైర్దుద్ధర ఇత్యాదిమిషేణ ప్రీత్యా. భూయస్తస్మై ప్రత్యర్పితవానితి. 42

శ్రీకృష్ణభగవానుడు ఆ శ్యమంతకమణిని తీసికొని దాయాదులందరికి చూపించి తనపైగల నీలాపనిందలను తొలగించుకొని మరల ఆమణిని అక్రూరునికే ఇచ్చెను. 42

శ్లో॥ యస్త్వేతద్భగవత ఈశ్వరస్య విష్ణో
ర్వీర్యాఢ్యం వృజినహరం సుమంగళంచ।
ఆఖ్యానం పఠతిశృణోత్యను స్మరేద్వా
దుష్కీర్తిం దురితమపోహ్యయాతి శాంతిమ్॥ 43

టీ:- య ఇతి. దుష్కీర్తిం తన్మూలం దురితం చేతి. 43

భగవంతుడు ప్రభువునగు విష్ణువు యొక్క పరాక్రమమును యుద్ధ విజయమును పాపక్లేశకరమును, శుభకరమును అగు ఈకథను చదివిన వారలకు, స్మరించినవారికిని, అపకీర్తి, పాపములు నశించును. విన్నవారికి కూడ సుఖశాంతులు సమకూరును. 43

ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,
సప్తపంచాశత్తమోఽధ్యాయః

శీమహాభాగవతమున దశమస్కంధమునందు
యాభైఏడవ అధ్యాయము సమాప్తము

## అష్టపంచాశత్తమో௨ధ్యాయః

శ్లో॥ అష్ట పంచాశత్తమేతు కృష్ణః పంచకరే௨గ్రహీత్ ।
కాళిందీం మిత్రవిందాంచ సత్యాంభద్రాంచ లక్షణామ్ ॥
కాళిందీం నిజలాభాయ తపః పరముపేయుషీం ।
పరిణేష్యన్ ప్రియావాస మింద్రప్రస్థమథాగమత్ ॥

## 58వ అధ్యాయము

ఈ యాభైయెనిమిదవ అధ్యాయమునందు శ్రీకృష్ణభగవానుడు కాళిందిని, మిత్రవిందను, సత్యాదేవిని,భద్రను మరియు లక్ష్మణయను పంచకన్యలను పరిణయమాడుట వర్ణింపబడినది.

తన కళ్యాణమునకై నిరూపమానముగ తపస్సునాచరించుచున్న కాళిందిని పరిణయము చేసికొని, తనకు ఇష్టులగువారి (పాండవుల) నివాస భూమియగు ఇంద్రప్రస్థపురమునకు వచ్చెను.

శ్లో ॥ ఏకదాపాండవాన్ద్రష్టుం ప్రతీతాన్ పురుషోత్తమః ।
ఇంద్రప్రస్థంగత శ్రీమాన్యుయుధానాదిభిర్వృతః ॥ 1

టీ:- ఏకదేతి. ప్రతీతాన్ నష్టానపి పునః దృపదగేహే సర్వైర్దృష్టాన్ యుయుధానః సాత్యకిః 1

ఒకానొకప్పుడు పురుషోత్తముడు శ్రీకృష్ణస్వామి సాత్యకి మొదలగువారితోకూడి, లక్కయింటి నుండి బయటపడి ఇంతవరకు కనిపించని పాండవులను చూచుటకు ఇంద్రప్రస్థపురమునకు పోయెను. 1

శ్లో॥ దృష్ట్వాతమాగతం పార్థా ముకుంద మఖిలేశ్వరం ।
ఉత్తస్థుర్యుగపద్వీరా ప్రాణాముఖ్యమి వాగతమ్ ॥ 2

వీరులగు పాండవులు పంచేంద్రియములకు ప్రాణదాత వలె వచ్చిన అఖిలేశ్వరుని ముకుందుని చూచి ఒకేమారు అందరులేచి నిల్చొని గౌరవించిరి. 2

శ్లో॥ పరిష్వజ్యాచ్యుతం వీరా అంగసంగ హతైనసః ।
సానురాగస్మితం వక్త్రం వీక్ష్య తస్య ముదం యయుః ॥ 3

టీ:- దృష్ట్వేతి. ప్రాణా ఇంద్రియాణి. ముఖ్యం పంచవృత్తిం ప్రాణమివ. (2-3)

అచ్యుతుని కౌగలించుకొని ఆవీరులు ఆయన శరీర సాంగత్యముచే పాపములు నశించినవారైరి. అనురాగ పూరితమగు చిర్నగవు గల ఆముకుందునివోమును గాంచి అమితముగ ఆనందించిరి. 3

శ్లో॥ యుధిష్ఠిరస్యభీమస్య కృత్వా పాదాభివందనం ।
ఫల్గునం పరిరభ్యాథ యమాభ్యాంచాభివాదితః ॥ 4

టీ:- యుధిష్ఠిరస్యేతి. జేష్ఠయోః ప్రణామం కృత్వా. సమేనాలింగితః కనిష్టాభ్యామభివందితో బభూవ. 4

శ్రీకృష్ణుడు తనకంటే పెద్దవారుఅగు యుధిష్ఠిర, భీమసేనలకు పాదాభివందనం చేసెను. సముడగు అర్జునుని అక్కున చేర్చుకొనెను. చిన్నవారగు కవలలు నకుల, సహదేవులచే నమస్కృతుడయ్యెను. 4

శ్లో॥ పరమాసన మాసీనం కృష్ణా కృష్ణమనిందితా ।
నవోఢావ్రీడితా కించిచ్ఛనైరేత్యాభ్య వందత ॥ 5

ఉత్తమాసనమున ఉపవిష్టుడైన కృష్ణునికి శ్రేష్ఠురాలు నూతన వివాహిత, నిందారహితయగు ద్రౌపది సిగ్గుపడుచూవచ్చి ప్రణమిల్లెను. 5

శ్లో॥ తథైవసాత్యకిః పార్థైః పూజితశ్చాభి వందితః ।
నిషసాదాసనేఽన్యేచ పూజితాః పర్యుపాసత ॥ 6

టీ:- పరమాసనమితి. కృష్ణా ద్రౌపదీ. అనిందితా బహుభార్యా సత్యపి నిందారహితా. పార్థైర్నవమచిరం ఊఢాపరిణితా. (5-6)

అట్లే సాత్యకియు పాండవులచే యథార్థముగ పూజితుడై నమస్కరింపబడెను. మరియొక ఉన్నతాసనమున కూర్చుండజేసి ఇతరులును పూజించి సేవించిరి. 6

శ్లో॥ పృథాంసమాగత్య కృతాభివాదన
స్తయాతిహార్దార్ద్ర దృశాభి రంభితః ।
అపృష్ట వాంస్తాం కుశలం సహ స్నుషాం
పితృష్వసారం పరిపృష్ట బాంధవః ॥ 7

టీ:- పృథామితి. అతిహార్దేన స్నేహేన ఆర్ద్రే సజలే దృశౌయస్యాః తయా. పరిష్వక్తః తయా. పరిపృష్టాః బాంధవా యస్యసః. 7

శ్రీకృష్ణుడు కుంతీదేవిని సమీపించి ఆమెకు నమస్కారము చేసినవాడై ఆనందబాష్పములతో కూడిన నేత్రములతో అభిమానితుడయ్యెను. కోడంద్రతో కూడియున్న మేనత్తయగు ఆమెను కుశల ప్రశ్నలు వేసెను. అట్లే బంధుజనమును ప్రేమతో పల్కరించెను. 7

శ్లో॥ తమాహ ప్రేమ వైక్లబ్యరుద్ధ కంఠాశ్రులోచనా ।
స్మరంతీతాన్ బహుక్లేశాన్క్లేశాపాయాత్మ దర్శనమ్ ॥8

టీ:- తమితి. ప్రేమ్ణా వైక్లబ్యం తనే రుద్ధఃకంఠోయస్యాః క్లేశాపాయే ఆత్మనిదర్శనం యస్య తం. భజతాం క్లేశాపాయాయ ఆత్మానం దర్శయతీతి వా. 8

ప్రేమాతిశయముతో, గద్గదికమగు గళముతో, కన్నీరునించుచు కుంతీదేవి తాము అనుభవించిన కష్టములను తలంచుకొనుచు, కష్టములుతీర్చు పరమాత్మ స్వరూపుడు కృష్ణుని దర్శించి ఇట్లనెను. 8

శ్లో॥ తదేవ కుశలంనోఽభూత్సనాథాస్తే కృతావయం ।
జ్ఞాతీన్నస్మ ్సరతా కృష్ణభ్రాతా మేప్రేషితస్త్వయా ॥ 9

టీ:- తదేతి. జ్ఞాతీన్ బంధూన్. నః అస్మాన్. యదా. భ్రాతా అక్రూరః ప్రేషితః. 9

ఓకృష్ణా! నీవు బంధువులగు మమ్ములను మనస్సుననుంచుకొని మాఅన్నను అక్రూరుని పంపుటవలన మేము సనాథులమైతిమి. అదియే మా క్షేమమునకు కారణము. 9

శ్లో॥ నతేఽస్తిస్వపరభ్రాంతిర్విశ్వస్య సుహృదాత్మనః ।
తథాపి స్మరతాం శశ్వత్ క్లేశాన్హంసి హృదిస్థితః ॥ 10

టీ:- జ్ఞాతీనితివచనాత్ ప్రాప్తం మోహం వారయంతీస్తౌతి- నేతి. తత్ర హేతుః- విశ్వస్యేతి. సుహృచ్చఆత్మాచ తస్య. హంసి నాశయసి. 10

కృష్ణా ! నీవు విశ్వేశుడవు. విశ్వశ్రేయోదాయకుడవు. నీకు స్వపర భేదములేదు. అయినను స్మరించినంతమాత్రమున వారి హృదయగతుడవై వెంటనే సమస్త బాధలను నాశనముచేయుదువు. 10

యుధిష్ఠిర ఉవాచ.

శ్లో॥ కిం న ఆచరితం శ్రేయోన వేదాహ మదీశ్వరః ।
యోగేశ్వరాణాం దుర్దర్శోయన్నోదృష్టః కుమేధసామ్ ॥ 11

టీ:- కిమితి. కుమేధసాం విషయాసక్త చిత్తానాం దృష్టోఽపి. 11

యుధిష్ఠిరుడు ఇట్లనెను.

శ్రీకృష్ణా! యోగీశ్వరులకు కూడా లభించని దర్శనసౌభాగ్యమును విషయాసక్త చిత్తులమైనప్పటికీ మాకు అనుగ్రహించితివి. మా కొనగూర్చిన ఈ మేలును తెలుసుకోలేదను నదిలేదు. అనగా బాగుగా గ్రహించగల్గితినని భావము. 11

శ్లో॥ ఇతివై వార్షికాన్ మాసాన్రాజ్ఞాసోఽభ్యర్థితస్సుఖం ।
జనయన్నయనానందమింద్ర ప్రస్థౌకసాం విభుః ॥ 12

టీ:- ఇతీతి. సుఖమవసదితి శేషః. సుఖం అభ్యర్థిత ఇతి వా. క్రియా సమాప్తిః. 12

ఈవిధముగ ధర్మజునిచే అభ్యర్థితుడైన కృష్ణభగవానుడు ఇంద్రప్రస్థ పురవాసులకు నయనానందసుఖమును కల్గించుచూ కొన్ని సంవత్సరములు అచటనే నివసించెను. 12

శ్లో॥ ఏకదా రథ మారుహ్య విజయోవానర ధ్వజః ।
గాండీవం ధనురాదాయతూణేచాక్షయసాయకౌ ॥ 13

కాళిందీ సందర్శన ప్రసంగమును నుడువుచున్నాడు. ఒకమారు హనుమధ్వజుడగు అర్జునుడు తన ధనస్సు గాండీవనమును అక్షయతూణీరము లను తీసి రథమునెక్కి కృష్ణభగవానునితో సహా

శ్లో॥ సాతం కృష్ణేన సన్నద్ధో విహర్తుం విపినం మహత్ ।
బహువ్యాళ మృగాకీర్ణం ప్రావిశత్పరవీరహా ॥ 14

శ్లో॥ తత్రా విధ్యచ్ఛరైర్వ్యా ఘ్రాన్ సుకరామహిషాన్ రురూన్।
శరభాన్ గవయాన్ ఖడ్గాన్ హరిణాన్ శశ శల్యకాన్ ॥ 15

టీ:- కాళిందీ సందర్శన ప్రసంగమాహ - ఏకదేతి. అక్షయాః సాయకాః యయోస్తౌ. తూణీ ఇషుధీ. (13-15)

సన్నద్ధుడై వివిధ మృగములకు నిలయమగు మహారణ్యమున వేటకొరకు విహరించుటకు పోయెను. ఆ కీకారణ్యమందు పులులను, అడవి పందులును, అడవిదున్నలను, దుప్పులను, శరభము (ఎనిమిది కాళ్ళు కలిగి, సింహమును చంపు మృగము) లను, గురుపోతులను, ఖడ్గమృగములను, జింకలను, కుందేళ్ళను, ఏదు పందులను చంపెను. 13-15

శ్లో॥ తాన్నిన్యుఃకింకరా రాజ్ఞేమేధ్యాన్ పర్వణ్యుపాగతే ।
తృట్పరీతః పరిశ్రాంతో భీభత్సుర్యమునామగాత్ ॥ 16

రాజభటులు ఉత్సాహంగా ఆహారోపయోగములగు జంతువులను ధర్మరాజు చెంతకుగొని పోయిరి. అర్జునుడు అలసిపోయి దప్పికగొన్నవాడై యమునానదిని చేరెను. 16

శ్లో॥ తత్రోపవిశ్య విశదం పేత్వావారి మహాదధౌ ।
కృష్ణౌ దదృశతుః కన్యాం చరంతీం చారులోచనామ్ ॥17

ఆ నదీతీరమున కూర్చుండి కృష్ణార్జునులిరువురు నిర్మలములగు జలములను పానముచేసి అచటనే విహరించుచున్న సులోచనయను కన్య నొకదానిని చూచిరి. 17

టీ:- తానితి. రాజ్ఞేయుధిష్ఠిరాయ. మేధ్యాన్ కర్మార్హాన్. బీభత్సురర్జునః .(16,17)

శ్లో॥ తామాసాద్యవరారోహాం సుద్విజా రుచిరాననాం ।
పప్రచ్ఛ ప్రేషితస్సఖ్యా ఫల్గునః ప్రముదోత్తమామ్ ॥ 18

స్నేహితుడగు కృష్ణునిచే పంపబడిన అర్జునుడు, చక్కని పలువరుస కల్గిన, అందమైన ముఖముగల యుక్తవయసుగల ఆ స్త్రీ రత్నమును సమీపించి ప్రశ్నించెను. 18

శ్లో॥ కాత్వం కస్యాసి కల్యాణి కుతోవా కిం చికీర్షసి ।
మన్యేత్వాం పతిమిచ్ఛంతీం సర్వం కథయ శోభనే ॥ 19

కల్యాణీ నీవెవరు? ఎవరి కూతురివి? మీనగరమేది? ఏమికోరి ఇచట చరించుచున్నావు. ఓ శోభనవతీ! భర్తను కోరుచున్నదానినిగ నిన్ను తలంచుచున్నాను. నీవిషయమునంతటిని చెప్పవలసినదని అడిగెను. 19

కాళింది రువాచ :-

శ్లో॥ అహందేవస్య సవితుః దుహితా పతిమిచ్ఛతీ ।
విష్ణుం వరేణ్యం వరదం తపః పరమ మాస్థితా ॥ 20

కాళింది పలికెను.

ఓ వీరుడా! నేను సూర్య భగవానుని సుతను, పతిని కోరిన దానినై వరప్రసాదియు, సర్వోత్తముడగు విష్ణువును గూర్చి తపస్సు చేయుచున్నాను. 20

టీ:- తామితి. సఖ్యా శ్రీకృష్ణేన. (18-20)

శ్లో॥ నాన్యం పతిం వృణే వీరతమ్న తే శ్రీనికేతనం ।
తుష్యతాం మేసభగవాన్ముకుందోనాధసంశ్రయః ॥ 21

లక్ష్మీపతియగు కృష్ణుని తప్పవేరొకరిని నేను భర్తగా వరించను. భగవంతుడాముకుందుడు తానే భర్త కావలెనని ఆశ్రయించిన నన్ను నా తపస్సును అంగీకరించి తృప్తిచెందునుగాక. 21

శ్లో॥ కాళిందీతి సమాఖ్యాతా వసామియమునా జలే ।
నిర్మితే భవనే పిత్రా యావదచ్యుత దర్శనమ్ ॥ 22

కాళిందియను పిలవబడు నేను ఈ యమునా జలము నందు మా తండ్రియగు సూర్యునిచే నిర్మింపబడిన భవనమునందు అచ్యుత దర్శనమగునంతవరకు నివసింతును. 22

టీ:- అయం మాం కామయే తేతి శంకయాహ. -నాన్యమితి. (21,22)

శ్లో॥ తథావదద్గుడాకేశో వాసుదేవాయసోఽపితాం ।
రథమారోప్య తద్విద్వాన్ ధర్మరాజ ముపాగమత్ ॥ 23

టీ:- తథేతి. ఆదావేవ తద్విద్వాన్. 23

అర్జునుడు వాసుదేవునకు ఆమె విషయమును వినిపించెను. మొదటనే ఆవిషయమును తెలిసియున్న సర్వజ్ఞుడగు కృష్ణుడు కాళిందిని అర్జునుని రథముమీదనెక్కించుకొని ధర్మజుని కడకు పోయెను. 23

శ్లో॥ యదైవ కృష్ణస్సందిష్టః పార్థానాం పరమాద్భుతం ।
కారయామాస నగరం విచిత్రం విశ్వకర్మణా ॥ 24

టీ:- ప్రసంగాత్తత్కాలికం. చరిత్రాంతరమాహ-యదేతి. పార్థైః. యదైవ సందిష్టోవిజ్ఞాపితః శ్రీకృష్ణః తదైవ. తేషాం విశ్వకర్మణా దేవశిల్పినా నగరం కారయామాస. 24

ప్రసంగానుకూలముగ ఆనాటి చరిత్రమును చెప్పుచున్నాడు. పరమాద్భుతమగు విషయమును పాండవులకు వివరించునంతలో విశ్వకర్మ ద్వారా విచిత్రమైన నగరము నిర్మింపచేసెను. 24

శ్లో॥ భగవాంస్తత్రనివసన్ స్వానాం ప్రియచికీర్షయా ।
అగ్నయే ఖాండవందాతుమర్జున స్యాస సారథిః ॥ 25

టీ:- కించ భగవానితి. భగవాన్నిరతిశయైశ్వర్య గుణవానపి అర్జునస్య ధనురాది లాభాయ సారథిరాస ఖాండవం నామ ఇంద్రస్య వనం. 25

భగవంతుడు శ్రీకృష్ణుడు ఆ నగరమున నివసించుచూ తన వారికి ఇష్టమును దీర్చుకోరికతో అగ్నిదేవునకు ఖాండవవన దహన సమయమున అర్జునకు రథసారథియయ్యెను. 25

శ్లో ॥ సోఽగ్నిస్తుష్టో ధనురదాద్ధయాన్ శ్వేతాన్ రథం నృప ।
అర్జునాయాక్షయౌ తూణీ వర్మచాభేద్యమస్త్రిభిః ॥26

టీ:- స ఇతి. అక్షయౌ అక్షయసాయకౌ. 26

ఓ రాజా! ఆ హుతాశనుడు తృప్తుడై అర్జునునకు గాండీవమను ధనస్సును, శ్వేతాశ్వములను, రథములను, అక్షయ తూణీరములను కరవాలముతో చేధించుటకసాధ్యమైన కవచమును ప్రసాదించెను. 26

శ్లో ॥ మయశ్చ మోచితో వహ్నేస్సభాం సఖ్య ఉపాహరత్ ।
యస్మిన్ దుర్యోధనస్యాసీజ్జలస్థలదృశి భ్రమః ॥ 27

అగ్నినేల నుండి రక్షితుడైన మయుడును మిత్రుడగు అర్జునునకు సభాభవనమును (మయసభను) బహుమతిగ సమర్పించెను. అందే దుర్యోధనుడు జలమున్నచోలేనట్లు, జలములేనిచోట జలమున్నట్లుగను భ్రమకులోనయ్యను. 27

శ్లో॥ సతేన సమనుజ్ఞాతస్సుహృద్భిశ్చాను మోదితః ।
ఆయయౌ ద్వారకాం భూయస్సాత్యకి ప్రముఖైర్వృతః ॥ 28

టీ:- మయ ఇతి. ఖాండవదాహకాద్వహ్నేః సఖ్యే అర్జునాయ యస్మిన్నితి సామాన్యతో నిర్దేశః యస్యామిత్యర్థః జలస్థలయోః దృశేర్దృష్టేః భ్రమః యద్వా. జలే స్థలవత్ దృక్ దృష్టిర్యస్మిన్ తత్ జలస్థలదృక్. తస్మిన్ భ్రమ ఆసీదితి. మతిభ్రమ ఇతి పాఠే జలే స్థలబుద్ధిరూపః స్థలే జలబుద్ధిరూపో భ్రమ ఇత్యర్థః (27-28)

శ్రీకృష్ణ భగవానుడు ధర్మజునిచే స్నేహితులతోడను అనుమతిని వడసి సాత్యకి మొదలైన వారితోకలసి మరల ద్వారకకు వచ్చెను. 28

శ్లో॥ అథోపయేమే కాళిందీం సుపుణ్యర్త్వృక్ష ఊర్జితే ।
వితన్వన్ పరమానందం స్వానాం పరమమంగళమ్ ॥ 29

టీ:- అథేతి. సుపుణ్యః ఋతుః ఋక్షం చ తస్మిన్. 29

పిమ్మట ఒక శుభ ఋతునక్షత్ర వేళ శ్రీకృష్ణుడు తన వారందరికి ఆనందమును కూర్చుటకై కాళిందీ దేవిని పరిణయమాడెను. 29

శ్లో॥ విందానవిందావావంత్యౌ దుర్యోధన వశానుగౌ ।
స్వయంవరే స్వభగినీం కృష్ణే రక్తాంన్యషేధతామ్ ॥ 30

ఐదవదియగు మిత్రవిందా వివాహమును వర్ణించుచున్నాడు. విందుడు, అనువిందుడు అను వారు అవంతిదేశ రాజులు. దుర్యోధనుని వశవర్తులు. స్వయంవరమున కృష్ణుని వరించిన తమ సోదరిని అడ్డగించిరి. 30

శ్లో॥ రాజాధిదేవ్యాస్తనయాం మిత్రవిందాం పితృష్వసుః ।
ప్రసహ్యాహృతవాన్ కృష్ణోరాజన్ రాజ్ఞాం ప్రవిశ్యతామ్ ॥ 31

టీ:- పంచమం మిత్రవిందావివాహమాహ.- ద్వాభ్యాం. విందేతి. ఆవంత్యౌ అవంతి రాజానౌ. (30,31)

ఓరాజా! మిత్రవింద తన మేనత్తయగు రాజాధిదేవి కూతురగుటచే సమస్తరాజ సమూహము చూచుచుండగనే శ్రీకృష్ణుడు బలాత్కారముగ ఆమెను అపహరించి పరిణయమాడెను. 31

శ్లో॥ నగ్నజిన్నా మకౌసల్య ఆసీద్రా జాతి ధార్మికః ।
తస్య సత్య భవత్కన్యా దేవి నాగ్నజితీ నృప ॥ 32

టీ:- షష్ఠమాహ-నగ్నజితిది. కౌసల్యః అయోధ్యాధిపతిః తస్య సత్యా నామకన్యా అభవత్ ఆసీత్. దేవీ కాంతీమతి నాగ్నజితీతి పితృనామ్నా ప్రసిద్ధేత్యర్థః 32

ఓరాజా! అయోధ్యానగర రాజు నగ్నజిత్తు,అతడు అతి ధర్మ ప్రభువు. ఆరాజునకు సత్య యను కూతురు కలదు. సుందరాంగియగు ఆమె తండ్రి పేరుతో నాగ్నజితి యని ప్రసిద్ధికెక్కినది. ఇది ఆరవ నాయికతోడి వివాహఘట్టము. 32

శ్లో॥ నతాం శేకుర్నృపావోఢు మజిత్వాసప్త గోవృషాన్ ।
తీక్ష శృంగాన్ సుదుర్ధర్షాన్వీరగంధాసహాన్ ఖలాన్ ॥ 33

టీ:- సేతి. వీరస్య గంధమపి న సహంత ఇతి తథావిధాన్. 33

వీరగంధమును సైతము సహింపని వాడి మొనలుగల కొమ్ములు గలిగినట్టి కుమ్ములాటలో పటుత్వముకల్గినట్టి, మిక్కిలి క్రూరమైన కోడెలను ఏడింటిని జయించి నాగ్నజితిని వివాహమాడుటకు ఏరాజ సింహమును ముందుకురాడయ్యెను. 33

శ్లో॥ తాం శ్రుత్వా వృషజిల్లభ్యాం భగవాన్ సాత్వతాం పతిః ।
జగామ కౌసల్యపురం సైన్యేనమహతా వృతః ॥ 34

టీ:- తామితి. వృషాన్ జయతి యస్తేన లాభ్యాం. 34

భగవంతుడు శ్రీకృష్ణుడు కోడెలను జయిస్తే లభించు దానినిగ నాగ్నజితి గూర్చివిని గొప్పబలగమును వెంటబెట్టుకొని కౌసల్యపురము (అయోధ్య) కు పోయెను. 34

శ్లో॥ స కోసలపతిః ప్రీతః ప్రత్యుత్థాయాసనాదిభిః ।
అర్హణేనాపి గురుణా పూజయన్ప్రతినందితః ॥ 35

కోసల దేశాధిపతి నగ్నజిత్తు ప్రీతుడై లేచి ఎదురేగి ఆసనాదుల సమర్పించి గురువు అనుమతితో విధి ప్రకారము సత్కరించి అర్చించి శ్రీకృష్ణునిచే ప్రత్యభినందితుడయ్యెను. 35

శ్లో॥ వరం విలోక్యాభి మతంధృతవ్రతా
నరేంద్ర కన్యాచకమే రమాపతిం ।
భూయాదయం మే పతిరాశిషోఽమలాః
కరోతు సత్యాయదిమే ధృతో వ్రతః ॥ 36

వ్రత దీక్షితురాలగు రాచకన్య సత్య తన మనస్సు మెచ్చిన శ్రీపతిని వరునిగా చూచి ఆనందించెను. నేను నిశ్చయముగ వ్రతపరాయణురాలనగుచో నిర్మలమగు ఆశిస్సులు సత్యమగునేని ఈకృష్ణ దేవుడు నాకు పతి యగు గాక యని తలంచెను. 36

శ్లో॥ అర్చితం పునరిత్యాహ నారాయణ జగత్పతే ।
ఆత్మానందేన పూర్ణస్య కరవాణి కిమల్పకః ॥ 37

నగ్నజిత్తు శ్రీకృష్ణుని అర్చించి ఓజగత్పతీ! నారాయణా! ఆత్మానంద పరిపూర్ణుడవగు నిన్ను ఈ అల్పుడు ఇంకను ఎట్లాదరించ వలెనో సెలవిమ్మనెను. 37

శ్లో॥ యత్పాద పంకజ రజ శ్శిరసాబిభర్తి
శ్రీరబ్జజస్సగిరిశస్సహ లోకపాలైః ।
లీలా తనూ స్స్వకృత సేతు పరీప్సయాయః
కాలే దధత్స భగవాన్ మమకేన తుష్యేత్ ॥ 38

శ్రీ శుక ఉవాచ

శ్లో ॥ తమాహభగవాన్ కృష్ణః కృతాసనపరిగ్రహః
మేఘగంభీరాయ వాచా సస్మితం కురునందన ॥ 39

టీ:- స ఇతి. ప్రతినందితస్తం ప్రతినందితవాన్ శ్రీకృష్ణేన వాస ప్రతినందితః (35-39)

శ్రీ భగవానువాచ

శ్లో ॥ నరేంద్రయాచ్ఞాకవిభిర్వి గర్హితా
రాజస్య బంధోర్నిజ ధర్మవర్తినః ।
తథాపి యాచే తవ సౌహృదేచ్ఛయా
కన్యాం త్వదీయాం న హి శుల్కదావయమ్ ॥ 40

టీ:- నరేంద్రితి. హే నరేంద్ర రాజస్యబంధోః క్షత్రియస్య శుల్కదాః ద్రవ్యాదిప్రదాః. 40

ఏ మహామహుని పాదధూళిని లక్ష్మీదేవి, బ్రహ్మ, ఈశ్వరుడు, లోకపాలురతో కలసి శిరస్సున ధరింతురో, ఎవడు దుష్టశిక్షణార్థమై స్వయముగ సేతువును నిర్మించుటకు మానవ శరీరమును ధరించెనో ఆభగవంతుడు ఇంకను నేనే విధముగ అర్చించిన సంతుష్టుడగునని పల్కెను. 38

శ్రీ శుక మహర్షి చెప్పెను.

ఓ పరీక్షిత్తా! భగవంతుడు శ్రీకృష్ణుడు ఉచితాసనమున ఉపవిష్టుడై చిరునవ్వుతో మేఘగంభీర వచనములతో నగ్నజిత్తుతో నిట్లు పలికెను. 39

శ్రీ భగవానుడు పలికెను

ఓ రాజా! స్వధర్మమును అనుసరించు రాజు బంధువును యాచించుట క్షత్రియులకు అయుక్తమని కవులు నిందించుచున్నారు. అయినను నీ యందలి స్నేహభావముతో నీ కూతురిని యాచించుచున్నాను. మేము కన్యాశుల్కమునిచ్చువారముకాము అని పల్కెను. 40

రాజోవాచ

శ్లో ॥ కో౽న్యస్తే౽భ్యధికో నాథ కన్యాపర ఇహేప్సితః ।
గుణైకధామ్నో యస్యాంగే శ్రీర్వసత్యనపాయిని ॥ 41

రాజు పలికెను

ఓ ప్రభూ ! కన్యను వరింపవచ్చినవాడా ! ఇచట నీ కంటె శ్రేష్ఠుడగు వాడెవ్వడున్నాడు. సర్వగుణములకు నిలయమైన నీ హృదయమున లక్ష్మి నిత్యనివాసముగ నున్నదికదా! 41

శ్లో ॥ కిం త్వస్మాభిః కృతః పూర్వం సమయస్సాత్వతర్షభ ।
పుంసాం వీర్యపరీక్షార్థం కన్యాపరపరీక్షయా ॥ 42

టీ:- క ఇతి. గుణానామేకమేవ ధామస్థానం. త్వం తథాభూతస్య తవాంగే. (41-42)

ఓ యదుశ్రేష్ఠా ! కన్యక కొరకు వరపరీక్షార్థము వీరపురుషుల పరీక్షించుటకై మేము మునుపే నియమమునొక దానిని విధించియున్నాము. 42

శ్లో ॥ సప్తైతే గోవృషా వీర దుర్దాంతాదురవగ్రహాః ।
ఏతైర్భగ్నా స్సుబహవో భిన్నగాత్రా నృపాత్మజాః ॥ 43

టీ:- సప్తేతి. దుర్దాంతాః అశిక్షితాః దురవగ్రహాః అపరాయత్తాః. కుతస్తత్రాహ- ఏతైరితి. భగ్నాః భంగం ప్రాపితాః. 43

ఓ వీరా! ఇవిగో ఈ యేడుకోడెలు అశిక్షితములు పరాధీనములు కానివి. వీటిచే అనేకులు రాకుమారులు భగ్నవీర్యులై గాయములతో హరులైరి. (ఓడిపోయిరి.) 43

శ్లో॥ యదిమేని గృహతా స్స్వస్త్వయైవ యదునందన ।
వరో భవానభిమతో దుహితుర్మే శ్రియః పతే ॥ 44

టీ:- యదితి. యత్ యది ఇమే గోవృషాః. 44

ఓ శ్రీపతీ ! యదుకుమారా ! నీచే ఈ ఏడు కోడెలు అణచివేయబడినచో నాకూతురికి ఇష్టుడవగు వరుడవు నీవేయగుదువు. 44

శ్లో॥ ఏవం సమయమాకర్ణ్య బద్ధ్వా పరికరం ప్రభుః ।
ఆత్మానం సప్తధాకృత్వా న్యగృహ్ణాల్లీల యైవతాన్ ॥ 45

ఏడు ఆబోతులనణచినవానికే కన్యనిత్తునని నగ్నజిత్తు సమయమును (నియమమును) విని ప్రభూత్తముడు కృష్ణుడు తనను ఏడుగురిగ విభజించి ఆబోతుల సమూహమును అవలీలగ బందించి పట్టుకొనెను. స్త్రీలనేకులైనను పరిపూర్ణుడగు తానొక్కడె సంభోగ యోగ్యుడనని సత్యకు సవతిపోరుండదని ప్రకటించుటకే తనను ఏడుగురిగ విభజించుటలోని భావము. 45

శ్లో॥ బద్ధ్వాతాన్ దామభిశ్శౌరిర్భగ్న దర్పాన్ హతౌజసః ।
వ్యకర్ష ల్లీల యాబద్ధాన్ బాలోదారుమయాన్ యథా ॥ 46

శ్రీకృష్ణుడు ఆ యాంబోతులను పలుగుత్రాళ్ళతో బంధించి పొగరు, శక్తి ఉడిగిన వాటిని చెక్కయెద్దు బొమ్మలను బాలుడు త్రాళ్ళతో కట్టిలాగినట్లుగ ఆకర్షించెను. 46

శ్లో॥ తతః ప్రీతస్సుతాం రాజాదదౌ కృష్ణాయ విస్మితః ।
తాం ప్రత్యగృహ్ణాద్భగవాన్విధి వత్సదృశీం ప్రభుః ॥ 47

పిమ్మట ఆయద్భుతమును చూచి ఆశ్చర్యము, ఆనందము పొందిన రాజు నగ్నజిత్తు కూతురగు నాగ్నజితిని కృష్ణునకు సమర్పించెను. భగవంతుడు శ్రీకృష్ణుడు ఆమెను విధిననుసరించి వివాహమాడెను. 47

శ్లో॥ రాజ పత్న్యశ్చ దుహితుః కృష్ణం లబ్ధ్వా పతిం ప్రియం ।
లేభిరే పరమానందం జాతశ్చ పరమోత్సవః ॥ 48

రాజపత్నులు కూడ తమ పుత్రికకు శ్రీకృష్ణభగవానుడు లభించినందులకెంతయో ముదమందిరి. మహోత్సవమును కూడ జరుపుకొనిరి. 48

శ్లో॥ శంఖ భేర్యానకానే దుర్గీత వాద్య ద్విజాశిషః ।
నరానార్యః ప్రముదితాస్సువాసస్స్రగలం కృతాః ॥ 49

టీ:- ఏవమితి. ఏతాన్ యో నిగృహ్ణాతి తస్య కన్యేతి సమయః కృతః . తమాకర్ణ్య ఆత్మానాం సప్తధా కృత్వేతి. బహ్వీనామపి యోషితాం. సంపూర్ణ వివాహం సంభోగయోగ్యఃస్యామితి సత్యాం ప్రత్యసాపత్న ప్రదర్శనార్థమాత్మనః సప్తధాకరణమ్. (45-49)

శంఖములు, భేరిభాంకారములను మ్రోగించిరి. పట్టుపుట్టముల ధరించి స్త్రీ పురుషులు ఆనందముతో పుష్పమాలలనలంకరించుకొని పాటలు పాడిరి. మృదంగములను వాయించిరి. ద్విజులు ఆశీర్వచనములు చేసిరి. 49

శ్లో॥ శతం ధేను సహస్రాణాం పారిబర్హ మదాద్విభుః ।
యువతీనాం త్రిసహస్రం నిష్కగ్రీవ సువాససామ్ ॥ 50

టీ:- శతమితి. నిష్కగ్రీవాశ్చ తాస్సువాససశ్చ తాసాం యువతీనాం దాసీనాం పారిబర్హం అదాత్ దత్తవాన్. 50

రాజు నగ్నజిత్తు కోటి ఆవులను మూడువేల దాసీ జనమును, సువర్ణ కంఠహారములను, పట్టు వస్త్రములను వైవాహిక కానుకలుగ సమర్పించెను. 50

శ్లో॥ నవనాగ సహస్రాణి నాగాచ్ఛతగుణా న్రతాన్ ।
రథాచ్ఛత గుణానశ్వాచ్ఛత గుణాన్నరాన్ ॥ 51

అట్లే తొమ్మిదివేల గజములను అంతకు నూరురెట్లు రథములను, రథములకు నూరరెట్లధికముగా అశ్వములను, అశ్వములకు నూరురెట్లు సైనికులను, పారిబర్హము (వివాహ సందర్భముననిచ్చు కానుక)గ నిచ్చెను. (ఏనుగులు 9000, రథములు 900000, అశ్వములు 90000000, సైనికులు 9000000000. (నవపద్మము)) 51

శ్లో॥ దంపతీ రథమారోప్య మహత్యానే నయావృతౌ ।
స్నేహ ప్రక్లిన్న హృదయో యాపయామాస కోసలః ॥52

ఆ నగ్నజిన్మాహారాజు నూతన వధూవరులు సత్యాకృష్ణులను రథముపైనెక్కించి గొప్ప సైన్యముచుట్టుముట్టిరాగ స్నేహముతో ఆర్ద్రమైన హృదయముతో కోసలయందంతట ఊరేగింపచేసెను. 52

టీ:- నవేతి. నాగాత్ నాగేభ్యః శతగుణాన్ నవలక్షాణి రథాన్ రథాత్ రథేభ్యశ్శతగుణాన్ నవకోటీః అశ్వాన్. అశ్వాత్ అశ్వేభ్యః శతగుణాన్ నవపద్మాని పదాతీన్ .(51-52)

శ్లో॥ శ్రుత్వైత ద్రురుధుర్భూపానయం తం పథి కన్యకాం ।
భగ్న వీర్యాస్సు దుర్మర్షాః యదుభర్గోవృషైః పురా ॥ 53

ఈ విషయమును విన్న రాజులు పూర్వము యాదవులతో, గోవృషభములతో భంగపాటు చెందిన వారైనను దురహంకారులై నాగ్నజితిని కృష్ణుడు కొనిపోవుచుండగ మార్గమునడ్డగించిరి. 53

టీ:- శ్రుత్వేతి. యదుభిర్గోవృషైశ్చ భగ్నవీర్యా అపి సుదుర్మర్షారురుధుః 53

శ్లో॥ తానస్యత శ్శరవ్రాతాన్ బంధు ప్రియకృదర్జునః ।
గాండీవీ కాలయామాస సింహః క్షుద్రమృగానివ ॥54

బాణ వర్షమును గుప్పించుచున్న ఆ రాజులను బంధువులకు ఆనందమును కలుగజేయదలచి అర్జునుడు గాండీవముతో సింహము నీచమృగములను వలె నిర్మూలించెను. 54

శ్లో॥ పారిబర్హము పా గృహ్య ద్వారకామేత్య సత్యయా ।
రేమేయదూనాం వృషభో భగవాన్ దేవకీసుతః ॥ 55

టీ:- తానితి. అసత్యః క్షిపతః ప్రయుంజానానితియావత్. 54,55

యదు శ్రేష్ఠుడు, భగవంతుడు, దేవకీతనయుడు పారిబర్హమును గ్రహించి నాగ్నజితితో కూడ ద్వారకానగరమును చేరి ఆనందము ననుభవించెను. 55

శ్లో॥ శ్రుతకీర్తే స్సుతాం భద్రాముపయేమే పితృష్వసుః ।
కైకేయాం భ్రాతభిర్దత్తాం కృష్ణ స్సందర్శనాదిభిః ॥ 56

టీ:- సప్తమం వివాహమాహ-శ్రుతకీర్తేరితి. శ్రుతకీర్తిర్నామ యా పితృష్వసా. తస్యాః సుతాం భద్రాం నామ కైకేయాం తద్దేశజాం సందర్శనాదిభిర్భ్రాతృభిర్దత్తాం. 56

సప్తమ వివాహమును గూర్చి పలుకుచున్నాడు. శ్రుతకీర్తియను మేనత్తకూతురు కైకయదేశపు కన్యయగు భద్రను ఆమె అన్నలు సందర్శనాదులు ఈయగ పరిణయము చేసికొనెను. 56

శ్లో॥ సుతాంచ మద్రాధిపతేర్లక్ష్మణాం లక్షణైర్యుతాం ।
స్వయంవరే జహారైక స్సుపర్ణ స్సుధామివ ॥ 57

టీ:- అష్టమం వివాహమాహ- సుతాంచేతి. ఏక ఏవస శ్రీకృష్ణో లక్షణాం జహార. 57

అష్టమ వివాహము మద్రదేశాధీశుని సుత శుభలక్షణయుత యునగు లక్ష్మణను తానొక్కడే పోయి గరుడడు అమృతమును వలె స్వయంవరమునుండి గ్రహించి వివాహమాడెను. 57

శ్లో॥ అన్యాశ్చైవం విధాభార్యాః కృష్ణస్యాసన్ సహస్రశః ।
భౌమం హత్వా తన్నిరోధాదాహృతాశ్చారు దర్శనాః ॥58

టీ:- అన్యా ఇతి. తస్య నిరోధోఽంతఃపురం తస్మాత్. 58

భౌముని (నరకాసురుని) చంపి కృష్ణుడు వాని చెర నుండిన అంతఃపుర సుందరీమణులను వివాహము చేసుకొనెను. ఈ విధముగ కృష్ణునకు వేలకొలదిగ భార్యలుండిరి. 58

**ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,**
**అష్టపంచాశత్తమోఽధ్యాయః**

**శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు**
**యాభైఎనిమిదవ అధ్యాయము సమాప్తము**

## ఏకోనషష్టితమోఽధ్యాయః

శ్లో ॥ ఊనషష్టితమే భౌమం హత్వాతేనాహృతా హరిః ।
కన్యాస్సహస్రశః ప్రాప్య పారిజాతం దివోఽహరత్ ॥
పరిణీయ తతస్తాభిస్తన్మనోరథపూరణైః ।
ఆత్మారామోఽప్యసౌ రేమే తద్గృహేషు గృహస్థవత్ ॥

## 59వ అధ్యాయము

ఈ యాభైతొమ్మిదవ అధ్యాయమున, హరి నరకాసురుని చంపి వానిచే నపహరింపబడిన వేలకొలది కన్యామణులను పొంది, స్వర్గమునుండి పారిజాత వృక్షమునపహరించెను. ఆ కన్యలందరిని పరిణయమాడి ఆత్మారాముడు శ్రీపతి వారివారి మనోరథములను దీర్చుచు వారివారి గృహములందు గృహస్థ ధర్మములను నిర్వర్తించుచు ఆనందించెను.

### రాజోవాచ

శ్లో ॥ యథాహతో భగవతాభౌమోయేన చ తాస్స్త్రియః ।
నిరుద్ధా ఏతదాచక్ష్వ విక్రమం శార్ఙ్గధన్వనః ॥ 1

టీ:- యథేతి. యేన తాః స్త్రియో నిరుద్ధాః సభౌమః చకారాత్ యేన కారణేన హతః తదాచక్ష్వేతి. 1

### రాజు పలికెను

ఓ మహర్షీ ! భగవంతుడు శ్రీకృష్ణునిచే నరకుడు చంపబడిన కథను, ఏకారణమున నరకునిచే ఆరాజ కన్యలు బంధింపబడిరో, అట్లే శ్రీపతి పరాక్రమాదులను గూర్చి విస్తరముగ చెప్పవలసినదని ప్రార్థించెను. 1

### శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఇంద్రేణ హృతచ్ఛత్రేణ హృతకుండల బంధునా ।
హృతామరాఏది స్థానేన జ్ఞాపితోభౌమచేష్టితమ్ ॥ 2

టీ:- ఇంద్రేణేతి. ఇంద్రేణ భౌమవిచేష్టితం విజ్ఞాపితస్సన్ ప్రాగ్జ్యోతిష

### శ్రీ శుకులు పలికిరి

లోకపాలురలో ప్రధానుడుగావున ఇంద్రునకు వరుణఛత్రము గలదు. దానిని ప్రాగ్జ్యోతిషపుర పాలకుడు నరకుడు అపహరించెను. అట్లే దేవమాతయగు అదితి కుండలములను, అమరాద్రి యందలి మణిపర్వతమును భౌముడపహరించెను అని సత్యభామ గృహమున

పురం భౌమనగరం. యయావిత్యన్వయః. కథమభూతేన హృతంఛత్రం యస్యతేన. లోకపాల ప్రధానత్వాదింద్రస్య వరుణఛత్రహరణేऽపి తస్యైవ మానభంగఇతి తథోక్తం. హృతే కుండలే యస్యాస్సాऽదితిః బంధుర్మాతా యస్యతేన హృతమమరాద్రౌ స్థానం మణిపర్వతలక్షణం యస్యతేన. సత్యభామాయాః గృహే భగవంతమింద్ర ఆగత్య విజ్ఞాపితవాన్. 2

నున్న కృష్ణుని చెంతకు ఇంద్రుడు వచ్చి విన్నవించెను. అనగా ఇంద్రుని గౌరవమునకు చిహ్నమైన ఛత్రమును, ఐశ్వర్య చిహ్నమైన అదితీదేవిని, మణికుండలములను ప్రాగ్జ్యోతిషపురాధిపతి హరించిన విధమును హరికి, హరి సత్యభామ ఇంట్లో తెలిపెను. 2

శ్లో॥ సభార్యో గరుడారూఢః ప్రాగ్జ్యోతిష పురం యయౌ ।
గిరి దుర్గైశ్శస్త్ర దుర్గైర్జ లాగ్న్యనిల దుర్గమమ్ ॥ 3

టీ:- స భార్యా ఇతి. తదా తస్యాః కౌతుకాయ తయా భార్యయా సహ యయావితి. యద్వా. తదన్వనుజ్ఞయైవ త్వత్పుత్రం హనిష్యామితి ఇతిహాసోక్తం. భూమ్యైవరం దత్తంసత్యం కర్తుం. సత్యభామాయా భూమ్యంశత్వాత్తయా సహ యయౌ. యద్వా నారదానీతపారిజాతైక కుసుమే రుక్మిణ్యైదత్తే సతి. కుపితాం సత్యభామాం సాంత్వయతా. తుభ్యం పారిజాతమేవ దాస్యామీతి శ్రీకృష్ణేనప్రతిశ్రుతిమితి హరివంశే ప్రసిద్ధం. తదర్థం తాం నీతవానితిజ్ఞేయం. గరుడేన యానేన కారణం. గిరిదుర్గైరిత్యాది తైరుపలక్షితం జలాగ్ననిలైశ్చ సర్వతో వర్తమానైర్దుర్గమం. (3,4,5)

ఇంద్రుని వాక్యములను విని శ్రీకృష్ణుడు సత్యభామకు ఆనందము కలిగించుటకు ఆమెతోకూడ గరుత్మంతునెక్కి, పర్వత, శస్త్ర, జల, అగ్ని, వాయు దుర్గములను కలిగిన ప్రాజ్యోతిష నగరముపై దండెత్తి పోయెను. సత్యభామ భూదేవి అంశతో జన్మించినది. భూదేవి కుమారుడు నరకుడు. ఆమె అనుమతితో వానిని హతమార్చుదునని ఆమెను వెంటగొని పోయెనని తలచవలయును. (ఇంకనూ హరివంశము నందున్న కథ ప్రకారము నారదుడు పారిజాత పుష్పాన్ని తెచ్చి రుక్మిణీ గృహములో కృష్ణునికి ఈయగా, కృష్ణుడు రుక్మిణికి ఇచ్చెను. అప్పుడు కోపగించిన సత్యభామను ఊరడించి పారజాత వృక్షాన్నే ఇస్తానని కృష్ణుడు చెప్పెను. ఆ చెట్టు ఇవ్వడానికే సత్యభామను వెంట తీసుకొని వెళ్ళాడని అనుకోవచ్చు) 3

శ్లో॥ మురపాశాయుతై ర్ఘోరై ర్దిశై స్సర్వత ఆవృతం ।
గదయానిర్భి భేరాద్రీన్ శస్త్ర దుర్గాణి సాయకై ॥ 4

ఇంకను మహాభయంకరములు, దృఢములునైన మురపాశములతో చుట్టు కంచెవేయబడినది ఆ ప్రాగ్జ్యోతిష పట్టణము. అచటికి చేరిన కృష్ణుడు పర్వతములను గదతో, బాణపరంపరను ప్రయోగించి శస్త్ర దుర్గములను నిర్మూలనము చేసెను. 4

శ్లో॥ చక్రేణాగ్నిం జలం వాయుం మురపాశాంస్తథాసినా ।
శంఖనాదేన యంత్రాణి హృదయాని మనస్వినామ్ ॥ 5

ఇంకను అగ్ని, వాయు, జల, దుర్గములను చక్రముతోడను, కరవాలముతో మురపాశములను దునిమెను. శంఖనాదముతో యంత్రములను భేదించి, సజ్జనహృదయములను స్పందింపజేసెను. 5

శ్లో॥ ప్రాకారగ దయా గుర్వ్యానిర్బిభేద గదాధరః ।
పాంచజన్య ధ్వనిం శ్రుత్వాయుగాంతాశని భీషణం ।
మురశ్శయాన ఉత్తస్థాదైత్యః పంచశిరాజలాత్ ॥ 6

గదాధరుడు తనపటుతరమగు కౌమోదకియను గదతో ప్రాగ్జ్యోతిషనగర ప్రాకారమును పగులగొట్టెను. ప్రళయకాలమునందలి పిడుగుపాటు ధ్వనివలె భయంకరమైన పాంచజన్యధ్వనిని విని అగడ్తజలమున నిద్రించుచున్న ఐదు తలల మురాసురుడు జలమునుండి లేచి వచ్చెను. 6

శ్లో॥ త్రిశూల ముద్యమ్య సుదుర్నిరీక్షణం
యుగాంత సూర్యానల రోచిరుల్బణం ।
గ్రసంస్త్రి లోకమివ పంచభిర్ముఖై
రభ్యద్రవత్తా రక్ష్యసుతం యథోరగః ॥ 7

టీ:- 6,7 ప్రాకారమితి. యుగాంతాశనేర్ధ్వనివద్భీషణం పరిఖాయా జలాత్.

పంచవదనములతో ముల్లోకములను మ్రింగువానివలె ఆ మురాసురుడు చూచుటకలవిగాని యుగాంతమునందలి సూర్యాగ్నుల కాంతివలె నిప్పులు గ్రక్కుచున్న త్రిశూలము నెత్తుకొని, సర్పమెట్లు గరుడుని సమీపమునకు పరుగులు తీయునో అట్లు కృష్ణుని మీదకురికెను. 7

శ్లో॥ ఆవిధ్యశూలం తరసాగరుత్మతే
నిరస్యవక్త్రైర్వ్యన దత్సపంచభిః ।
ఖం రోదసే సర్వదిశోంతరం మహా
నాపుర యన్నండ కటాహ మావృణోత్ ॥ 8

టీ:-ఆవిధ్యేతి. ఆవిధ్య ఆతోల్య వ్యనదత్ సః మహాన్నాదఇత్యన్వయః8

ఆ మురాసురుడు త్రిశూలమును వేగవంతముగ త్రిప్పుచు గరుత్మంతునిమీద ప్రయోగించెను. అట్లే ఐదుముఖములతో, ఆకాశము, భూమ్యాకాశ మధ్యభాగము దశదిశలును మార్మోగునట్లు అరచుచు బ్రహ్మాండమునావరించెను. 8

శ్లో॥ తదాపతద్వైత్రి శిఖం గరుత్మతే
హరిశ్శరౌఘై రభినత్త్రిధౌజసా ।
ముఖేషు తం చాపి శరైర తాడయ
తస్మై గదాం సో౾పిరుషా వ్యముంచత ॥ 9

టీ:- తదేతి. తస్మై కృష్ణాయ గదాం వ్యముంచత్. 9

అపుడు గరుడనిపైకివచ్చుచున్న త్రిశూలమును శ్రీహరి శరము సాయముతో మూడుముక్కలుగ చేసెను. పంచముఖములను బాణములతో బాధించెను. ఆమీద మరాసురుడు రోషముతో కృష్ణునిపై గదను విసరెను. 9

శ్లో॥ తామపతంతీం గద యాగదాం మృదే
గదాగ్రజో నిర్బిభిదే సహస్రధా ।
ఉద్యమ్యబాహూనభిధా వతో౾జిత
శ్శిరాంసి చక్రేణజహార లీలయా ।
వ్యసుః పపాతాంభసి కృత్త శీర్షకో
నికృత్త శృంగో౾ద్రి రివేంద్ర తేజసా ॥ 10

టీ:- తామితి. ఇంద్రతేజసా వజ్రేణ. 10

ఆ యుద్ధమున గదాగ్రజుడు తనమీదకు వచ్చుచున్న గదను కౌమోదకియను తనగదతో మోది వేయివ్రక్కలొనరించెను. పరాక్రమించి భుజములనెత్తుకొని ఎదురువచ్చుచున్న మురాసురుని ఐదు శిరములను చక్రములతో సులభముగనుత్తరించెను. తలలు త్రెగి ప్రాణములు కోల్పోయిన మురాసురుడు ఇంద్రుని వజ్రాయుధముతో తెగిపడిన కొమ్ములుగల కొండవలె అగడ్తజలమున పడెను. 10

శ్లో॥ తస్యాత్మజా స్సప్త పితు ర్వధాతురాః
ప్రతిక్రియా మర్ష జుషస్స ముద్యతాః ।
తామ్రోంతరిక్ష శ్రృవణో విభావసు
ర్వసుర్నభస్వా నరుణశ్చ సప్తమః ॥ 11

టీ:- తస్యేతి. ప్రతి క్రియయా అమర్షజుషః. 11

ఆ మురాసురునకు, తామ్రుడు, అంతరిక్షుడు, శ్రవణుడు, విభావసువు, వసువు, నభస్వంతుడు, అరుణుడని ఏడ్గురు కుమారులు కలరు. వారు తండ్రి వధకు వగచి, ప్రతిక్రియను చేయ సమకట్టి ఆతురులు ఆగ్రహావేశముకలవారైరి.

శ్లో॥ పీఠంపురస్కృత్య చమూ పతిం మృథే
భౌమ ప్రయుక్తా నిరుగుర్ధృతాయుధాః ।
ప్రాయుంజతా సాద్య శరానసేన్ గదా
శ్శక్త్యృష్టి శూలాన్యజితే రుషోల్బణాః ॥ 12

టీ:- పీఠమితి. పీఠం పీఠనామానం సేనాపతిం. నిరుగుః నిరగమన్. 12

నరకాసురునిచే ప్రేరేపితులై పీఠుడను సేనాపతిని ముందిడుకొని ఆయుధధారులై యుద్ధభూమిని ప్రవేశించి బాణవర్షమును కృష్ణునిపై కురిపించిరి. కోపోద్రిక్తులై, గదలను, శక్తులను, యష్టులను, బల్లెములను ప్రయోగించిరి. (11,12)

శ్లో॥ తచ్ఛస్త్ర కూటం భగవాన్ స్వమార్గణై
రమోఘ వీర్యస్తిలశశ్చ కర్తహ ।
తాన్వీర ముఖ్యా ననయద్య మక్షయం
నికృత్త శీర్షోరు భుజాంఘ్రి వర్మ్మణః ॥ 13

అమోఘ శక్తివంతుడగు భగవంతుడు శ్రీకృష్ణుడు ఆ శస్త్రములన్నింటిని తన శరపరంపరతో నుజ్జునుజ్జుగ త్రుంచివేసెను. శిరస్సులను, భుజములను, తొడలను, పిక్కలను, శరీరములను నరికి ఆవీరులనందరిని యమపురికి పంపెను. 13

శ్లో॥ స్వానీకపాన చ్యుతచక్ర సాయకై
ర్మథేహ తాంస్తాన్నరకో ధరాసుతః ।
నిరీక్ష్య దుర్మర్షణాస్రవన్మదై
ర్గజైః పయోధి ప్రభవై ర్నిరాక్రమత్ ॥ 14

భూపుత్రుడగు నరకుడు యుద్ధభూమియందు శ్రీకృష్ణ నిర్మూలితులైన తన సైన్యమును, సేనాపతులను కని సముద్రమువలె పొంగివచ్చు మదగజసైన్యముతో దురాగ్రహవిష్టుడై ఆక్రమించెను. 14

టీ:- తదితి. నికృత్తాని శీర్షాదీని యేషాం తాన్. 13, 14

శ్లో॥ దృష్ట్వా సభార్యం గరుడోపరిస్థితం
సూర్యో పరిష్టాత్సతటి ద్ఘనం యథా ।
కృష్ణం సతస్మై వ్యసృజ చ్ఛతఘ్నీం
యోధాశ్చ సర్వే యుగపత్త్ర వివ్యధుః ॥ 15

సూర్యోపరిభాగమున మెరుపు తీగతోడి మేఘమును వలె, భార్య సత్యభామతో కూడి గరుత్మంతునిపై నున్న శ్రీకృష్ణుని చూచి నరకుడు అతనిపై శతఘ్నులను ప్రయోగించెను. యోధులందరు ఒక్కుమ్మడిగ పైబడిరి. 15

టీ:- దృష్ట్వేతి. శతఘ్నీం శక్తి నిరగమన్. 15

శ్లో॥ తద్భౌమ సైన్యం భగవాన్ గదాగ్రజో
విచిత్ర వాజై ర్నిశితై శ్శిలీముఖైః ।
నికృత్త బాహూరు శిరోధి విగ్రహం
చకార తర్హ్యేవ హతాశ్వ కుంజరం ॥ 16

భగవంతుడు గదాగ్రజుడు విచిత్రమగు రెక్కలుగల వాడియైన బాణములతో ఆ నరకుని సైన్యమును, భుజములు, తొడలు, మెడలు, దేహములును తెగిపడునట్లు చేసెను. అదే సమయమున అశ్వగజములను కూడ హతమార్చెను. 16

టీ:- తదితి. విచిత్రాః వాజాః పత్రాణి యేషాం తైర్బాణైః నికృత్తాః బాహవః ఊరవః శిరోధయః కంధరాః విగ్రహా దేహాశ్చ యస్య తత్. తర్హ్యేవ యదా వివ్యధుః. తస్మి న్నేవ క్షణే. 16

శ్లో॥ యానియోధైః ప్రయుక్తాని శస్త్రాస్త్రాణి కురూద్వహ
హరిస్తాన్యచ్ఛినత్తీక్ష్ణై శ్శరైరేకైకశస్త్రిభిః ।
ఉహ్యమానస్సుపర్ణేన పక్షాభ్యాం నిఘ్నతా గజాన్ ॥ 17

టీ:- యానీతి. అత్యాశ్చరేణ్య కురుద్వహేతి సంబోధనం. తథాహి. తైర్యాని ప్రయుక్తాని శస్త్రాస్త్రాణి. తత్ర్పాప్తేః పూర్వమేవతత్సైన్యంసర్వం హత్వా. పశ్చాత్తాని శస్త్రాస్త్రాణి చ చిచ్ఛేద. తత్రాప్యేకైకం శస్త్రమస్త్రంచ త్రిభిస్త్రిభిశ్శరైరిత్యాశ్చర్యం. 17

కురువంశతిలకా! అత్యాశ్చర్యముగా, ప్రతియోధులచే ప్రయోజితములైన శస్త్రాస్త్రములను హరి ఒక్కొక్కదానిని మూడుమూడు తీక్ష్ణములగు బాణములతో త్రుంచివేసెను. హరి అధివసించిన గరుత్మంతుడు తన రెక్కలతో గజములను చావబాదెను. 17

శ్లో॥ గరుత్మతా హన్యమానా స్తుండపక్షన ఖైర్గజాః ।
పురమే వావిశన్నార్తా నరకో యుధ్యయుధ్యత ॥ 18

టీ:- కించ గరుత్మతేతి. ఆయుధ్యత న న్యవర్తత. 18

గరుత్మంతుని ముక్కు, రెక్కలు, గోళ్ళచే బాధితములైన గజములు ఆర్తనాదములు చేయుచు పురములోనికి పరుగులు తీసెను. నరకుడొక్కడే యుద్ధమున నిలిచి పోరు సల్పెను. 18

శ్లో॥ దృష్ట్వా విద్రావితం సైన్యం గరుడేనార్దితం స్వకం ।
తం భౌమః ప్రాహరచ్ఛక్త్యా వజ్రః ప్రతిహతో యతః ॥ 19

టీ:- దృష్ట్వేతి. యతః యయా శక్త్యావజ్రః ప్రతిహత ఆసీత్. 19

గరుత్మంతునిచే కొట్టబడి పరుగెత్తుచున్న తన సైన్యమునుచూచి భౌముడు ఇంద్రుని వజ్రాయుధమును సైతం త్రిప్పికొట్టిన ఆయుధముతో గరుడుని కొట్టెను. 19

శ్లో॥ నాకంపత తయావిద్ధో మాలాహత ఇవద్విపః ।
శూలం భౌమోఽచ్యుతం హంతుం మాద దేవితథోద్యమః ॥20

శక్తియను శస్త్రముతో కొట్టబడినను గరుడడు పూలమాలతో కొట్టబడిన గజమువలె ఇంచుకయు చలించలేదు. గరుడునిపై ప్రయోగించిన శక్తి వ్యర్థమగుటచే భూసుతుడు శూలముతో హరిని చంపుటకు విఫలప్రయత్నము చేసెను. 20

శ్లో॥ తద్వి సర్వాపూర్వమేవ నరకస్య శిరోహరిః ।
అపాహరద్గజస్తస్య చక్రేణ క్షురనేమినా ॥ 21

నరకుడు బల్లెమును విసరుటకు పూర్వమే గజముపైనున్న నరకుని శిరస్సును పదునైన పలువరుసలుగల చక్రముతో శ్రీహరి ఖండించెను. 21

శ్లో॥ సకుండలం చారుకిరీట భూషితం
బభౌ పృధివ్యాం పతితం సముజ్జ్వలత్ ।
హాహేతి సాధ్వి త్ర్యషయస్సురేశ్వరా
మాల్యైర్ముకుందం వికిరంత ఈడిరే ॥ 22

టీ:- నేతి. ఆసౌ గరుడస్తు నాకంపత. గరుడే వితథోద్యమస్సన్. (20-22)

కుండలములతో, అందమైన కిరీటముతో అలంకరించబడిన నరకుని శిరస్సు భూమిపై పడగనే హాహాకారములు చెలరేగెను. ఋషులు సాధూసాధూ అనిరి. దేవతలు ముకుందుని పుష్పమాలలతో నలంకరించుచు నాట్యము చేసిరి. 22

శ్లో॥ తతశ్చభూః కృష్ణ ముపేత్య కుండలే
ప్రతప్త జాంబూ నదరత్న భాస్వరే ।
సావైజయంత్యా వనమాల యార్పయ
త్ప్రాచేతసం ఛత్ర మథో మహామణిమ్ ॥ 23

శ్లో॥ అస్తౌషీ దథ విశ్వేశం దేవీ దేవ వరార్చితం ।
ప్రాంజలిః ప్రణతా రాజన్ భక్తిప్రణవ యాధియా ॥ 24

టీ:- తత ఇతి. ప్రతేప్తే జాంబూనదేయాని రత్నాని తైర్భాస్వరే. మేర్వంశభూతం మందరశిఖరం మహామణిం చార్పయదితి.(23,24)

భూదేవి ఉవాచ

శ్లో॥ నమస్తే దేవదేవేశ శంఖచక్ర గదాధర ।
భక్తేచ్ఛో పాత్తరూపాయ పరమాత్మనమో2స్తుతే ॥ 25

టీ:- ఐశ్వర్యం జ్ఞాత్వా భూమిః స్తౌతి - నమఇతి. పరమాత్మన్ దేవాద్యంతర్యామిన్ భక్తానుగ్రహార్థం ఇచ్ఛయాస్వీకృతనానారూపాయ. 25

పిమ్మట భూదేవి కృష్ణుని సమీపించి, వైజయంతి అను వనమాలను, బంగారమున పొదిగిన రత్నములతో ప్రకాశించు కర్ణకుండలమును, ప్రాచేతసమను ఛత్రమును మేరువు అంశ కలిగిన మందరపర్వత మహామణిని బహుకరించెను. 23

**పరాత్పరునుగ తలచి భూదేవి స్తోత్రము చేసెను**

బ్రహ్మాదిదేవతలచే నర్పింపబడిన విశ్వేశ్వరుని, ఓ రాజా! ముకుళిత హస్తయై నమస్కరించుచు భక్తి తత్పరమగు మతితో భూమాత స్తుతించెను. 24

**భూదేవి పలికెను.**

దేవదేవేశ ! శంఖచక్రగదాధర నీకు నమస్సులు. భక్తులకోరిక ప్రకారము నానా (నామ) రూపములను ధరించినవాడా ! ఓ పరమాత్మా నీకు నమస్కారము. 25

శ్లో॥ నమః పంకజనాభాయ నమః పంకజ మాలినే ।
నమః పంకజ నేత్రాయ నమస్తే పంకజాంఘ్రయే ॥ 26

టీ:- యేన మంత్రేణ కుంత్యాః ప్రసన్నః పూర్వమాసీత్. తేన మంత్రేణ నమస్యతి-నమ ఇతి. పంకజం నాభౌ యస్య తస్మై జగత్కారణాయేత్యర్థః అతఏవ. సత్కీర్తిమయీపంకజానాం మాలా విద్యతే యస్య తస్మై. ఏవం భూతం ధ్యాయతాం. పంకజవత్సుప్రసన్నేతాపోపశమనే నేత్రే యస్య తస్మై పంకజవత్సు సేవ్యౌ పంకజాంకితౌ వా అంఘ్రీయస్య తస్మై. నమ ఇతి. 26

పూర్వము ఏమంత్రముచే కుంతిదేవికి శ్రీహరి ప్రసన్నుడయ్యెనో ఆ మంత్రము చేతనే భూదేవి నమస్కరించుచున్నది. జగత్తును సృష్టించుటకు కారణమైన పద్మము నాభి యందు కలవాడా! పద్మమాలాధారి నీకు నమస్కారము. పద్మమువలే తాపహరణములగు నేత్రములు కలవాడా నీకు నమస్కారము. పంకజము వంటి సేవింపతగిన పాదయుగళము కలవాడా! నీకు నమస్కారము. 26

శ్లో॥ నమో భగవతే తుభ్యం వాసుదేవాయ విష్ణవే ।
పురుషాయాది బీజాయపూర్ణబోధాయతే నమః ॥ 27

టీ:- కించ నమ ఇతి. భగవతే నిరితిశయైశ్వర్యాయ కుతః. వాసుదేవాయ సర్వభూతాశ్రయాయ. అత ఏవ విష్ణవే వ్యాపినే. న హి సర్వ భూతాశ్రయత్వం పరిచ్ఛిన్నస్య సోభవతీతి తత్రాత. పురుషాయ. సర్వస్మాత్కార్యాపూర్వమేవసతే.శ్రు.“పూర్వమేవసమి”తి. “తత్పురుషస్య పురుషత్వ“మితి శ్రుతేః ఏతదపి కుతః ఆదిబీజాయ ఆదేర్జగత్కారణస్యాపి కారణాయ ఏవమపి న మృదాదివజ్జాడ్యమిత్యాహ-పూర్ణబోధాయేతి. 27

నిరతిశయ ఐశ్వర్యము కల్గినట్టి, సర్వభూతములకు ఆశ్రయమైనట్టి, సర్వవ్యాపకుడగు నీకు నమస్కారము. “పూర్వమేవసమి”తి శ్రుతి. సకలకార్యములకు పూర్వమేయున్నట్టి, జగత్ కారణమునకు కారణమైనట్టి, పూర్ణపురుషా! నీకు నమస్కారము. 27

శ్లో॥ అజాయజన మిత్రేఽస్య బ్రహ్మణేఽనంత శక్తయే ।
పరాపరాత్మన్ భూతాత్మన్ పరమాత్మన్నమోఽస్తుతే ॥ 28

టీ:- నన్వేవమపి స్వకారణాపూర్వం సత్వం న స్యాదతఆహ - అజాయేతి. స్వయమజాయ అస్య చ జనయిత్రే ఉభయత్రాపి క్రమేన హేతుద్వయం. బ్రహ్మణే బృహతే అనంతశక్తయ ఇతి చ బృహత్వా దజత్వం. అనంతశక్తిత్వాజ్జనయితృత్వామిత్యర్థః. నను పిత్రాదయః పుత్రాదీనాం జనకాః. తేషాంచ తత్పూర్వే తేషాంచ తథా భూతాని తేషాంచ స్వకర్మద్వారేణ జీవః. కిమత్రహం తత్రాహ- పరాపరాత్మన్ని త్యాది. పిత్రాద్యాత్మకత్వాత్త్వమేవ జనక ఇత్యర్థః. (28)

పుట్టుకలేనివాడు, అనగా తానే జగత్కారణుడు. తనకు పూర్వము ప్రాణిలేదు. కావున స్వయంభువు. బ్రహ్మనుసృష్టించిన మూలభూతుడు. అనంతశక్తి స్వరూపుడు. ప్రాణిలోకమునంతటికి జనకుడని భావము. సర్వభూతాత్మకుడవగు నీకు నమస్కారము. 28

శ్లో॥ త్వంవై సిసృక్షూరజ ఉత్కటం ప్రభో
తమోనిరోధాయ చిభర్ష్య సోవృతః ।
స్థానాయ సత్త్వం జగతో జగత్పతే
కాలః ప్రధానం పురుషో భవాన్ పరః ॥ 29

టీ:- నను గుణా విశ్వోత్పత్త్యాది హేతవః తే చ ప్రధానస్యైవ తస్య చ పురుషః క్షోభకః తత్ర చ కాలో నిమిత్తమితి ప్రసిద్ధం. కిమత్రాహం తత్రాహ-త్వమితి. తమసో ధారుణేఽప్యసంవృత ఏవ. స్థానాయ పాలనాయ జగతః సృష్ట్యాద్యర్థం. ఉత్కటంరజ ఆది త్వమేవ బిభర్షి

విశ్వముయొక్క ఉత్పత్తి, స్థితి, లయములు ప్రధానపురుషునకు సంబంధించినవి. లయమునకు కాలము నిమిత్త కారణమని ప్రసిద్ధము. ఇందు నీ ప్రమేయమేమనినచో అధికమైన రజస్సును భరించువాడవు, సృజించువాడవు నీవే. తమస్సును నిరోధించువాడవు నీవే. ఓ జగత్పతీ! జగత్తు స్థితికి నీవేకారణము. నీకంటే ఇతరమైన కాలప్రధానపురుషుడు లేడు. నీవే పరుడవు. అందువల్ల నీవే సకలజగత్తునకు ప్రధానమైన సృష్టికర్తవు. 29

సృజసీత్యర్థః. కాలప్రధాన పురుషాః త్వద్వ్యతిరిక్తా. న సంతి. త్వం తు పరః సర్వవ్యతిరిక్తః అతస్త్వమేవ జనయితేత్యర్థః. 29

శ్లో॥ అహం పయోజ్యోతిరథాని లోనభో
మాత్రాణిదేవా మన ఇంద్రియాణి చ ।
కర్తా మహో నిత్యఖిలం చరాచరం
త్వయ్య ద్వితీయే భగవన్నయంభ్రమః ॥ 30

టీ:- కార్య కారణ ప్రపంచస్య తదవ్యతిరేకం తస్య చ సర్వవ్యతిరేక మపపాదయతి-అహమితి. అహం భూమిః మాత్రాణి దేవా మన ఇంద్రియాణీతి చ త్రివిధాహంకారకార్యాణి కర్తాహంకారః. 30

ఓ భగవంతుడా ! సమస్త చరాచర ప్రపంచము అద్వితీయుడవగు నీయధీనమునందుండగ, ఈ భూమికి, నీటికి, తేజస్సునకు, వాయువునకు, ఆకాశమునకు, పంచతన్మాత్రలకు, దేవతలకు, మనస్సు, ఇంద్రియములకు సైతం నేనే మహాకర్తననుట అహంకార కారణము. (భ్రమయని అర్థము) 30

శ్లో॥ తస్యాత్మజోఽయంతవ పాద పంకజం
భీతః ప్రపన్నార్తిహరోప సాదితః ।
తత్పాలయైనం కురుహస్త పంకజం
శిరస్యముష్యాఖిల కల్మషా పహమ్ ॥ 31

టీ:- ఏవం స్తుత్వా ప్రార్థయతే తస్యేతి. హే ప్రపన్నార్తిహర. తస్య నరకస్య ఆత్మజః అయం భగదత్తో నామభీతః అత ఏవ. మయా తవ పాదపంకజ ముపసాదితః అభయప్రదానార్థం. 31

ఆశ్రయించినవారి కష్టములను పారద్రోలు మహానుభావా! ఆ నరకుని కుమారుడు ఈ భగదత్తుడు నీ పాదరేణువు. భయపడుచుండగ నీపాదమూలమును చేర్చితిని. సమస్త పాపమును నాశనము చేయగల మీ హస్తకమలమును శిరస్సుననుంచి వీనిని రక్షించుము. 31

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఇతి భూమ్యార్చితో వాగ్భిర్భగవాన్ భక్తి నమ్రయా ।
దత్వాభయం భౌమగృహం ప్రావిశత్సకలర్ధిమత్ ॥ 32

టీ:- ఇతీతి. అభయం దత్వా. 32

**శ్రీశుకులు పలికిరి.**

ఈ విధముగ భక్తిచే వినమ్రురాలగు భూదేవి వాక్యములచే పూజితుడైన భగవానుడు కృష్ణుడు భగవదత్తునకు సకల సౌభాగ్యదమగు అభయమునిచ్చి నరకుని పురమును ప్రవేశించెను. 32

శ్లో॥ తత్రరాజన్య కన్యానాంషట్సహస్రాధికా యుతం ।
భౌమాహృతానాం విక్రమ్య రాజభ్యోదదృశేహరిః ॥ 33

రాజులను జయించి నరకునిచే అపహరింపబడిన పదహారువేలమంది రాజకన్యలను శ్రీహరి ఆ ప్రాగ్జ్యోతిష నగరమున చూచెను. 33

శ్లో॥ తంప్రవిష్టం స్త్రియోవీక్ష్యనర వర్యం విమోహితాః ।
మనసావవ్రిరేఽభీష్టం పతిం దైవోప పాధితమ్ ॥ 34

పురమున ప్రవేశించిన ఆ పురుషోత్తముని బంధితులైన ఆ స్త్రీలు చూచి సమ్మోహితులై తమకు దైవము సమకూర్చిన ఇష్టపతిగ శ్రీపతిని మనస్సున వరించిరి. 34

శ్లో॥ భూయాత్పతి రయం మహ్యం
ధాతా తదను మోదతాం ।
ఇతి సర్వాః పృథకృష్ణే
భావేన హృదయం దధుః ॥ 35

ఆ స్త్రీలందరు ఎవరికివారే ఈ పురుషోత్తముడు నాకు భర్తయగుగాక ! అని కృష్ణుని యందు భావముతో హృదయము నర్పించుకొనిరి. 35

టీ:- తత్రేతి. శతాధికమిత్యపిజ్ఞాతవ్యం. యదాహ శ్రీపరాశరః. శ్లో. కన్యాపురే సకన్యానాం షోడశాతులవిక్రమః శతాదికాని దదృశే సహస్రాణి

మహామత ఇతి. రాజభ్య ఇత్యుపలక్షణంసిద్ధాదిభ్యశ్చేతి. తథాతేనైవోక్తం. శ్లో. దేవసిద్ధాసురాదీనాం నృపాణాం చ జనార్దన, హృత్వా హి సోఽసురః కన్యా రురోధ నిజమందిర ఇతి.(33-35)

శ్లో॥ తాః ప్రాహిణోద్ద్వారవతీం సుమృష్టవిరజాంబరః ।
నరయానైర్మహాకోశాన్ రథాశ్వాన్ ద్రవిణంమహత్ ॥ 36

ఆ సుందరీమణులందరిని శ్రీకృష్ణ భగవానుడు పల్లకీలయందు కూర్చుండచేసి ద్వారకా నగరమును చేర్చెను. అట్లే మహాకోశములను, రథములను, అశ్వములను, అనంతమైన ధనమును కూడ పంపించెను. 36

శ్లో॥ ఐరావతకులేభాశ్చ చతుర్దంతాం స్తరస్వినః ।
పాండరాంశ్చ చతుష్షష్టిం ప్రేషయామాస కేశవః ॥ 37

ఐరావత కులమునకు చెందిన నాల్గు దంతములు కలిగిన మహాబలముగల శ్వేత గజములను అరువదినాల్గింటినికూడ కేశవుడు ద్వారకకు పంపించెను. 37

టీ:- త ఇతి. ప్రాహినోత్ ప్రస్థాపయామాస సుమృష్టాః కమనీయాశ్చ తాః విరజాంబరాశ్చ తాః. నరయానైః శిబికాబిః. అపి చ. మహాకోశానితి. 37

శ్లో॥ గత్వాసురేంద్రభవనం దత్వాదిత్యై చ కుండలే ।
పూజితస్త్రిదశేంద్రేణ మహేంద్రాణ్యా చ సప్రియః ॥ 38

సత్యభామతో కూడ సురేంద్రభవనమునకు పోయి దేవమాత అదితికి కుండలములను సమర్పించెను. అనంతరము ఇంద్రునితో, ఇంద్రాణితోడను పూజితుడయ్యెను. 38

టీ:- గత్వేతి. సప్రియః సత్యభామసహితః 38

శ్లో ॥ చోదితో భార్యయోత్పాట్య పారిజాతం గరుత్మతి ।
ఆరోప్యసేంద్రాన్ విబుధాన్నిర్జిత్యో పానయత్పురమ్ ॥ 39

టీ:- చోదిత ఇతి. సత్యభామయ ప్రేరితస్సన్ పారిజాతవృక్షం ఉత్పాట్య కృతవిబుధజయస్సన్ ద్వారకాం వివేశ. 39

శ్రీకృష్ణుడు సత్యాప్రేరితుడై పారిజాత వృక్షమును పెకలించి గరుడుని మూపుపై పెట్టి అడ్డగించిన ఇంద్రాదిదేవతలను జయించి ద్వారకకు గొనిపోయెను. 39

శ్లో ॥ స్థాపితస్సత్యభామాయా గృహోద్యానోప శోభనః ।
అన్వగుర్భ్రమరాస్స్వర్గాద్యద్గంధాసవ లంపటాః ॥ 40

టీ:- స్థాపిత ఇతి. గృహోద్యానం నిష్కుటం ఉపశోభయతియః 40

సత్యభామయొక్క గృహ ఉద్యానమునందు అలంకారముగ నాటించెను. పారిజాతపు సువాసనలకు అలవాటి పడిన భృంగములు కూడ స్వర్గమునుండి భూమికి దిగివచ్చినవి. 40

శ్లో ॥ యయాచ ఆనమ్య కిరీటకోటిభిః
పాదౌ స్పృశన్నచ్యుతమర్థసాధనం ।
సిద్ధార్థ ఏతేన విగృహ్యతే మహా
నహో సురాణాం చ తమో ధిగాఢ్యతామ్ ॥ 41

టీ:- సేంద్రాన్ విభుదాన్ నిర్జిత్యేతింద్రకృష్ణయోసంగ్రామ ఉక్తః తత్ర నను కథంప్రసాదితః స్వమనోరథేన. శ్రీకృష్ణేన సహేంద్రస్య కథం సంగ్రామ ఇత్యాంశక్యాహ-యయాచ ఇతి. అచ్యుతం అర్థసాధనమితి. చ కర్ణద్వయం యాచతిధాతో. విగృహ్యతే విగ్రహంకరోతిమహానపి. తమ క్రోధం ఆఢ్యతాం ధనికతాం. 41

ఇంద్రాది దేవతలను జయించినాడనుటచే శ్రీకృష్ణ ఇంద్రులకు సంగ్రామము జరిగినదని చెప్పబడినది. శ్రీకృష్ణుడు స్వమనోరథమును చెప్పి చేసికొనెను. ఆ ఇరువురికి సంగ్రామమెందుకు జరిగినదని ఆశంకించి చెప్పుచున్నాడు. కార్యసాధకుడైన అచ్యుతుని పాదములకు సత్యభామ కిరీట తలమువంచి స్పృశించెను. అహో! సురులయొక్క అజ్ఞానరూపమగు ధనికత్వమును, క్రోధావేశమును నిగ్రహించి కేశవుడు సిద్ధ సంకల్పుడయ్యెను. 41

శ్లో ॥ అథోముహూర్త ఏకస్మిన్నానాగారేషు తాస్త్రియః ।
యథోపయేమే భగవాన్తావద్రూపధరోఽవ్యయః ॥ 42

టీ:- అథో ఇతి. యథాయథావత్. అనేన దేవక్యాది బంధుజన సమాగమోఽపి ప్రతిగృహం యౌగపద్యేన సూచితః. అవ్యయః సర్వత్రాపి సంపూర్ణః 42

పిమ్మట భగవంతుడు శ్రీకృష్ణుడు ఒకే ముహూర్తమున వారివారి గృహములందు సర్వత్ర సంపూర్ణుడై, అనేక రూపధారియై ఆ స్త్రీలను పరిణయము చేసికొనెను. అట్లే దేవకీదేవి మొదలగు బంధు జనమును కూడ ప్రతి గృహమున ఏకకాలమున కలిసెను. (భగవానుడు పరిపూర్ణుడు కదా !) 42

శ్లో ॥ గృహేషు తాసామనపాయ్యతర్క్యకృ
న్నిరస్త సామ్యాతిశయేష్వవస్థితః ।
రేమే రమాభిర్నిజధామసంప్లుతో
యథేతరోగార్హకమేధికాంశ్చరన్ ॥43

టీ:- అహోభాగ్యం నారీణామిత్యాహ-త్రిభిః. గృహేష్వితి. ఆతర్క్యాణి కర్మాణి కరోతీతి తథా సహనిరస్థం సామ్యమతిశయశ్చయైరన్యేషాం. తేషుగృహేషు అనపాయీ అవస్థితః. రమాభిః లక్ష్మ్యా అంశభూతాభిః నిజకామ సంప్లుతః స్వానంద పరిపూర్ణః గార్హక మేధికాన్ గృహస్థ ధర్మాన్. 43

శ్రీకృష్ణ భగవానుడు వారివారి గృహములందు నిరంతరము సన్నిహితుడై, ఆ సమయమందే లక్ష్మీదేవి గృహమున కూడ విలసితుడై, ఇతర గృహస్థులు తమ ధర్మాచారములందు నిమగ్నులైనట్టే తాను గృహస్థ ధర్మములను నిర్వర్తించెను. ఆహా ! ఏమి ఆ నారీమణుల సౌభాగ్యము. 43

శ్లో ॥ ఇత్థం రమాపతిమవాప్య పతింస్త్రియస్తా
బ్రహ్మాదయోऽపినవిదుః పదవీం యదీయాం ।
భేజుర్ముదావిరతమేధితయానురాగ
హాసావలోకనవసంగమజల్పలజ్జాః ॥ 44

టీ:- ఇత్థమితి. అనురాగహాససహితమవలోకనం చ. తత్పూర్వకం నవసంగమం చ తద్గతం జల్పంచ. తస్మిన్ లజ్జాంచ భేజుః 44

శ్లో ॥ ప్రత్యుద్గమాదరభయాసనపాదశౌ చ
తాంబూలవిశ్రమణవీజనగంధమాల్యైః ।
కేశప్రసారశయనస్నపనోపహార్యై
ర్దాసీశ్శతా అపి విభోర్విదధుస్స్మ దాస్యమ్ ॥ 45

టీ:- ప్రత్యుద్గమేతి. విశ్రమణం సంవాహనం. కేశప్రసారః కేశప్రసాధనం. దాసీనాం శతాని విద్యంతే యాసాం తథాభూతా అపి స్వయం విభోర్దాస్యంవిదాధురితి. 45

**ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,**
**ఏకోనషష్టితమోऽధ్యాయః**

ఈవిధముగ బ్రహ్మాదులకు కూడ పొందరాని స్థానమును పొందిన అ స్త్రీలు రమాపతిని పతిగా పొందిరి. నిరంతరము ఆ భగవానునితో ఆనందముననుభవించిరి. సరస సల్లాపములు గావించిరి. అనురాగ పూరిత హాస అవలోకన సంగమసౌఖ్యముల ననుభవించిరి. 44

ద్వారకా నగరమున శ్రీకృష్ణ మందిరమునందు ఎదురు వచ్చి భయమును ప్రదర్శించుచు, ఆసనములు వేయుటకు, తాంబూలముల నిచ్చుటకు, పాదములొత్తుటకు, స్నానాదులు చేయించుటకు, విశ్రమించు సమయమున వింజామరలు వేయుచు గంధమాల్యముల నలంకరించుటకు, కేశపాశముల సవరించుటకు, శతాధికులైన దాస దాసీ జనములున్నను విభునకు శ్రీకృష్ణునకు తామే స్వయముగ సకల విధ సేవలను చేయుచుండిరి. 45

**శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు**
**యాభైతొమ్మిదవ అధ్యాయము సమాప్తము**

## షష్టితమోఽధ్యాయః

### శ్రీకృష్ణ రుక్మిణీదేవుల పరస్పర నర్మోక్తి ప్రవచనఘట్టము.

శ్లో॥ అథ షష్టితమే కృష్ణః పరిహాసేన రుక్మిణీం ।
కోపయిత్వా తతః ప్రేమకలహే తామసాంత్వయత్ ॥
రామారామా జనానందమహోదయ విడంబనైః ।
రుక్మిణ్యా ప్రేమకలహచ్ఛద్మనైశ్వర్య మీర్యతే ॥

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ కర్హి చిత్సుఖ మాసీనం స్వతల్పస్థం జగద్గురుం ।
పతిం పర్యచరద్భైష్మీ వ్యజనేన సఖీజనైః ॥ 1

టీ:- కర్హి చిదితి. స్వతల్పస్థం స్వపర్యంకస్థం. 1

శ్లో॥ యస్త్వేతల్లీలయా విశ్వం సృజత్యత్త్యవతీశ్వరః ।
సహిజాతస్స్వ సేతూదాం గోపీథాయ యదుష్వజః ॥ 2

టీ:- వక్ష్యమాణం రుక్మిణ్యాః శ్రియః శ్రీకృష్ణే పరమప్రేమ సంభావయితం తస్యోక్తమేవ తత్త్వమనుస్మారయతి - యస్త్వితి. 2

## 60 వ అధ్యాయము

ఈ అరవయ్యవ అధ్యాయమున శ్రీకృష్ణుడు పరిహాస వచనములతో రుక్మిణీదేవికి కోపము వచ్చునట్లు చేసి ప్రణయ కలహమున ఆమెను ఓదార్చెను. అనేకులగు నారీమణులకు విలాసవచనములతో ఆనందమును కల్గించుచుండెను. ప్రేమ కలహమను నెపమున ఈ కథను విన్నవారికి ఐశ్వర్య సిద్ధి వృద్ధి కల్గును.

శ్రీ శుకులు పలికిరి.

ఒకప్పుడు తన శయ్యపై సుఖాసీనుడైనట్టి జగద్గురువు, పతియైన శ్రీకృష్ణుని భీష్మకనందన రుక్మిణీదేవి పరిచారకలతో కూడి వింజామరలతో వీచుచు సేవించెను. 1

రుక్మిణికి శ్రీకృష్ణునియందు గల పరమప్రేమను స్పష్టమొనర్చుటకై ఆమె వాక్యముల సారమును స్మరింపజేయుచున్నాడు. ఏ పరమేశ్వరుడు ఈ విశ్వమును తనలీలతో సృజించి, స్థితిని కల్పించి, లయము చేయుచున్నాడో ఆ పరాత్పరుడు పరబ్రహ్మ తన పరిధులను నియమించుకొని దేహధారియై యాదవులలో జన్మించెను. 2

శ్లో॥ తస్మిన్నంతర్గృహే భ్రాజన్ముక్తాదామ విలంబినా ।
విరాజితే వితానేన దీపైర్మణి మయైరపి ॥ 3

టీ:- ఆదౌ తావత్త్రిభిః శ్లోకైః మందిరమనువర్ణయతి- తస్మినితి. తచ్ఛబ్దేనాతిప్రసిద్ధమాహ - భ్రాజంతి ముక్తాదామాని తేషాం విలంబాః సంతి యస్మిన్ తేన వితానేన విరాజితే. తృతీయాంతానాం విరాజిత పదేనాన్వయః. 3

మొదట మూడు శ్లోకములతో ద్వారక యందలి శ్రీకృష్ణ మందిరమును వర్ణించుచున్నాడు.

ఆ ప్రభువు ప్రసిద్ధమగు గృహమధ్యభాగము కనులకు మిరిమిట్లు గొలుపుచు వ్రేలాడుచున్న ముత్యాలహార సముదాయము తోడను, మణిమయ దీపకాంతులతోడను ప్రకాశించుచుండెను. 3

శ్లో॥ మల్లికాదామభిర్ధూపైర్ద్విరేఫ కులనాదితే ।
జాలరంధ్ర ప్రవిష్టైశ్చ గోభిశ్చంద్ర మసోఽరుణైః ॥ 4

టీ:- మల్లికేతి. సుగంధితయా ద్విరేఫకులైః నాదితే. ప్రవిశభిశ్చంద్ర రశ్మిభిః. 4

మరియు మల్లెపూవుల మాలికతో, అగరవత్తుల పొగలతో, సువాసనలకు దరిచేరు తుమ్మెదనాదములతో, గవాక్ష రంధ్రముల నుండి లోనికి వచ్చుచున్న చంద్ర, సూర్య కిరణముల తోడను ప్రకాశించుచుండెను. 4

శ్లో॥ పారిజాత వనామోద వాయునోద్యాన శాలినా ।
ధూపైరాగరుభీరాజన్ జాలరంధ్ర వినిర్గతైః ॥ 5

టీ:- పారిజాతేతి. నిర్గచ్ఛద్భిః. 5

ఓ రాజా! గవాక్ష రంధ్రముల నుండి లోపలకు ప్రవేశించుచున్న ఉద్యాన వనమునందలి పారిజాత కుసుమ వాసనలతోడి వాయువుతో కూడిన అగరుధూపములతో విరాజిల్లు చుండెను. 5


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ పయః ఫేననిభే శుభ్రే పర్యంకేకశిపూత్తమే ।
ఉపతస్థే సుఖాసీనం జగతామీశ్వరం పతిమ్ ॥ 6

శ్లో॥ వాలవ్యజనమాదాయరత్నదండం సఖీకరాత్ ।
తేనవీజయతీ దేవీ ఉపాసాం చక్ర ఈశ్వరమ్ ॥ 7

టీ:- తదేవాభినయతి- వాలవ్యజనమితి. 6, 7

శ్లో॥ సోపాచ్యుతం క్వణయతీమణి నూపురాభ్యాం
రేజే౽ంగులీయ వలయవ్యజనాగ్రహస్తా ।
వస్త్రాం తగూఢ కుచకుంకుమ శోణ హార
భాసా నితంబ ధృతయాచ పరార్ధ్యకాంచ్యా ॥ 8

టీ:- సేతి. ఉపాచ్యుతం అచ్యుతస్య సమాపే. సామణినూపురాభ్యం రేజే.కథం రేజే క్వణయతీ మణిమయౌనూపురౌ కూజయంతీతి కథా. అంగులీయవలయవ్యజనాని అగ్రహస్తేహస్తాగ్రేయస్యాస్సా వస్త్రాంతే గూఢౌస్థగితౌ కుచౌ తయోః కుంకుమం తేన శోణోహారస్తస్య భాసా. తథా నతంబే ధృతయా పరార్ధ్యా అమూల్యా కాంచీ తయా చ రేజే. 8

పాలమీద నురగ వలె తెల్లటి మెత్తనైన హంసతూలికాతల్పము మీద సుఖాసీనుడైన, జగత్తునకు ప్రభువగు పతిని శ్రీకృష్ణుని రుక్మిణీదేవి సేవించెను. 6

**ఆ సేవాప్రకారమును వర్ణించుచున్నాడు-**

రుక్మిణీదేవి పరిచారకా కరమున నున్న రత్నదండముగల వింజామరమును తన హస్తమున గ్రహించి మెల్లగా వీచుచు పతిని (శ్రీకృష్ణుని) ఉపాసించెను. 7

రుక్మిణి అచ్యుతిని చెంత, సవ్వడిచేయుచ్ను మణిమయములగు అందెల తోడను, రత్నఖచిత అంగులీయములుగల హస్తమున ధరించిన వింజామరలతోడను, చీరచెంగుమాటున స్తనాంకిత కుంకుమతో నెరబారిన ముత్యాలహారకాంతులతోడను, అట్లే కటియందు ధరించిన అమూల్యమైన మొలనూలు తోడను ప్రకాశించుచుండెను. 8

శ్లో॥ తాం రుక్మిణీం శ్రియమనన్యగతిం నిరీక్ష్య
యాలీలయా ధృత తనోరను రూపరూపా ।
ప్రీతస్స్మయన్నలక కుండల నిష్కకంఠ
వక్త్రోల్లసత్స్మిత సుధాం హరిరాబభాషే ॥ 9

టీ:– తామితి. తాం నిరీక్ష్యప్రీతస్సన్. స్మయమానో హరిరాబభాషే. కథం భూతాం. యా లీలయా ధృతతనోస్స్వస్య అనురూపరూపా ఆనురూపం రూపం యస్యాస్సా. యథోక్తం శ్రీ పరాశరేణ. శ్లో. దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ, విష్ణోర్దేహానురూపాం వై కరోత్యేషాత్మనస్తనుమితి. కించ. అలకైః కుండలాభ్యాం నిష్కేణ పతకేన చాలంకృతకంఠేన చతుర్దిక్షు శోభితే వక్త్రే ఉల్లసంతీ స్మితసుధా యస్యాస్తాం. 9

జగన్నాటకమున తాను ధరించిన మానవరూపమునకు అనురూపమగు రూపమును ధరించిన, ముంగురుల తోడను మణిమయ కుండలముల తోడను, బంగారు పతకములతోడను, అలంకృతమగు కంఠము తోడను, నాల్గు దిశలను ప్రకాశింపచేయు చిరునగవులుగల ఆ రుక్మిణీదేవి అనన్య దేహ సౌందర్యమును గాంచి ప్రీతుడై హరి ఆమెతో ఇట్లనెను.

శ్లో॥ దేవత్వే దేవదేహేయం మనుష్యత్వేచ మానుషే ।
విష్ణోర్దేహాను రూపాం వైకరోత్యేషాత్మనస్తనుమ్ ॥

లక్ష్మీదేవి పరాత్పరుడు దివ్యుడగుచో తాను దేవతామూర్తిగను, మానవుడగుచో మానుషరూపమును విష్ణువు ఏయే విధములగు రూపములు ధరించిన ఆయా రూపములకు అనువగు రూపములను తానుధరించునని శ్రీ పరాశురులవారు చెప్పిరి. 9

### శ్రీకృష్ణ ఉవాచ

శ్లో॥ రాజపుత్రీప్సితా భూపైర్లోకపాల విభూతిభిః ।
మహానుభావై శ్రీమద్భిరూపౌదార్య బలోర్జితైః ॥ 10

టీ:– సర్వగుణయుక్తాయా అపి తవ బుద్ధిర్మందేత్యాశయేనా హైకా దశభిః– రాజపుత్రీతి. హే రాజపుత్రి. లోకపాలానామివ విభూతిరైశ్వర్యం యేషాం తైః తథా మహాప్రభావైః ఆఢ్యైః రూపాదిభిరూర్జితైశ్చ పూర్వమీప్సితాసి. 10

### శ్రీకృష్ణులు పలుకు చున్నారు

తర్వాతి పదకొండు శ్లోకములతో, రాజపుత్రీ! సమస్త గుణములకు నిలయమైనను నీవు మంధమతివి అను భావముతో కృష్ణుడనుచున్నాడు. ఓ రాకుమారీ! లోకపాలురంతటి సంపన్నులు, మహానుభావులు, సౌందర్య ఔదార్య బలములచే నధికులగు రాకుమారులచే మొదట నీవు కోరబడి యున్నావు. 10

శ్లో॥ తాన్ప్రాప్తానర్థినోహిత్వా చైద్యాదీన్ స్మరదుర్మదాన్ ।
దత్తా భ్రాత్రాస్వపిత్రాచ కస్మాన్నోవవృషేఽసమాన్ ॥ 11

టీ:- తానితి. తాన్ హిత్వానోఽస్మాన్ అసమాన్ కస్మాత్. వవృషే వృతవతీ త్వం. 11

శ్లో॥ రాజభ్యోబిభ్యతస్సుభ్రు సముద్రం శరణం గతాన్ ।
బలవద్భిః కృతద్వేషాన్ ప్రాయస్త్యక్త నృపాసనాన్ ॥ 12

టీ:- కించ రాజభ్య ఇతి. ప్రాయశః రాజభ్యో జరాసంధాదిభ్యః బిభ్యతః భయంప్రాప్నువతః 12

శ్లో॥ అస్పష్టవర్త్మనాం పుంసామాలోకపథమీయుషాం ।
ఆస్థితాః పదవీం సుభ్రుప్రాయస్సీదం తి యోషితః ॥ 13

టీ:- అస్పష్టేతి. అస్పష్టవర్త్మనాం అవిజ్ఞాతాచారాణాం. ఆలోకపథం ఆశాస్త్రపారతంత్ర్యం అ స్త్రీపారతంత్ర్యం వా. పదవీ మార్గం. ఆస్థితాః అనుసృతాః. 13

శ్లో॥ నిష్కించనా వయం శశ్వన్నిష్కించన జనప్రియాః ।
తస్మాత్ప్రాయేణ నహ్యాఢ్యామాం భజంతి సుమధ్యమే ॥ 14

టీ:- కించ. నిష్కించనా ఇతి. 14

మదనుని మించిన అందగాండ్రని మదమున మత్తిల్లిన చైద్యాదులకిచ్చుటకు, నీ తండ్రి అన్నలు అంగీకరించియున్నను వారిని కాదని నీతో ఏ విషయమునను సరిపోలని మమ్ము ఎందుకు వరించితివి? 11

మరియి ఓ చక్కని కనుబొమ్మలు కలదాన! జరాసంధాది రాజులకు తరచుగ భయపడుచు, సముద్రమును శరణు జొచ్చినట్టి, బలవంతులతోడి విరోధము కల్గినట్టి, రాజ సింహాసనములను వదిలి పారిపోయినట్టి, ఆచారములు తెలియనట్టి, శాస్త్ర పారంగతులు కానట్టి, పురుషుల నాశ్రయించి, అనుసరించిన స్త్రీలు దుఃఖముల పాలగుదురు. - అంతేగాక దరిద్రులమైన మేము దరిద్ర దామోదరులగు వారికి ప్రీతిపాత్రులము. అందువలన ఓ సుందరీ! మావంటి వారలను గొప్పవారు సేవింపరు.(12-14)

శ్లో॥ యయోరాత్మ సమంవిత్తం జన్మైశ్వర్యా కృతిర్భవేత్ ।
తయోర్వివాహమైత్రీ చ నోత్తమాధమయోః క్వచిత్ ॥ 15

టీ:- యయోరితి. ఆత్మసమం పరస్పరమనురూపం. జన్మైశ్వర్యాభ్యాం సహితా ఆకృతిః రూపం జాతిర్వా సమా. 15

ఎవరికి పరస్పరము సమతుల్యమైన ధనము, కులము, ఐశ్వర్యము, సౌందర్యములుండునో వారికి మాత్రమే వివాహ నెయ్యములు రాణించును. ఉత్తమాధములకు ఎచటను సంబంధ బాంధవ్యాలు కుదరవు. 15

శ్లో॥ వైదర్భ్యేతద విజ్ఞాయత్వయాऽదీర్ఘ సమీక్షయా ।
వృతావయం గుణైర్హీనాభిక్షుభి శ్లాఘితాముదా ॥ 16

టీ:- వైదర్భీతి. న దీర్ఘా సమీక్షా విచారోయస్యాస్తయా. 16

అందుచేత ఓ విదర్భరాజపుత్రీ ! సుదూరపు ఆలోచనచేయని నీవు, గుణహీనులను, భిక్షులచే ఆనందముతో పొగడబడు అమ్ములను వరించితివి. 16

శ్లో॥ అథాత్మనోऽను రూపంవై భజస్వ పురుషర్షభం ।
యేన త్వమాశిషస్సత్యా ఇహాముత్రచ లప్స్యసే ॥ 17

టీ:- అథేతి. అథ ఇదానీమపి. 17

ఇప్పటికైనను నీకు తగిన పురుషపుంగవుని ఎన్నుకొని పరిణయమాడుము. అపుడు ఇహ,పరములందు నీవుపొందిన ఆశీస్సులు ఫలవంతములగును. 17

శ్లో॥ చైద్యసాల్వ జరాసంధ దంతవక్త్రాదయో నృపాః ।
మమ ద్విషంతి వామోరు రుక్మీచా పితవాగ్రజః ॥ 18

టీ:- తర్హి కిమిత్యానీతాహమితి చేత్తత్రాహ - చైద్యేతి. మమ మాం ద్విషంతి. 18

ఓవామాంగీ ! శిశుపాలుడు, సాల్వుడు, జరాసంధుడు, దంతవక్త్రుడు మరియు మీఅన్న రుక్మియు మొదలగు రాజులు నన్ను ద్వేషించుచున్నారు. 18

శ్లో॥ తేషాం వీర్య మదాంధానాం దృప్తానాంస్మయనుత్తమే ।
ఆనీతాసి మయాత్వంచ తేజోపహరతాఽసతామ్ ॥ 19

టీ:- తేషామితి. స్మయనుత్తమే గర్వాపనయనాయ. 19

బలపరాక్రమములచే విర్రవీగు వారి గర్వము నణచుటకై, సజ్జనుల శక్తిని వృద్ధి పరచుటకై అసత్య పురుషుల శక్తిహీనులను చేయుటకు మాత్రమే నీవు నాచే కొనిరాబడితివి. 19

శ్లో॥ ఉదాసీనా వయంనూనం నస్త్ర్యపత్యార్థ కాముకాః ।
ఆత్మలబ్ధ్యాస్మహేపూర్ణా గేహయోర్జ్యోతిరక్రియాః ॥ 20

టీ:- స్త్రీణామతిదుస్సహమోదాసీన్యమకామత్వం చాహ- ఉదాసీనా ఇతి.గేహయోః దేహ గేహయోః. ఉదాసీనాః. అత ఏవ జ్యోతిరక్రియాః జోతి ప్రదీపాది. తద్వత్సాక్షిమాత్రతయా క్రియా రహితాః ఆస్మహే వర్తామహ ఇతి. 20

స్త్రీలయొక్క మిక్కిలి అసహనశీలము, ఔదాసీన్యము, కామరాహిత్యమును గూర్చి చెప్పుచున్నాడు.మేము ఈ విషయమున ఏ సంబంధములేని వారము. నిశ్చయముగ స్త్రీ, సంతాన, అర్థములను కోరువారముకాము. దేహమను గృహమునందలి జ్యోతివలె సాక్షీభూతులమై క్రియారహితులుగను నున్నారము. ఆత్మలబ్ధితో పరిపూర్ణులమై యున్నాము. 20

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఏతావదుక్త్వా భగవనాత్మానాం వల్లభామివ ।
మన్యమానామ విశ్లేషాత్తద్దర్పఘ్న ఉపారమత్ ॥ 21

**శ్రీ శుకులు పలుకుచున్నారు**

చైద్యాదుల గర్వమునణచిన భగవానుడు శ్రీకృష్ణుడు, యెడబాటును సహింపని కారణమున తననే అందరి కంటె ప్రియురాలిగ తలంచుచు గర్వించుచున్న ఆ రుక్మిణీదేవితో ఆమె గర్వమునణచివేయునట్లు పలికి విరమించెను.

శ్లో॥ ఇతి త్రిలోకాధి పతే స్తదాత్మనః ప్రియస్య
దేవ్యశ్రుత పూర్వ మప్రియం ।
ఆశ్రుత్యభీతా హృదిజాతవేపథుః
శ్చింతాందురంతాం రుదతీ జగామహ ॥ 22

రుక్మిణీదేవి ఈ విధమైన, ఇంతకుపూర్వము వినని అప్రియములైన, త్రిలోకాధిపతియగు తన ప్రియుని వాక్యములను విని హృదయమున భయమును చెంది అంతులేని చింతతో చలించు చున్నదై రోదించుచు అచటినుండి తరలిపోయెను. (21-22)

టీ:- ఏతావదితి. అవిశ్లేషాద్ధేతోరాత్మానం వల్లభామేవేత్యేవార్థే ఇవ శబ్దః. ఆత్మానమేవ వల్లభాం. సర్వాసు అహమేవ వల్లభా నాన్యేతి మన్యమానాం గర్వితామిత్యర్థః.(21-22)

శ్లో॥ పదాసుజాణేన నఖారుణ శ్రియా
భువం లిఖింత్యశ్రుభిరంజనావృతైః ।
ఆసించతీ కుంకుమరూషితస్తనౌ
తస్థావధో ముఖ్యతి దుఃఖ రుద్ధవాన్ ॥ 23

ఎర్రవైన గోళ్ళకాంతిచే అతికోమలమైనపాదముతో భూమి యందు రాయుచు, కాటుక కంటి నీటితో కుంకుమాక్తములైన స్తనములను తడుపుచు అమిత దుఃఖముతో గాద్గదికమైన కంఠముతో తలవాల్చినదై నిల్చెను. 23

టీ:- చింతాలక్షణమాహ-పదేతి. నఖైరరుణాశ్రీః కాంతిర్యస్య తేన సుకోమలేన పదా. 23

శ్లో॥ తస్యాస్సు దుఃఖభయ శోక వినష్టబుద్ధే
ర్హస్తాచ్ఛ్రధద్వలయతో వ్యజనం పపాత ।
దేహశ్చ విక్లబధియస్సహసా విముహ్యాన్
రంభేవవాత నిహతా ప్రవికీర్య కేశాన్ ॥ 24

టీ;- తస్యా ఇతి. సుదుఃఖమప్రియ శ్రవణాత్. భయం త్యాగ శంకరాయ శోకః అనుతాపః. తైర్వినష్టా బుర్ధిర్యస్యాస్తస్యాః శ్లథంతి పతంతి వలయాని యస్మాత్. హస్తాత్. దేహశ్చ పపాత విక్లబా వివశా ధీర్యస్యాః తస్యాః. 24

శ్రీకృష్ణుని అప్రియవాక్యములను వినుటవల్ల రుక్మిణీదేవికి భయము కల్గెను. తనను త్యజింపుమనుటచే దుఃఖమును, అందుచే బుద్ధి వివశత్వమును కల్గెను. హస్తము నుండి కంకణములు వింజామరములును జారిపడెను. వికలమగు బుద్ధి వలన మోహముతో వెంటనే దేహముకూడ, కేశపాశము చెదరి గాలికి పెకలింపబడిన అరటి వృక్షమువలె నేల కూలెను. 24

శ్లో॥ తం దృష్ట్వా భగవాన్ కృష్ణః ప్రియాయాః ప్రేమబంధనం ।
హాస్యప్రౌఢీమజానంత్యాః కరుణస్సోஉన్వకంపత ॥ 25

టీ:- తమితి. హాస్యప్రౌఢిం గాంభీర్యం. అన్వకంపత దయాం కృతవాన్. ఏతస్యామబలాయాం పరిహాసమజానంత్యాం కిమర్థం మచ్చతుర్వమితి విరారమేత్యర్థః. 25

భగవంతుడు శ్రీకృష్ణుడు ప్రియురాలి ఆ ప్రేమ బంధమును చూచి, గంభీరమగు హాస్యధోరణినెరుగని అమాయకురాలిపై జాలిపడి దయకలవాడై విరమించెను. 25

శ్లో॥ పర్యం కాదవరుహ్యాశు తాముత్థాప్య చతుర్భుజః ।
కేశాన్ సమూహ్యతద్వక్త్రం ప్రామృజత్పద్మ పాణినా ॥26

టీ:- పర్యంకాదితి. చతుర్భుజ ఇతి. ఉత్థాపనాశ్లేషణ వక్త్రపరిమాం నాద్యర్థమావిష్కృత చతుర్భుజ ఇత్యర్థః. సమూహ్యా నిబధ్య. 26

చతుర్బాహువు శ్రీకృష్ణపరమాత్మ వెంటనే మంచము నుండి దిగి రుక్మిణిని లేవనెత్తి ఆదరముతో ముంగురులను కేశపాశమును సవరించి పద్మపత్రము వంటి మెత్తని చేతితో కన్నీటిని తుడిచెను. 26

శ్లో॥ ప్రమృజ్యాశ్రుకళే నేత్రేస్తనౌ చోపహతౌ శుచా ।
ఆశ్లిష్య బాహునారాజన్ననన్య విషయాం సతీమ్ ॥ 27

టీ:- ప్రమృజ్యేతి. అశ్రుభిః కళే శోభితే శుచా శోకాశ్రుభిః. 27

కన్నీటి కన్నులను, కన్నీటితో తడిసిన కుచములను చేతితోతుడిచి, శ్రీకృష్ణునే మనమున మననము చేయుచున్న రుక్మిణీదేవిని ఆలింగనముచేసుకొని-

శ్లో॥ సాంత్వయామాససాంత్వజ్ఞః కృపయా కృపణాంప్రభుః ।
హాస్యప్రౌఢేభ్రమచ్చిత్తామత దర్హాం సతాంగతిః ॥ 28

టీ:- సాంత్వయా మాసేతి. సాంత్వయామాస అనునీతవాన్. 28

దీనులయెడ దయాళువు ఓదార్చుటనెరిగిన ప్రభువు, సజ్జన కల్పతరువగు శ్రీకృష్ణ భగవానుడు హాస్య ప్రౌఢిమతో అతలాకుతలమగు చిత్తముగల దుక్మిణీదేవిని ఓదార్చెను. (27-28)

శ్రీ కృష్ణ ఉవాచ

శ్లో॥ మా మావైదర్భ్యసూమేథాజానే త్వాంమత్పరాయణం ।
త్వద్వచ శ్రోతుకామేన క్ష్వేళ్యా చరితమంగనే ॥ 29

టీ:- మేతి మా మాం త్వద్వచః కింను వదిష్యసీతి శ్రోతుకామేన శ్రోతుమిచ్ఛతా. క్ష్వేళ్యానర్మణా. ఏవమాచరిత ముక్తం న తు తత్త్వతః. హే అంగనే హే సుందరి. 29

శ్రీకృష్ణుడు మాట్లాడెను.

ఓ వైదర్భీ! ఈ విధముగ నీమనస్సు నొప్పించిన నన్ను అసహ్యించుకొనవద్దు. నీవు నన్నే నమ్మియుండుటను నేనెరుగుదును. ఓ సుందరీ! నీ మనస్సులోని మాటలను వినగోరిన నేను నర్మగర్భముగ నిట్లు పలికితిని. యథార్థముగ కాదు. 29

శ్లో॥ ముఖమచ ప్రేమసంరంభస్ఫురితాధర మీక్షితుం ।
కటాక్షేపారుణా పాంగం సుందర భ్రుకుటీతటమ్ ॥ 30

టీ:- ముఖమితి. ప్రేమసంరంభేణ ప్రణయకోపేన. స్ఫురితః కంపితోఽధరోయస్మిన్ తత్. కటశబ్దేన కటాక్షా. తైరాక్షేపైరరుణా వపాంగౌ యస్మిన్ తత్ ఆత ఏవ. సుందరం కుటిలం భ్రుకుటీతటం యస్మిన్ తత్. 30

ఓ రుక్మిణీ ! ప్రణయకోపముచే కంపించు అధరము తిరస్కార భావముచే ఎరుపెక్కిన క్రీగంటి చూపులను, అందమైన కనుబొమల ముడిపాటుగల నీ ముఖమును చూచుటకై ఇట్లు మాట్లాడితిని. 30

శ్లో॥ అయంహి పరమోలాభో గృహేషు గృహమేధినాం ।
యన్నర్మైర్నీయతే యామః ప్రియయా భీరుభామిని ॥ 31

ఔను కలహము వల్ల మీకు కల్గు ఆనందమేమి? సుఖమే మందువ? వినుము - ఓ భయశీలా ! గృహస్థులగు వారికి తమ గృహములందు ఇదొక్కటియే పరమగు లాభము ప్రియురాలితో నర్మభాషణము వలన తత్ఫలితమైన కలహ సాంత్వనముతో కాలము గడచిపోవును. 31

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ సైవం భగవతా రాజన్ వైదర్భీ పరిసాంత్వితా ।
జ్ఞాత్వా తత్పరిహాసోక్తిం ప్రియత్యాగ భయం జహౌ ॥ 32

టీ:- నను కలహే తవకిం కౌతుకం సుఖం వా ఆత ఆహ. - అయమితి. నర్మైర్నర్మభిః యామః కాలః. (31,32)

**శ్రీ శుకులు పలికిరి**

ఓరాజా! ఆ రుక్మిణీదేవి ఈ విధముగ భగవానునిచే ఓదార్చబడినదై ఆయన మాటలను పరిహాస వచనములుగ తెలుసుకొని, ప్రియునితోడి యెడబాటు కలుగునను భయమును వదిలి వేసెను. 32

శ్లో॥ బభాష ఋషభం పుంసాం వీక్షంతీ భగవన్ముఖం ।
సవ్రీడహాసరుచిర స్నిగ్ధా పాంగేన భారత ॥ 33

టీ:- బభాష ఇతి. భగవత స్తస్యైశ్వర్యయుక్తం ముఖం సవ్రీడేన హాసేన రుచిరేణసిగ్ధేన చాపాం గేన వీక్షమాణా.

(శ్లో॥) అసమత్వం భయం దుర్గాశ్రయణం ప్రబలైఃకలిః ।
అరాజత్వమవిజ్ఞత్వాలౌకికేహావసాదనం ।
నిష్కించనత్వం తత్ప్రీతి రాద్యానాదరణీయతా ।
అనౌచిత్యంనిర్గుణత్వం వృథాశ్లాఘా చ భిక్షుభిః ।
అజ్ఞత్వాదీర్ఘ దర్శిత్వే భైష్మ్యా ్య రాజ్ఞాం బహూన్ గుణాన్ ।
కృష్ణనర్మోదితాన్ భైష్మీన్యషేధత్త ద్గుణస్తవైః ॥ శ్రీధరాయ ఇమే. భగవతః స్వనిందాపరాణీవయాని వాక్యాని తాని సర్వోత్కర్ష పరతయా వ్యాచక్షాణా ప్రతిభాషతేస్మ. 33

భరతవంశ ప్రదీపకా ! భగవంతుడు, పురుషపుంగవుడునగు శ్రీకృష్ణుని ముఖమును, సిగ్గు, చిరునగవుతో, మనోహారిణియగు క్రీగంటి చూపులతో చూచుచున్నదై రుక్మిణీదేవి మాట్లాడెను.(సర్వాంగ సుందరి రుక్మిణి సాక్షాత్తుగ లక్ష్మీదేవి స్వరూపమే, ప్రతిజన్మ యందును విష్ణువుననుసరించియే అవతరించునది) అసమానత, భయము, దుర్గమును ఆశ్రయించుట, బలవంతులతో జగడము, అరాచకత్వము, అవిజ్ఞత్వము, వృద్ధులను పరివూర్చుట, దరిద్రత్వము, దరిద్రులయందధికప్రేమ, అనాధరణము, అనౌచిత్యము, నిర్గుణత్వము, భిక్షుకులచే వృథాశ్లాఘనము, ఉదాసీనత, కోరికలు లేకపోవుట, అజ్ఞత్వాదీర్ఘదర్శత్వములను రుక్మిణియొక్క పదహారు దోషములను కృష్ణుడు పరిహాసముగ పలికిన రాజుల అనేక గుణములను, భగవానుని గుణములను స్తుతించు వ్యాజమున భీష్మకనందన నిషేధించెను. స్వనిందాపరములుగ భగవానుడు పల్కిన వాక్యములను అన్నింటికంటె ఉత్తమమైనవిగ వ్యాఖ్యానించుచు రుక్మిణి పలికెను. 33

**రుక్మిణీ ఉవాచ**

శ్లో॥ నన్వేవమేత దరవింద విలోచనాహ
యద్వైభవాన్ నభవతస్సదృశీ విభూమ్నః ।
క్వస్వేమహిమ్న్య భిరతో భగవాంస్త్ర్యధీశః
క్వాహం గుణ ప్రకృతి రజ్ఞ గృహీత పాదా ॥ 34

**రుక్మిణి పలికెను**

అసములమగు మమ్ములను ఎందుకు వరించితివి అను ప్రశ్నకు నిజమే మనకు సమత్వము లేదనిచున్నది.ఎట్లనగా ఓ అరవిందలోచనా! నీ మహిమతో విలసిల్లుచు బ్రహ్మాదులను నియమించు భగవంతుడవగు

టీ:- తత్ర యదుక్తం కస్మాన్నోవవృషే సమానితి. తత్రసామ్యం సత్యమేవేత్యాహ - నన్వితి. హే అరవిందలోచన. త్ర్యధీశః త్రయాణాం బ్రహ్మాదీనపి అధీశో నియంతా త్వం క్వ? క్వ చాహం గుణ ప్రకృతిః త్రిగుణస్వభావా ప్రాకృతగుణమయీ ప్రకృతిర్వా? నను త్వమేవధీశ్వరీ శ్రీః సర్వైరూపాస్యత్వాదిత్యత ఆహ-అజ్ఞైస్సకామైర్గృహీతౌ పాదౌ అంఘ్రీ యస్యాస్సా. 34

నీవెక్కడ? త్రిగుణ స్వభావముగల ప్రాకృతగుణమున స్వరూపముగల ప్రకృతియగు నేనెక్కడ? అట్లుకాదు. సంపదకు మూలరూపిణివై అందరిచే నుపాసింపబడు నీవే గొప్పదానివనినచో, కోరికలు కలిగిన అజ్ఞానులచే సేవింపబడు నేనెట్లు మీతో సదృశురాలనగుదును. 34

శ్లో॥ సత్యం భయాదివ గుణేభ్య ఉరుక్రమాంత
శ్శేతే సముద్ర ఉపలంభనమాత్ర ఆత్మా ।
నిత్యం కదింద్రియ గణైః కృత విగ్రహస్త్వం
త్వత్సేవకైర్నృప పదం విధుతం తమోంధమ్ ॥ 35

టీ:- యదుక్తం. "రాజభ్యో భిభ్యతస్సుభ్రుసముద్రం శరణం గతాని"తి, తత్రాహ-సత్యమితి. హే ఉరుక్ర మేతి భయాభావం దర్శయతి-గుణాః శబ్దాదయ ఏవ . రాజంత ఇతి రాజానః. తేభ్యో భయాదివేతి అంతః హృదయే సముద్రే తద్వదగాధే. విషయా కారైరపరిచ్ఛిన్న ఇత్యర్థః. శేతే నిశ్చలతయా ప్రకాశతే. ఉపలంభనమాత్రః చైతన్యఘనః ఆత్మా భవానితి. బలచద్భిః కృతద్వేషానితి యదుక్తం తదపి సత్యమిత్యాహ- నిత్యమితి. కదింద్రియ గణైః కుత్సాతైర్బహిర్ముఖైరింద్రి యగణైః

రాజులకు భయపడి సముద్రమును శరణుజొచ్చితి మనుటకు సమాధానము. ఉరుక్రమా ! నీకు భయమెక్కడిది. శబ్దాది గుణములను రాజులకు భయపడినవానివలె, చైతన్య ఘనుడవు ఆత్మస్వరూపుడవు అగు నీవు సముద్రమువలె అగాథమైన హృదయాంతరమున నిశ్చలుడవై ప్రకాశించుచున్నావు. ఇక బలవంతులతోడి విరోధము కలవాడ నందువా? నిజమే బహిర్ముఖములగు ఇంద్రియ గుణములు గలవారు (బలవంతులని) నిన్నెరుగక నిత్యము నీతో జగడమాడు చుందురు. మరియు రాజసింహాసనమును వదిలిన వారమంటివి. అదియును యుక్తమే. అజ్ఞానాంధకారమున మునిగిన నీ సేవకులే అనంతమగు అవివేకముల వలన దానిని త్యజించుచుండ జ్ఞాన స్వరూపుడవగు నీవిషయమున చెప్పవలసినదేమున్నది. 35

వృత్త్యభిప్రాయేణ బహువచనం. కుత్సిత ఇంద్రియగణో యేషామితివా. తైస్త్వం నిత్యం కృతవిగ్రహః తేషు తవాప్రతీతేః. యదుక్తం త్యక్త నృపాసనానితి తద్యుక్తమేవేత్యాహ - త్వత్సేవకైరితి. నృపాణాం పదమాసనం. అంధం గాఢం తమ ఏవ తత్. అవివేక బహుళత్వాత్ త్వత్సేవకైరేవ త్యక్తం కిం పునర్వక్తవ్యం త్వయాత్యక్తమితి. 35

శ్లో॥ త్వత్పాదపద్మమకరందజుషాం మునీనాం
వర్త్మాస్ఫుటంనృపశుభిర్నను దుర్విభావ్యం ।
యస్మాద లౌకిక మపేహిత మీశ్వరస్య
భూమ్నస్తవేహిత మథోఽనునయే భవంతమ్ ॥ 36

టీ:- అస్పష్టవర్త్మనాం పుంసామవలోకపథమీయుషామితి యదుక్తం తదపి తథైవేత్యాహ- త్వత్పాదేతి. నృప శుభిః. నరాకారైః పశుభిః. కిం పునర్వక్తవ్యం తవ వర్త్మాస్ఫుటమితి. కించ యస్మాత్ యే భవంతమనువర్తంతే తేషామపి ఈహితం అలౌకికమేవ. అథో అతః కిం వక్తవ్యం తవేశ్వరస్యేహితం అలౌకికమితి. ఆస్థితాః పదవీం సుభ్రు ప్రాయసీదంతి యోషిత ఇత్యస్య పరిహారం వక్ష్యతి- యద్వాంఛ యేతి పంచమశ్లోకేన. 36

ఆచార మార్గమునెరుగని, శాస్త్రపారమ్యమును పొందని వారమంటివి అదియు అట్టిదే కదా! శ్రీహరి నీ పాదపద్మ మకరందమును సదాపానముచేయు మునులకే నిన్ననుసరించు మార్గము అస్పష్టము. ఇక నరపశువుల విషయము నేమనదగును. ఎందువలననగ నిన్ను కోరువారి కోరికలు అలౌకికములైనప్పుడు ఈశ్వరుడవగు నీ భావములును అలౌకికములని చెప్పుట ఎందులకు? అందుచేతనే నిన్ను నేనభిలషించితిని. ఇక అనాచార పరులనాశ్రయించిన స్త్రీలు దుఃఖ భాజనులగుదురనుటకు పరిహారమును చెప్పుచున్నది. పారిజాత వన వాసనలచే మనోహరములైనవారు మీరు. ఆ మనోహరత్వమును కోరినేను మిమ్ములను వరించితిని. 36

శ్లో॥ నిష్కించనో నను భవాన్నయతోఽస్తి కించి
ద్యస్మైబలిం బలిభజోపి హరంత్యజాద్యాః ।
నత్వావిదంద్యసుతృపోంతకమాధ్యతాంధాః
ప్రేష్ఠోభవాన్ బలిభుజామ పితేఽపి తుభ్యమ్ ॥ 37

టీ:- నిష్కించినా వయం శశ్వన్నిష్కించనా జనప్రియాః, తస్మాత్ప్రాయేణ న హాఢ్యా మాం భజంతి సుమధ్యమ ఇత్యేతచ్ఛ్లోకోక్తం దోషత్రయం పరిహతి-నిష్కించన ఇతి. దరిద్రతాలక్షణం నిష్కించనత్వం తు తవ న ఘటత ఇత్యాహ-యస్మా ఇతి. అసత్యో బలిభుజః పూజ్యా అపి బ్రహ్మదయో యస్మై బవతే బలిం హరంతి.తస్య సర్వేశ్వరశ్య భవతో దరిద్రతా న ఘటత ఇత్యర్థః. నిష్కింజనప్రియా ఇత్యత్ర తత్పురుషేణ బహుబ్రిహిణా వానిందా స్యాదితి స్వయమప్యుభయధా స్తౌతి-ప్రేష్ఠో భవానితి. బలిభుజాం బ్రహ్మదీనాం లోకేశ్వరాణాం త్వం ప్రేష్ఠః తేఽపి తుభ్యం తవేతి. తస్మాత్ప్రాయేణ న హాఢ్యా మాం భజంతీత్యస్యోత్తరం న త్వా విదంతీతిఆఢ్య తయా అంధాః త్వాత్వాం. అంతకం నవిదంతీతి. అతస్తే అసుతృపః అసూనేవ తర్పయంతి. న త్వాం భజంతీత్యర్థః. 37

ఇక మేము దరిద్రులము. ఎప్పుడును దరిద్రజనులకు ప్రీతిపాత్రులము. అందుకే గొప్పవారు మమ్ములను భజింపరను మూడు దోషములకు పరిహార సమాధానము--

1) దరిద్రతా లక్షణము మీకయుక్తము. ఎందుకనగ ఇతరుల నుండి హవిస్సులను గ్రహించి పూజ్యులగు బ్రహ్మాదులు నీకు హవిర్భాగమును సమర్పించుకొనుచున్నారు. కావున సర్వేశ్వరుడగు నీకు దరిద్రత్వమెట్లు ఘటించును

2) హవిస్సుకు యోగ్యులైన బ్రహ్మాదిదేవతలకు ఇంద్రాది లోకపాలురకు నీవు అత్యంత ప్రియుడవు. అట్లే వారును నీకు ప్రియులు అట్టి సంబంధమున నీవు దరిద్ర జనప్రియుడవగుట ఎట్లు? కావని భావము.

3) అజ్ఞానులు ఎంతవారైనను అంధులై తమ ప్రాణత్యాగమునకైనను సిద్ధపడుదురుగాని నిన్ను సేవించుటకు ఇష్టపడరు. 37

శ్లో॥ త్వంవై సమస్త పురుషార్థమయః పలాత్మా
యద్వాంఛయా సుమతయో విసృజంతి కృత్స్నం ।
తేషాం విభో సముచితో భవతస్సమాజః
పుంసస్త్రియాశ్చరతయో సుఖదుఃఖనోర్న ॥ 38

టీ:- బలిభుజామపి భవాన్ ప్రేష్ఠఇత్యత్ర హేతుం వదంతీయ యోరాత్మసమం విత్తమిత్యనేనోక్తమనౌచిత్యం పరిహతి-త్వమితి. ఫలాత్మా పరమానందస్వరూపః. శ్రు."ఏతస్యైవానందస్యాన్యాని భూతాని వా ఏతాముపజీవంతి" తిశ్రుతేః. సమాజఃసేవ్య సేవక భావలక్షణ సంబంధః. న తు పుంసః స్త్రియాశ్చ. మిథోరతయోః అత ఏవ తత్కృత సుఖదుఃఖినో స్తదాకులయోరిత్యర్థః. 38

శ్లో॥ త్వంన్యస్తదండ మనిభిర్గదితానుభావ
ఆత్మాత్మదశ్చ జగతామితి మేవృతో౽సి ।
హిత్వా భవద్భ్రువ ఉదీరతకాలవేగ
ధ్వస్తాశిషోబ్జ భవనాకపతీన్ కుతో౽న్యే ॥ 39

టీ:- భిక్షుభిః శ్లాఘితాముధేత్యస్య పరిహారః. త్వమితి. భిక్షుపద వ్యాఖ్యానం న్యస్తదండైర్మునిభిరితి ముధేత్యస్య పరిహారః. ఆత్మేతి. యదర్థే

పరస్పరము విత్తాదులు సమముగనున్నపుడే వైవాహికాది సంబంధములు కుదురునన్న దానిలోని ఔచిత్యమును పరిహసించుచున్నది. ఓ మహాత్మా ! పరమానంద స్వరూపుడవగు నీవు సకల పురుషార్థస్వరూపుడవు. ఫలాత్మవు. సాధు జనులు అట్టి నిన్ను పొందగోరి సమస్తమును త్యాగము చేయుచున్నారు. ఈ సమాజము సేవ్యసేవక భావలక్షణ సంబంధమైనదే కాని స్త్రీ పురుషుల సంబంధమైనది కాదు. అందువలన సుఖ దుఃఖములకొరకు ప్రాకులాడునది కాదీ సమాజము. 38

భిక్షుకులతో వ్యర్థముగ పొగడబడువాడనంటివి. అందుకు సమాధానము- భిక్షుకులనగ దండమును ధరించిన మునులని అర్థము అనగా సర్వసంగ పరిత్యాగులైన మహర్షులచే నుడువబడుచున్న సర్వాంతర్యామివగు నీవు ఆత్మ స్వరూపుడవు. అట్టి నీకు యుద్ధముతో పని లేదు. దురాలోచనలేని దాననుటకు సమాధానము-సకల జగత్తుకు ఆత్మ దాతవు నీవు. అందుకే నేను వరించితిని. నేను అజ్ఞానినికాను. ఇంకను నీకంటి రెప్పపాటు కాలమున ఆ వేగమునకు నశించి పోవు నీ ఆశీస్సులుగల బ్రహ్మ ఇంద్రాదులను వదిలి ఇతరులకు చంద్ర దర్శన భాగ్యమెక్కడిది. 39

సర్వం ప్రియం భవతి తస్య జగతామాత్మనస్తవ రణంన వృధేత్యర్థః కించ. ఆత్మద ఇతి. వైదర్భ్యేతదవిజ్ఞాయ త్వయా దీర్ఘసమీక్షయేతి స్వస్మిన్నుక్త దోషద్వయం పరిహతి–ఇతీతి. ఇతి జ్ఞాత్వైవ మే మయా వృతో౾సీత్యజ్ఞానపరిహారః. హిత్వేత్య దీర్ఘసమీక్షత్వపరిహారః భవతో భ్రువస్సకాశాదుదీరితో యః కాలః తస్య వేగః తేన ధ్వస్తా ఆశిషోయేషాం తాన్ బ్రహ్మాదీనపి విహాయ కుతోన్యే వరకా ఇతి భావః. 39

శ్లో॥ జాడ్యం నచస్తవ గదాగ్రజయశ్చ భూపాన్
విద్రావ్య శార్ఙ్గనినదేన జహర్థ మాంత్వం ।
సింహౌ యథాస్వబలి మీశ పశూన్ స్వభాగం
తేభ్యోభయాద్యదుధిం శరణం ప్రపన్నః ॥ 40

టీ:- స్వాజ్ఞానం పరిహృత్య పురుషాంతరగుణవర్ణన ప్రదీప్తకోప సంరంభేణ తస్మిన్నే వాజ్ఞానమాపాదయతి–జాడ్యమితి. సింహోయథా పశూన్ విద్రావ్యస్వబలిం హరతి. తథా శార్ఙ్గధను ర్నినదేనైవ జరాసంధాదీన్ విద్రావ్య మాం స్వభాగం శ్రియం యస్త్వం హృతవానసి తస్య తవ రాజభ్యో భయాదుదధిం ప్రపన్న ఇతి యద్వచో భాషణం. తజ్జాడ్యం మాంద్యంన ఘటత ఇత్యర్థః. 40

తాను అజ్ఞానిని కాదని ఇంతవరకు నిరూపించిన రుక్మిణి, ఇతర పురుషుల గుణములను వర్ణనము చేయుటచే రేగిన కోపావేశముతో కృష్ణుని యందే అజ్ఞానము నారోపించుచున్నది. గదాగ్రజా ! సింహమేరీతిగ ఇతర జంతువులను పారద్రోలి తాను వేటాడిన మృగమును హరించునో అట్లే నీశార్ఙ్గమును ధనుష్టంకారము తోడనే జరాసంధాదులను, పరాజితులను చేసి నీ దానను కాదగిన నన్ను బలాత్కారముగ కొనివచ్చితివి. అట్టి నీవు రాజుల భయముతో సముద్రమును జొచ్చితినను మాట అజ్ఞానజాడ్యముతో కూడినది కాదా? 40

శ్లో॥ యద్వాంఛయా నృప శిఖామణయోంగవైన్య
జాయంతనాహుషగయాదయ ఐకపత్యం ।
రాజ్యంవిసృజ్య వివిశుర్వన మంబుజాక్ష
సీదంతి తేనుపదవీం త ఇహాస్థితాః కిమ్ ॥ 41

టీ:- యచ్చాన్యదసృష్టవర్త్మ నామిత్యాదినార్థాత్వాం భజంతస్సీదంతీత్య వసాదనం శ్రమావహత్వముక్తం తదపి మందమేవేత్యాహ- యద్వాంఛయేతి. యస్య తవ భవ, నవాంఛయా నృపోత్తమాః అంగోవేనస్య పితా. వైన్యః పృథుః జాయంతః భరతః. నాహుషో యయాతిః. గయశ్చాదిరేష్వాంతే. యే. తవ అనుపదవీంమార్గం. ఆస్థితాః ఆశ్రితాః తే కిం సీదంతి న సీదంత్యేవ. అపి తు త్వత్పదం ప్రాప్తా ఇత్యర్థః. ఏవం చ కోపావేశేన అవసాదనస్య పరిహారాదసృష్టవర్మ నామి త్యేతదాన్యంతరం విహాయత్రోత్కర్షః. 41

మరియు అనాచరపరాయణులగు ఆ రాజులు నిన్ను ధ్యానించుచు పరాజితులైరి అనువచనము అజ్ఞాన విలసితమే- ఎట్లనగ అంబుజాక్ష ! నిన్ను సేవించిన రాజశిఖామణులు అంగుడు పృథు చక్రవర్తి, భరతుడు, నహుషపుత్రుడు యయాతి, గయుడు మొదలగువారు ఒక్కుమ్మడిగ రాజ్యములను వదిలి వనమును ప్రవేశించి బాధలననుభవించుచున్నారా? లేదని భావము నీ అనుగ్రహమున నీ పాదమూలమును పొంది యున్నారు. ఈ విధముగ కోపోద్రేకమున రాజ సంహారము గావించుటయు దోషముగాదని పరిహారముగా పల్కుటయు కృష్ణునకుత్కర్షకారణము. 41

శ్లో॥ కాన్యం శ్రమేత తవపాద సరోజగంధం
మాఘ్రాయ సన్ముఖరితం జనతాపవర్గం ।
లక్ష్మాలయంత్వవిగణయ్య గుణాలయస్య
మర్త్యం సదోరుభయమర్థ వివిక్త దృష్టిః ॥ 42

నీకు తగిన వానిని కాంక్షించి వివాహము చేసుకొనరాదా అన్నందుకు సమాధానము - సకల జగమునకు మోక్షప్రదమును, లక్ష్మికినావాస స్థానమును, సజ్జనులచే సేవితమై కీర్తింపబడు గుణనిలయుడవగు నీ పాదపద్మ సుగంధమును వాసన జూచిన తర్వాత దానిని గణింపక యుక్తాయుక్త విచక్షణా దృష్టిగల ఏ వనిత సదా మరణ భయమున కొట్టుమిట్టాడు వానినెవని ఆశ్రయించగలదు?42

టీ:- యచ్చోక్తం ఆథాత్మనోఽనురూపమితి తత్రాహ - శ్లోకద్వయేన. కేతి. గుణానమాలయస్య తవ పాద సరోజగంధం జనతాయా అపవర్గం మోక్షరూపం. లక్ష్మ్యా ఆలయం సత్సేవ్యం. సద్భిర్ముఖరితం వర్ణిత మాఘ్రాయతమవిగణయ్య మర్త్యం మరణధర్మకం సదా ఉరుభయం యస్య తమన్యం. కా స్త్రీ శ్రయేత సేవేత. అర్థే వివక్తా దృష్టిర్యస్యాస్సా. గుణాలయస్యేత్యనేన గుణైర్వినా ఇతి యదుక్తం తదపాస్తం. 42

శ్లో॥ తంత్వాను రూపమభజం జగతామధీశ
మాత్మానమత్ర చ కామపూరం ।
స్యాన్మేతవాంఘ్రిరా రణం సృతిభిర్భ్రమంత్యా
యోవైభజంత మపయాత్యనృతాపవర్గః ॥ 43

టీ:- ఆత్మస్త్వామేవాహమభజమిత్యాహ - తమితి. ప్రార్థయతే - స్యాదితి. ఆరణం శరణం. సృతిభిః దేవతిర్యగాదిజన్మభిః. శ్రుతిభిరితి పాఠాంతరేత్వర్థవాదబహుళ కర్మశ్రవణైరిత్యర్థః. కథంభూతస్య తవ. యస్త్వం. అనృతస్య సంసారస్య అపవర్గో నాశో యస్మాత్సః. భజంత ముపయాతి ఆత్మసాత్కరోతి తస్య తవాంఘ్రిరితి. భీతస్యహి శరణమేవ. అనురూపం భజన యోగ్యం. అతస్త్వామభజమిత్యర్థః. 43

జగత్తునకధిదేవతయగు స్వామీ ! ఇహపర జన్మలలో నా కోరికల నీడేర్చగల నా కనురూపుడనైన నిన్నే ధ్యానించితిని. నీ పాదములు దేవతలకు పశు పక్ష్యాది జన్మల నెత్తిన వారికి మరియు వేదములకు రక్షకములు. అసత్యమగు సంసార బంధనముల నశింపజేయునవి. సేవించినవారికి ముక్తి ప్రదములనియు నమ్మి నిన్ను సేవించితిని. 43

శ్లో॥ తస్యాస్స్యురచ్యుత నృపా భవతోపదిష్టా
స్త్రీ ణాంగృహేమ ఖరగోశ్వబిడాలభృత్యాః ।
యత్కర్ణమూలమరి కర్శన నోపయాయా
ద్యుష్మత్కథా హరవిరించి సభాసుగీతా ॥ 44

టీ:- యేచోక్తా రాజ్ఞాంబహవోగుణాః రాజపుత్రీప్సితా భూపైర్లోకపాల విభూతిభిరిత్యాదినా. తత్రసేర్ష్యం సశాపం సాంగుళిభమగం చాప-ద్వాభ్యాం. తస్యా ఇతి ఖరా ఇవ కేవలం భారవాహాః. గావో బలీవర్దా ఇవ నిత్యంవ్యాపారక్లిష్టాః శ్వాన ఇవావమతాః బిడాలా ఇవ కృపాణాః హింస్రాశ్చ భృత్యా ఇవ కింకరాః. నృపాస్తస్యాః దుర్భగాయాః. పతయః స్యుః యస్యాః కర్ణపథం త్వత్కథా న ప్రాప్నుయాదితి. 44

ఇహలోక పాలురవంటి ఐశ్వర్య సంపన్నులైన రాచకన్యలు కోరుకొను బాహు గుణవంతులగు రాజకుమారులున్నారు కదా అన్నదానికి అసహనముతో నిందించుచు సమాధానము చెప్పుచున్నది. అచ్యుత! శత్రుంజయ! పరమేశ్వర బ్రహ్మ సభలయందు గానము చేయబడు నీ కథలు చెవిన బడని అభాగ్య స్త్రీల యొక్క గృహములందు, నీవు చెప్పినట్లు రాజులు కేవలం సంసార భారమునుమోయు గాడిదల వంటివారు. రోజు కృషి వ్యాపార క్లేశముల ననుభవించు ఎద్దులవంటి వారు. అవమానములకు గురియగు కుక్కలవాంటివారు. పిల్లులవలె దీనులు. సేవకులవలె నిత్యము హింసలననుభవించువారు. 44

శ్లో॥ త్వక్శ్మశ్రు లోమనఖ కేశ పినద్ధమంత
ర్మాంసాస్థి రక్త కృమివిట్కఫ పిత్తవాతం ।
జీవచ్ఛవంభజతి కాంతమతిర్వి మూఢా
యాతే పదాబ్జమకరంద మజిఘ్రతీ సా ॥ 45

టీ:- తథాహి త్వగితి. తే పదాబ్జమకరందమజిఘ్రతీ సతీ యా స్త్రీ విమూఢా సా. కాంతోఽయమితి మతిర్యస్యాస్సా కాంతమతిః. జీవచ్ఛవం భజతి. త్వగాదిభిః బహిఃపినద్ధం ఛన్నం. అంతర్మాంసాదిమయమితి. 45

అదియునుగాక మహానుభావ ! నీ పాదపద్మముల మకరందమును రుచిచూడని కాంత, చర్మము, గడ్డము, మీసాలు, గోళ్లు, కేశములచే కప్పబడి, లోపల మాంసము, ఎముకలు , రక్తము, పురుగులు, మలము, కఫము, పిత్తము, వాతాదులు కల్గిన జీవచ్ఛవుడగు భర్తను పొంది సేవించుచున్నది. 45

శ్లో॥ అస్త్వంబుజాక్ష మమతే చరణానురాగ
ఆత్మన్ రతస్యమయ చానతి రిక్తదృష్టేః ।
యర్హ్యస్య వృద్ధయ ఉపాత్త రజోతిమాత్రో
మామీక్షసే తదూహనః పరమానుకంపా ॥ 46

టీ:- యదుక్తముదాసీనా వయమిత్యాది,తత్రాహ - అస్త్వితి. యద్యపి త్వం నిరపేక్షస్తథాపి మమతే చరణానురాగోఽస్తు. మయి చ అనతిరిక్తా అనతిశయవతి దృష్టిర్యస్య తస్య తేఆత్మన్ ఆత్మనేవ. రతస్యతర్హితవతేన కోలాభః? త్వచ్చరణానురాగ ఏవ మహాలాభః. కించ యర్హి అస్య విశ్వస్య వృద్ధయే ఉపాత్తారజసః అతిమాత్ర ఔత్కట్యం యేనసః. తథా భుతస్సన్ మాంసమీక్షసే. ఉపవార్ధ. హహర్షే. తదేవనః పరమానుకంపా అత్యనుగ్రహ ఇతి. 46

ఉదాసీనులన్నమాటకు సమాధానము--

అంబుజాక్ష ! నీవు నిరపేక్షుడవయినను నా మనస్సున నీ పదపద్మము లందు అనురాగము ఎల్లవేళలనుండును గాక ! అట్లే నీ ఆత్మయందును నా యందు కొంచమనురాగముండును గాక! ఈ విశ్వము యొక్క శ్రేయస్సు కొరకు నీవు ప్రదర్శించు ఉత్సాహము తోడనే నన్ను పరికించుట నాకమితానందమును కలుగజేయుచున్నది. అదియే నాయందు అత్యంతానుగ్రహముగ తలంచుచున్నాను. 46

శ్లో॥ నైవాళికమహం మన్యేవచస్తే మధుసూదన ।
అంబాయా ఇవమే(ప్రాయః కన్యయాస్స్యాద్రతిః క్వచిత్ ॥47

టీ:- తదేవం తదుక్తం సర్వం ప్రతివ్యాఖ్యాయ ప్రసన్న చిత్తామంత్ర ముప్పదిశం త్యాహ-ద్వాభ్యాం. నేతిఅధాత్మనోఽనురూపమిత్యాదితేవచ అళీకంమిథ్యేది నైవా మన్యే. యతోలోకేకన్యాయ ఏవసాల్వే రతిర్జాత తద్వత్. 47

ఈ విధముగ కృష్ణుని వాక్యములను వ్యాఖ్యానించి ప్రసన్న చిత్తయై మంత్రముపదేశించుచూ పల్కుచున్నది. ఓ మధుసూదనా ! అనురూపుడగు వానిని పరిణయమాడరాదా అని నీవనిన మాటలు అసత్యమైనవిగ తలంచుటలేదు. ఎందుకనగ లోకమున కన్యక హృదయముననే ప్రేమ జనించుచున్నది. పూర్వము కాశీ రాజుకు అంబ, అంభిక, అంబాలికలను ముగ్గురు కూతుళ్లలో అంబకు మాత్రమే సాల్వుని యందు ప్రేమ కల్గినది. అట్లే నాకును మీయందనురాగ ముదయించినది. 47

శ్లో॥ వ్యూఢా యాస్సాపి పుంశ్చల్యా మనోఽభ్యేతి నవం నవం ।
బుధో సతీం నచి భృయాత్తాంబిభ్రదుభయచ్యుతః ॥ 48

టీ:- వ్యూఢాయా ఇతి. వ్యూఢాయాః పరిణతాయా అపీతి. ఉభయస్మాదిహ పరలోక ద్వయాత్ చ్యుతో భ్రష్ట ఇతి. 48

పరిణయమాడినను అంకుటాలి మనస్సు నూతన నూతనమైన ప్రియుల కొరకు అర్రులు చాచుచుండును. అట్టి స్త్రీని బుద్ధిమంతుడు భరించరాదు. మూర్ఖుడై వరించి భరించినచో ఇహపరలోకముల యందు భ్రష్టుపట్టును. 48

శ్రీ భగవానువాచ

శ్లో॥ సాధ్వేతచ్ఛ్రోతు కామేన రాజపుత్రీ ప్రలంభితా ।
మయో దితం యదన్వాత్థ తత్సర్వం సత్యమేవహి ॥ 49

టీ:- సాధ్వీతి. ప్రలంభితా ఉపహసితాసి అన్వాత్థ అన్వాఖ్యాతవతి. 49

శ్రీ భగవానుడు పల్కెను

సాధ్వీ ! రాకుమారీ ! నీ మనస్సు నందలి ఈభావమును వినగోరియే నేనిట్లు పరిహాసముగ పలికితిని. నీవు నా వాక్యములకు చేసిన వ్యాఖ్యము సర్వము సత్యమేగదా! 49

శ్లో॥ యాన్ యాన్ కామయసేకామన్
మయ్య కామాయమానిని ।
సంతిహ్యే కాంత భక్తాయా
స్తవ కల్యాణి నిత్యదా ॥ 50

టీ:- యానితి. మయి ఏకాంతభక్తాయా స్తే కామాస్సంత్యేవ. అకామాయ కామనివృత్తయే మోక్షపర్యవ సాయిన ఇత్యర్థః. 50

అభిమానవతీ ! కల్యాణీ ! నా యందు నీవు ఏయే కోరికలు తీరవలయునని కాంక్షించుచున్నావో మోక్ష పర్యవసానములైన అవి యన్నియు ఏకాంతభక్తురాలివగు నీకు నిత్య కల్యాణ ప్రదములైయున్నవి. 50

శ్లో॥ ఉపలబ్ధం పతిప్రేమ పాతివ్రత్యం చ తేఽనఘే ।
యద్వాక్యైశ్చాల్య మానాయాన ధీర్మయ్యపకర్షితా ॥ 51

టీ:- అనువాదేన వరాన్ దత్వా తామపినందతి- ఉపలబ్ధమితి. యద్యస్మాత్మయి వర్తమానా ధీర్నాపకర్షితాసాన్యవిషయా జాతా. 51

ఓ పుణ్యసతీ ! ఇతరుల వాక్యములచే నీకు నాయందలి అనురాగ బుద్ధి ఇంచుకయు చలించలేదు. అందుచే నీకు పతి అనురాగము లభించినది. పాతివ్రత్యముసిద్ధించినది. 51

శ్లో॥ యేమాంభజంతిదాంపత్యే తపసావ్రత చర్యయా ।
కామాత్మానోప వర్గేశం మోహితా మమ మాయయా ॥ 52

టీ:- ఏకాంతభక్తిమభినంద్య తామేవ దృఢీ కర్తుం సకామాన్ భక్తాన్ నిందతి-య ఇతి. దాంపత్యే దంపత్యుభోగసుఖార్థం. 52

రుక్మిణీ! అనన్య భక్తిని అభినందించుచు దానిని బలపరుచునట్లు కోరికలు గల భక్తులను నిందించుచున్నాడు. ఎవరు కేవలము కోరికలను తీర్చుకొనుటకై, తపస్సు, వ్రతములను చేసి మోక్ష ప్రదాతనగు నన్ను భర్తగా పొందగోరుదురో వారు నా మాయచేత మాత్రమే మోహితు లగుదురు. 52

శ్లో ॥ మాం ప్రాప్య మానిన్యపవర్గ సంపదం
వాంఛంతి యే సంపద ఏవ తత్పతిమ్ ।
తే మందభాగ్యనిరయేఽపి యే నృణాం
మాత్రాత్మకత్వాన్ని రయస్సుసంగమః ॥ 53

టీ:- మాయామోహితత్వ మేవోపపాదయతి-మామితి. అపవర్గేణ సహ సంపదో యస్మిన్ తం మాం . ప్రాప్యప్రసాద్య. యే కేవలం

మాయామోహమును మహాత్ములుకూడ విడువలేని స్థితిని ప్రతిపాదించుచున్నాడు.. మానినీ! కొందరు మోక్షమనే సంపదను ప్రసాదింపగల నన్ను వ్రత తపములచేత తృప్తి పరచియు, కేవలము విషయ సుఖములకు సంబంధించిన సంపదను కోరుచున్నారు. అలౌకిక సుఖములకు కూడ పతినగు నన్ను విషయసుఖములందా సక్తులై కోరుచున్నందున మరణానంతరము మరల నీచయోనులందు జన్మించుచున్నారు. అట్టి వారికి జననమరణ చక్రమే (నిరయము)

సంపద ఏవ విషయాన్ త్వాంఛంతి.నతు మాం తత్పతిం తాసాం సంపదామపియోఽహమేవపతిః తం. యే విషయాః నిర్ణయేఽపి నికృష్టయోనావపిస్యుః తాన్ కించ. తేషాం మాత్రాత్మకత్వాత్ విషయాత్మకత్వాత్. నిరయః సుసంగమః శోభనసంగమ యేవస్యాత్. అతో మందభాగ్యా ఇత్యర్థః. 53

శ్లో॥ దిష్ట్యా గృహైశ్చర్యసకృన్మయి త్వయా
కృతానువృత్తిర్భవమోచనీఖలైః ।
సుదుష్కరాసౌ సుతరాందురాశిషో
హ్యసుంభరాయానికృతిం జుషస్త్రియాః ॥ 54

టీ:- దిష్ట్యేతి. తస్మాత్ గృహేశ్వరి త్వయామయి భవమోచనీ నిష్కామా అనువృత్తిః కృతా. ఏతద్దిష్ట్యా భద్రం కథంభూతా. ఖలైసుదుష్కరా. దురాశిషో దురభిప్రాయయాః. అత ఏవ ఆసుంభరాయాః ప్రాణతర్పణపరాయాః. నికృతింజుషో వంచనపరాయాః స్త్రియా సుతరామసావనువృత్తిస్సుదుదుష్క రేతి. 54

శోభనమని భావింతురు. అందువలనే వారు దురదృష్టవంతులని అర్థము. 53

అందువలన గృహమునకు అధీశ్వరివగు ఓ రుక్మిణీ! నీవు నా యందు సంసారతారకమైన నిష్కామప్రేమను చూపితివి. అట్టి నిష్కామ రతి నీచులయందుండదు. దురభిప్రాయము కలిగి వంచనాపరులై తమ ప్రాణతృప్తిని మాత్రమాశించెదు స్త్రీలలో నిశ్చయముగ అట్టి నిష్కామ ప్రేమయుండదు. 54

శ్లో ॥ సత్వాదృశీం ప్రణయినీం గృహిణీ గృహేషు
పశ్యామి మానిని యయా స్వవివాహకాలే ।
ప్రాప్తాన్న పానవిగణయ్యరహో అహో మే
ప్రస్థాపితో ద్విజ ఉపశ్రుతసత్కథస్య ॥ 55

టీ:- కించ సంతి నిష్కామాః ప్రేమైవ మయ్యనువర్తమానా బహ్వ్యః కింతు త్వయా సదృశీం చాపి క్వాపి న పశ్యామితి తస్యాః భక్తిం బహుమానేనాభినందతి-త్రిభిః. నేతి. ఉపశ్రుతాస్సత్యః కథా యస్యమే 55

మరియు నిష్కామ ప్రేమతో నన్నునుసరించువారు అనేకులున్నారు. కాని నీవంటిదానినెందును చూడలేదని రుక్మిణి భక్తిని బహుమాన పూర్వకముగ అభినందించుచున్నాడు-మానినీ ! ప్రేమ స్వరూపిణివగు నీవంటి గృహిణిని గృహములందు ఎచటను చూడలేదు. ఎందుకనగా తన వివాహకాలమున స్వయంవరార్థము వచ్చిన రాజకుమారులను లెక్కచేయక నా కథలను విని ప్రభావితురాలవై ఆహా ! నా కొరకు రహస్య దూతగ విప్రుని పంపితివి గదా ! 55

శ్లో॥ భ్రాతుర్విరూప కరణం యుధినిర్జితస్య
ప్రోద్వాహపర్వణిచ తద్వధమక్షగోష్ఠ్యాం ।
దుఃఖంసముత్థమసహోऽస్మదయోగభీత్యా
నైవాబ్రవీఃకి మపి తేనవయం జితాస్మ ॥ 56

టీ:- భ్రాతురితి. ప్రోద్వాహపర్వణి అనిరుద్ధవివాహే అక్షగోష్ఠ్యాం ద్యూతసభాయాం. తస్య భ్రాతుర్వధం తస్మిన్ కాలే కాలాంతరే. తదనుస్మరణతః పునః పునః సముత్థం దుఃఖం అస్మాభిరయోగో వియోగః తద్భీత్యా. అసహః సోఢవత్యసి. అనేనైవానిరుద్ధవివాహానంత ర్యమస్య జ్ఞాతవ్యం. 56

ఓ రుక్మిణీ ! యుద్ధమున పరాజితుడైన అన్నను రుక్మిని వికృతరూపునిగచేసి అనిరుద్ధుని వివాహము సందర్భమున పాచికల జూదమున, అతనిని చంపుటయు, దానివల్ల కల్గిన దుఃఖమును మా వియోగ భయముతో సహించితివి. పల్లెత్తు మాటయు నిందాపూర్వక ముగ మమ్ములననలేదు. ఆ సహనశక్తితో మేము నీచే జయింప బడితిమి. 56 (ఈ కథ ముందు రాలదు)

శ్లో॥ దూతస్త్వయాత్మ లభనే సు విభక్త మంత్రః
ప్రస్థాపితో మమిచిరాయతి శూన్యమేతత్ ।
మత్వాజిహాస ఇదమంగమనన్య యోగ్యం
తిష్ఠేత తత్త్వమివయం ప్రతి నందయామః ॥ 57

టీ:- అపి చ. దూత ఇతి. ఆత్మలభనే మత్రాప్త్యర్థం. మయి చిరాయతిశ్వో భావిని వివాహే ఆగంతవ్యమితి కృతే సమయే కథంచిదప్రాప్తవతి సతి. ఏత ద్విశ్వం శూన్యం మత్వా ఇదమనన్య యోగ్యం అంగం జిహాసే త్యక్తుమిచ్ఛామీత్యేవం దూతఃప్రస్థాపితః తథా హ్యుక్తం త్వయా. శ్లో.యద్యంబుజాక్ష న లభేయ భవత్ప్రసాదం జహ్యామసూన్ వ్రతకృశాన్ శతజన్మభిస్స్యామితి. యద్వా. అజిహాస ఇతి ఛేదః త్యక్తుమైచ్ఛత ఇత్యర్థః. తతః తత్తవ కర్మ త్వయ్యేవ తిష్ఠేత న తత్ప్రతికర్తుం శక్యమిత్యర్థః. కింతు కేవలం వయం త్వాం ప్రతినందయామః హర్షయామ ఇతి. 57

భామినీ ! నీవు నన్ను భర్తగ పొందగోరిన దానవై చక్కని మంత్రాలోచనము చేసి రేపు జరగబోవు వివాహ సమయమునకు రావలసినదని దూతను బంపితివి. నేను ఆలస్యమాచరించినచో ఈ జగత్తును శూన్యముగ భావించి ఇతరులకు అర్పించ తగని శరీరమును త్యాగము చేయుదునని యంటివి. ఇట్టి సునిశ్చిత కర్మను నీ యందే గాంచుచున్నాను. అందుకై మేము నిన్నెంతయో అభినందించుట తప్ప మరేమి ప్రత్యుపకారము చేయగలము. 57

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఏవం సౌరత సల్లాపైర్భగవాన్ దేవకీసుతః ।
స్వరతోరమయారేమే నరలోకం విడంబయన్ ॥58

శ్లో॥ అథాన్యాసామపి విభుర్గ్రహేషు గృహవానివ ।
ఆస్థితో గృహమేధీయాన్ ధర్మాన్ లోకగురుర్హరిః ॥ 59

టీ:- ఏవమితి. సౌరతసల్లాపైః సురతనర్మ గోష్ఠీభిః . 58,59

**ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,**
**షష్టితమోఽధ్యాయః**

**శ్రీ శుకులు పలికిరి.**

ఈ విధముగ భగవంతుడు దేవకీనందనుడగు శ్రీకృష్ణభగవానుడు సురత నర్మోక్తులచే నరలోకము నాశ్చర్యమున ముంచెత్తుచూ రమారూపిణి యగు రుక్మిణితో ఆనంద క్రీడల నానందించెను. 58

అదేవిధముగ పరాత్పరుడు విభుడు అన్యకాంతామణుల గృహము లందును యజమానివలెనున్నవాడై గృహస్థ ధర్మములను నిర్వర్తించుచు లోకమునకు గురుతుల్యుడైనిలిచెను. 59

**శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు**
**అరవయవ అధ్యాయము సమాప్తము**

## ఏకషష్టితమోఽధ్యాయః

శ్లో॥ ఏకషష్టితమే శౌరేః పుత్రపౌత్రాది సంతతిః ।
అనిరుద్ధ వివాహేచ రుక్మిణో రామతో వధః ॥
అష్టాదిక శతద్వ్యష్ట సహస్ర స్త్రీ సముద్భవాన్ ।
కోటిశః పుత్ర పౌత్రాదీన్ హరిర్ద్వారై రయోజయత్ ॥

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఏకైక శస్తాః కృష్ణస్య పుత్రాన్ దశదశాబలాః ।
అజీజనన్న నవమాన్పితుస్సర్వాత్మ సంపదా ॥ 1

టీ:- తదేతద్వక్తుమాహ- ఏకైకశ ఇతి. కృష్ణస్యాబలా భార్యాః సర్వాయా. ఆత్మని సంపత్ తయా. పితాస్సకాశాదనవమాన్ అన్యూనాన్. 1

శ్లో॥ గృహాదనపగం వీక్ష్య రాజపుత్ర్యోచ్యుతం స్థితం ।
స్వం స్వం న్యమంసతప్రేష్టంన తత్త్వ విదుస్త్రియః ॥ 2

టీ:- గృహాదితి. న్యమంసత. ప్రేష్ఠం అచ్యుతస్య ప్రియతమం ప్రత్యేకం స్వం స్వం మేనిరే. నతస్య తత్త్వమాత్మారామత్వం విదంతి తాః . 2

## 61 వ అధ్యాయము

ఈ అరవై ఒకటవ అధ్యాయమున కృష్ణునకు పుత్రపౌత్రాది సంతతిని గూర్చి అనిరుద్ధుని వివాహ సందర్భమున అక్షద్యూతము నందు బలరామునిచే రుక్మివధయు, 16008 మంది కాంతలను పరిణయమాడిన హరి కోట్లాది పుత్రపౌత్రులను పొందుటయు వర్ణింపబడినది.

శ్రీకృష్ణుని పత్నులు ఒక్కొక్కరు పదిమందికి తక్కువగాకుండగ తండ్రి శక్తి సామర్థ్యములలో హీనముగాని పుత్రులను కనిరి. 1

తమతమ గృహములను వదలక గృహస్థ ధర్మములందాసక్తుడైన అచ్యుతుని చూచి ఆయా రాకుమార్తెలు తామే అచ్యుతునికి మిక్కిలి ప్రియమైన వారమని తలంచిరి. కాని ఆ పురుషుని తత్త్వము ఆత్మారామత్వమని ఒక్కరును ఎరుగరైరి. 2

శ్లో॥ చార్వబ్జకోశవదనాయత బాహునేత్ర
స ప్రేమహాస రసవీక్షిత వల్గుజల్పైః ।
సం మోహితా భగవతో నమనో విజేతుం
స్వైర్విభ్రమైస్సమశకన్ వనితా విభూమ్నః ॥ 3

టీ:- ఆత్మరామత్వం వన్యక్తి ద్వయేన-చార్వితి. చార్వబ్జకోశవద్వదనం చ. ఆయతాని బాహునేత్రాణి చ సప్రేమ్ణాహాస్య రసేన వీక్షణాం చ. వల్గుజల్పాశ్చ. భగవత ఏతైస్సమ్మోహితాః వనితాః స్వై స్వై రనేకైవిభ్రమైః తస్య మనో విజేతుం హర్తుం. న సమశకన్ శక్తాన బభూవుః. విభూమ్నః పరిపూర్ణస్య. 3

శ్లో॥ స్మాయవ లోకలవదర్శిత భావహారి
భ్రూమండల ప్రహిత సౌరత మంత్ర శౌండైః ।
పత్న్యస్తుషోడశ సహస్రమనంగబాణై
ర్యస్యేంద్రియం విమథితుం కరణైర్నశేకుః ॥ 4

టీ:- తాసాం విభ్రమాన్ వర్ణయన్ ఏతద్వివణోతి-స్మాయేతి. స్మాయో గూఢహసితం. తద్యుక్తః అవ లోకః తస్య లవః కటాక్షః. తేన దర్శితః సూచితో భావో௨భిప్రాయః. తేన హరి మనోహరణశీలం. యద్భ్రూ

శ్రీకృష్ణ పరమాత్మ ఆత్మారామత్వమును రెండు శ్లోకములచే స్పష్టము చేయుచున్నాడు.

పరిపూర్ణుడగు భగవంతుని సుందరమగు ముఖ పద్మముచే, ఆజానుబాహువులచే, ఆకర్ణాంతనయనములతో, ప్రేమరసపురిపుష్టమైన క్రీగంటి చూపులతో, మనోహరమైన మాటలచేతను, సమ్మోహితులైన వనితలు తమతమ అనేక విలాసములతో ఆయన మనసును హరింప అసమర్థలైరి. 3

ఆ పదహారువేల మంది పత్నులు, మదనబాణములవంటి ప్రేమపూర్వకమైన చూపులతో ప్రదర్శించు మహాభావములతోడను, సురత మంత్ర సమయములగు భ్రూవిలాసములతోడను, ఇతరములగు, శాస్త్ర ప్రసిద్ధమైన కార్యములతోడను, అచ్యుతుని మానసేంద్రియమునకు కలచివేయజాలరైరి. (స్ఖలింపజేయలకపోయిరి.) 4

మండలం తేన ప్రహితాః ప్రస్థాపితాః. యే సౌరతమంత్రాః తేషు శౌండైః ప్రగల్భైః. అనంగస్య బాణైః శరైః అన్యైశ్చ కరణైః కామశాస్త్ర ప్రసిద్ధైః యస్యేంద్రియం మనో మివధితుం క్షోభయితుం. షోడశ సహస్రమపి పత్న్యో న శేకురితి. 4

శ్లో॥ ఇత్థం రమాపతి మవాప్యపతిం స్త్రియస్తా
బ్రహ్మాదయోऽపిన విదుః పదవీం యదీయాం ।
భేజుర్ముదావితతమేధీతయానురాగ
హాసావ లోకనవ సంగమ లాలసాద్యమ్ ॥ 5

టీ:- ఇత్థమితి. అనురాగేణ హాసోऽవలోకశ్చ. నవసంగమే లాలన వసంగమలాలసాత్. యం భేజుః తస్య మనో విజేతుం న శేకురితి. 5

ఈ విధముగ బ్రహ్మాదులచేత కూడ తెలియజాలని భాగ్య స్థానమును పొందియూ, అట్లే, అనురాగపూరితమైన చిరునగవు, ఆలోకనములను, నూతన సమాగమమునందలి ఉత్సాహములను కూడ పొందియు, ఆదిపురుషుడగు రమాపతిని భర్తగా పొందియు ఆ స్త్రీలు ఆయన మనసును జయింపజాలరైరి. 5

శ్లో॥ ప్రత్యుద్గమాసనవరార్హణ పాదశౌచ
తాంబూల విశ్రమణ వీజనగంధమాల్యైః ।
కేశ ప్రసారశయనస్నపనోపహార్యై
ర్దాసీశతా అపివిభోర్విదధుస్స్మదాస్యమ్ ॥ 6

శతాధికులైన దాసదాసీజనులున్నను, పరాత్పరునకు గౌరవముగ లేచి ఎదురు పోవుట, ఆసనమున సుఖాసీనుని చేసి కాళ్ళు కడిగి, అలంకరించి, తాంబులాదులనొసగి, విశ్రాంతించు సమయమున వింజామరలు వీయుచు, గంధ పుష్పాదులను సమర్పించుచు, కేశసంవాహనము చేయుచు, శయన, స్నానాదులను సమకూర్చుచు, దాస్యమును తామే చేయుచుండిరి. 6

శ్లో॥ యాస్స్వర్చితం స్వభవనేష్వధిరూఢభావై
ర్లక్ష్మ్యైకధామ రజసా ప్లుతవీక్షణేన ।
ఐక్షన్మతా అపిపతిం న చ తాః కటాక్షైః
స్థూణాం తరేణ నవసంగమ లజ్జయైక్షన్ ॥ 7

తమ భవనములందు చక్కగా రమానిలయుని పూజించియు, అనురాగపూరిత కటాక్షములతో చూడవలయునను కాంక్షకలవార య్యును, నవ సంగమకాలమున కల్గిన సిగ్గుతో విభుని చూడజాలక పోయిరి. 7

శ్లో॥ రామాగృహేవిహరతః పురతః కరాభ్యాం
బద్ధేక్షణా స్స్వదయతస్యముదా హసంత్యః ।
గోత్రాంత రాణ్యభి దధుర్నతు పూరుషస్య
క్లేశాపహాన్యపి తదంగజ భంగభీతాః ॥ 8

స్త్రీలు తమ గృహమలందు కనులయెదుట విహరించుచు ఆనందములతో నవ్వుచు మదన భావము భంగమగునను భయముతో వారి గోత్రనామములను తలపరైరి. (మైమరచిరి) 8

టీ:- కింతు. ప్రత్యుద్గమేతి. ప్రత్యుద్గమభిర్విభోస్తస్య దాస్యం నిత్యం విదధురితి ప్రౌఢాభావేఽపి నవసంగమాద్యభిధానం. అగతసారత్వే నౌత్సుక్యేన చ తథా ప్రతీతేః తేషామేవ శ్లోకానాం ప్రస్తావాంతరే పునః పునరావృత్తిరతి సౌందర్యాత్.(6-8)

శ్లో॥ తాసాంయాదశ పుత్రాణాం కృష్ణస్త్రీణాం పురోదితాః ।
అష్టామహిష్య స్తత్పుత్రాన్ ప్రద్యుమ్నాదీన్ గృణామి తే ॥ 9

శ్లో॥ చారుదేష్ణస్సుదేష్ణశ్చ చారుదేవశ్చ వీర్యవాన్ ।
సుచారుశ్చారుగుప్తశ్చ భద్రచారుస్తథా పరః ॥10

ఆ షోడశ సహస్ర స్త్రీలతో పూర్వము దశ పుత్రులను పొందిన వారుగ చెప్పబడిన అష్టమహిషులను వారి ప్రద్యుమ్నాది పుత్రుల నామములను చెప్పెదను. అందు రుక్మిణికి హరివలన ప్రద్యుమ్నుడు, చారుదేష్ణుడు, సుదేష్ణుడు, పరాక్రమశాలియగు చారుదేవుడు, సుచారువు, చారుగుప్తుడు, భద్రచారువు, చారుభద్రుడు, విచారుడు,

శ్లో ॥ చారుభద్రో విచారుశ్చ చారుశ్చ దశమో హరేః ।
ప్రద్యుమ్నప్రముఖా జాతా రుక్మిణ్యాऽనవమా పితుః ॥ 11

చారువు అను పదిమంది హరి శక్తియుక్తుల పుణికిపుచ్చుకున్నవారై జన్మించిరి. (9-11)

శ్లో ॥ భానుస్సుభానుస్స్వర్భానుః ప్రభానుర్భానుమాంస్తథా ।
చంద్రభానుర్బృహద్భాను రవిభానుస్తథాష్టమః ॥ 12

శ్లో ॥ శ్రీభానుః ప్రతిభానుశ్చ సత్యభామత్మజాదశ ।
సాంబస్సుమిత్రః పురుజిచ్ఛతజిచ్చసహస్రజిత్ ॥ 13

శ్లో ॥ విజయశ్చిత్ర కేతుశ్చ కీర్తిమాన్ ద్రవిణఃక్రతుః ।
జాంబవత్యాసుతా హ్యేతే సాంబాద్యాః పితృసంమతాః ॥ 14

భానువు, సుభాను, స్వర్భానువు, ప్రభానువు, భానుమంతుడు, చంద్రభానువు, బృహద్భానువు, విభానువు, శ్రీభానువు మరియు ప్రతిభానువులను పదుగురు సత్యభామ తనయులు. అట్లే సాంబుడు, సుమిత్రుడు, పురుషజిత్తు, శతజిత్తు, సహస్రజిత్తు, విజయుడు, చిత్రకేతువు, కీర్తిమంతుడు, ద్రవిణుడు, క్రతువు అను పదిమంది పత్ృ తండ్రితో సమానులైన జాంబవతి సుతులు.(12-14)

టీ:- ప్రాంసంగికముక్త్వా ప్రస్తుతమహో-తాసామితి. దశదశపుత్రా యాసాంతాసాం మధ్యేఅష్టౌ మహిష్యో యాః ప్రాగుక్తాః. తత్పుత్రానితి. (9-14)

శ్లో॥ భానుశ్చంద్రోऽశ్వసేనశ్చ చిత్రగుర్వేగవాన్ వృషః ।
ఆమశ్శంకుర్వసుశ్శ్రీమాన్ కృతిర్నాగ్నజితేస్సుతాః ॥ 15

భానుడు, చంద్రుడు, అశ్వసేనుడు, చిత్రగుడు, వేగవంతుడు, వృషుడు, ఆమహుడు, శంకువు, శ్రీమంతుడు, వసువు, కృతియను పదిమంది నాగ్నజితి కుమారులు. 15

టీ:- భానురితి. శ్రీమానితి వసోః కృతేర్వా విశేషణం. 15





ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో ॥ శ్రుతః కవిర్వృషో వీరస్సుబాహుర్భద్ర ఏకలః ।
శాంతర్దర్శః పూర్ణమాసః కాళింద్యాస్సోమకోవరః ॥ 16

టీ:- శ్రుత ఇతి. భద్రో నామ ఏకలః ఏకః సోమకః అవరః కనీయాన్ ఏతే కాళింద్యాస్సుతా ఇతి. 16

శ్రుతుడు, కవి, వృషుడు, వీరుడు, సుభాహువు, భద్రుడు, ఏకలుడు, శాంతుడు, దర్శుడు, పూర్ణమాసుడు, శ్రేష్ఠులు పదుగురు కాళింది తనయులు. 16

శ్లో॥ ప్రఘోషో గాత్రవాన్ సంహోబలః ప్రబల ఊర్ధ్వగః ।
మాద్ర్యాస్సుతా మహాశక్తిస్సహస్తేజో ఽపరాజితః ॥ 17

టీ:- ప్రఘోష ఇతి. మాద్ర్యాః లక్ష్మణాయాః. 17

లక్షణసుతులు – ప్రఘోషుడు, గాత్రవంతుడు, సంహుడు, బలుడు, ప్రబలుడు, ఊర్ధ్వగుడు, మహాశక్తి, సహుడు, తేజుడు, అపరాజితుడు అనువారలు. 17

శ్లో॥ వృకోహ్యర్కోఽనిలోగృధ్రో బహ్వాన్నో నాథ ఏవచ ।
మహాశః పావనోవహ్నిర్మిత్రవిందాత్మజాస్సుధీః ॥ 18

టీ:- వృక ఇతి. సుధీర్దశమః ఏతే మిత్రవిందాత్మజాః. 18

మిత్రవింద సుతులు – వృకుడు, అర్కుడు, అనిలుడు, గృధ్రుడు, బహ్వాన్నుడు, నాథుడు, మహాశుడు, పావనుడు, వహ్ని, సుధీ అను వారు. 18

శ్లో॥ సంగ్రామజిద్బృహత్సేనః శూరః ప్రహరణోఽరిజిత్ ।
యజ్ఞస్సుభద్రో భద్రాయా వామ ఆయుశ్చ సత్యకః ॥ 19

టీ:- సంగ్రామజిదితి. సంగ్రామజిత్ప్రముఖాస్సత్యకాంతాః భద్రాయాః సుతాః శైబ్యానామపి సైవ. 19

సంగ్రామజిత్తు, బృహత్సేనుడు, శూరుడు, ప్రహరణుడు, అరిజిత్తు, యజ్ఞుడు, సుభద్రుడు, వాముడు, ఆయువు, సత్యకుడు అను పదిమంది భద్రా పుత్రులు.(వీరిని శైబ్యాపుత్రులనీ అందురు) 19

శ్లో॥ దీప్తిమాంస్తామ్రపత్రాద్యా రోహిణ్యా స్తనయాహరేః ॥ 20

శ్లో॥ ప్రద్యుమ్నస్యానిరుద్ధోஉభూద్రుక్మదత్యాం మహాబలః ।
పుత్రాంతు రుక్మిణో రాజన్నామ్నా భోజకటే పురే ॥ 21

టీ:- దీప్తిమానతి. రోహిణ్యాస్సుతానాము క్తిరన్యాసము పలక్షణార్థం (20-21)

దీప్తిమంతుడు, తామ్రపతి మొదలైనవారు హరికి రోహిణి యందు జన్మించిన సుతులు.ఓ రాజా! భోజకటమను పట్టణమున ప్రద్యుమ్నునకు అనిరుద్ధుడను పుత్రుడు, రుక్మవతియను రుక్మి పుత్రిక యందు మహాబలుడు అనువారలు జన్మించిరి. (20-21)

శ్లో॥ ఏతేషాం పుత్రపౌత్రాశ్చ బభూవుః కోటిశో నృప ।
మాతరః కృష్ణ జాతానాం సహస్రాణిచ షోడశ ॥ 22

టీ:- ఏతేషామితి. అన్యేషామపిశ్రీకృష్ణ పుత్రానాం శతసంఖ్యాః స్త్రీషు పుత్రాశ్చపౌత్రాశ్చ కోటిశో బభూహాః. తత్ర హేతుత్వేన శ్రీకృష్ణ పత్నీనాం బాహుళ్యమనుస్మారయతి. మాతరః కృష్ణజాతానామితి. చ శబ్దేన అధికాశ్చేత్యుక్తం. 22

ఓరాజా! వీరికి జన్మించిన పుత్రులు పౌత్రుల కలసి కోట్ల కొలదిగనైరి. శ్రీకృష్ణ సంతతికి తల్లులు మాత్రము 16008 మంది రాకుమార్తెలు. 22

**పరీక్షిదువాచ**

శ్లో॥ కథం రుక్మ్యరి పుత్రాయాః ప్రాదాద్దుహితరం యుధి ।
కృష్ణేన పరిభూతస్తం హంతుంరంధ్రం ప్రతీక్షతే ॥ 23

**పరీక్షిత్తు పలికెను**

ఓ శుకమహర్షీ! యుద్ధరంగమున కృష్ణునిచే అవమానితుడై, అతనిని పరిమార్చుటకు సమయమును ప్రతీక్షించు రుక్మి హరి పుత్రుడగు ప్రద్యుమ్నునకు తన కూతురును ఎట్లు ఇచ్చెను?

శ్లో॥ ఏతదాఖ్యాహి మేవిద్వన్ ద్విషోర్వైవాహికం మిథః ॥ 24

శత్రువులకు పరస్పర వైవాహికీ సంబంధమెట్లు కుదిరెనో నాకు వివరముగ చెప్పవలసినది. (23-24)

టీ:- కథమితి. యః కృష్ణం హంతుంరంధ్రం ప్రతీక్షతే స కథం ప్రాదాదితి. 23

టీ:- ఏతదితి. వైవాహికం వివాహనిమిత్తం. 24

శ్లో॥ అనాగతమతీతంచ వర్తమాన మతీంద్రియం ।
విప్రకృష్ణంవ్యవహితం సమ్యక్పశ్యంతి యోగినః ॥ 25

మనకు ఇంద్రియగోచరములుకానట్టి, భూత భవిష్యద్వర్తమాన విషయములను, దూరముగ నున్నవాటిని, నాలుగు గోడలమధ్య జరిగిన విషయములను కూడ యోగులైన వారు బాగుగ చూడగలరు. ఇందుకుదాహరణము - ప్రద్యుమ్నుడు స్వయంవరమున రుక్మవతిచే వరింపబడినవాడై రాజులను జయించి పరిమార్చుటయే. 25

టీ:- నను రుక్మిణోఽభిప్రాయం కథం జానీమ ఇతి చేత్తత్రాహ- అనాగతమితి. అతీంద్రియం అస్మదింద్రియాగోచరం. విప్రకృష్టం దూరస్థం. వ్యవహితం కుడ్యాద్యంతరితం. అత్రోత్తరం స్వయంవరే రుక్మవత్యావృతస్సన్. 25

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ యద్యప్యనుస్మరన్ వైరం రుక్మీ కృష్ణావమానితః ।
వ్యతరద్భాగినేయా యసుతాంకుర్వన్ స్వసుః ప్రియమ్ ॥ 26

**శ్రీ శుకులు పలికిరి**

శ్రీకృష్ణునిచే అవమానితుడనైతినను వైరమును తలంచుకొనుచున్నను రుక్మి, సోదరియగు రుక్మిణికి ప్రియమాచరించుటకై తన మేనల్లునకు కూతురును రుక్మవతినిచ్చి పరిణయము చేయుట కంగీకరించెను. 26

శ్లో॥ వృత స్వయంవరే సాక్షాదనంగోంగయుతస్తయా ।
రాజ్ఞస్సమేతాన్నిర్జిత్యహారైకరథో యుధి ॥ 27

టీ:- యదీతి. యద్యపి కృష్ణావమానితః. తథాపి వైరమనుస్మరన్నపి వ్యతరత్ అదాత్ అన్వమోదతేత్యర్థః.(26-27)

అని అనిరుద్ధుని వివాహమున శ్రీబలరామునిచే చేయబడిన రుక్మి వధాది కథా ప్రారంభ ఘట్టము ప్రస్తావిస్తున్నాడు. సాక్షాత్తుగ మదనరూపమున జన్మించిన ప్రద్యుమ్నుడు స్వయంవరమున రుక్మి కూతురు రుక్మవతిచే వరింపబడినవాడైననూ అది సహింపక తనపై దండెత్తి వచ్చిన రాజ సమూహమును ఏకరథుడై జయించి రుక్మవతిని కొనిపోయెను. 27

శ్లో॥ రుక్మిణ్యాస్తనయాం రాజన్ కృతవర్మసుతోబలీ ।
ఉపయేమే విశాలాక్షః కన్యాం చారుమతీం కిల ॥ 28

టీ:- సర్వాసామప్యేకైకా కన్యాతత్సర్వ వివాహోపలక్షణార్థం జ్యేష్ఠకన్యా వివాహమహ - రుక్మిణ్యా ఇతి. 28

శ్రీకృష్ణునకు పదహారువేలమంది భార్యలందు ఒక్కొక్కరికి ఒక కూతురు జన్మించెను. వారందరి వివాహములకు ఉదాహరణముగ జ్యేష్ఠ కన్యకా వివాహమును గూర్చి నుడువుచున్నాడు - ఓ రాజా! కృతవర్మ సుతుడు మహాబలవంతుడగు విశాలాక్షుడు రుక్మిణీకృష్ణుల జ్యేష్ఠపుత్రిక చారుమతిని పరిణయము చేసికొనెను. 28

శ్లో॥ దౌహిత్రాయానిరుద్ధాయ పౌత్రీం రుక్మ్యదదాద్ధరేః ।
రోచనాం బద్ధవైరోఽపిస్వసుః ప్రియచికీర్షయా ।
జానన్న ధర్మం తద్యౌనం స్నేహపాశానుబంధనః ॥ 29

టీ:- సర్వాసామప్యేకైకాకన్యా తత్సర్వవివాహః తద్యౌనం అధర్మం జాన్ననితి. శ్లో. "ద్విషదన్నం న భోక్తవ్యం ద్విషంతం నైవ భోజయే"

శ్రీకృష్ణునకు బద్ధవైరియైనను, సోదరికి ప్రియ మాచరింప దలచినవాడై రుక్మి తన పౌత్రిని రోచనయను కన్యను దౌహిత్రుడు రుక్మవతి సుతుడు అగు అనిరుద్ధునకిచ్చి వివాహము చేసెను. ఈ వివాహము ధర్మ సమ్మతము కాదని తెలిసియు స్నేహ పాశమునకు కట్టుబడి ఇట్లు చేసెను. 'ద్విషదన్నం నభోక్తవ్యం ద్విషంతంనైవభోజయేత్' అని శాస్త్రము. "శత్రువుఇంట భుజింపరాదు. అట్లే శత్రువుకు అన్నము

దిత్యాది శ్లోకవిచారాత్. శ్లో. "అస్వర్గ్యం లోకవిద్విష్టం ధర్మ్యమప్యాచరేన్న" త్వితినిషేధాచ్చేత్యర్థః. 29

శ్లో॥ తస్మిన్నభ్యుదయే రాజన్ రుక్మిణీ రామకేశవౌ ।
పురం భోజకటం జగ్ముస్సాంబ ప్రద్యుమ్నకాదయః ॥ 30

శ్లో॥ తస్మిన్నిర్వృత్త ఉద్వాహే కాళింగ ప్రముఖా నృపాః ।
దృప్తాస్తే రుక్మిణం ప్రోచుర్బలమక్షైర్వినిర్జయ ॥ 31

టీ:- లోకవిరుద్ధాచరణఫలం వక్తుమాహ - తస్మినితి.(30-31)

శ్లో॥ అనక్షజ్ఞోహ్యయం రాజన్నపి తద్వ్యసనం మహత్ ।
ఇత్యుక్తోబల మహూయతేనాక్షై రుక్మ్యదీవ్యత ॥ 32

శ్లో॥ శతం సహస్రమయుతం రామస్తత్రాదదేపణం ।
తంతు రుక్మ్యజయత్తత్రకాళింగః ప్రాహసద్బలం ।
దంతాన్ సందర్శయన్నుచ్చైర్నామృష్యతద్ధలాయుధః ॥33

టీ:- అనక్షజ్ఞ ఇతి. అదీవ్యత అదీవ్యత్ క్రీడితవాన్.(32-33)

పెట్టరాదు" అని శాస్త్రము చెప్పుచున్నది. ఇంకను ' అస్వర్గ్యంలోక విద్విష్టం ధర్మమప్యాచరేన్నతు ' లోకనిందితము మోక్షకారికాదు. అది ధర్మమైనను ఆచరణయోగ్యముకాదనియు శాస్త్రము నుడువుచున్నది. 29

లోక విరుద్ధాచరణమునకు ఫలమును చెప్పుచున్నాడు-ఓరాజా! అనిరుద్ధ-రోచనల వివాహముకై కృష్ణుడు రుక్మిణి, బలరామదేవుడు, సాంబప్రద్యుమ్నులతో కూడి భోజకటమను పట్టణమునకు పోయిరి. అచట వివాహానంతరము బలగర్వితులైన కాళింగ ప్రముఖులైన రాజులు ద్యూత క్రీడయందు బలరాముని జయింపుమని రుక్మిని పురిగొల్పిరి. (30-31)

ఓ రాజా! బలరామునకు పాచికలాటరాదు. ఆ జూదము గొప్ప వ్యసనము అని పలుకబడి వ్యసన బలముచే రుక్మి బలరాముని పిలిచి అతనితో జూదమాడెను.

ఆ జూదమున బలరాముడు నూరు, వేయి, పదివేల బంగారు మాడలను పందెముగ పెట్టెను. రుక్మి ఆ ధనమునంతటిని గెల్చుకొనెను. ఆనందమును పట్టలేక కాళింగుడు నోటి పండ్లన్నియు కనిపించునట్లు ప్రదర్శించుచు కేరింతలుగొట్టుచు బలదేవుని పరిహసించెను. హలాయుధుడు ఆ వెటకారమును సరకుగొనడయ్యెను. (32-33)

శ్లో॥ తతోలక్షం రుక్మ్యగృహ్ణాద్గ్లహంతత్ర జయద్బలః ।
జితవానహమిత్యాహ రుక్మికైతవమాశ్రితః ॥ 34

టీ:- తత ఇతి. నిష్కాణాం లక్షం గ్లహం పణం కృతవాన్. కైతవం కపటం. 34

పిమ్మట బలదేవుడు లక్షమాడలను పణముగ పెట్టెను. దానిని బలరాముడు గెలిచెను. మోసమునకు పాల్పడిన రుక్మి నేనే గెలిచితినని గేలి చేసెను. 34

శ్లో॥ మన్యునాక్షుభితశ్శ్రీమాన్ సముద్ర ఇవపర్వణి ।
జాత్యారుణాక్షోஉతిరుషాన్యర్బుదంగ్లహ మాదదే ॥ 35

టీ:- మన్యునేతి. న్యర్బుదం దశకోటీః గ్లహం పణం క్షుభితో రామ ఆదదే. 35

పున్నమి నాటి సముద్రునివలె కోపముతో కలతచెందిన శ్రీబలరాముడు ఆగ్రహముతో అరుణిమ నేత్రములతో పది కోట్ల ధనమును పణముగ నుంచెను. 35

శ్లో॥ తంచాపి జితవాన్ రామో ధర్మేణచ్ఛలమాశ్రితః ।
రుక్మీజితం మయాత్రేమేవదంతు ప్రాశ్నికా ఇతి ॥ 36

శ్లో॥ తదాబ్రవీన్నభోవాణీ బలేనైవ జితోగ్లహః ।
ధర్మతో వచనేనైవ రుక్మీవదతి వైమృషా ॥ 37

ఆ పందెమును ధర్మముగ బలరాముడు జయించెను. కపటియగు రుక్మి నేనే గెలిచితినని పలుకుచు సభ్యులారా! మీరు న్యాయము చెప్పుడని గద్దించెను. అపుడు ఆకాశవాణి ధర్మబద్ధముగ బలరాముడే పణము గెలిచెనని, రుక్మి అసత్యముగ కపటముతో తాను గెలిచితినని అనుచున్నాడని పలికెను. (36-37)

శ్లో॥ తమనాదృత్య వైదర్భో దుష్ట రాజన్యచోదితః ।
సంకర్షణం పరివాసన్ బభాషేకాలచోదితః ॥ 38

శ్లో॥ నైవాక్షకో విదాయూయం గోపాల వనగోచరాః ।
అక్షైర్దీవ్యంతి రాజన్యో బాణైశ్చన భవాదృశాః ॥ 39

టీ:- తమితి. ఛలమాశ్రితో రుక్మీ మయా జితమిత్యాహ.(36-39)

శ్లో॥ రుక్మిణైవ మధిక్షిప్తో రాజాభిశ్చాపహాసితః ।
క్రుద్ధః పరిఘముద్యమ్య జఘ్నేతం నృమ్ణసంసది ॥ 40

శ్లో॥ కళింగ రాజాంతరసా గృహీత్వా దశమేపదే ।
దంతాన పాయత్క్రుద్ధోయోహసద్వివృతైర్ద్విజైః ॥ 41

శ్లో॥ అన్యేనిర్భిన్న బాహూరూశిరసోరుధిరోక్షితాః ।
రాజానోదుద్రువుర్భీతా బలేన పరిఘార్దితాః ॥ 42

ఆకాశవాణిని తృణీకరించి అనాదరముతో రుక్మి దుర్మార్గులైన రాజుల ప్రేరణముతో కాలము ముంచుకరాగ బలరాముని పరిహాసము చేయుచు పలుకుచున్నాడు. 38

ఓ బలరామా! గోవులకాయుచు వనములందు తిరుగు మీరు పాచికలాటలో పండితులుకారు. రాజులు పాచికలతోను, బాణముల తోడను ఆటలాడుకొందురు. మీ వంటి వారు అసమర్థులని రుక్మి పలికెను. 39

రుక్మిచే నీవిధముగ అధిక్షేపింపబడి, రాజులచే పరిహసితుడైన బలరాముడు కోపించి రాజసభయందే ఇనుపగుద్దియను తీసుకొని రుక్మిని చావబాదెను. 40

పదియడుగుల దూరమునుండి పండ్లిగలించి పరిహసించు చున్న కళింగరాజును పట్టుకొని కోపముతో పండ్లూడగొట్టెను. బలరాముని గుదియచే బాదబడిన ఇతర రాజులు కాళ్ళు చేతులు విరిగి తలలు పగిలి రక్తములోడు చుండగ కాలికి బుద్ధి చెప్పిరి. ఓరాజా! బావయగు రుక్మి చంపబడగ, స్నేహము భంగమగునేమోయను భయముచే యుక్తమనికాని అయుక్తమనికాని హరి, రుక్మిణి

శ్లో॥ నిహతే రుక్మిణిస్యాలేనాబ్రవీ త్సాధ్వసాధువా ।
రుక్మిణీ బలయో రాజన్ స్నేహ భంగ భయాద్ధరిః ॥ 43

టీ:- రుక్మిణేతి. నృష్ణసంసది శోభనసభాయాం నృపసంసదీతి పాఠాంతరం.(40-43)

శ్లో॥ తతోஉ_నిరుద్ధం సహసూర్యయా వరం
రథసమారోప్యయయుః కుశస్థలీం ।
రామాదయో భోజకటాద్దశార్ణకా
స్సిద్ధాఖిలార్థా మధుసూదనాశ్రయాః ॥ 44

టీ:- తత ఇతి. సూర్యయా నవోఢయా సిద్ధాః అఖిలాః అర్థాః అభ్యుదయ శత్రువదాదయోయేషాంతే. 44

**ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,**
**ఏకషష్టితమోஉ_ధ్యాయః**

బలరామునితో అనజాలకపోయిరి. (41-43)

అనంతరము మధుసూదనాశ్రితులైన దాశార్హులు శత్రువధ చేత అఖిలార్థములు సిద్ధించినవని తలంచుచు, బలరామాదులను నూతన పరిణీతయగు రోచనతో కూడ అనిరుద్ధుని రథముపై నెక్కించుకొని భోజకటపురము నుండి బయలుదేరి ద్వారకా నగరమునకు చేరిరి. 44

**శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు**
**అరవైఒకటవ అధ్యాయము సమాప్తము**

## ద్విషష్టితమోఽధ్యాయః

శ్లో॥ ద్వియుక్ షష్టితమే ప్రోక్త మనిరుద్ధస్య రోధనం ।
కన్యయా రమ మాణస్య బాణేన బహుబాహునా ॥

**శ్రీ శుకఉవాచ**

శ్లో॥ బాణః పుత్త్రశతజ్యేష్ఠో బలేరాసేన్మహాత్మనః ।
సహస్రబాహు ర్వాద్యేన తాండవేఽతోషయన్మృడమ్ ॥ 1

టీ:- ద్వియుక్ షష్టితమే ప్రోక్తమని రుద్ధస్య రోధనం .కన్యయా రమ మాణస్య బాణేన బహుబాహునా .1

శ్లో॥ భగవాన్ సర్వభూతేశశ్శరణ్యో భక్తవత్స లః ।
వరేణ ఛందయామాస స తం వవ్రే పురాధిపమ్ ॥2

శ్లో॥ స ఏకదాహ గిరిశం పార్శ్వస్థం వీక్ష్యదుర్మదః ।
కిరీటేనార్కవర్ణేన సంస్ప్రుశన్ తత్పదాంబుజమ్ ॥ 3

టీ:- భగవానితి. పురాధిపం పురపాలకం. ( 2-3)

## 62వ అధ్యాయము

ఈ అరవైరెండవ అధ్యాయమున రోచనతో ఆనందమున నున్న అనిరుద్ధుడు బహుబాహువగు బాణునిచే అడ్డగింపబడుట వర్ణింప బడినది.

**శ్రీశుకులు పలికిరి.**

మహానుభావుడగు బలిచక్రవర్తికి నూర్గురు పుత్రులు కలరు. వారిలో పెద్దవాడు బాణుడు అనువాడు. సహస్ర బాహువులు కలవాడు. భగవంతుడగు శివుడు తాండవము చేయు సమయమున డమరుకాది వాద్యములతో సంతుష్టునిగావించెను. 1

భగవంతుడు, భక్తప్రియుడు, రక్షకుడునగు సకల భూతపతియగు శివుడు బాణుని భక్తికి మెచ్చి వరమునిచ్చి ఆనందపరిచెను. బాణుడు తన పురపాలకునిగ నుండుమని శివుని వరమడిగెను.

దుర్మదుడగు బాణుడు ఒకమారు ప్రక్కనే యున్న కైలాసాధిపతిని చూచి సూర్యతేజమువలే మెరయు కిరీటముతో ఆ మహేశ్వరుని పదములకు మ్రొక్కి పలికెను. (2-3)

శ్లో॥ నమస్యేత్వాం మహాదేవ లోకానాం గురుమీశ్వరం ।
పుంసామపూర్ణకామానాం కామపూరామరాంఘ్రిపమ్ ॥ 4

కోరికలు తీరని పురుషుల కోరికలను పూరించుటకు కల్పతరువైన పాదపద్మములుగలట్టి, చతుర్దశ భువనములకధిపతి యైనట్టి మహాదేవ! నీకు నమస్కారము. 4

శ్లో॥ దోస్సహస్రం త్వయాదత్తం వరం భారయమేऽభవత్ ।
త్రిలోక్యాం ప్రతియోద్ధారంన లభే త్వదృతేసమమ్ ॥ 5

నీచే వరప్రసాదితములైన ఈ వేయి భుజములు నాకు భారభూతములగుచున్నవి. ముల్లోకములందు నీవు తప్ప నాతో సమముగ యుద్ధము చేయువాడు లభించుట లేదు. 5

టీ:- సమస్య ఇతి. కామాన్ పూరయతీతి కామపూరః స చాసాపమరాంఘ్రిపః కల్పతరుః తం త్వా.(4-5)

శ్లో॥ కండూత్యానిభృతైర్దోర్భి ర్యుయుత్సుర్దిగ్గజానహం ।
ఆద్యాయాం చూర్ణయన్నద్రీన్ భీతాస్తేऽపిప్రదుద్రువుః ॥ 6

శ్లో॥ తచ్ఛ్రుత్వా భగవాన్ క్రుద్ధఃకేతుస్తే భజ్యతేయదా ।
త్వద్దర్పఘ్నోభవేన్మూఢ సంయుగోమత్సమేనతే ॥ 7

ఓ ఆదిపురుషా! తీటతో తీవ్రమైన బాహువులతో నేను దిగ్గజములతో పోరదలచి మొదట పర్వతములను పిండిచేయుచు వచ్చుచుండగ ఆ దిగ్గజములు భీతిల్లి పారిపోయినవి.

ఆ మాటలను విని భగవంతుడు కోపనుడై మూర్ఖుడా! నీ ధ్వజము ఏనాడు ఎవనిచే కూల్చబడునో వాడే నీ దర్పముననుచువాడు. నాతో సమానమగు వీర్యవంతుడు అతనితో నీకు సంగరము జరుగునని పల్కెను. (6-7)

టీ:- అద్యేతి. హే అద్య నిభృతైర్భరి తైర్దోర్భిరద్రీన్ చూర్ణయన్ ఆయాం అగచ్ఛం. (6-7)

శ్లో॥ ఇత్యుక్తః కుమతిర్హృష్టస్స్వగృహం ప్రాపాశన్నృప ।
ప్రతీక్షన్ గిరిశాదేశం స్వవీర్యనశనం కుధీః ॥ 8

టీ:- ఇతీతి.స్వవీర్య వశనం నాశకం కేతుభంగం ప్రతీక్షమాణః 8

**ఉషా పరిణయ కథా ప్రారంభ ఘట్టము.**

ఓరాజా! ఈ విధముగ పరమేశ్వరునిచే పల్కబడిన పిదప ఆ కుమతి బాణుడు, తన శక్తిని అణచివేయుటకు సూచకమైన కేతుభంగమునకు, శివుని ఆదేశమును ఎదురుచూచుచు సంతసమున స్వగృహమున ప్రవేశించెను. 8

శ్లో॥ తస్యోషానామ దుహితా స్వప్నేప్రాద్యుమ్నినారతిం ।
కన్యాలభతకాంతేన ప్రాగదృష్టశ్రుతేన సా ॥ 9

టీ:- మహేషాదిష్టసమ్ గ్రామస్య ప్రసంగమాహ - తస్యేతి. ప్రాద్యుమ్నిన అనిరుద్ధేన. తత్రాపి స్వప్నే. 9

మహేశ్వరాదిష్ట సంగ్రామ ప్రసంగమును ప్రస్తావించుచున్నాడు బాణాసురునకు ఉషయను పేరుగల సుత కలదు. ఆమె పూర్వము కనని వినని కాంతుడగు అనిరుద్ధునతో కలయందు రతిసుఖమునను భవించెను. 9

శ్లో॥ సాతత్ర తమపశ్యంతీ క్వాపి కాంతేతివాదినీ ।
సఖీనాంమధ్య ఉత్తస్థౌ విహ్వలావ్రీడితా భృశమ్ ॥ 10

టీ:- సేతి. తం కాంతం అపశ్యంతీ సా ఉత్తస్థౌ. 10

ఆమె తన రాజనగరమున అతనిని కాంచనిదై, ప్రియా! ఎచట ఉన్నావని పలుకుచు చెలికత్తెలనడుమ మేల్కొని చలించుచు మిక్కిలి లజ్జితురాలయ్యెను. 10

శ్లో॥ బాణస్యమంత్రీ కుంభాండశ్చిత్రలేఖాచతత్సుతా ।
సఖ్యపృచ్ఛత్సఖీంచోషాం కౌతూహలసమన్వితా ॥ 11

టీ:- తతః కిం కృతం తదాహ.- బాణస్యేతి. 11

భాణుని మంత్రి కుంభాండుడను వాడు. అతని సుత చిత్రలేఖ. చిత్రలేఖ ఉషకు నెచ్చెలి. ఆమె కుతూహలమును పట్టజాలక, ఉషను విషయమేమిటని అడిగెను. 11

శ్లో॥ కాంతం మృగయసే సుభ్రు కేదృశస్తేమనోరథః ।
హస్త గ్రాహం నతేऽద్యాపి రాజపుత్ర్యుప లక్షయే ॥ 12

ఓ చెలి! కాంతుని వెదకుచుంటివా? నీమనోరథుడెట్లుండును? రాజపుత్రీ! ఇంతకాలము లభించని నీ భర్తను నేను వెతుకగలను. 12

**ఉషోవాచ**

శ్లో॥ దృష్టః కశ్చిన్నరస్స్వప్నే శ్యామః కమలలోచనః ।
పీతవాసా బృహద్బాహుర్యోషితాం హృదయంగమః ॥ 13

శ్లో॥ తమహం మృగయేకాంతం పాయయి త్వాధరం మధు ।
క్వాపియాతస్స్పృహయతీంక్షిప్త్వామాహృజినార్ణవే ॥ 14

**ఉష పలికెను**

నాకు స్వప్నమున ఒక నరుడు కనబడెను. అతను నీలవర్ణుడు. కమలలోచనుడు. పీతాంబరుడు. ఎగు భుజములవాడు. స్త్రీల హృదయములను దోచువాడు. అధర మధుపానము చేయించి కలలో తేలుచున్న నన్ను కష్టాల కడలిలో త్రోసి ఎచటికో పోయెను. అట్టి మనోహరునికై నేను వెదకుచున్నాను. (13-14)

**చిత్రలేఖోవాచ**

శ్లో॥ వ్యసనం తేऽపకర్షామి త్రిలోక్యాం యది భావ్యతే ।
తమానేష్యే నరం యస్తే మనోహర్తా తమాదిశ ॥ 15

టీ:- కాంత మితి. హస్తగ్రాహం భర్తారం(12-15)

**చిత్రలేఖ పలికెను**

రాకుమారి నీ మనస్సును దోచుకొనిన ఆ నరుడు, వరుడు ముల్లోకములలో ఎచట ఉన్నను వెదకి తీసుకొని వచ్చి నీ మనోబాధను తీర్చుదును. ఆదేశింపుము. 15

శ్లో॥ ఇత్యుక్త్వాదేవ గంధర్వ సిద్ధచారణ పన్నగాన్ ।
దైత్యాన్ విద్యాధరాన్ యక్షాన్ మనుజాంశ్చయథాలిఖత్ ॥ 16

టీ:- మనుజేష్వితి ప్రద్యుమ్నం లిఖితం వీక్ష్య శ్వశురోऽయమితి లజ్జితా. 16

అని పలికి చిత్రలేఖ దేవ, గంధర్వ, సిద్ధ, చారణ, పన్నగ, దైత్య, విద్యాధర, యక్ష మరియు మానవ యువకుల చిత్రపటములను గీచి చూపించెను, ఇందరిలో నీ మనోహరుని గుర్తించుమని అడిగెను. 16

శ్లో॥ మనుజేషు చ సావృష్ణేన్ శూరమాననకదుందుభిం ।
వ్యలిఖద్రామకృష్ణౌచ ప్రద్యుమ్నం వీక్ష్య లజ్జితా ॥ 17

టీ:- మనుజేష్వితి. ప్రద్యుమ్నం లిఖితం వీక్ష్య శ్వశురోఽయమితి లజ్జితా. 17

శ్లో॥ అనిరుద్ధం విలిఖితం వీక్ష్యోషాఽవాఙ్ముఖీస్థితా ।
సోఽసావసావితిప్రాహస్మయమానామహీపతే ॥ 18

శ్లో॥ చిత్రలేఖాత మాజ్ఞాయపౌత్రం కృష్ణస్య యోగినీ ।
యయావిహాయసారాజన్ ద్వారకాం కృష్ణ పాలితం ॥ 19

టీ:- అనిరుద్ధమితి. అనిరుద్ధం విలిఖితం వీక్ష్యఉషా అవాఙ్ముఖీ బభూవ. (18-19)

శ్లో॥ తత్రసుప్తం సుపర్యం కే ప్రాద్యుమ్నిం యోగమాస్థితాననా ।
గృహీత్వా శోణితపురం సఖ్యై ప్రియమదర్శయత్ ॥ 20

టీ:- తత్రేతి. శోణితపురం నీత్వా. 20

ఆ చిత్రలేఖ పటమునందు మానవులలో వృష్ణి వంశజులైన శూరుడు, వసుదేవుడు, బలరామకృష్ణులను, ప్రద్యుమ్నుని గీసెను. అందు ప్రద్యుమ్నుని చూచి ఈయన తన మామయని లజ్జితురాల య్యెను. 17

అట్లే అనిరుద్ధుని పటము చూచి ఉషనోట మాటరానిదై తలవంచుకొని నిల్చెను. ఓ రాజా! చిరునగవుతో ఆశ్చర్య చకితయగుచు ఇతడే ఆ కాంతుడనెను.

చిత్రలేఖ ఆ నరుని శ్రీకృష్ణుని పౌత్రునిగ బాగుగ గుర్తించి, యోగవిద్యా సహాయమున, ఆకాశమార్గమున శ్రీకృష్ణునిచే పాలింప బడుచున్న ద్వారకకు పోయెను. (18-19)

ద్వారక యందు హంసతూలికా తల్పమున శయనించి నిద్రించుచున్న అనిరుద్ధుని, చిత్రలేఖ యోగమాయావలంబియై శోణిత పురమునకు కొనిపోయి తన ప్రియసఖియగు ఉషకు ఆమె ప్రియుని చూపించెను. 20

శ్లో॥ సాచ తం సుందరవరం విలోక్యముదితాననా ।
దుష్ప్రేక్ష్యే స్వగృహే పుంభీంరేమే ప్రాద్యుమ్నినాసమమ్ ॥ 21

టీ:- సేతి. పుంభిర్దుష్ప్రేక్ష్యే ప్రేక్షితుమశక్యే. 21

ఆ ఉషాసుందరియు పురుషులకు ప్రవేశింపవీలుగాని తన రాచనగరున సుందరవరుడైన ఆ అనిరుద్ధుని కాంచి ఆనందపరవశయై అతనితోకూడి ఆనందక్రీడలననుభవించెను. 21

శ్లో॥ పరార్ధ్యవాసస్స్రగ్గంధ ధూప దీపాసనాదిభిః ।
పానభోజనభక్ష్యైశ్చ వాక్యైశ్శుశ్రూషణార్చితః ॥ 22

టీ:- పరార్ధ్యేతి. సచ పరార్ధ్యై రమూల్యైర్వా సస్స్రగ్గంధాది భిశ్శుశ్రూషణ పూర్వక మర్చితస్సన్ . 22

ఆ అనిరుద్ధుడు అమూల్యములగు వస్త్ర, పుష్పమాలికల, సుగంధ, ధూపదీప, అర్ఘ్య ఆసనాదులచే, పానీయ భోజన భక్ష్యముల తోడను ప్రేమ పూర్వక చతురసల్లాపముల సేవలతో అర్చితుడయ్యెను. 22

శ్లో॥ గూఢః కన్యాపురే శశ్వత్ప్రవృద్ధస్నేహయా తయా ।
నాహర్గణాన్ సబుబుధే హ్యుషయాపహృతేంద్రియః ॥ 23

టీ:- గూఢ ఇతి. తయా ఉషయా అపహృతేంద్రియః అహర్గణాః దివససమూహాన్ నబుబుధే. 23

రహస్యమైన కన్యకాంతఃపురమునందు, నిత్యము ఉషతో పెరిగిన స్నేహము వలన ఆమెచే ఆకర్షితమైన ఇంద్రియములు కలవాడై అనిరుద్ధుడు ఎన్ని దినములు గడచినవో గమనింప జాలడయ్యెను. 23

శ్లో॥ తాంతథాయదువీరేణ భుజ్యమానాం హతవ్రతాం ।
హేతుభిర్లక్షయాంచక్రురాప్రీతాం దురవచ్ఛదైః ॥ 24

టీ:- తామితి. అరపీతాం అతిహృష్టాం దురవచ్ఛదైః ఆచ్ఛాదయితు మశక్యైః. 24

ఆ విధముగ యదువీరుడగు అనిరుద్ధునిచే సేవితయై వ్రతముచెడి అమితానందపరవశయగు ఉషను కప్పిపుచ్చుటకు అశక్యములగు ఆయా లక్షణములచే భటులు గుర్తింపగల్గిరి. 24

శ్లో॥ భటాఅవేదయాం చక్రూరాజంస్తేదుహితుర్వయం ।
విచేష్టితం లక్షయామః కన్యాయాః కులదూషితమ్ ॥ 25

టీ:- భటా ఇతి. విచేష్టితం విరుద్ధాచరణం. 25

ఓ రాజా! నీ కూతురి కన్యాజన విరుద్ధములగు చేష్టలచే, కులమునకపకీర్తికరములగు లక్షణములను మేము గమనించు చున్నామని రాజభటులు బాణునితో చెప్పిరి. 25

శ్లో॥ అనపాయిభిరస్మాభిర్గుప్తాయాస్స్వ గృహే ప్రభో ।
కన్యాయా దూషణం పుంభిర్దుష్ప్రేక్ష్యాయాన విద్మహే ॥26

శ్లో॥ తతః ప్రవ్యథితో బాణోదుహితుశ్శృత దూషణః ।
త్వరితః కన్యకాగారం ప్రాప్తోऽద్రాక్షీద్యదూద్వహమ్ ॥ 27

టీ:- అనపాయిభిరితి. అనపాయిభిః అపాయః అపస్మరణం ప్రమాదో వా తద్రహితైః. పాఠంతరే దుష్ప్రేష్యాయాః దుష్టా ప్రేష్యా సఖీ యస్యాః తస్యాః. పుంభిర్దూషణం కుతో వేతి న జానీమ ఇతి. (26-27)

ఓరాజా! కన్యాంతఃపురమును మేము ఎల్లవేళల అప్రమత్తులమై రక్షించుచున్నను, పురుషులచే కన్నెత్తి చూడరానిచోట కన్యాంతః పురమున పురుష ప్రవేశము ఎట్లు జరిగినదో ఎరుగము.

ఆ మాటలచే వ్యథచెందిన బాణుడు కూతురు చెడునడతను గూర్చి విని వెంటనే ఉషయొక్క అంతఃపురమునకు పోయి అచట యదుకుమారుడైన అనిరుద్ధుని చూచెను. (26-27)

శ్లో॥ కామాత్మజాతం భువనైకసుందరం
శ్యామం పిశాంగాంబర మంజుజేక్షణం ।
బృహద్భుజం కుండలకుంతల త్విషా
స్మితావ లోకేన చ మండితాననమ్ ॥ 28

టీ:- కామాత్మజాతమితి. కామస్యాత్మనో దేహాజ్జాతం. 28

ప్రపంచముననే అందగాడు, శ్యామరూపుడు, గోరోజనవర్ణ వస్త్రమును ధరించినవాడు, పద్మపత్రములవలే విశాలమైన నేత్రములు కలవాడు, ఆజానుబాహువు, ఉంగరములవంటి ముంగురుల కాంతితో, చిరునగవుచూపులతో అలంకృత ముఖవర్చస్సుగల ప్రద్యుమ్న పుత్రుని అనిరుద్ధుని కాంచెను. 28

శ్లో॥ దివ్యం తమక్షైః ప్రియయాభి నృమ్ణయా
తదంగసంగస్తన కుంకుమస్రజం ।
బాహ్వోర్దధానం మధు మల్లికాశ్రితాం
తస్యాగ్ర ఆసీన మవేక్ష్య విస్మితః ॥ 29

టీ:- దీవ్యంతమితి. అభినృమ్ణయా సర్వమంగళయా. తస్యా అంగసంగేన స్తన కుంకుమం యస్యాంస్రజితాం బాహోర్మధ్యే వక్షసి దధానం మధుమల్లికాః వసంతభవా మల్లికాః తదాశ్రితాం తస్యాగ్ర ఇత్యార్షస్సంధిః. తస్యా అగ్ర ఇత్యర్థః. 29

సర్వమంగళ స్వరూపిణియగు ప్రియురాలితో పాచికలాట ఆడుచున్నట్టి వసంత మల్లికామాలికలను ధరించిన ఆ ఉష శరీర సంగమము వలన అంటిన స్తన కుంకుమచే శోభితమైన మాలికలను కంఠమున ధరించి ఆమె ఎదుట కూర్చున్న అనిరుద్ధుని చూచి బాణుడు ఆశ్చర్యచకితుడయ్యెను. 29

శ్లో॥ సతం ప్రవిష్టం వృత మాతతామిభి
ర్భుజైస్సహస్రైరవ లోక్యమాధవః ।
ఉద్యమ్య మౌర్వం పరిఘం వ్యవస్థితో
యథాంతరో దండధరో జిఘాంసయా ॥ 30

అకస్మాత్తుగ దుర్మార్గులను వెంటబెట్టుకొని సహస్ర బాహువులతో ప్రవేశించిన బాణుని మాధవుడు చూచి యమునివలె బంగారు గదను పట్టుకొని నిల్చెను. 30

శ్లో॥ జిఘృక్షయాతాన్ పరితః ప్రసర్పత
శ్శునోయథాసూకరయూథపోఽహీనత్ ।
తేహన్యమానాభవనా ద్వినిర్గతా
నిర్భిణ్ణ మూర్ధోరు భుజాః ప్రదుద్రువుః ॥ 31

టీ:- స ఇతి. అతతాయిభిరుద్యతశస్త్రైః మాధవః అనిరుద్ధః మౌర్వం మురుః లోహవిశేషః తన్నిర్మితం. (30-31)

అనిరుద్ధుడు తనను చంపుటకై చుట్టుమూగిన హంతకులను, శిరములు భుజములు పగులగొట్టుచుండగ కుక్కలచేత చంపబడు పందులగుంపువలె వారు కన్యాంతఃపురమును వీడి పారిపోయిరి. 31

శ్లో॥ తంనాగపాశైర్బలి నందనో బలీ
ఘ్నంతం స్వసైన్యం కుపితో బబంధహ ।
ఉషాభృశం శోక విషాదవిహ్వలా
బద్ధం నిశమ్యాశ్రుకలాక్ష్య రోదీత్ ॥32

టీ:- తమితి. శోకవిషాదాభ్యాం విహ్వలా వివశా. అశ్రూణాం కలాః బిందవః యయోస్తే అక్షిణీ యస్యాస్సా. 32

బలినందనుడు, బాణుడు తన సైన్యమును సంహరించుచున్న అనిరుద్ధుని చూచి క్రుద్ధుడై నాగపాశములతో బంధించెను. శోక విషాదములతో వివశయగు ఉష అనిరుద్ధుడు బంధింపబడినట్లుగ విని కన్నీరుమున్నీరుగ విలపించెను. 32

**ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,**
**ద్విషష్టితమోఽధ్యాయః**

**శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు**
**అరవైరెండవ అధ్యాయము సమాప్తము**

## త్రిషష్టితమోஉ_ధ్యాయః

శ్లో॥ త్రియుక్ షష్టితమేనాథ బాణ యాదవసంగరే ।
స్తుతిర్జ్వరేణ రుద్రేణ బాణబాహుభిదోహరేః ॥
అనిరుద్ధోద్వహేన్యస్మిన్ బాణయాదవ సంయుగే ।
శ్రీకృష్ణ శ్రీహరం జిత్వాబాణ బాహూసథాచ్ఛినత్ ॥

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ అపస్యతాం చానిరుద్ధం తద్బంధూనాంచ భారత ।
చత్వారో వార్షికామాసావ్యతీ యురను శోచతామ్ ॥ 1

శ్లో॥ నారదాత్తాదు పాకర్ణ్య వార్తాం బద్ధస్య కర్మచ ।
ప్రయయుశ్శోణితపురం వృష్ణయః కృష్ణ పాలితాః ॥ 2

టీ:- నారదాతి. తత్తతః కర్మయుద్ధాదికం. 1,2

శ్లో॥ ప్రద్యుమ్నో యుయుధానశ్చగదస్సాంబోஉ_థ సారణః ।
నందోపనంద భద్రాద్యా రామకృష్ణాను వర్తినః ॥ 3

టీ:- ప్రద్యుమ్న ఇతి. రామ కృష్ణాను వర్తిన ఇతి తౌ పురతో నిర్గతా మిత్యర్థః. 3

## 63వ అధ్యాయము

ఈ అరవైమూడవ అధ్యాయమున బాణ అనిరుద్ధుల యుద్ధము నందు శివజ్వరస్తోత్రము, రుద్రునితో బాణబాహువుల తెగవేయు హరికిని సంగ్రామము జరిగినట్లున్నది. మరియు అనిరుద్ధుని వివాహ కాలమున బాణ అనిరుద్ధులకు జరిగిన సంగ్రామమున శ్రీకృష్ణుడు ఉమాపతిని జయించి బాణబాహువులను తేగవేసెనని యథార్థము.

**శ్రీ శుకులు పలికిరి**

ఓ పరీక్షిన్మహారాజా! అనిరుద్ధుని బంధువులకు అతనిని కానక నాల్గుసంవత్సరములు నాల్గునెలలు దుఃఖముతో గడచిపోయెను. 1

నారదమహర్షి వలన బాణ అనిరుద్ధుల భీకర యుద్ధవార్తను విని కృష్ణపాలితులగు యదువీరులు శోణితపురమునకు ప్రయాణమై పోయిరి. 2

బలరామ శ్రీకృష్ణ దేవులను పురస్కరించుకొని ప్రద్యుమ్నుడు, యుయుధానుడు, ఉపనందుడు, భద్రుడు మొదలగువారు శోణిత పురమునకు బయలుదేరిపోయిరి.

శ్లో॥ అక్షౌహిణీభిర్ద్వాదశభిస్సమే తాస్సర్వతో దిశం ।
రురుధుర్బాణ నగరం సమంతాత్సాత్వతర్షభాః ॥ 4

టీ:- అక్షౌహిణీభిరితి. సర్వతో దశమిత్యస్య ఉత్తరేణాన్వయః. 4

శ్లో॥ భజ్యమానపురోద్యాన ప్రాకారాట్టాలగోపురం ।
ప్రేక్షమాణో రుషావిష్టస్తుల్యసైనోऽనిర్యయౌ ॥ 5

టీ:- భజ్యమానేతి. భజ్యమానాని పురోద్యానాని ద్వంద్వైకవద్భావః. అట్టాలాః ప్రాకారాదుపరిఅత్యున్నతస్థానాని. అభినిర్యయౌబాణః. 5

శ్లో॥ బాణార్థం భగవాన్రుద్రస్ససుతైః ప్రమథైర్వృతః ।
ఆరుహ్యనంది వృషభం యుయుధే రామకృష్ణయోః ॥ 6

శ్లో॥ ఆసేత్సుములంయుద్ధం అద్భుతం రోమహర్షణం ।
కృష్ణం శంకరయో రాజన్ప్రద్యుమ్నగుహయోదపి ॥ 7

శ్లో॥ కుంభాండ కూపకర్ణాభ్యాం బలేన సహసంయుగః ।
సాంబస్యబాణపుత్రేణ చాణేన సహ సాత్యకేః ॥ 8

శ్లో॥ బ్రహ్మాదయ స్సురాధీశా మునయస్సిద్ధ చారణాః ।
గంధర్వాప్సరసోయక్షా విమానైర్ద్రష్టు మాగమన్ ॥ 9

పండ్రెండు క్షౌహిణుల బలగముతో కూడినవారై యదువీరులు బాణుని నగరమును ముట్టడించిరి. (3-4)

శోణిత పురమునందలి ఉద్యానవనమును, ప్రాకారములను, వాటిశిఖరములను యాదవులు ధ్వంసం చేయుచుండగ చూచిన బాణుడు ఆగ్రహావేశపరుడై తానును పండ్రెండు క్షౌహిణుల సైన్యముతో ఎదుర్కొనెను. 5

బాణునికొరకు భగవంతుడు శివుడు తన సుతుడు కుమారస్వామితో, ప్రమథగణముతో కూడినవాడై, నందివాహనము నధిరోహించి వచ్చి బలరామకృష్ణులతో యుద్ధమును చేసెను. - ఓ రాజా! అపుడు కృష్ణశంకరులకు, ప్రద్యుమ్నగుహులకు శరీరము గగుర్పొడుచు అద్భుతమగు సంగరము జరిగెను. - బలరామునితో కుంభాండుడు, కూపకర్ణుడు, యుద్ధము చేసిరి. బాణపుత్రునితో సాంబునకు, బాణునితో సాత్యకికిని భయంకరమైన పోరుజరిగెను. బ్రహ్మాదిదేవతలు, ఇంద్రాదులును, మునులు, సిద్ధులు, చారణులు, గంధర్వులు, అప్సరసలు, యక్షులు, తమతమ విమానములనెక్కి ఆ సంగ్రామమును చూడవచ్చిరి. (6-9)

శ్లో॥ శంకరామచరాన్శౌరి ర్భూత ప్రేతాన్య గుహ్యకాన్ ।
ఢాకినీయాతుధానాంశ్చభేతాళాన్సవినాయకాన్ ॥ 10

శ్లో॥ భూతమాతృపిశాచాంశ్చకూశ్మాండాన్బ్రహ్మరాక్షసాన్ ।
తాడయా మాసతీ క్ష్ణాగ్రైశ్శార్న్గ ధనుశ్చ్యుతైః ॥ 11

శ్లో॥ పృథగ్విధాని ప్రాయుజ్క్త పినాక్యస్త్రాణి శార్న్గిణే ।
ప్రత్యస్త్రైశ్శమయామాసశార్ంగపాణిరవిస్మితః ॥ 12

టీ:- బాణార్థమితి. సుతః స్కందః తత్సహితైః ప్రమథగణైః రామకృష్ణాభ్యాం యుయుధే.(6-12)

శంకరుని అనుచరులగు, గుహ్యకుడు అధినాయకుడుగాగల భూతప్రేతములన, ఢాకినీ మొదలగురాక్షసులను, వినాయకుడితో కూడిన భేతాళగణములను భూత, మాతృ, పిశాచగణములను, కూశ్మాండాది బ్రహ్మరాక్షసులను, శ్రీకృష్ణుడు తన శార్న్గమను ధనస్సు నుండి వెలువడు, తీక్ష్ణమగు మొనలుగల్గిన బాణములతో మోదెను - పరమేశ్వరుడు కూడ నానావిధములగు ఆయుధములను మురారిపై ప్రయోగించెను. శార్న్గధరుడు కూడ ఆశ్చర్యపడకయే ఆ యస్త్రముల నన్నింటిని ప్రత్యస్త్రములను ప్రయోగించి ఉపశమింప జేసెను. (10-12)

శ్లో॥ బ్రహ్మాస్త్రస్యచ బ్రహ్మాస్త్రం వాయవ్యస్య చ పార్వతం ।
ఆగ్నేయస్యచ పార్జన్యం నైజం పాశుపతస్యచ ॥ 13

శ్లో॥ మోహమిత్వాథ గిరీశం జృంభణాస్త్రేణ జృంభితం ।
బాణస్యపృతానాం శౌరిర్జఘానాసిగదేషుభిః ॥ 14

టీ:- ప్రత్యస్త్రాణ్యేవాహ - బ్రహ్మస్త్రస్యేతి. నైజం నారాయణాస్త్రం. (13-14)

బ్రహ్మాస్త్రమునకు బ్రహ్మాస్త్రమును, వాయువ్యమునకు పర్వతాస్త్రమును, ఆగ్నేయాస్త్రమునకు వారుణాస్త్రమును, పాశుపతము నకు నారాయణాస్త్రమును, జృంభణాస్త్రమునకు జృంభణమును ప్రయోగించి శంకరును భ్రమింపజేసి, శ్రీకృష్ణుడు బాణుని సైన్యమును ఖడ్గ, గదా, బాణములతో పరిమార్చెను. (13-14)

శ్లో॥ స్కందః ప్రద్యుమ్నబాణౌఘైరర్ద్య మాన స్సమంతతః ।
అసృగ్విముంచన్గాత్రేభ్యశ్శిఖినా పాద్రవద్రణాత్ ॥ 15

టీ:- స్కంద ఇతి. శిఖినామయూరేణ వాహనేన. 15

ప్రద్యుమ్నుని బాణఘాతములచే బాధితుడైన స్కందుడు శరీరము నుండి రక్తము స్రవించుచుండగ మయూరవాహనముతో రణ రంగమును విడిచి పారిపోయెను. 15

శ్లో॥ కుంభాండః కూపకర్ణశ్చ పేతతుర్ముసలార్దితౌ ।
దుద్రువుస్తదనీకానీ హతనాదాని సర్వతః ॥ 16

శ్లో॥ విశీర్యమాణం స్వబలం దృష్ట్వాబాణోऽత్యమర్షణః ।
కృష్ణమభ్యద్రవత్సంఖ్యేరథీ హిత్వైవ సాత్యకిమ్ ॥ 17

కుంభాండకూపకర్ణులు రోకళ్లచే మోదబడినవారై మన్నుగరచిరి. వారుమరణించగానే అనాథలైన వారిసైన్యము దిక్కునకొకరిగ చెల్లాచెదురైరి - చెదరిబెదరి పారిపోవుచున్న తన సైన్యమునుగాంచి బాణుడు తీవ్రమైన కోపముతో యుద్ధరంగమున సాత్యకిని వదిలి రథముపై కృష్ణుని మీదకు పరుగెత్తెను. (16-17)

శ్లో॥ ధనూష్యాకృష్య యుగద్బాణః పంచశతానివై ।
ఏకైకస్మిన్శరౌద్వౌ సందధే రణ కోవిదః ॥ 18

శ్లో॥ తానిచిచ్ఛేదభగవాన్ధనూంషి యుగపద్ధరిః ।
సారథిం రథమశ్వాంశ్చ హత్వా శంఖమపూరయత్ ॥ 19

శ్లో॥ తన్మాతా కోటరానామ నగ్నా ముక్తశిరోరుహా ।
పురోపథస్థేకృష్ణస్య పుత్ర ప్రాణ రిరక్షయా॥ 20

టీ:-కుంభాండ ఇతి తయోరనీకాని హతః నాథాః యేషాం తాని. (16-20)

రణపండితుడైన బాణుడు ఒకేమారు ఐదువందల ధనస్సులను గ్రహించి, ఒక్కొక్క ధనస్సునందు రెండేసి అలుగులను సంధించి కృష్ణుని మీదకు వదలెను - భగవంతుడు హరి ఏకకాలమున వానినన్నింటిని ఛేదించెను. బాణుని సారథిని అశ్వములను హతమార్చి, రథమును ముక్కలుగచేసి శంఖమును పూరించెను. ఆ సమయమున కోటరయను బాణాసురుని తల్లి పుత్రుని ప్రాణములను రక్షింపదలచినదై, వివస్త్రయై, జడలు విరియబోసికొని కృష్ణుని ఎదుట నిల్చెను. (18-20)

శ్లో॥ తతస్తిర్యఙ్ముఖోనగ్నా మనిరీక్షన్ గదాగ్రజః ।
బాణశ్చతావ ద్విరథశ్ఛిన్నధన్వా విశతత్పురమ్ ॥ 21

శ్లో॥ విద్రావితే భూతగణే జ్వరస్తుత్రిశిరాత్రిపాత్ ।
మహాదేవ ప్రయుక్తోऽసౌఘోరరూపో విభీషణః ॥ 22

టీ:- తత ఇతి. అనిరీక్షమాణః తిర్యఙ్ముఖో బభూవేతి. (21-22)

పిమ్మట వివస్త్రయగు ఆమెను చూడక గదాగ్రజుడు విముఖుడయ్యెను. ఇంతలో ధనస్సు విరిగి, రథము భిన్నమైన బాణుడు రణమును వీడి ప్రాణరక్షణార్థము శోణపురమును ప్రవేశించెను.- మహాదేవునిచే ప్రేరితులైన భూతగణములుకూడ పారిపోగ శివుడు, మహాభయంకరుడు, ఘోరాకారుడు, మూడుతలలు, మూడుకాళ్లుగల జ్వరుడని వానిని ప్రయోగించెను. (21-22)

శ్లో॥ ఆవిర్బభూవపురుతస్సమరే శార్ఙ్గధన్వనః ।
అథనారాయణోదేవః తందృష్ట్వా వ్యసృజజ్జ్వరమ్ ॥ 23

శ్లో॥ మహేశ్వరోవైష్ణవశ్చయుయుధాతే జ్వరావుభౌ ।
మాహేశ్వరస్సమాక్రందద్వైష్ణ వేన బలారిహదతః ॥ 24

శ్లో॥ అలబ్ధ్వాऽభయమస్యత్ర భీతో మహేశ్వరహో జ్వరః ।
శరణార్థ హృషీకేశం తుష్టావ ప్రయతామంజలిః ॥ 25

టీ:- ఆవిర్బభూవేతి. జ్వరస్తు యోధూమద్యభధాపదతి నారాయణ శ్రీతజ్వరమసృజత్. (23-25)

శివునిచే ప్రయోగించబడిన ఆ జ్వరుడు, సమరమున కృష్ణుడిముందు ఆవిర్భవించెను. నారాయణదేవుడను వానిని చూచి శీతజ్వరుడు అను వానిని, శివజ్వరునిపైకి ఉసిగొల్పెను. మహేశ్వరునిచే నారాయణునిచేతను ప్రయోగింపబడిన, శివజ్వర - శీతజ్వరులిరువురు యుద్ధము చేయుచుండగ శీతజ్వరునిచే బలముగ కొట్టబడిన శివజ్వరుడు భయంకరముగ రోదించెను. మహేశ్వర సంబంధమగు జ్వరుడు మరొకరి నుండి రక్షణము పొందనివాడై భయపడి శ్రీకృష్ణ భగవానుని శరణుజొచ్చి కరములు మోడ్చి స్తుతించి సంతోషపరచెను. (23-25)

శ్లో॥ నమామి త్వామినంతశక్తిం పరేశం
సర్వాత్మానం కేవలం జ్ఞప్తిమాత్రం ।
విశోత్పత్తి స్థానసంరోధహేతుం
యత్తద్బ్రహ్మబ్రహ్మలింగం ప్రసాంతమ్ ॥ 26

టీ:- ఆత్మానాం పరమశక్తం మన్యమానః. శ్రీకృష్ణం తాపయితుం ప్రవృత్తః స్వయమేవతప్తస్సన్. తం పరమేశ్వరం జ్ఞాత్వాస్తువన్నమస్కరోతి - నమామితి. త్వాత్వాం అనంతశక్తిం నమామి కుతః పరేషాం బ్రహ్మాదీనాం ఈశం తత్ర హేతుః. సర్వాత్మానాం సర్వస్య ఆత్మానం చేతయితారం. తత్కుతఃకేవలం శుద్ధం జ్ఞప్తి మాత్రం చైతన్య ఘనం. తదేవం సర్వ చేతయితృత్వేన పరమేశ్వరత్వముక్తం. కించం. విశ్వసృష్ట్యాది హేతుత్వాదపీత్యాహ-విశ్వో త్పత్తీతి. నన్వేవంభూతం బ్రహ్మ ప్రసిద్ధం నాహమితి చేత్తత్రాహ. యద్బ్రహ్మ తదేవత్వమిత్యర్థః కితద్బ్రహ్మేత్యత ఆహ- బ్రహ్మలింగం బ్రహ్మణావేదేన లింగ్యతే ద్యోత్యత ఇతి. తత్కుతః. ప్రశాంతం సర్వవిక్రియారహితత్వాత్ న సాక్షాద్వాచ్య మితి భావః. 26

తనను అమిత శక్తిశాలిగ భావించి శ్రీకృష్ణుని తపింపచేయ సమకట్టిన శివజ్వరుడు తానే వైష్ణవజ్వరునిచే తపింపబడిన వాడై నారాయణుని దేవదేవునిగ గుర్తించి నమస్కార పూర్వకముగ స్తుతించుచున్నాడు.

ఓ ప్రభో! నీవు బ్రహ్మాది దేవతలకు అధిపతివి. అనంత శక్తిమంతుడవు. సకల భూతములకు చైతన్యమును ప్రసాదించు ఘనుడవు. కేవల శుద్ధజ్ఞానస్వరూపుడవు. విశ్వముయొక్క సృష్ఠి, స్థితి లయలకు కారణభూతుడవు. వీటన్నింటికి మూలమగు మరియొక్క బ్రహ్మ నీవుతప్ప వేరొకరులేరు. ఆ బ్రహ్మయే నీవు. బ్రహ్మయనగ వేదము. ఆ వేదముచే ప్రతిపాదింపబడు వాడవు నీవే. అన్నింటికి మూలభూతుడవయ్యు, సర్వక్రియావిరహితుడవై, ప్రశాంతుడవు నీవే. ఇదమిత్థముగ నిర్వహించబడుటకు అసాధ్యమగు స్వరూపము కలవాడవు. అట్టి నీకు నమస్కరించుచున్నాను. 26

శ్లో॥ కాలోదైవం కర్మ జీవస్స్వభావో
ద్రవ్యం క్షేత్రం ప్రాణాత్మావికారః ।
తత్సంఘాతో బీజరోహ ప్రవాహ
స్త్వన్మాయైషా తన్నిషేధం ప్రపద్యే ॥ 27

టీ:- కించ. యత్సవిశేషం వస్తు తత్ర వయం ప్రభవామః. త్వయితు సర్వవిశేషాతీతే న కస్యాపి ప్రభుత్వం. కింతుత్వమేవ సర్వ ప్రభురితి జ్ఞప్తిమాత్రత్వం వివృణ్వన్ స్తౌతి. కాల ఇతి- కాలః క్షోభకః. కర్మ నిమిత్తం. తదేవ ఫలాభిముఖ అభివ్యక్తం దైవం. స్వభావః తత్సంస్కారః జీవ తద్వాన్ . ద్రవ్యం భూతసూక్ష్మాణి క్షేత్రం ప్రకృతిః. ప్రాణః సూత్రం ఆత్మా అహంకారః వికార ఏకాదశేంద్రియాణి మహాభూతాని చేతి షోడశకః తత్సంఘాతో దేహః. ఏతస్య చ బీజరోహరప్రవాహః రోకురః దేహోద్బీజరూపం కర్మ.తతోంకురరూప రూపో దేహః.తతః పునరేవమితి. ప్రవాహః ఏషా త్వన్మాయా. తస్యా నిషేధః అపోహో యస్మిన్నితి తం త్వాం నిషేదావధిభూతం ప్రపద్యే భజ ఇతి. 27

మరియు విశిష్టమైన వస్తుతత్వమును గూర్చి చెప్పుచున్నాము. సర్వ విశేషములకు అతీతుడవైన నిన్ను శాసించువాడు అన్యుడు వేరొకడులేడు. కావున నీవే సమస్తభువనములకు,విషయములకు అధీశ్వరుడవను జ్ఞానమును వివరించుచు స్తుతించుచున్నాడు. క్షోభ కారకమైన కాలస్వరూపుడవు నీవు. నేను నిమిత్తమైన కర్మస్వరూప జీవుడను. నాయీ జీవకర్మల ఫలితమును వ్యక్తముచేయు నా కర్మ సంస్కారమునకు మూలమైన సూక్ష్మభూతములు (ఇంద్రియముల) దేహ, ప్రాణములు ఆత్మ మొదలైనవాని సముదాయముతో జీవోత్పత్తికి మూలమైనది నీ మాయ. ఓ స్వామి! వాటి నుండి నన్ను విడిపింపమని శరణుపొందుచున్నాను. 27

శ్లో॥ నానాభావైర్లీల యై వో పపన్నై
ర్దేవాన్ సాధూన్ లోక సేతూన్ బిభర్షి ।
హంస్యున్మార్గాన్ హింసయా వర్తమానాన్
జన్మైతత్తే భారహారాయ భూమేః ॥ 28

నిజమే, దేవకీ సుతునకు వీటన్నింటికి ఏమి సంబంధమని చెప్పుచున్నాడు- సకల ఉపాధులకు దూరుడవగు నీవు ఎట్లైతే నీ లీలలతో స్వీకరింపబడిన మత్స్యాద్యవతారములతో దేవాదులను పాలించుచున్నావో, వారికొఱకై లోకములకు సంధాతలైన వర్ణాశ్రమాది

టీ:- నను దేవకీ తనయస్య కథమేవం భూతత్వం తత్రాహ - నానాభావైరితి. సర్వోపాధివినిర్ముక్త ఏవ త్వం యథా లీలయా స్వీకృతైర్మత్స్యాద్యవతారైర్దేవాదీన్ బిభర్షి పాలయసి తదర్థం లోకసేతున్ వర్ణాశ్రమధర్మాన్. తదర్థం తదనుష్ఠాతౄన్ సాధూన్. తదంగత్వేన ఉన్మార్గాన్ దైత్యాదీన్ హంసి సంహరసి. ఏవమేతదపి తవ జన్మభూమే ర్భారహరణాయ లీలావతారోஉయం న కస్యాపి త్వం తనయ ఇత్యర్థః 28

ధర్మములను, వాటిని చక్కగా నిర్వర్తించుటకు సాధువులను కూడ పాలించుచున్నావు. అట్లే హింసను పాటించు దుష్టమార్గ ప్రవర్తకులను సంహరించుచున్నావు. ఈవిధముగ నీ జన్మ భూ భారహరణము కొరకైన స్వలీలావతరణమేగాని నీవెవరి తనయుడవు కావు. 28

శ్లో॥ తప్తోஉహంతేతేజసాదుస్సహేన
శాంతోగ్రేణాత్యుల్బణేన జ్వరేణ ।
తావత్తాపో దేహినాం తేం ఘ్రిమూలం
నోసేవేరన్ యావదాశానుబద్ధాః ॥ 29

టీ:- అతః అజ్ఞానత స్త్వదభిభవే ప్రవృతం మాం తప్తం రక్షేత్యా శయేనహ - తప్త ఇతి. తేజసా త్వత్రృష్టేన జ్వరేణ. శాంతోగ్రేణ శీతజ్వరేణ పరసంతాపకస్య యుక్త ఏవ తాప ఇతి చేదవ ఆహ- తావదితి. త్వత్సేవాయాం ప్రవృతానుమనుచిత ఇతి భావాః. 29

అందువల్ల, అజ్ఞానముచే నిన్ను తిరస్కరించుటకై ఉద్యమించి తపించిన నన్ను రక్షింపమనునభిప్రాయముతో పల్కుచున్నాను.- స్వామీ ! నీచే సృజింపబడిన తీవ్రమైన శీత జ్వర తాపముతో తపింపబడితిని. నీ పాదమూలమును ఆశాబద్ధులై సేవింపని వారికి ఇట్టి తాపము కలుగుగాక! కాని నిన్ను శరణుకోరి ఆశ్రయించిన వారిపట్ల ఈతాపమయుక్తముకదా! 29

శ్రీ భగవానువాచ

శ్లో॥ త్రిశిరస్తే ప్రసన్నోఽహంవ్యేతుతే మజ్జ్వరాద్భయం ।
యోనౌ స్మరతి సంవాదం తస్య త్వన్న భవేద్భయమ్ ॥ 30

శ్లో॥ ఇత్యుక్తోఽచ్యుతమానమ్యగతో మాహేశ్వరో జ్వరః ।
బాణస్తురథమారూఢః ప్రాగాద్యోత్స్యన్ జనార్దనమ్ ॥ 31

శ్లో॥ తతోబాహు సహస్రేణ నానాయుధధరో బలీ ।
ముమోచ పరమక్రుద్ధోబాణాంశ్చక్రాయుధేనృప ॥ 32

శ్లో॥ తస్యాస్యతోఽస్త్రాణ్య సకృచ్చక్రేణ క్షురనేమినా ।
చిచ్ఛేద భగవాన్ బాహూన్ శాఖా ఇవవనస్పతేః ॥ 33

శ్లో॥ బాహుషు ఛిద్యమానేషు బాణాస్య భగవాన్ భవః ।
భక్తాను కంప్యుపవ్రజ్య చక్రాయుధ మభాషతీ ॥ 34

టీ:- త్రిశిర ఇతి. హే త్రిశిరఃవ్యేతు అపయాతు మదాజ్ఞాపాలకస్సన్ సుఖం విచర. కా సా ఆజ్ఞా? తామాహ-య ఇతి. నౌ అవయోరిమం సంవాదం. యః స్మరతి తస్య తత్ త్వత్తః భయం న భవేత్ త్వయా భయంనో త్పాదనీయమిత్యర్థః. (30-34)

శ్రీ భగవానుడు పల్కెను.

త్రిశిరా ! నీకు నేను ప్రసన్నుడనైతిని. నాచే ప్రయుక్తమగు శీతజ్వరుని వలన నీకు భయము తొలగిపోవునుగాక! నేటి నుండి నా ఆజ్ఞను పాలించుచు సుఖముగనుండుము. అదే మనగ, ఈమన యిరువురిసంవాదనమును విన్నవారికి ఎన్నడును నీవలన భయము తాపమును కలుగకుండునుగాక ! నీవును నా భక్తులకు భయ తాపములను కలుగనీయకుము. ఉమామహేశ్వర ప్రయుక్తమగు జ్వరము ఈవిధముగ పల్కబడినదై, అచ్యుతునకు ప్రణమిల్లి పోయెను. బాణాసురుడు మరల రథాధిరూఢుడై జనార్దనునితో పోరుసల్ప రణభూమికి వచ్చెను. (30-31)

ఓరాజా! బలశాలియగు బాణుడు వేయిచేతులతో వివిధ ఆయుధధారియై వచ్చి అతి కోపముతో చక్రిపై బాణ వర్షమును గుప్పించెను - అట్లు బాణప్రయుక్తమైన బాణములను వాడియగు చక్రధారతో దునిమి, శ్రీకృష్ణుడు చెట్టుకొమ్మలను నరికినట్లుగవాని సహస్ర భుజములను ఖండించెను - బాణుని బాహువులు ఛేదింపబడుచుండగ భగవంతుడు శివుడు భక్తునిపై దయాళుత్వముతో నారాయణుని సమీపించి పల్కెను. (32-34)

శ్రీ రుద్ర ఉవాచ

శ్లో॥ త్వంహిబ్రహ్మపరంజ్యోతిర్గూఢం బ్రహ్మణి వాఙ్మయే ।
యం పశ్యంత్య మలాత్మానమాకాశమివ కేవలం ॥ 35

టీ:- భక్త రక్షణార్థం శ్రీ రుద్రో భగవంతం స్తౌతి-త్వమితి. అయమర్థః త్వాం అజ్ఞాత్వాఽయమద్యుతేతి న చిత్రం. యతస్త్వం వాఙ్మయే బ్రహ్మణ్యపి గూఢం బ్రహ్మ. అభిధానా విషయత్వాత్. కుతః. పరంజ్యోతిః జ్యోతిషామపి ప్రకాశకత్వాదవిషయః. కథం తర్హి ప్రతీతిరతఅహ- యమితి అమలాత్మనాం స్వతః ప్రకాశసే ఇత్యర్థః. 35

శ్రీ రుద్రుడు పలికెను

భక్త రక్షణము కొరకు భవుడు భగవంతుడు విష్ణువును నుతించుచున్నాడు. ప్రభూ! నీ తత్త్వము నెరుగని అజ్ఞాని బాణుడు నీతో సమరమునకు సమకట్టెను. వేదవాఙ్మయమున నీవు పరబ్రహ్మవుగ ప్రతిపాదింపబడితివి. అది రహస్యమైనది. తేజస్సులకు తేజః ప్రసాదివి. నిర్మలమగు ఆకాశమువలె మహాత్ములకు మాత్రమే స్వయముగ దర్శనమును కలుగజేయుదువు. 35

శ్లో॥ నాభిర్నభోऽగ్నిర్ముఖమంబురేతో
ద్యౌశ్శీర్ష మాశాశ్శ్రుతిరం ఘ్రిరుర్వీ ।
చంద్రో మనోయస్యదృగర్కఆత్మా
హ్యహం సముద్రో జఠరం భుజేంద్రః ॥ 36

టీ:- ఆస్తాం తావన్నిర్గుణ స్వతవజ్ఞానంలీల యాధిష్ఠితస్త్వయా యో విరాడ్విగ్రహః సోऽపినజ్ఞాయతే. ఉదుంబరఫలాంతర్వర్తిమశకైరివోదుంబర ఫలమిత్యాశయేన విరాడ్రూపం స్తౌతి.- ద్వాభ్యాం. నాభిరితి. యస్య సభ ఆదయో నాభ్యాద్యవయవాః. సభవాన్ లోక కల్పః పురుష ఇత్యుత్తరేణాన్వయః. నభో యస్య నాభిః. అగ్నిర్యస్యముఖం. అంబురేతఃద్యౌః శీర్షం ఆశాః దిశః శ్రుతిః శ్రవణేంద్రియం. ఉర్వీ అంఘ్రిః

మేడిపండులోని పురుగునకు మేడిపండుఇది అని తెలియని విధమున లీలావతారుడవై, నిర్గుణుడవైన నీ విరాడ్రూపము ఎవరికి తెలియదు అను ఆశయముతో విరాడ్రూప స్వరూపమును స్తుతించుచున్నాడు.- ఓ ప్రభూ! నీ నాభి ఆకాశము, ముఖము అగ్ని, రేతస్సు జలము, శిరము స్వర్గము, కర్ణములు దిక్కులు, పాదములు భూమి, మనస్సు చంద్రుడు, నేత్రములు సూర్యుడు, శివుడనగు నేను అహంకారము, ఉదరము సముద్రము బాహువులు ఇంద్రాది లోకపాలురు. 36

చంద్రో మనః. అర్కోదృక్. అహం శివః. ఆత్మా అహంకారః సముద్రో జఠరం. ఇంద్రోభుజాబాహుః. ఇంద్రాదయో లోకపాలాబాహవ ఇత్యర్థః 36

శ్లో॥ రోమాణి యస్యౌషధయోంబువాహాః
కేశావిరంచోధిషణా విసర్గః ।
ప్రజాపతిర్హృదయం యస్య ధర్మ
స్సవై భవాన్ పురుషో లోక కల్పః ॥ 37

టీ:- రోమాణీతి. ఓషధయో రోమాణియచ్ఛబ్దస్యావృత్తి స్పష్టతార్ధా. అంబువాహాఃకేశాః విరించోధిషణా బుద్ధిః. ప్రజా పతిః విసర్గోమేఢ్రం. ధర్మో హృదయం లోకైః కల్ప్యతే ఉపకల్ప్యత ఇతి లోక కల్పః. 37

అట్లే రోమములు వృక్షములు, కేశములు మేఘములు, బుద్ధి బ్రహ్మము, మేఢ్రము సృష్టికర్తయగు ప్రజాపతి, హృదయము ధర్మము, ఇట్టివి కల్గిన పురుషునిగ నిన్ను లోకము ఊహించుకొనుచున్నది. 37

శ్లో॥ తవావతారోఽయమకుంఠధామన్
ధర్మస్యగుప్త్యై జగతో భవాయచ ।
వయం చ సర్వేభవతాను భావితా
విభావయామోభువనాని సప్త ॥ 38

టీ:- నను ప్రాదేశిక శరీరస్య కథం నభోనాభిత్వాదిత్యత్రాహ - తవేతి. హే అంకుఠధామన్ అప్రచ్యుతస్వరూప భవాయ అభ్యుదయాయ. న కేవలమేతావత్. కింతుం అస్మదనుగ్రహార్ధమపీత్యాహ- వయం చేతి.

జానెడు శరీరమునకు నభోనాభులు ఎట్లు అనగ చెప్పుచున్నాడు. ఓ అప్రచ్యుత స్వరూప నీ అవతార తత్వము ధర్మరక్షణార్థమైనది. మేము ఇంద్రాది లోకపాలురము అందరము మీ అనుగ్రహముచేతనే పాలింపబడుచు ఈ భువన వనసప్తకమును పాలించుచున్నాము. 38

సర్వే లోకపాలా వయం త్వయా పాలితాః. సప్తాహి భువనాని పాలయామ ఇతి. 38

శ్లో॥ త్వమేక ఆద్యః పురుషోऽద్వితీయస్తు
స్తుర్యస్స్వదృగ్ఘేతురహేతురీశః ।
ప్రతీయసేऽథాపి యథావికారం
స్వమాయయా సర్వగుణ ప్రసిద్ధ్యై ॥ 39

టీ:- నను యది విభావయితారో యూయం విభావ్యాని భువనానిచ సంతిం. తర్హి కథముక్తం. త్వంహి బ్రహ్మేతి న హి బ్రహ్మత్వే మమ సజాతీయవిజాతీయ భేదసంభవతీత్యత ఆహ-త్వమితి. ఏకః సజాతీయ రహితః.కుతః. ఆద్యః పురుషః పురుషాణామవస్థాత్రయవతామాద్యః ప్రకృతి భూతః పురుషః. కుతః తుర్యః శుద్ధ ఇత్యర్థః. తదపికుతః స్వదృక్ స్వప్రకాశజ్ఞానరూపః. శుద్ధా దేవ హ్యుపాధి యోగాజ్జీవా జాయంతే. శ్రు "యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగ వ్యుచ్చరం త్యేవ మేవాస్మాదాత్మనసర్వ ఏవాత్మానో వ్యుచ్చరంతీ" తి శ్రుతేః. అతః సజాతీయరహితః కించ. అద్వితీయః విజాతీయరహితః తదపి కుతః హేతుస్సర్వస్యతథా స్వయం అహేతురీశశ్చేతి. కథం తర్హి ప్రతిశరీరం జీవభేదః ప్రతీయతే అత ఆహ-ప్రతీయస ఇతి. సర్వగుణ ప్రసిద్ధ్యైసర్వవిషయ ప్రకాశనాయ. 39

పాలించువారు మీరు పాలించబడునవి లోకములైనచో నీవు బ్రహ్మవనుట ఎట్లు? బ్రహ్మతత్వమును సజాతీయ విజాతీయ బేధము సంభవించదుకదా అనినచో చెప్పుచున్నాడు. - స్వామీ! నీవొక్కడవే సజాతీయుడు లేని ఆదిపురుషుడవు. ప్రకృతి భూతుడగు పురుషుడవు. ఆద్యుడు, అద్వితీయుడు, తుర్యుడు(శుద్ధుడు) అని పురుషునకు అవస్థాత్రయము కలదు. కావున నీవు స్వయముగ ప్రకాశించు జ్ఞాన స్వరూపుడవు. శుద్ధ స్వరూపమునుండియే ఉపాధిభేదములతో జీవులు జన్మించుచుందురు. ఇందుకు " యథాగ్నేః క్షుద్రా విస్ఫు లింగా వ్యుచ్చ రంత్యేవ మేవాస్మాదాత్మనస్సర్వ యే వాత్మానో వ్యుచ్చరంతి" తి శ్రుతి. అగ్ని నుండి ఎట్లైతే చిన్నచిన్న మిణుగురులు జనించి ఎగురుచుండునో అట్లే శుద్ధాత్మనుండి సమస్తాత్మలు జనించుచుండునను వేదము ప్రామాణికము. అందువలననే అద్యపురుషుడు సజాతీయ రహితుడు. ఇక అద్వితీయుడు అనగ విజాతీయుడు లేనివాడని అర్థము. శుద్ధస్వరూపుడు తాను సమస్త సృష్టికి కారణముకాని ఈశుడగు తనకుతాను హేతువుకాదు. కావున అద్వితీయుడు శుద్ధుడు. అట్లగుచో ప్రతి శరీరమున జీవబేధమెట్లు సిద్ధించుననగ చెప్పుచున్నాడు. సర్వ విషయములను ప్రకాశింపచేయుటకై ప్రతి శరీరమున జీవభేదము కలుగుచున్నది. 39

శ్లో॥ యథైవ సూర్యః పిహిత స్స్వయం ఘనై
శ్ఛాయాంచ రూపాణి చ సంచకాస్తి ।
ఏవం గుణేనాపి హితోగుణాంస్త్వ
మాత్మప్రదీపో గుణినశ్చ భూమన్ ॥ 40

టీ:- తర్హి కిమహ మేవసంసారీత్యుచ్యతే న హి నహీతి సదృష్టాంత మాహ - యథేతి. హేభూమన్. స్వయా ఛాయయా మేఘలక్షణయా పరదృష్ట్యా పిహితః ఛాదితోఽపి సూర్యః. ఛాయాం మేఘం చ రూపాణి చ భవనాంతరితాన్ ఘటాదీనపి సంచకాస్తి ప్రకాశయతి. ఏవం గుణేనాహంకారేణ స్వకార్యేణ జీవావరణేన తదృష్ట్యా పిహితోఽపి గుణాన్ సత్త్వాదీన్. ఉపాధీన్ గుణినశ్చ. ఉపహితాన్ జీవానపి. చకాస్తి. ఆత్మ ప్రదీపః స్వప్రకాశః అతఃసర్వసాక్షిణస్తవ న సంసార ఇత్యర్థః. 40

శ్లో॥ యన్మాయామోహితధియః పుత్రదార గృహాదిషు ।
ఉన్మజ్జంతి నిమజ్జంతి ప్రసక్తావృజినార్ణవే ॥ 41

టీ:- కించ మాయాశ్రయస్యాన్యాన్ మోహయతస్తవ కుతస్సంసృతి రిత్యాశయేనాహ - యదితి. పుత్రాదిషు ప్రసక్తాః. వృజినార్ణవే దుఃఖసాగరే. ఉన్మజ్జంతి దేవాదియోనిషు. నిమజ్జంతి స్థావరాది

అయినచో నేనే సంసారినాయన్నచో లేదులేదనుచున్నాడు. ఓ సంపన్నిలయా ! సూర్యుడు ఏ విధముగ మేఘలక్షణ రూపమైన తన నీడచే కప్పబడిన వాడయ్యును నీడను మేఘములను రూపములను, గృహ మధ్యము నందలి ఘటాదులను ప్రకాశింపచేయునో అట్లే అహంకారరూప స్వగుణ కార్యముతో జీవావరణ దృష్టితో ఆచ్ఛాదితులైనను నీవు సత్త్వాది గుణములను ఉపాధులను జీవులను ప్రకాశింప చేయుదువు. స్వ ప్రకాశమైన ఆత్మ దీపమువంటి వాడవునీవు. సమస్తమునకు సాక్షీభూతుడవగు నీవు సంసారివికావు. 40

మరియు మాయకు ఆశ్రయమై, ఇతరులను మోహితులను చేయు నీకు సంసారమెక్కడిది? అను నభిప్రాయముతో పల్కుచున్నాడు. నీ మాయా మోహితమైన బుద్ధికలవారు భార్య పుత్ర గృహాలందు ఆసక్తి కలవారై దుఃఖ సాగరమునబడి దేవాది యోనులందు, స్థావరాది యోనులందును మునిగి తేలుచున్నారు. 41

యోనిషు. తుదుక్తం వాయవీయే. శ్లో."విపర్యయశ్చ భవతి. బ్రహ్మత్వస్థావరత్వయోః". 41

శ్లో॥ దేవదత్తమిదం లబ్ధ్వానృలోక మజితేంద్రియః ।
యోనాద్రియేతత్వత్పాదౌసశోచ్యోహ్యాత్మవంచకః ॥ 42

టీ:- ఏవం జీవేశ్వరవ్యవస్థాం నిరూప్యేదానీం అభజంతం నిందతి- ద్వాభ్యాం. దేవేతి. దేవేన త్వయా కర్మాధ్యక్షేణ దత్తం నృదేహమిమం లబ్ధ్వాపీతి. 42

ఈ విధముగ జీవేశ్వర వ్యవస్థను నిరూపించి ఇపుడు దైవమును సేవించనివారిని దూరుచున్నాడు. దేవుడవగు నీవు ప్రసాదించిన మానవదేహమును పొందియు ఎవరు ఇంద్రియ సుఖములను జయింపజాలక ఆత్మ వంచకుడై నీ పాదపద్మములను సేవింపడో వాడు దుఃఖ భాజనుడగును. 42

శ్లో॥ యస్త్వాం విసృజతే మర్త్యఆత్మానాం ప్రియమీశ్వరం ।
విపర్యయేంద్రియార్థార్థం విషమిత్యమృతం త్యజన్ ॥ 43

టీ:- శోచ్యత్వేహేతుః - య ఇతి. విపర్యయాః విపరీతాః. అనాత్మ ప్రియాః అనీశ్వరాః యే ఇంద్రియార్థాఃపుత్రాదయస్తదర్థం. 43

దుఃఖమునకు కారణమునుచెప్పుచున్నాడు- ఈశ్వరునియందు భక్తి లేక నిజదారాపుత్రగృహరూపమైన విపరీత విషయములందు తగుల్కొని నిన్ను సేవింపనివారు విషమని అమృతమును త్యజించిన వారగుదురు. 43

శ్లో॥ అహం బ్రహ్మా చ విబుధామునయశ్చామలాశయాః ।
సర్వాత్మనా ప్రసన్నాస్త్వామాత్మానం ప్రేష్ఠమీశ్వరమ్ ॥ 44

టీ:- అహమన్యే చ శుద్ధమనసస్త్వా మేవ భక్త్యా ప్రపన్నా ఇత్యాహ - అహమితి. 44

ఈశ్వరుడగు నేను బ్రహ్మాది దేవతలును, నిర్మలస్వభావులైన మునులు, వేదవిదులును శుద్ధఆత్మస్వరూపుడవగు నీ యందు భక్తితో సర్వాత్మనా ప్రపన్నులమైయున్నాము. 44

శ్లో॥ తంత్వాజగత్థి స్త్యుదయాంత హేతుం
సమం ప్రశాంతం సుహృదాత్మదైవమ్ ।
అనన్యమేకం జగదాత్మకేతం
భవాపవర్గాయ భజామదేవ ॥ 45

టీ:- భగవతో భజనీ యత్వే హేతూన్ వదన్ తద్భక్తిం ప్రార్థయతే- తమితి. సమత్వే హేతుః-ప్రశాంతమితి. సుసేవ్యత్వమాహ- సుహృదాత్మ దైవం సుహృత్ బుద్ధిప్రవర్తకత్వాత్. ఆత్మాచ సర్వాత్మకత్వాత్. ఏవం భూతం దైవం ఈశ్వరంత్వాం. న చాన్యోభజనియోऽస్తీత్యాహ- అనన్యమేకం సమానజాతీయ రహితం తత్కృతః జగతామాత్మనాం చ కేతమదిష్టానాం. 45

ఓ దేవదేవా ! జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయములకు కారణముడవగు నీవు సకల జగత్తునకు బుద్ధిని ప్రసాదించుటచే స్నేహితుడవు. ప్రశాంతుడవు. సర్వభూతసముడవు. సంసారబంధమును త్రోసి రాజని ముక్తిని ప్రసాదించు అద్వితీయుడవు. జగదాత్మకుడవు. అట్టి నిన్ను మేమెల్లరము సర్వదాసేవించుచున్నాము. 45

శ్లో॥ అయం మమేష్టో దయితోऽనువర్తీ
మయాऽభయం దత్తమముష్యదేవ ।
సంపాద్యతాం తద్భవతః ప్రసాదో
యథాహి తే దైత్యపతౌ ప్రసాదః ॥ 46

స్వయముగ భక్తిని వివరించి శివుడు తన భక్తునకు బాణునకు ఆశీస్సులను అభ్యర్థించుచున్నాడు. - ఓ దేవా! ఈ బాణుడు నాకు ఇష్టమైనవాడు. ప్రియమును కూర్చువాడు. నన్నసరించువాడు. వీనికి నాచే అభయము ప్రసాదింపబడినది. కావున తాము దానవరాజు ప్రహ్లాదునిపై అనుగ్రహము చూపిన విధముగనే మీ ప్రసాదమును వీనిపై గూడ ప్రసరింపచేయతగినది. 46

**శ్రీ భగవానువాచ**

శ్లో॥ యదాత్థ భగవంస్త్వంనః కరవామ ప్రియంతవ ।
భవతాయద్వ్యవసితం తన్మే సాధ్వను మోదితమ్ ॥ 47

టీ:- స్వయం భక్తిమాశాస్య భక్తస్యాశిష మాశాస్తే - అయమితి. దైత్యపతౌ ప్రహ్లాదే. (46-47)

**శ్రీ భగవానుడు పలికెను**

ఓ ఈశ్వరా ! మీరుపల్కిన దంతయు సత్యమే ! మీకు ప్రియమును కల్గించెదము. మీరు చెప్పిన విషయమునంతటిని మేము ఆమోదించితిమి. 47

శ్లో॥ అవధ్యోయం మయాప్యేష వైరోచనిసుతోఽసురః ।
ప్రహ్లాదయావరో దత్తో నవధ్యోమేత్వదన్వయః ॥ 48

టీ:- అవధ్య ఇతి. వైరోచనిర్బలిర్మద్భక్తః తత్సుతత్వా దయమవధ్య స్తావత్ కించ. ప్రహ్లాదయేతి అన్వయో వంశః. 48

బలిచక్రవర్తి కుమారుడగు ఈ బాణుడు నాచేత కూడ వధార్హుడుకాడు. ఎందుకనగ నీ వంశమున ఎవ్వనినికూడ నేను వధించనని ఇంతకు పూర్వమే ప్రహ్లాదునకు వరమును ప్రసాదించి యున్నాను. 48

శ్లో॥ దర్పోపశమనాయాస్య ప్రవృక్ణా బాహవోమయా ।
సూదితం చ బలం భూరియచ్చభారామితం భువః ॥ 49

టీ:- తర్హి కిమిత్యేవం కృతం తత్రాహదర్పోపశమనాయేతి. 49

అయినచో ఎందుకువాని భుజముల నరికితినందువా. వినుము. వీని గర్వము నణచివేయుటకు మాత్రమే బాహువులు తెగవేయబడినవి. భూమికి భారముగ పరిణమించిన వీని అక్షౌహిణుల బలమును నశింపజేయబడినది. 49

శ్లో॥ చత్వారోఽస్యభుజాశ్శిష్టా భవిష్యత్యజరామరః ।
పార్షదముఖ్యోభవతోనకుతశ్చిద్భయోఽసురః ॥ 50

టీ:- అనుగృహ్ణాతి - చత్వార ఇతి. 50

అనుగ్రహమును ప్రసాదించుచున్నాడు. - ఈ బాణుని నాల్గుచేతులు మాత్రము మిగిలియున్నవి. వీడు జరామరణములు లేక యుండగలడు. నీకు ఎల్లవేళల ప్రక్కనే యుండి ఇతరులనుండి భయమును పొందకయుండును. 50

శ్లో॥ ఇతి లబ్ధ్వాభయం కృష్ణం ప్రణమ్య శిరసాసురీః ।
ప్రాద్యుమ్నిం రథమారోప్యసవధ్వాతముపానయత్ ॥ 51

టీ:- ఇతీతి సవధ్వా ఉషయా కాంతయా సహ. 51

ఈ విధముగ బాణుడు అభయమును పొంది శ్రీకృష్ణునకు శిరస్సు వంచి సాష్టాంగముగ ప్రణమిల్లి నవవధువు ఉషతో కూడ అనిరుద్ధుని రథముపైనెక్కించుకొని శోణితపురమునకు గొనిపోయెను.

శ్లో॥ అక్షౌహిణ్యా పరివృతం సువాససమలంకృతం ।
సపత్నీకం పురస్కృత్యయయౌ రుద్రానుమోదితః ॥ 52

టీ:- అక్షౌహిణ్యేతి. రుద్రానుమోదిత ఇతి దభిప్రేతస్త్వేవ బాణభుజ భంగస్య కృతత్వాత్. 52

రుద్రునిచే అనుమతిని పొందినవాడై అక్షౌహిని సేనాపరివృతుడై విచిత్రవస్త్రాలంకుతులైన పత్నులతో కూడి పురమునకు పోయెను. (51-52)

శ్లో॥ స్వరాజధానీం సమలంకృతాం ధ్వజై
స్సతోరణైర్భూషిత మార్గ చ త్వరాం ।
వివేశ శంఖానకదుందుభి స్వనై
రభ్యుద్యతః పౌరసుహృద్ద్విజాతిభిః ॥ 53

పతాకధ్వజములతో, తోరణములతో పట్టణమార్గములనన్నింటిని అలంకరింపజేసి శంఖ ఢమరుక భేరీనాదములతో, పురజనులతోడను, మిత్రులతోడను, విప్రులతోడను కూడి అభ్యుదయ పరంపరలతో రాజధానీ ప్రవేశముచేసెను. 53

శ్లో॥ య ఏతత్కృష్ణ విజయం శంకరేణ చ సంయుగీం ।
సంస్మరేత్ప్రాతరుత్థాయ నతస్యస్యాత్పరాజయః ॥ 54

శ్రీకృష్ణునియొక్క విజయమును, శంకరుని తోడి సమరమునకు సంబంధించిన కథను ఎవడు ఉదయముననే లేచి స్మరించునో, వానికి లోకమున పరాజయమనునది యుండదని ఈ అధ్యాయ ఫలము. 54

టీ:- స్వేతి. పౌరాదిభిరభ్యుద్యతః ఆభిముఖమాగత్య సత్కృతః (53-54)

**ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,**
**త్రిషష్టితమోఽధ్యాయః**

**శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు**
**అరవైమూడవ అధ్యాయము సమాప్తము**

## చతుష్షష్టితమోఽధ్యాయః

శ్లో॥ చతుష్షష్టితమే కృష్ణోనృగం పాపాదమోచయత్ ।
బ్రహ్మస్వహారిదోషోక్త్యా రాజ్ఞోదృప్తాన శిక్షయత్ ॥
విభూతి భాగ్యభోగాది మదోద్ధత మనోరథాన్ ।
అన్వశాసద్యదూన్ కృష్ణోనృగోద్ధారప్రసంగతత్ ॥

### నృగోపాఖ్యాన కథా ప్రారంభఘట్టః

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఏకదా ఉపవనం జగ్మూరాజన్ యదుకుమారకాః ।
విహర్తుం సాంబ ప్రద్యుమ్న చారుభాను గదాదయః ॥ 1

శ్లో॥ క్రీడిత్వా సుచిరంతత్ర విచిన్వంతః పిపాసితాః ।
జలం నిరుదకే కూపే దదృశుస్సత్త్వమద్భుతమ్ ॥ 2

టీ:- క్రీడిత్వేతి. పిపాసితాః తృషితాః జలం విచిన్వంతః సత్త్వం జీవం. 1,2

శ్లో॥ కృకలాసంగిరినిభం వీక్ష్య విస్మిత చేతసః ।
తస్యచోద్ధరణే యత్నం చక్రుస్తే కృపయానితాః ॥3

టీ:- కృకలాసమితి. తం చ కృకాలాసం వీక్ష్య. 3

## 64వ అధ్యాయము

ఈ అరువదినాల్గవఅధ్యాయము నందు శ్రీకృష్ణుడు నృగుచక్రవర్తికి పాపమునుండి మోక్షమును కల్గించెను. బ్రాహ్మణ ధనాపహరణము దోషమని, రాజు విషయమున గర్వితులగువారిని శిక్షించెను. శ్రీకృష్ణుడు నృగోద్ధార ప్రసంగము వలన ఐశ్వర్య భోగభాగ్య మదముచే పొంగిపొర్లు యాదవులను కూడ శాసించెను.

### నృగోపాఖ్యాన కథా ప్రారంభ ఘట్టము.

### శ్రీ శుకులు పలికిరి.

ఓ పరీక్షిత్తా ! ఒకసారి యదుకుమారులు, సాంబ, ప్రద్యుమ్న, చారు, గదాదులు విహరించుటకై సమీప వన ప్రదేశమునకు పోయిరి. 1

ఆ వనమున చాలసేపు విహరించి, ఆటలాడి దప్పిగొనిరి. నీటికై వెదకుచు ఒక ఎండిన బావిని అందు ఆశ్చర్యమగు ఒక జల జంతువును చూచిరి. 2

ఆ జంతువు కొండంత ఊసరవెల్లి. దానిని చూచి ఆశ్చర్యపడి దయాళువులై యదుకుమారులు దానిని బావి నుండి బయటకు తీయుటకు ప్రయత్నించిరి. 3

శ్లో॥ చార్మభిస్తాంతవైఃపాశైర్బద్ధ్వా పతితమర్భకాః ।
నాశక్నువన్ సముద్ధర్తుం కృష్ణాయాచఖ్యురుత్సుకాః ॥ 4

శ్లో॥ తత్రగత్వారవిందాక్షో భగవాన్విశ్వభావనః ।
వీక్ష్యోజ్జహార వామేన తంకరేణ సలీలయా ॥ 5

టీ:- చార్మభిరితి. చార్మభిః చర్మమయైః. తాంతవైః తంతుమయైః పాశైశ్చ. (4-5)

మూర్ఖులైన యదుకుమారులు చర్మతంతువులతో తయారుచేసిన తాడుతో దానిని బయటకిలాగ యత్నించి అసమర్థులై ఉరకలెత్తు ఉత్సాహముతో పోయి కృష్ణునకు నివేదించిరి. పద్మపత్రముల వంటి నేత్రములుకలవాడు విశ్వజనులచే నుతింపబడువాడునగు భగవంతుడు శ్రీకృష్ణుడు ఆ కూపము చెంతకు పోయిచూచి ఎడమచేతితో సులభముగ దానిని బావినుండి బయటకు తీసెను. (4-5)

శ్లో॥ స ఉత్తమ శ్లోకకరాభి మృష్టో
విహాయ సద్యః కృకాలాసరూపం ।
సంతప్త చామీ కర చారువర్ణః
స్వర్గ్యద్భుతాలంకరణాంబరస్రక్ ॥ 6

శ్లో॥ పప్రచ్ఛవిద్వానపి తస్యదానం
జనేషు విఖ్యాపయితుం ముకుందః ।
కస్త్వం మహాభాగవరేణ్యరూపో
దేవోత్తమం త్వాం గణయామనూనమ్ ॥ 7

టీ:- స ఇతి. సంతప్తం చామీకరం సువర్ణంతద్వోచ్చారువర్ణో యస్య సః అద్భుతాఃఅలంకరణాంబరస్రజో యస్యసః స్వర్గీదేవో బభూవ.(6-7)

ఉత్తమోత్తముడగు పురుషోత్తముని కరస్పర్శతో ఆ ఊసరవెల్లి ఆ రూపమును వదిలి బాగుగ శుద్ధముచేయబడిన బంగారువర్ణము వంటి దేహఛాయ కలవాడై, అద్భుత ఆభరణ, వస్త్ర అలంకరణ పూమాలికలు కంఠమున గల దివ్య దేహము కలవాడయ్యెను. అన్ని విషయములు తెలిసినవాడయ్యును. ముకుందుడు ఆ దివ్యశరీరి చేసిన దానము లోకమునకు తెలియజేయుటకై ప్రశ్నించెను. మహానుభావా! ఈ దివ్య దేహమును కలిగిన నీవు ఎవరు? నిశ్చయముగ నీవు ఇంద్రుడవని తలంచుచున్నాను. (6-7)

శ్లో॥ దశామిమాం వా కతమేన కర్మణా
సంప్రాప్తితోऽసి హ్యతదర్హ సుప్రభః ।
ఆత్మాన మాఖ్యాహి వివిత్సతాంనో
యన్మన్యసేతత్క్ష మమత్ర వక్తుమ్ ॥ 8

అనన్య కాంతిమంతమగు శరీరకాంతి కలవాడా! ఏమి పాపకర్మ చేయుటచే నీవు ఈ స్థితిని పొందితివి. చెప్పుటకు యుక్తమైనదని తలచినచో నీ కథను తెలిసికోగోరు మాకు వినిపింపుము. 8

శ్లో॥ స్మరాజాసంపృష్టః కృష్ణేనానంద మూర్తినా ।
మాధవం ప్రణిపత్యాహ కిరీటేనార్కవర్చసా ॥ 9

ఈ విధముగ ఆనందమూర్తియగు కృష్ణునిచే అడుగబడినవాడై రాజు సూర్యసదృశతేజము కల్గిన కిరీటముతో మాధవునకు నమస్కరించి పల్కెను. 9

టీ:- దశామితి. యత్ యదిక్షమం యోగ్యం. (8-9)

నృగ ఉవాచ

శ్లో॥ నృగో నామ నరేంద్రోऽహమిక్ష్వాకుతనయః ప్రభో ।
దానేష్వాఖ్యాయమానేషు యదితేకర్ణమస్పృశమ్ ॥ 10

టీ:- నృగ ఇతి. యదితే కర్ణమస్పృశమిత్యసందేహే సందేహవచనం యది వేదాః ప్రమాణంస్యురితివత్. కర్ణపథంనూనంప్రాప్తస్యామిత్యర్థః 10

నృగమహారాజు పలికెను

ఓ స్వామీ ! నేను నృగుడను పేరుగల నరేంద్రుడను. ఇక్ష్వాకు మహారాజు తనయుడను. నేను చేసిన దాన కథలు లోక విదితములు. అవి మీ చెవికి సోకనిచో విన్నవింతును. శ్రీకృష్ణుడు వేదప్రతిపాద్యుడు. ఆయనకు తెలియని కథలేముండును. వేదములలో తప్పక నా కథయున్నది. కథా! సందేహములేనిచోట సందేహమున్నట్లు చెప్పుటను కర్ణమస్పృశమందురు. 10

శ్లో॥ కిన్నుతేஉవిదితం నాథ సర్వభూతాత్మ సాక్షిణః ।
కాలేనా వ్యాహతదృశో వక్ష్యేஉథాపి తవాజ్ఞయా ॥ 11

శ్లో॥ యావత్యస్సికతాభూమేర్యావత్యోదివి తారకాః ।
యావత్యో వర్షధారాశ్చ తావతీరదదాంచగాః ॥ 12

శ్లో॥ పయస్వినీస్తరుణీశ్శీల రూపగుణో
పపన్నాః కపిలా హేమశృంగాః ।
న్యాయార్జితారౌప్య ఖురాస్సవత్సాః
దుకూలమాల్యాభరణాస్త్వదా మహమ్ ॥ 13

టీ:- కించ కిన్నితి.సర్వేషాం భూతానామాత్మనో బుద్ధేస్సాక్షిణ స్తే అవిదితం కిన్ను న కించిత్.(11-13)

శ్లో॥ స్వలంకృతేభ్యోగుణశీలవద్భ్య
స్సీదత్కుటుంబేభ్యఋతవ్రతేభ్యః ।
తపశ్రృత బ్రహ్మవదాన్యసద్భ్యః
ప్రాదాంయువభ్యో ద్విజ పుంగవేభ్యః ॥ 14

టీ:- స్వలంకృతేభ్య ఇతి. ఋతవ్రతేభ్యః అదంభాచారేభ్యః. తపసా శ్రుతాః ప్రఖ్యాతాశ్చ. తే బ్రహ్మణి వదాన్యాః అత్యుదారాః అధ్యాపన శీలాశ్చ తే సంతశ్చ తేభ్యః. 14

సర్వ ప్రాణుల ఆత్మ బుద్ధులకు సాక్షివగు నీకు తెలియని దేమున్నది. ఏమియు లేదని భావము. ఓ దేవాధిదేవా ! సకల భూత ఆత్మసాక్షివగు నీకు తెలియనిదేమి కలదు. ఐనను కాలానురూపముగ నశించని దివ్యదృష్టిగల నీయానతిచే చెప్పుచున్నాను. భూమి యందు ఇసుకరేణువు లెన్నిగలవో, ఆకాశమున తారకలెన్నిగలవో, దివినుండి వర్షింపబడు వర్షధారలెన్నిగలవో అన్ని గోవులను నేను దానము చేసితిని. దూడలను కలిగి పాలనిచ్చునట్టి, వయస్సుననుండి శీలరూప గుణవంతములైనట్టి, బంగారపు కొప్పెరల కొమ్ములు కల్గినట్టి, వెండి తొడుగులుగల గిట్టలతోడి, న్యాయముగ సంపాదించిన కపిలవర్ణ ధేనువులను, పట్టుబట్టలను, పుష్పమాలలను, ఆభరణములను కూడ దానము చేసితిని. (11-13)

సదాచారవంతులై తపస్సు, వేదపాండిత్యముతో ప్రసిద్ధులైనట్టి, వదాన్యులైనట్టి, అధ్యాపనశీలురైనట్టి, చక్కగ అలంకృతులైనట్టి యువకులగు విప్రవరులకు, సంసారబాధలకు లోనైన కుటుంబములు గల వారికి, గుణశీల సంపన్నులకూ కూడ అనేక దానాలు చేసితిని. 14

శ్లో॥ గోభూహిరణ్యా యతనాశ్వహస్తినః
కన్యాస్సదాసీస్తిలరౌప్యశయ్యాః ।
వాసాంసి రత్నాని పరిచ్ఛదాన్ రథా
నిష్టాంశ్చ యజ్ఞాశ్చరితంచ పూర్తమ్ ॥ 15

టీ:- గోభూమిహిరణ్యేతి. పూర్తం వాపీకూపాది చరితం కృతం. 15

ఇంకను, గోవులను, భూములను, సువర్ణములను, గృహములను, అశ్వములను, గజములను, చెలికత్తెలతో సహా కన్యకలను, నూగులను, వెండిని, పరుపులను, వస్త్రములను, రత్నములను, గ్రంథములను, రథములను, అగ్నిహోత్రము, తపస్సు, సత్యము, వేదానుపాలనము, ఆతిథ్యము, వైశ్య దేవములను, ఇష్ఠములను, మరియు వాపీకూప తటాకములు, దేవాయతనములు, అన్నదానములు, విశ్రాంతి గృహములను పూర్తములను, అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థ్యము, షోడశీ, వాజపేయము, అతిరాత్రము, ఆప్తోర్యాయము అను యజ్ఞములనుకూడ దానములుగ చేసితిని. 15

శ్లో॥ కస్యచిద్ద్విజముఖ్యస్య భ్రష్టా గౌరంమగోధనే ।
సంపృక్తావిదుషాసాచమయాదత్తా ద్విజాతయే ॥ 16

శ్లో॥ తాంనీయమానాంతత్స్వామీదృష్ట్వో వాచమమేతితం ।
మమేతి ప్రతిగృహ్యాహ నృగోమే దత్తవానితి ॥ 17

టీ:- ఏవం వర్తమానస్య మమ సంకటం కించదాపన్నం శృణ్విత్యాహ - కస్యచిదితి. ద్విజముఖ్యస్య బ్రాహ్మణానాంమధ్యే అత్యంతశ్రేష్ఠస్య. అత ఏవ ప్రతిగ్రహనివృత్తస్య. సంపృక్తా మిశ్రితా. అవిదుషా బ్రాహ్మణ స్యేయమిత్యజానతా. (16-17)

ఇట్లు దానశీలుడనై యుండుచుండగ నాకొక చిన్న సంకటము వచ్చిపడినది. వినుము.- ఒకానొక బ్రాహ్మణుని యొక్క తప్పిపోయిన గోవు నాచే దానము చేయబడినది. వచ్చి నాగోధమున కలసి పోయినది. అది తెలియని నేను ఆయావును కూడ కలిపి మరియొక ద్విజునకు దానము చేసితిని. - ఆ బ్రాహ్మణుడు ఆవులను తోలుకొని పోవుచుండగ మొదట దానముగ స్వీకరించిన విప్రుడు ఇది నాకు దానము చేయబడిన ఆవు అని రెండవ బ్రాహ్మణునితో అనెను. కాదు నాదని రెండవ బ్రాహ్మణుడనగ మొదటివాడు నాకు దీనిని నృగ మహారాజు దానము చేసినాడని పల్కెను. (16-17)

శ్లో॥ విప్రౌ వివదమానౌమామూచతుస్స్వార్థ సాధకౌ ।
భవాన్ దాతాపహర్తేతి తచ్ఛ్రుత్వామేఽభవద్భ్రమః ॥ 18

టీ:- విప్రావితి. ప్రతిగ్రాహిణోక్తం దాతేతి. స్వామినోక్తం. అపహర్తేతి. అభవత్ భ్రమః వ్యాకులోఽభవమిత్యర్థః. (18)

అవుకై కలహించుచున్న ఆ ద్విజులిరువురు తమతమ స్వార్థమును సాధించుకొను ఇచ్ఛకలవారై నాచెంతకు వచ్చి నన్నడిగిరి. మొదటివాడు రాజా! నీవు నాకు దానము చేసితివనెను. రెండవవాడు నాగోవును నీవు అపహరింపదలచితివనెను. ఆ మాటలను విని నేను మిక్కిలి కలవరపడితిని. 18

శ్లో॥ అనునీతావుభౌ విప్రౌ ధర్మకృచ్ఛ్రగతేనమే ।
గవాం లక్షం ప్రకృష్టానాం దాస్యామ్యేషాం ప్రదీయతాం ॥ 19

శ్లో॥ భవాంతావనుగృహ్ణీతాం కింకరస్యా విజానతః ।
సముద్ధరంతమాం కృచ్ఛ్రాత్పతంతన్నిరయేఽశుభే ॥ 20

టీ:- అనునీతావితి. తథా ఉభావపి ప్రత్యేకమనునీతౌ ప్రార్థితౌ కథం తదాహ - సార్ధేన. గవామితి. (19-20)

ధర్మసంకటమునకు లోనైన నేను ఆయిరువురిని అనునయించుచు ప్రాధేయపడితిని. ఆ యావుకు బదులు లక్ష గోవులను మీకిచ్చెదనని గోవునిమ్మని అడిగితిని. దాసుడు తెలియక చేసిన ఈ తప్పిదమును మన్నింపుమంటిని. అగాధమైన పాపమున బడునన్ను ఉద్ధరించుడని కోరితిని. (19-20)

శ్లో॥ నాహం ప్రతీచ్ఛేవైరాజన్ ఇత్యుక్త్వా స్వామ్యపాక్రమత్ ।
నాన్యద్గవామప్యయుతమిచ్ఛా మీత్య పరోయయా ॥ 21

టీ:- నేతి అపరః ప్రతి గ్రహీ దురాగ్రహః యల్లక్షం త్వయోక్తం ఆన్యదపి గవామయుతం యది తదిపి. ఇమాం విహాయ నేచ్ఛామీత్యుక్త్వా గాం త్యక్త్వా యయావిత్యర్థః. 21

ఆ గోవు యొక్క నిజమైన అధికారియగు ద్విజుడు ఓ రాజా! నీవు లక్ష గోవులను ఇచ్చినను నాకు వలదని నేను దానికై నిరీక్షించనని పల్కుచు అచటినుండి వెళ్లిపోయెను. రెండవ బ్రాహ్మణుడు కూడ దానికి బదులుగ కోటి ఆవులను ఇచ్చినను గ్రహించనని పల్కుచు ఆయావు నచటనే వదలి వెళ్లిపోయెను. 21

శ్లో॥ ఏతస్మిన్నంతరే యామ్యైర్దూతైర్నీతో యమక్షయం ।
యమేన పృష్టస్తత్రాహం దేవదేవ జగత్పతే ॥ 22

టీ:- ఏతస్మిన్నంతర ఇతి. ఇతః పూర్వం పాపాభావాన్నేతుమసమర్థైరితి భావః. 22

శ్లో॥ పూర్వం త్వమ శుభంభుంక్ష్వ ఉతాహూ నృపతేశుభం ।
నాంతం దానస్య భవతీః పశ్యేలోకస్య భాస్వతః ॥ 23

టీ:- పూర్వమితి. ఉతాహూ ఇత్యేకం పదం. అథవా పూర్వం శుభమితి నాంతమితియమస్య వాక్యం పశ్యేపశ్యామి. 23

శ్లో॥ పూర్వం దేవాశుభంభుజ ఇతి ప్రాహపతేతిసః ।
తావదద్రాక్షమాత్మానం కృకలాసం పతన్ప్రభో ॥ 24

శ్లో॥ బ్రహ్మణ్యస్య వదాన్యస్య తవదాసస్య కేశవ ।
స్మృతిర్నాద్యాపివిధ్వస్తా భవత్సందర్శనార్థినః ॥ 25

టీ:- పూర్వమితి. హే దేవ యమ. పూర్వమశుభం భుంజే ఇతి మయోక్తే. సయమః పతేతి ప్రాహ - (24-25)

ఇంతలో ఇంతకుముందు పాపములు లేకపోవుటచే యమపురికి గొనిపోవ నశక్తులైన ఇరువురు యమభటులు వచ్చి యమసదనమునకు నన్ను తీసుకొని పోయిరి. ఓ దేవదేవా! జగత్పతీ ! యమధర్మరాజుచే నేనిట్లు అడుగబడితిని. - ఓ రాజా! మొదట అశుభమగు పాపఫలము ననుభవింపుము. లేదా పుణ్య ఫలము ననుభవింపుము. సూర్యలోక పర్యంతమైన నీ దానమునకు తత్ఫలమునకు అంతమును కనుగొన జాలకున్నాము. (22-23)

ఓ యమదేవా! మొదట అశుభఫలమునే అనుభవింపనిమ్మనగ పాపఫలానుభవమున పడుమని యమధర్మరాజు పలికెను. ఓ దేవా! పాప పంకిలమున పడుచున్న ఈ ఊసరవెల్లి రూపమును అపుడు కాంచితిని. కేశవా! ఔదార్యవంతుడు, పరబ్రహ్మ స్వరూపుడవగు నీ దాసునకు, నీ సందర్శనాభిలాషి నగుటచే నేటికిని స్మరణ శక్తి నశించలేదు. (24-25)

శ్లో॥ సత్వం కథం మమ విభోఽక్షపథః పరాత్మా
యోగీశ్వరైశ్రుతిదృశామలహృద్విభావ్యః ।
సాక్షాదధోక్షజ ఉరువ్యసనాంధబుద్ధీ
స్స్యాదేవ దృశ్య ఇహయస్యభవాపవర్గః ॥ 26

శ్లో॥ దేవదేవ జగన్నాథ గోవింద పురుషోత్తమ ।
నారాయణ హృషీకేశ పుణ్యశ్లోకాచ్యుతావ్యయ ॥ 27

టీ:- దుర్ఘటేన శ్రీ కృష్ణ సందర్శనేన విస్మితస్సన్ ఆత్మనః భాగ్యమభినందతి - సత్వమితి. హే విభో సత్వం మమాక్షపథః లోచన గోచరస్సన్ కథం సాక్షాత్ ప్రత్యక్షోఽసీత్యర్థః. కిమత్రాశ్చర్యం తదాహ- పరః ఆత్మా ఆత ఏవ యోగీశ్వరైరపి శ్రుతిదృశా ఉపనిషచ్చక్షుషా అమలే హృది విభావ్యః చింత్యః యతః అధోక్షజః అక్షజమైంద్రియకం జ్ఞానం తత్ అధః ఆర్వాగేన యస్మాత్సః యస్యేహ భవాపవర్గో భవేత్తస్య భవాన్ననుదృశః స్యాత్. ఉరువ్యసనేన కృకలాసత్వభవేన దుఃఖేన అంధబుద్ధేస్తు మమైతచ్చిత్రమిత్యర్థః (26-27)

శ్లో॥ అను జానీహిమాం కృష్ణయాంతందేవగతిం ప్రభో ।
యత్రక్వాపి సతశ్చేతో భయాన్మేత్వత్పదాస్పదమ్ ॥ 28

అలవికాని శ్రీకృష్ణ దర్శన భాగ్యముచేత ఆశ్చర్య చకితుడైనవాడై నృగుడు తన అదృష్టమును కొనియాడుకొనుచున్నాడు. - ఓ ప్రభూ! నీవు నాకనులకు కనిపించునట్లుగ ఎట్లు ప్రత్యక్షమైతివి. ఇందులో ఆశ్చర్యమేమందువా? వినుము. నీవు యోగీశ్వరులచేత ఉపనిషత్తులను నేత్రములతో హృదయములందు దర్శింపగల పరాత్పరుడవు. అధోక్షజ! నీ నామమునకు తగినట్లు నేరుగ కింది చూపుగలవాడివై క్రుకలాస్వరూపమున జన్మమును పొంది అధిక దుఃఖముతో అంధకార కూపమున బడిన నాకు ముక్తిని ప్రసాదించుటకై కాక సాక్షాత్తుగ నాకనులకు కనిపించుట ఎట్లు సంభవించును.

దేవదేవా! జగన్నాథా! గోవింద! పురుషోత్తమ! నారాయణ! హృషికేశ! పుణ్యశ్లోక! అవ్యయ! అచ్యుత! ఇది ఎంతయో చిత్రము. ఆశ్చర్యకరమగు విషయముకదా. (26-27)

ఉద్వేగ పూరితమగు భక్తితో అనేక విధములుగ నుతించి అనుమతిని వేడుకొనుచున్నాడు. దేవలోకమునకూడ మానవునిగ

టీ:- ఉద్రిక్తభక్తిర్బహుధా సంబోధయన్ననుజ్ఞాపయతి - అనుజానీహీతి. దేవలోకేఽపి వర్తమానస్యాత్మనో మనస్సన్నిధిం ప్రార్థయతే. - యత్ర క్వాపీతి. త్వత్పదం ఆస్పదం విషయం యస్య తథా భూతం భూయాధితి. 28

నున్నప్పటికి మనస్సన్నిది ప్రసాదించుమని ప్రార్థించుచున్నాడు. - ఓ ప్రభో! శ్రీకృష్ణ! నాకు దేవలోకమునకు పోవుటకు అనుమతినిమ్ము. అచటకూడ నీ పాదపద్మముల ధ్యానించుకొనుటకు తగిన భక్తిభావము కల్గిన సచ్చిత్తముండులాగున నన్ననుగ్రహింపుము. 28

శ్లో॥ నమస్తే సర్వభావాయ బ్రహ్మణేఽనంతశక్తయే ।
వాసుదేవాయ కృష్ణాయ యోగానాంపతయే నమః ॥ 29

శ్లో॥ ఇత్యుక్త్వా తుపరిక్రమ్య పాదౌస్పృష్ట్వాస్వమౌళినా ।
అనుజ్ఞాతో విమానాగ్ర్యమారుహ్యత్పశ్యతాం నృణామ్ ॥ 30

శ్లో॥ కృష్ణః పరిజనం ప్రాహభగవాన్ దేవకీసుతః ।
బ్రహ్మణ్యదేవో ధర్మాత్మారాజన్యాననుశిక్షయన్ ॥ 31

టీ:- యాస్యన్న మస్యతి. నమ ఇతి. సర్వభావాయ సర్వస్య భావో జన్మ యస్మాత్ తస్మై.బ్రహ్మణే కర్త ృత్వేఽప్యవికారాయ కుతః అనంతశక్తయే అనంతామాయాఖ్యాశక్తిర్యస్యతస్మై. వాసుదేవాయ సర్వాశ్రయాయేత్యు పాదానత్వ ముక్తం. శ్రీకృష్ణసదానంద రూపాయేతి పురుషార్థత్వ ముక్తం.శ్లో."కృషిర్భూవాచక శ్శబ్దోణశ్చ నిర్వృతివాచకః

నృగచక్రవర్తి దేవలోకమును పుణ్యఫలము ననుభవింప పోవుచు ఆత్మస్వరూపిని నమస్కరించుచున్నాడు.

ఓ పరమాత్మా ! సకల జగత్తు యొక్క సృష్టికి మూలభూతమగు, అనంత మాయయను శక్తి స్వరూపుడవు నీవు. అవికారుడవగు పరబ్రహ్మమునకు, సర్వాశ్రయునకు, సదానంద స్వరూపుడగు శ్రీకృష్ణ దేవునకు నమస్కారము. శ్లో ॥ కృషిర్భూవాచక శ్శబ్దోణశ్చ నిర్వృతివాచకః । తయోరైక్యం పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభి ధీయతే ॥ కృష్ అనగ సంసారము, ణ కారమున విముక్తి. ఈ రెండు అక్షరముల కలయిక కృష్ణ శబ్ధము అనగా భవమోచకుడు పరబ్రహ్మ స్వరూపుడు కృష్ణుడని భావము. కృష్ణా! యోగీశ్వరుల ఇష్టాపూర్తాది కర్మలకు ఫలదాతవగు నిన్ను వదిలి పోవుటకు ఇష్టము లేకపోయినను నీచే ప్రసాధితమగు ఫలము ననుభవించుటకై పోవుచున్నాను - అని పలికి నృగ మహారాజు స్వామికి ప్రదక్షిణము చేసి శిరము పాదములంటగ నమస్కరించి స్వామి అనుజ్ఞ పడసి మానవులందరు చూచుచుండగ తన కట్టెదుట నిల్చిన దేవ

తయోరైక్యం పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభి ధీయతే" .ఇతి స్మృతేః. కించ. యోగానాం ఇష్టాపూర్తాదికర్మణాం ఫలదాత్రే. అయం భావః. ఏవం భూతం త్వాం విహాయగంతుమనిచ్ఛురపి గమిష్యామిత్వద్దత్త ఫలభోగాయేతి. (29-31)

శ్లో॥ దుర్జరం బతబ్రహ్మస్వం భుక్తమగ్నేర్మ నాగపి ।
తేజీయసోఽపి కిముతరాజ్ఞామీశ్వరమానినామ్ ॥ 32

శ్లో॥ నాహం హాలాహలం మన్యే విషంయస్య ప్రతిక్రియా ।
బ్రహ్మస్వంహి విషం ప్రోక్తం నాస్య ప్రతివిధిర్భువి ॥ 33

టీ:- దుర్జరమితి. మనాక్. ఈషదపి భుక్తం సత్ అగ్నేః అగ్నిసదృశస్య తేజీయసః అతి తేజస్వినోఽపి దుర్జరమ్. (32-33)

శ్లో॥ హినస్తివిషమత్తారం వహ్నిరద్భిః ప్రశామ్యతి ।
కులం సమూలం దహతి బ్రహ్మస్వారణి పావకః ॥ 34

టీ:- కింతు. విషాదపి ఘోరమిత్యాహ-హినస్తీతి సంసర్గి సంసర్గేణ మారకత్వా దగ్ని తుల్యతా స్యాత్ తదపి నేత్యాహ - వహ్నిరితి కించ. సమూలమితి. వహ్నిర్మూలాన్యవశేషయతి. బ్రహ్మలక్షణారణిజఃపాప పావకస్తు కులం దహతి. తదపి సమూలమితి. 34

విమానమునెక్కెను. బ్రాహ్మణ్య దేవుడు, ధర్మాత్ముడు, భగవంతుడునగు దేవకీనందనుడు శ్రీకృష్ణుడు రాజులనందరును చైతన్య పరచగోరి పరిజనులతో ఈ విధముగ పలికెను. (29-31)

బ్రాహ్మణ ధనము అతిపాపిష్ఠమైనది. అగ్నివలె తేజస్సు కలిగిన వాడుకూడ కొంచమపహరించి, అనుభవించినను పట్టి కుడుపును కదా ! అగ్ని మూలములను దహింపక వదిలి వేయును కాని బ్రహ్మ లక్షణమైన అగ్ని మాత్రము సమూలముగ కులమును దహించి వేయును. ఇక ఈశ్వరునియందలి భక్తి పరాధీనులగు వారి విషయమున నేమి చెప్పదగును. - హాలహలముకూడ బ్రాహ్మణ ధన విషయమునకు సాటి రాదని నేను తలంచుచున్నాను. బ్రహ్మస్వములతో తుల్యమగు విషయము భూమియందు వేరొకటి లేదు. (32-33)

బ్రహ్మస్వరూపము విషముకంటె ఘోరమైనదని నిరూపించుచున్నాడు. విషము దానిని తిన్న వానిని మాత్రమే చంపును. అగ్ని నీటిచే చల్లార్పబడును. బ్రహ్మస్వమను అగ్ని కులమును సమూలముగ దహించివేయును. 34

శ్లో॥ బ్రహ్మస్వం దురనుజ్ఞాతం భుక్తం హంతి త్రిపూరుషం ।
ప్రసహ్యాతు బలాద్భుక్తం దశ పూర్వాన్ దశాపరాన్ ॥ 35

టీ:- బ్రహ్మస్వమితి. దురనుజ్ఞాతం యదావదనుజ్ఞాతం త్రిపూరుషం కులం. స్వం పుత్రపౌత్రౌచ. ప్రహస్య బలాత్ రాజాద్యాశ్రయతః. 35

శ్లో॥ రాజనో రాజలక్ష్మాచనాత్మపాతం విచక్షతే ।
నిరయంయేऽభిమన్యంతే బ్రహ్మస్వంసాధుబాలిశా ॥ 36

టీ:- రాజాన ఇతి. యే బ్రహ్మస్వమభిమన్యంతేవాంఛంతి. తే నిరయ మేవాభిమన్యంతే. ఆతో బాలీశాః అజ్ఞాః ఆత్మపాతం న విచక్షత ఇతి. 36

శ్లో॥ గృహ్ణంతి యావతః పాంసూన్రుదతామశ్రు బిందవః ।
విప్రాణాం హృతవిత్తానాం వదాన్యానాం కుటుంబినామ్ ॥37

శ్లో॥ రాజానోరాజకుల్యాశ్చతావతోబ్దాన్ నిరంకుశాః ।
కుంభీపాకేషు పచ్యంతే బ్రహ్మదాయాప హారిణః ॥ 38

శ్లో॥ స్వదత్తాం పరదత్తాంవా బ్రహ్మవృత్తిం హరేతయః ।
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతేక్రిమిః ॥ 39

టీ:- అపి చ. గృహ్ణన్తీతి.(37-39)

బ్రహ్మస్వము దాని యజమానిచే అనుమతిని పడయక అనుభవింపబడినచో తనతో కలిపి పుత్రపౌత్రుల పర్యంతము నాశనము చేయును. రాజాదుల ఆశ్రయము కలిగి బలవంతముగ దానిని అనుభవించినచో తనకు పది తరములకు ముందు వారిని, పది తరముల తరువాతి వారిని కూడ హతమార్చును. 35

సజ్జనులైన బ్రాహ్మణుల ధనమును దోచుకొనవలెనని కాంక్షించువారు నిశ్చయముగ నరకము నాశించువారే. రాజులు రాజ్యలక్ష్మియు తెలివి లేనివారై తమ పతనావస్థను గూర్చి ఆలోచింపరు. (36)

మరియు, ఉదారులు, కుటుంబీకులు, ధనమునపహరింప వారునునగు విప్రులు రోదించుచుండగ వారి కన్నీటి బిందువులచే కన్నులు ఎంతకాలము ఎఱ్ఱబడునో అంతకాలము - నిరంకుశులై బ్రాహ్మణ దాయములను హరించిన రాజులు రాజకులములును కుంభీపాకమను నరకము నందు పచనము చేయబడుదురు. తాను దానము చేసినదికాని, ఇతరులు దానముచేసినది కానియగు బ్రాహ్మణ జీవన భృతిని హరించినవాడు అరువదివేల సంవత్సరములు అమేధ్యమున క్రిమియై జన్మించును. (37-39)

శ్లో॥ మామే(బ్రహ్మధనం భూయాద్య (గ్ధద్ధ్వాత్స్వాయుషోన్నృపాః ।
పరాజితాశ్చ్యుతా రాజ్యాద్భవంత్యుద్వేగి నోహియే ॥ 40

శ్లో॥ వి(ప్రం కృతాగసమపిమైవ(ద్రుహ్యతమామకాః ।
ఘ్నంతంబహుశపంతం వానమస్కురుతనిత్యశః ॥ 41

టీ:- మేతి. గృధ్వా అభికాంక్ష్య.(40-41)

శ్లో॥ యథాహం(ప్రణమేవి(ప్రాననుకాలం సమాహతః ।
తథా నమతయూయంచయోஉ_న్యథామేసదండభాక్ ॥ 42

టీ:- యథేతి. (ప్రణమే (ప్రణమామి. 42

శ్లో॥ (బ్రహ్మణార్థోహ్యపహృతోహర్తారం పాతయత్యధః ।
అజానం తమపిహ్యేనం నృగం (బ్రాహ్మణ గౌరివ ॥ 43

శ్లో॥ ఏవం వి(శ్రావ్య భగవాన్ ముకుందో ద్వారకా(ప్రజాః ।
పావనస్సర్వలోకానాంవివేశ నిజ మందిరం ॥ 44

టీ:- న కేవలమర్థవాదబిభీషి కేయం. కింతు. (ప్రత్యక్షమిత్యాహ - (బ్రాహ్మణార్థ ఇతి. (43-44)

**ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే, చతుష్షష్టితమోஉ_ధ్యాయః**

ఉద్వేగము కలిగి ఏరాజులు అధికముగ (బ్రాహ్మణుల దానమును కాంక్షించుచుందురో వారు అల్పాయుష్కులై రణములందు పరాజితులై రాజ్య (భష్టులగుదురు. 40

ఆత్మీయులారా! పాపాచరణుడైన (బ్రాహ్మణుని నిందించవలదు. హంతకుడైనను, అధికముగ శపించువాడైనను, నిత్యము (బ్రాహ్మణునకు నమస్కరింపవలయును. 41

నేనేవిధముగ భక్తి(శద్ధలుకలిగి ఎల్లవేళల వి(ప్రులను నమస్కరింతునో అట్లే మీరునుసమాహితచిత్తులై వారిని నమస్కరింపుడు. అట్లు చేయనివాడు నాదండనమునకు పా(తుడగును. 42

తెలియక చేసిన తప్పిదమునకు నృగుని (బ్రాహ్మణ గోవువలె (బ్రాహ్మణ ధనమును అపహరించిన వానిని అధఃపతనము గావించును. ఈ విధముగ భగవంతుడు ద్వారక (ప్రజలకు నృగ మహారాజు కథను వినిపించి సర్వలోక పావనుడు కృష్ణుడు తన మందిరమున (ప్రవేశించెను. (43-44)

**శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు**
**అరవైనాల్గవ అధ్యాయము సమాప్తము**

## పంచషష్టితమోఽధ్యాయః

శ్లో॥ పంచషష్టితమే రామశ్చక్రేగోకులమాగతః ।
రమమాణస్తు గోపిభిః కాళింద్యాః కర్షణం మదాత్ ॥
రామస్యచరితం చిత్రం కాళింద్యాకర్షణాదియత్ ।
పౌండ్రకాంతాది కృష్ణస్య పృథగుక్తం తతః పరమ్ ॥

### బలరామస్య పునర్నంద వ్రజగమనాది కథా ప్రారంభ ఘట్టః

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ బలభద్రః కురుశ్రేష్ఠ భగవాన్రథమాస్థితః ।
సుహృద్దిదృక్షురుత్కంఠః ప్రయయౌ నందగోకులమ్ ॥ 1

శ్లో॥ పరిష్వక్తశ్చిరోత్కంఠైర్గోపైర్గోపీభిరేవచ ।
రామోఽభివాద్య పితరావాశీర్భిరభినందితః ॥ 2

టీ:- పరిష్వక్త ఇతి. ఆశీర్భిరభినందితోబభూవ. 1, 2

## 65వ అధ్యాయము

ఈ అరవైఐదవ అధ్యాయమునందు బలరాముడు గోకులమునకు వచ్చుటయు, గోపికలతో క్రీడించుచుకాళిందీ నదిని హలముతోదగ్గరగ లాగుటయును, వర్ణింపబడినది. కాళింద్యాకర్షణాదికమగు బలరామ చరితము అతి విచిత్రమైనది. పౌండ్రకసంహార రూపమగు కృష్ణ చరిత్ర వేరుగ వర్ణితమైనది.

### బలరాముడు మరల రేపల్లెకు పోవు కథా ప్రారంభఘట్టము.

**శ్రీ శుకులు పలికిరి**

ఓ కురుశ్రేష్ఠా ! తరువాత భగవంతుడు బలరాముడు స్నేహితులను చూడవలయునను కోరికతో రథమునెక్కి నంద వ్రజమునకు పయనించెను. 1

చాలా కాలముగ చూడ కోరికలు గల గోపాలురచేత, గోపికల చేతను ఆలింగనము చేసికొనబడినవాడై బలరాముడు తల్లిదండ్రులకు నమస్కరించి వారి ఆశీస్సులతో అభినందితుడయ్యెను. 2

శ్లో॥ చిరం నః పాహిదాశార్హసానుజో జగదీశ్వర ।
ఇత్యారోప్యాంక మాలింగ్య నేత్రైస్సిషి చతుర్జలమ్ ॥ 3

టీ:- తదాహ - చిరమితి. 3

శ్లో॥ గోపవృద్ధాంశ్చ విధివదభి వంద్యాభి వందితః ।
యథావయో యథాసంఖ్యం యథా సంబంధమాత్మనః ॥ 4

శ్లో॥ సముపేత్యాథ గోపాలా హాస్య హస్త గ్రహాదిభిః ।
విశ్రాంతం సుఖమాసీనం పప్రచ్ఛుః పర్యుపాగతః ॥ 5

టీ:- గోపేతి.గోప వృద్ధాంశ్చ విధివదభివంద్య యవి షైరభివందితో బభూవేత్యర్థః. అపి చ యథావయ ఇతి. (4-5)

శ్లో॥ పృష్టాశ్చానామయం ప్రీతాః ప్రేమగద్గదయాగిరా ।
కృష్ణే కమలపత్రాక్షేసన్న్యస్తాఖిల రాధసః ।
తేసర్వేస్వేషుతం రామంతేచతేనా ప్యనామయమ్ ॥ 6

దాశార్హా! జగదీశ్వరా! తమ్మునితో కూడ చిరకాలము మమ్ములను రక్షింపమని పల్కుచు పితరులు బలరాముని అంకతలమున కూర్చుండబెట్టుకొని, ఆలింగనము చేసికొని ఆనందబాష్పములతో నభినందించిరి. 3

వృద్ధులగు గోపకులను కూడ విధిప్రకారము నమస్కరించి అభినందితుడయ్యెను. అనంతరము, వయస్సు,స్నేహము, తనకు వారితో గల సంబంధమునుసరించి, చిన్నవారిని ఆశీర్వదించెను. మిత్రులను ఆలింగనము చేసుకొనెను. బంధువులను గౌరవించెను.

గోపాలకులందరు బలరాముని సమీపించి పరిహాసములాడుచు కరచాలనము చేయుచు సుఖాసనముపై కూర్చుండి విశ్రాంతి తీసుకొనుచుండగ చుట్టుముట్టి కుశలప్రశ్నలు వేసిరి. (4-5)

ఆ యాదవులందరు ప్రేమ పూరిత గద్గద వాక్యములతో బలరామునికుశలమునడిగిరి. బలరాముడు కూడ వారిని కుశల ప్రశ్నలు వేసెను. అంబుజాక్షుడగుకృష్ణుని పొందవలెనను కోరికతో సకల విషయములను వదిలినవారై వచ్చి వారిని కుశలమునడిగిరి. 6

శ్లో॥ కచ్చిన్నోబాంధవారామ సర్వేకుశలమాసతే ।
కచ్చిత్స్మరథనోరామయూయం దారసుతాన్వితాః ॥ 7

శ్లో॥ దిష్ట్యా కంసోహతః పాపోదిష్ట్యాముక్తాసుహృజ్జనాః ।
నిహత్యనిర్జిత్య రిపూన్ దిష్ట్యా దుర్గం సమాశ్రితాః ॥ 8

శ్లో॥ గోప్యోహసంత్యఃపప్రచ్ఛూ రామసందర్శనాదృతాః ।
కచ్చిదాస్తే సుఖం కృష్ణః పురస్త్రీ జనవల్లభః ॥ 9

శ్లో॥ కచ్చిత్స్మరతివా బంధూన్ పితరం మాతరంచనః ।
అపివాస్మరతేఽస్మాకమనుసేవాం మహాభుజః ॥ 10

శ్లో॥ మాతరం పితరం భ్రాతౄన్ పతీన్ పుత్రాన్ స్వసౄరపి ।
యదర్థేత్యాక్ష్మదాశార్హదుస్త్యజాన్ స్వజనాన్ ప్రభో ॥ 11

టీ:- పృష్టా ఇతి. తే సర్వే స్వేషు యాదవేషు తంరామం అనామయం ఆరోగ్యం ప్రపచ్ఛుః తేచ తేనపృష్టా ఇతి. కృష్ణేకృష్ణప్రాప్త్యర్థం సన్న్యస్తాఖిలరాధసః త్యక్త సర్వ విషయాః. (6-11)

ఓ బలరామా ! మన బంధుజాలమంతయు కుశలమే కదా! మీరు మీ భార్యా పిల్లలతోగూడి వేడుకగనున్న సమయమున మమ్ములను ఎప్పుడైన స్మరించుచుంటిరా?

మా అదృష్టవశమున పాపియగు కంసుడు చంపబడెను. మన మిత్రులందరు సుఖముగ విముక్తులైరి. శత్రువులను చంపి, జయించి మేమెల్లరము దుర్గమునుచేరితిమి. (7-8)

బలరామ దర్శనముతో పరవశులైన గోపికలు ముసిముసి నవ్వులు నవ్వుచు ఓదేవా !పుర స్త్రీజనప్రియుడగు గోవిందుడు సుఖముగానున్నాడు కదా ! అని అడిగిరి. ఆజానుబాహుడు శ్రీకృష్ణుడు, బంధువులను, తండ్రిని, తల్లిని,మమ్ములనుఎప్పుడైనా స్మరించునా? అంతేకాదు ఎప్పుడైన మా సేవలను స్మరించి కొనియాడునా? ప్రభూ! దాశార్హా ! ఏ మహానుభావుని పొందగోరి త్యజింపరాని, స్వజనమైన మాతాపితలను, అన్నదమ్ములను, భర్తలను, సుతులను, అక్కాసెల్లెండ్రను, వదిలి వచ్చితిమో ఆ శ్రీకృష్ణ పరమాత్మ క్షేమముగ నున్నాడు కదా! (9-11)

శ్లో॥ తానస్పద్యః పరిత్యజ్య గతస్సంఛిన్న సౌహృదః ।
కథన్నుతాదృశంస్త్రీ భిర్నశ్రద్ధీయేత భాషితమ్ ॥ 12

టీ:- తా ఇతి. తర్హి తద్గమనే యుష్మాభిః ప్రతిబంధః కింన కృతః తద్వాక్యవిశ్వాసాదితి చేత్. నను విశ్వాసః కిమితి కృతస్తత్రాహుః - కథంన్వితి. వక్తృ బహుత్వాన్నానావిధాని వాక్యాని. 12

ఇంత అనురాగమున్నచో ఆ కృష్ణుని గమనమును మీరేల అడ్డగించలేదనినచో ఆయనపైగల విశ్వాసముతోనని సమాధానము. ఔను అంతగా ఎందుకు నమ్మితిరన్నచో వివరించుచున్నాడు. గోపికలు అనేకులు కావున అనేక విధములుగ పలికిరి. ఆ శ్రీకృష్ణుడు మమ్ములను వెంటనే వదిలి స్నేహమును తృంచివేసి వెళ్లిపోయెను. అట్టివానిమాటలు స్త్రీలుఎట్లు నమ్ముదురు. 12

శ్లో॥ కథం నుగృహ్ణంత్యనవస్థితాత్మనో
వచః కృతఘ్నస్య బుధాః పురస్త్రియః ।
గృహ్ణంతవైచిత్ర కథస్య సుందర
స్మితావలోకోచ్ఛ్వసితస్మరాతురాః ॥ 13

టీ:- తత్రాన్యా ఊచుః. కథమితి. అన్యా ఊచుః. గృహ్ణంతి వా ఇతి. చిత్రకథస్య చిత్రకథాకథనకోవిదస్య కించ. సుందరం స్మితం యస్మిన్ తేన. అవలోకేన ఉచ్ఛ్వసితః క్షుభితోయస్మరః తేనాతురాః. 13

నిలకడలేని తత్త్వముగల వాని మాటలు ఎట్లు నమ్ముదురని కొందరు, కొందరుతెలివిగల పురస్త్రీలు ఎట్లు విశ్వసింతురనియు, మరికొందరు చిత్రవిచిత్ర కథాత్మకుడు అందమైన చిర్నగవు చూపులను చూచి మదనాతురలై నిట్టూర్పులతో గ్రహింతురనియు పల్కిరి. 13

శ్లో॥ కిం నస్తత్కథయా గోప్యః కథాః కథయతాపరాః ।
యాత్యస్మాభిర్వినాకాలో యది తస్య తథైవ నః ॥ 14

గోపికలారా! అతని కథలతో ఊసులతో మనకేమి పని. ఇంకేమైన ఇతర కథలను పలుకుడు. మనములేక సుఖముగాని, దుః ఖముకాని అతనికి కాలము గడచినట్లే మనకును అట్లే గడుచుచున్నదని మరికొందరు అనిరి. 14

శ్లో॥ ఇతి ప్రహసితం శౌరేర్జల్పితం చారువీక్షితం ।
గతిం ప్రేమ పరిష్వంగం స్మరంత్యోరురుదుస్త్రియః ॥ 15

టీ:- అపరా ఊచుః - కిమితి. కాలస్తావత్ తస్యచాస్మాకం చ యాత్యేవ. కింతుం. తస్య సుఖేన అస్మాకం దుఃఖేనేత్యేతావానేవ విశేష ఇతి ధ్వనితం. (14-15)

ఈ విధముగ శ్రీకృష్ణుని అట్టహాసమును, మాటలను, అందమైన చూపులను, గమనమును, ప్రేమతో కౌగిలింతలను స్మరించుకొనుచు పురస్త్రీలు రోదనములు చేసిరి. 15

శ్లో॥ సంకర్షణస్తాః కృష్ణస్య సందేశైర్హృదయంగమైః ।
సాంత్వయామాస భగవన్నానానునయ కోవిదః ॥ 16

టీ:- సంకర్ష ఇతి. నానావిధేష్వనునయేషు కోవిదః. 16

అనేక విధములుగ ఓదార్చుటలో ప్రావీణ్యముగల భగవంతుడు బలరాముడు మనోహరములగు శ్రీకృష్ణుని సందేశములతో ఆ పురస్త్రీలను, గోపికలను ఓదార్చెను. 16

శ్లో॥ ద్వౌమాసౌతత్రచావాత్సీన్మధుం మాధవ మేవచ ।
రామఃక్షపాసు భగవాన్ గోపీనాం రతిమావహన్ ॥ 17

టీ:- ద్వావితి. మధుం చైత్రం. మాధవం వైశాఖం గోపీనాం. రతిమితి. శ్రీకృష్ణక్రీడా సమయే అనుత్పన్నానామితి బాలానాం చ అన్యాసామిత్యభి యుక్తప్రసిద్ధిః. 17

బలరామదేవుడు, శ్రీకృష్ణుడు గోపికలతో ఆటలాడు సమయమునకు జన్మించిన బాలురకు, బాలికలకు, ఇతరగోపికలకు రాత్రులందు శ్రీకృష్ణ సందేశములతో ఆనందము కలిగించుచు నందవ్రజమున చైత్ర వైశాఖ మాసములను రెండింటిని గడిపెను. 17

శ్లో॥ పూర్ణచంద్రకళామృష్టే కౌముదీగంధవాయునా ।
యమునోపవనే రేమేసేవితే స్త్రీ గణైర్వృతః ॥ 18

టీ:- పూర్ణేతి. పూర్ణచంద్రస్య కళాభిర్మరీచిభిరామృష్టే ఉజ్వలితే కౌముదీ గంధవాయునా కుముద్వతీనాం గంధసహితేన సేవితే.యద్వా. కౌముదీ శబ్దేనతద్వికాసితాని కుముదాని లక్ష్యంతే.కుముదగంధవాయునేత్యర్థః (18).

ఆ రెండు నెలలు పరిపూర్ణ చంద్రకాంతులతో స్పృశింప బడుచున్న పద్మముల, పరిమళములను గొనివచ్చు వాయువులు గల్గినట్టి యమునానది తటమునందలి ఉపవనములందు బలరాముడు స్త్రీజన పరివేష్టితుడై సేవింపబడుచు ఆనందించెను. 18

శ్లో॥ వరుణప్రేరితాదేవీవారుణీ వృక్షకోటరాత్ ।
పతంతీతద్వనం సర్వం స్వగంధేనాధ్యవాసయత్ ॥ 19

శ్లో॥ తం గంధం మధుదారాయా వాయునోపహృతంబలిః ।
ఆఘ్రాయోపగతస్తత్రలలనాభిః పపౌసమీమ్ ॥ 20

వరుణునిచే ప్రేరేపింపబడిన వారుణిదేవి కదంబపు వృక్షపు రంధ్రముల నుండి జాలువారుచు యమునాతట ఉప వనమునంతటిని తన సువాసనలతో ముంచెత్తెను. - వాయువుచే కొనిరాబడిన ఆ మదిరా సుగంధమును బలరాముడు వాసన చూచి స్త్రీ లందరితో కలసి ఆ వారుణి వృక్షముచెంతకు పోయి కాదంబరి పానము చేసెను. (19-20)

శ్లో॥ ఉపగీయమాన ఉద్గాయన్ వనితాశోభిమండలే ।
రేజేకరేణుయూథేశో మాహేంద్ర ఇవ వారుణః ॥ 21

శ్లో॥ నేదుర్దుందుభయో వ్యోమ్ని వవృషుః కుసుమైర్ముదా ।
గంధర్వామునయో రామంతద్వీర్యైరీడిరే ముదా ॥ 22

టీ:- వరుణేతి. వారుణీ సుధయా సహోత్పన్నా మదిరా.(19-22)

వనితామండలితో కలిసి మదిరాపానము చేసిన బలదేవుడు ఎలుగెత్తి పాటలు పాటుచు ఆడ ఏనుగులతో కూడిన వారుణ దిగ్గజేంద్రమువలె ప్రకాశించెను. - ఆ సమయమున ఆకాశమునందు దుందుభులు మ్రోగెను. గంధర్వులు ఆనందముతో గానము చేసిరి. పుష్ప వర్షమును కురిపించిరి. గంధర్వులు మునులును పరవశించి బలరాముని బలవీర్యములను స్తోత్ర పాఠములతోనుతించిరి. (21-22)

శ్లో॥ ఉపగీయమాన చరితో వనితాభిర్హలాయుధః ।
వనేషువ్య చరత్ క్షీబోమద విహ్వల లోచనః ॥ 23

టీ:- ఉపగీయామనేతి. క్షీబో మత్తః. 23

శ్లో॥ స్రగ్వ్యేక కుండలోమత్తో వైజయంత్యాచ మాలయా ।
బిభ్రత్స్మిత ముఖాంభోజం స్వేదప్రాలేయభూషితమ్ ॥ 24

టీ:- స్రగ్వీతి. స్వేద ప్రాలేయం హిమంతేన భూషితం. 24

శ్లో॥ నిజవాక్య మనాదృత్యమత్త ఇత్యాపగాం బలః ।
అనాగతాం హలాగ్రేణ కుపితోవిచకర్షహ ॥ 25

టీ:- స ఇతి. మత్తోఽయమిత్యనాదృత్య అనాగతాం అపగాం నదిం. 25

శ్లో॥ పాపేత్వం మామవజ్ఞాయయన్నాయాసిమమయాఽహూతా ।
నేష్యేత్వాం లాంగలాగ్రేణ శతధా కామచారిణీమ్ ॥ 26

టీ:- పాప ఇతి. ఆహూతా ఆహూతా యద్యస్మాన్నాగచ్ఛసి తస్మాన్నేష్యే గమిష్యామి. 26

వనితలు తన పరాక్రమ కథలు పాటలుగ పాడుచుండగ బలరాముడు మత్తెక్కినవాడై మత్తుతో చలించు నేత్రములు కలవాడై ఆ వనమునందు సంచరించెను. 23

విజయ చిహ్నమైనపుష్పమాలచే అలంకృతుడై, ఒక చెవి యందు మాత్రమే కుండలమును ధరించినవాడై, హిమమువంటి చల్లని చెమట బిందువులచే అలంకరింపబడిన చిర్నగవుతోడి ముఖపద్మమును కలవాడైన, ఆ బలరాముడు జలక్రీడలాడుటకై యమునను ఆహ్వానించెను. మత్తురాలై తన మాటను తృణీకరించుచున్నదని బలరాముడు కుపితుడై తన దరికి చేరని ఆ యమునానదిని నాగేటి మొనతో చీరెను.(24-25)

పాపిష్టిదానా! నీవు నాచే పిలువబడిన దానివై, నన్నవమానించుచు జలకాలాడుటకు రాకున్నావు. కావున కామ చారిణి వగు నిన్ను నా నాగేటి మొనతో నూరు పాయలగునట్లు చీల్చెదను.- ఓ రాజా! ఈ విధముగ బలదేవునిచే నిర్బంధింపబడిన యమున

శ్లో॥ ఏవం నిర్భర్త్సితాభీతాయమునా యదునందనం ।
ఉవాచ చకితావాచం పతితా పాదయోర్నృప ॥ 27

టీ:- ఏవ మితి. మౌళాకంపితా. 27

భయభీతయై చలించిపోయి వచ్చి పాదములపైబడి యదునందనుడగు బలరామునితో ఇట్లు పలుకజొచ్చెను. (26-27)

యమునోవాచ

శ్లో॥ రామరామ మహాబాహూనజానే తవ విక్రమం ।
యస్యైకాంశేన విధృతా జగతీజగతః పతే ॥ 28

శ్లో॥ పరంభావం భగవతో భగవన్ మామజానతీమ్ ।
మోక్తుమర్హసి విశ్వాత్మన్ ప్రపన్నాం భక్తవత్సల ॥ 29

టీ:- రామేతి. ఏకాంశేన శేషాఖ్యేన. (28-29)

యమున పల్కెను

రామా ! బలరామ! మహాబాహూ! జగత్పతీ! నీ శక్తి నేనెరుగనా? నీవు శేషుని అవతారముతో ఈ జగత్తు భారమును వహించితివి కదా! భక్తవత్సల! భగవన్! తమ ఉత్తమమైనమనస్సును గమనింపని, నీ శరణుజొచ్చిన నన్ను విశ్వాత్మ! వదిలిపెట్టుమని ప్రార్థించెను. (28-29)

శ్లో॥ తతోవ్యముంచద్యమునాం యాచితో భగవాన్ బలః ।
విజగాహే జలంస్త్రీభిఃకరేణుభిరివేభరాట్ ॥ 30

టీ:- తత ఇతి. విజగాహే అవగాహనం కృతవాన్. 30

పిమ్మట ఈ విధముగ యాచింపబడిన భగవంతుడు బలరాముడు యమునను వదిలిపెట్టెను. తరువాత ఆ యమునా జలములందు గోపికలతోకూడి, ఆడు గజములతోకూడిన గజరాజువలె జలక్రీడలు సల్పెను. 30

శ్లో॥ కామం విహృత్యసలిలా దుత్తీర్ణాయాసి తాంబరే ।
భూషణాని మహార్హాణి దదౌకాంతిశ్శుభాంస్రజమ్ ॥ 31

టీ:- కామ ఇతి. ఉత్తీర్ణాయ నిర్గతాయ. ఆసితాంబరాదీని కాంతిర్దదౌ. కాంతిర్లక్ష్మీః. యథోక్తం విష్ణుపురాణే. శ్లో."వరుణ ప్రహితామస్తై మాలామమ్లాన పంకజామ్, సముద్రాభే తథా వస్త్రేనీలేలక్ష్మీరయచ్ఛతే"తి. హరివంశే చ. బలం ప్రతి లక్ష్మీవాక్యం. శ్లో."జాతరూపమయం చైకం కుండలం వజ్రభూషణం, ఆదిపద్మం చ పద్మాఖ్యం దివ్యం శ్రవణ భూషణం. దేవేమాం ప్రతిగృహ్ణీష్వపౌరాణీం భూషణ క్రియా" మిత్యాది. (31)

స్వేచ్ఛగా జలక్రీడలాడి జలములనుండి బయటకు వచ్చిన బలదేవునకు లక్ష్మీదేవి నీలమగు పట్టు పుట్టములను అమూల్యములగు ఆభరణములను, శుభస్కరమగు పూలమాలలను సమర్పించెను. విష్ణు పురాణము ఈవిషయమునే చెప్పుచున్నది. శ్లో."వరుణ ప్రహితామస్తై మాలామమ్లాన పంకజామ్, సముద్రాభే తథా వస్త్రేనీలే లక్ష్మీరయచ్ఛత" – జలకములాడిన బలరామునకు లక్ష్మీదేవి వరుణునిచే పంపబడిన వాడిపోని పద్మమాలికలను, సముద్రమువలె నీలమైన వస్త్రములను సమర్పించెను. హరి వంశమునందు ఇట్లే కలదు. శ్లో."జాతరూప మయం చైకంకుండలం వజ్రభూషణం, ఆదిపద్మం చ పద్మాఖ్యం దివ్యం శ్రవణ భూషణం. దేవేమాంప్రతిగృహ్ణీష్వపౌరాణీం భూషణ క్రియా" బలరామునితో లక్ష్మీదేవి యనుచున్నది. బంగారమున వజ్రమును పొదిగిన ఒక కుండలమును, పద్మమను పేరు గల దివ్య కర్ణ భూషణమగు ఆది పద్మమును పురాణములకు ఈ భూషణములను దేవా ! ప్రతిగ్రహింపుము. 31

శ్లో॥ వసిత్వావాససీనీలే మాలామాముచ్యకాంచనీం ।
రేజే స్వలంకృతోలిప్తోమాహేంద్ర ఇవ వారణః ॥ 32

శ్లో॥ అద్యాపి దృశ్యతే రాజన్ యమునా కృష్ణ వర్త్మనా ।
బలస్యానంతవీర్యస్య వీర్యంసూచయతీవహి ॥ 33

టీ:- వసిత్వేతి. వసిత్వా పరిధాయ. ఆముచ్య కంఠే నిధాయ. చందనాదిభిరాలిప్తః. (32-33)

శ్లో॥ ఏవం సర్వాని శాయతా ఏకేవరమతోవ్రజే ।
రామస్యాక్షిప్తచిత్తస్యమాధుర్యైర్వ్రజయోషితామ్ ॥ 34

టీ:- ఏవమితి. ఏకా నిశాయథా మాధుర్యైః విలాసైః. 34

ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,
పంచష్షష్టితమోఽధ్యాయః

నీలములగు పట్టు వస్త్రములను కంఠమున ధరించి, చందనాది పరిమళ ద్రవ్యములను శరీరముననలదుకొని బలదేవుడుచక్కగా అలంకరింపబడిన మహేంద్ర దిగ్గజము వలె ప్రకాశించెను. బలరాముని అనంత పరాక్రమమును సూచించు దానివలె నల్లని చీలికతో యమునానది నేటికిని కనిపించుచున్నది. (32-33)

ఈ విధముగ నందవ్రజము నందలి గోపికలకు రామునిచే వినిపిపబడిన మధుర కథలతో అచటి రాత్రులన్నియు గడిచిపోయెను. 34

శీమహాభాగవతమున దశమస్కంధమునందు
అరవైఐదవ అధ్యాయము సమాప్తము

## షట్షష్టితమోఽధ్యాయః

శ్లో॥ షడ్యుక్ షష్టితమే కాశీంగత్వాఽహన్పౌండ్రకంహరిః ।
తన్మిత్రంచ తతోవృత్తం సుదక్షిణవధాదికమ్ ॥

## 66వ అధ్యాయము.

ఈ అరవైఆరవ అధ్యాయమున హరి కాశీ పట్టణమునకు పోయి కాశీరాజైన పౌండ్రకుని సంహరించెను. అతనిని పరివేష్టించియున్న అతని మిత్రుడు సుదక్షిణుని కూడా వధించిన కథ వర్ణితమైనది.

**శ్రీకృష్ణునిచే చేయబడిన పౌండ్రక కాశీరాజువధాది కథా ప్రారంభఘట్టము.**

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ నందవ్రజం గతేరామే కరూశాధిపతిర్నృప ।
వాసుదేవోఽహమిత్యజ్ఞో దూతం కృష్ణాయ ప్రాహిణోత్ ॥ 1

**శ్రీ శుకులు పలికిరి.**

ఓరాజా! బలరాముడు నంద్రవ్రజమునకు పోయిన సమయమున కరూశదేశాధిపతి వాసుదేవుడను వాడు మూర్ఖుడైనేనే నిజమైన వాసుదేవుడనని శ్రీకృష్ణుని చెంతకు నొక రాయబారిని పంపెను. 1

శ్లో॥ త్వం వాసుదేవో భగవానవతీర్ణో జగత్పతిః ।
ఇతి ప్రస్తోభితోబాలైర్మేనేస్వాత్మానమచ్యుతమ్॥ 2

టీ:- తవమితి. ప్రస్తాభితః స్తుత్యా ప్రోత్సాహితః బాలైః అజ్ఞైః. 1, 2

అజ్ఞానులైన ప్రజలచే నీవు జగత్పతివి, భగవంతుడగు వాసుదేవుడని స్తోత్రములచే ప్రోత్సాహ పరచుటచే తనను తానే అచ్యుతునిగ తలచెను. 2

శ్లో॥ దూతం చ ప్రాహిణోన్మందః కృష్ణాయావ్యక్తవర్త్మనే ।
ద్వారకాయాం యథాబాలో నృపోబాలకృతో బుధః ॥ 3

పిల్లలు ఆటలలో ఒకనిని రాజు అనినట్లుగ, తాను నిజముగ అచ్యుతుడనని నమ్మి మందుడగు కరూశరాజు వాసుదేవుడగు

శ్లో॥ దూతస్తు ద్వారకామేత్య సభాయామాస్థితం ప్రభుం ।
కృష్ణం కమలపత్రాక్షం రాజసందేశమబ్రవీత్ ॥ 4

అవ్యక్తత్త్వము గల శ్రీకృష్ణుని సమీపమునకు ద్వారకకు దూతను పంపించెను - ఆ దూత ద్వారకకు వచ్చి సభాభవనమున నున్న ప్రభువు, కమలదళనేత్రుడునగు శ్రీకృష్ణునకు కరూశరాజ సందేశమును ఇలా చెప్పెను. (3-4)

కారూశ ఉవాచ

శ్లో॥ వాసుదేవోఽవ తీర్ణోఽహమేకేవనచాపరః ।
భూతానామనుకంపార్థం త్వం తు మిథ్యాభిధాం త్యజ ॥ 5

శ్లో॥ యానిత్వమస్మచ్చిహ్నాని మౌఢ్యాద్బిభర్షిభీతవత్ ।
త్యక్త్వైమాం త్వం శరణం నోచేద్దేహి మమాహవమ్ ॥ 6

కరూశదేశ రాజు పల్కెను

భూతకోటిని రక్షించుటకై అవతరించిన వాసుదేవుడను నేనొక్కడినే. వేరే మరియొకడులేడు. కావున నీవు వాసుదేవుడనను మోసపూరితమైన నా నామమును త్యజింపుము.- నీవు మూఢుడవై తెలివిలేనివానివలె, భయరహితుడవై, నాచిహ్నములను ధరించి యున్నావు. వాటన్నింటిని వదిలివచ్చినన్ను శరణు కోరుము. లేదా నాతో యుద్ధమును చేయుము. (5-6)

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ వికత్థనం తదాకర్ణ్యపౌండ్రకస్య అల్పమేధసః ।
ఉగ్ర సేనాదయస్సభ్యా ఉచ్చకైర్జహసుస్తదా ॥ 7

టీ:- దూతస్తు గోపాలకృతో నృపః బాలైః నృపత్వేన క్రీడాయాం పరికల్పితః. (3-7)

శ్రీ శుకులు పలికిరి

అల్పబుద్ధియగు పౌండ్రకుని ఆత్మశ్లాఘను విని సభయందాసీనులైన ఉగ్రసేనాదులు గట్టిగా పరిహసించిరి. 7

శ్లో॥ ఉవాచ దూతం భగవాన్ పరిహాసకథామను ।
ఉత్స్రక్ష్యే మూఢచిహ్నాని యైస్త్వ మేవం వికత్థసే ॥ 8

టీ:- ఉవాచేతి. హే మూఢత్సృక్ష్యే త్యత్వయ ప్రక్షేప్స్యామి యైస్సహ త్వమేవంవికతస్థే.తేషపీత్యర్థః.యద్వా. యైః కృత్రిమైస్సు దర్శనాదిభిస్త్వ మేవంశ్లాఘసే తానుత్సృక్ష్యే త్యాజయిష్యామీత్యర్థః. 8

హాస్యాస్పదమగు ఈ విషయమును భగవంతుడు కృష్ణుడు విని, ఓయి మూర్ఖుడా ! ఏ కృతిమములగు సుదర్శనాదులను ధరించి నీవు ఈ రకముగ ఆత్మశ్లాఘను చేసుకొనుచున్నావో వాటన్నింటిని నేను తెగవేయుదునని దూతతో చెప్పి పంపెను. 8

శ్లో॥ ముఖం యదాపిథాయాజ్ఞ కంకగృధ్రవలైర్వృతః ।
శమిష్యసే హతస్తత్ర భవితా శరణం శునామ్ ॥ 9

టీ:- మాం శరణమే త్యస్యోత్తరం. ముఖమితి.పలాః కంకాదివత్ పక్షి విశేషాః. తత్ర తదా.శునాం శరణమాశ్రయోవితాసి. 9

నన్ను శరణు కోరుము అను మాటలకు సమాధానము - ఓరీ తెలివిహీనుడా! నీవు నాచే చంపబడికంకమను గ్రద్దలచే ముఖము కప్పబడగ స్మశానమున శునకములకు తప్పక ఆశ్రయుడవుకాగలవు. (9)

శ్లో॥ ఇతి దూతస్తమాక్షేపం స్వామినే సర్వమాహరత్ ।
కృష్ణో௨పి రథమాస్థాయ కాశీముపజగామహ ॥ 10

శ్లో॥ పౌండ్రకోపితదుద్యోగముపలభ్య మహారథః ।
అక్షౌహిణీభ్యాంసంయుక్తో నిశ్చక్రామపురాద్ద్రుతమ్ ॥ 11

టీ:- ఇతీతి. కాశీమితి. పౌండ్రకస్యాపి తదా మిత్రపురే అవస్థానాత్. (10-11)

కృష్ణుడు పల్కిన అధిక్షేపవాఖ్యములను దూత యథాతథముగ తన ప్రభువుకు చేరవేసెను.పౌండ్రకవాసుదేవుడు మిత్రుని పురమగు కాశియందుండుటచే కృష్ణుడు కూడ రథమునెక్కి కాశీ పట్టణమునకు పోయెను.- మహారథి యగు పౌండ్రకుడు కూడకృష్ణుని ప్రయత్నము తెలిసికొని కొన్ని అక్షౌహిణుల సైన్యమును వెంటబెట్టుకొని వెంటనే పట్టణము నుండి బయటకు వచ్చెను. (10-11)

శ్లో॥ తస్య కాశీపతిర్మిత్రం పార్ష్ణిగ్రాహో௨న్వయాన్నృప ।
అక్షౌహిణీభిస్తిసృభిరపశ్యత్పౌండ్రకం హరిః ॥ 12

శ్లో॥ శంఖార్యసిగదా శార్ఙ్గ శ్రీవత్సాద్యుపలక్షితమ్ ।
బిభ్రాణం కౌస్తుభమణిం వనమాలావిభూషితమ్ ॥ 13

టీ:- తస్యేతి. పార్ష్ణిగ్రాహః పృష్ఠప్రాంతరక్షణతత్పరః. (12-13)

ఓరాజా! ఆ పౌండ్రకుని యొక్క మిత్రుడు కాశీపతి అతని వెనుకనే యుండి రక్షించుటకై వెంటనంటి వచ్చెను. హరి మూడు అక్షౌహిణుల బలగముతో నున్న పౌండ్రకుని చూచెను.- శంఖము, ఖడ్గము, గద, శార్ఙ్గమను ధనుస్సు, శ్రీవత్సచిహ్నములచే కూడిన వాడు, కౌస్తుభమణి వనమాలలచే నలంకృతుడగు వానిని హరి చూచెను. (12-13)

శ్లో॥ కౌశేయవాసీపీతే వసానం గరుడధ్వజం ।
అమూల్యమౌళ్యాభరణం స్ఫురన్మ కరకుండలం ॥ 14

శ్లో॥ దృష్ట్వాత మాత్మనా తుల్యం వేషం కృత్రిమ మాశ్రితం ।
యథానటం రంగగతం విజహాసభృశం హరిః ॥ 15

శ్లో॥ శూలైర్గదాభిః పరిఘైశ్శక్త్యృష్టి ప్రాస తోమరైః ।
అసిభిః పట్టసైర్బాణైః ప్రాహరన్నరయో హరిమ్ ॥ 16

టీ:- కౌశేయేతి. గరుడః కృత్రిమః ధ్వజే కిరీటం యస్య తం. (14-16)

పీతాంబరములను, కృత్రిమ గరుడ ధ్వజమును, అమూల్యములగు కిరీట ఆభరణములను, పుష్పమాలికలను, మకరకుండలములను ధరించి, శోభిల్లు వానిని తనతో సమానమైన కృత్రిమ అలంకరణలను ధరించి, నాటక వేదికపైనటుని వలె నున్న ఆ పౌండ్రక వాసుదేవుని చూచి హరి ఫక్కున నవ్వెను. శత్రువులు పౌండ్రకాదులు, బల్లెములు, గదలు, ఇనుపగుదియలు, శక్తి,తోమరములు, ఖడ్గములు, పట్టస బాణములచే హరిని వేధించిరి. (14-16)

శ్లో॥ కృష్ణ స్తుతత్పౌండ్రక కాశీరాజయో
ర్బలం గజస్యందన వాజిపత్తిమత్ ।
గదాసి చక్రేషుభిరర్దయద్భృశం
యథా యుగాంతేహుతభుక్పృథక్ప్రజాః ॥ 17

యుగాంతాన్ని నాల్గు విధములగు భూతగ్రామములను వేరువేరుగ దహించునట్లుగ కృష్ణభగవానుడు ఆ పౌండ్రక కాశీరాజు బలగమును గజ, రథ, తురగ, పదాతులను వేరువేరుగ గద, ఖడ్గ, చక్రములను ప్రయోగించి సంహరించెను. 17

శ్లో॥ ఆయోధనం తద్రథవాజికుంజర
ద్విపత్ఖరోష్ట్రైరరిణా చ ఖండితైః ।
బభౌ చితం మోదవహం మనస్వినా
మాక్రీడనం భూతపతే రివోల్బణమ్ ॥ 18

చక్రి చక్రముచే ఖండింపబడిన పౌండ్రకుని రథములు, అశ్వములు, గజములు, పదాతులు, కంచరగాడిదలు, లొట్టిపిట్టలచే పరుచబడిన సమరభూమి, మంచివారికి ప్రోగుచేయబడిన మోదమును, కల్పాంతమున రుద్రునకు క్రీడాస్థానమువలెను ప్రకాశించెను. 18

శ్లో॥ అథాహ పౌండ్రకం శౌరిర్భోభోపౌండ్రకయద్భవాన్ ।
దూతవాక్యేన మామాహతానస్త్రాణ్యుత్సృజామితే ॥ 19

శ్లో॥ త్యాజయిష్యేఽభిదానంమేయత్త్వయాజ్ఞమృషాధృతం ।
వ్రజామి శరణం తేఽద్యయదినేచ్ఛామి సంయుగమ్ ॥ 20

పిమ్మట పౌండ్రకునితో హరి ఇట్లనెను. ఓరోరీ ! పౌండ్రక ! దూతవాక్యములుగ నీవుచెప్పి పంపిన ఆయస్త్రములను ఇపుడు నీపై వదులుచున్నాను. ఓరీ అజ్ఞుడా! నీవు అసంబద్ధముగ ధరించిన నా నామమును ఇపుడు నీనుండి వదలింతును. నీతో యుద్ధముచేయ నిష్టపడనిచో నీ శరణుజొచ్చి యుందును. (19-20)

టీ:- కృష్ణ ఇతి. గజస్యం తత ఇతి. విజగాహే ఆహోన్. పృథక్ ప్రజాః చత్వారిదం భూతగ్రామం యథా యుగాంతాగ్నిరితి. బరాదీనిదాధనమితి. ఆయోధనం రణస్థానం. అరిణా చక్రేణి చిత్రం చరిత్రం ఆకీర్ణం ఆ క్రీడనమివ కల్పాంతే రుద్రస్య క్రీడాస్థానమివ. (17-20)

శ్లో॥ ఇతి క్షిప్త్వాశాతైర్బాణైర్విరథకృత్య పౌండ్రకం ।
శిరో౽వృశ్చద్రథాంగేన వజ్రేణేంద్రో యథా గిరేః ॥ 21

శ్లో॥ తథా కాశీపతేః కాయాచ్ఛిర ఉత్కృత్య ప్రతిభిః ।
వ్యపాత యత్కాశిపుర్యాం పద్మకోశమివానిలః ॥ 22

శ్లో॥ ఏవం మత్సరిణం హత్వా పౌండ్రకం ససఖిం హరిః ।
ద్వారకామావి శత్సిద్ధైస్తూయమాన కథామృతః ॥ 23

శ్లో॥ సనిత్యం భగవద్ధ్యానప్రధ్వస్తాఖిల బంధనః ।
బిభ్రారాశ్చ హరేరాజన్ స్వరూపం తన్మయో౽భవత్ ॥ 24

టీ:- ఇతీతి. గిరేః శృంగం యథేతి. (21-24)

శ్లో॥ శిరః పతితమాలోక్య రాజద్వారి సకుండలం ।
కిమిదం కస్యవావక్త్రమితి సంశిశిరే జనాః ॥ 25

అని పలికి శ్రీకృష్ణుడు నిశితములగు బాణములను ప్రయోగించి పౌండ్రకుని విరథుని చేసెను. తదుపరి ఇంద్రుడు వజ్రాయుధముతో పర్వతములను భేదించినట్లుగ చక్రాయుధముతో వాని శిరస్సును తెగవేసెను.

అట్లే కాశీరాజు శరీరమునుండి శిరస్సును బాణములచే ఛేదించి ఎగురవేసి వాయుదేవుడు పద్మమొగ్గల రాశిని వలె కాశీనగరమునందు పడునట్లు వేసెను. (21-22)

ఓ రాజా! ఆ పౌండ్రకుని, మాత్సర్యవంతుని మిత్రునితో సహా ఈ విధముగ హతమార్చి హరి, సిద్ధులచే నుతింపబడుచున్న కథామృతము గలవాడై ద్వారకానగరమును ప్రవేశించెను. ఓ రాజా! ఆ పౌండ్రకుడు నిత్యము భగవంతుని ధ్యానముచే ధ్వంసము చేయబడిన సకల బంధనములు కలవాడై హరిస్వరూపమును ధరించినవాడై నందున హరిసాయుజ్యమును పొందెను. (23-24)

రాజద్వారమునందు పడిన కుండలములతోడి శిరస్సునుచూచి, జనులందరు మొదట ఏమిటిదియని, తరువాత వదనమిది యని గుర్తించి అనంతరము ఎవరిదను సందేహమునకు లోనయిరి. పిమ్మట

శ్లో॥ రాజ్ఞః కాశీపతే రాజ్ఞత్వా మహిష్యః పుత్ర బాంధవాః ।
పౌరాశ్చవశవాతారాజన్నాథ నాథేతి చారుదన్ ॥ 26

టీ:- శిర ఇతి. ప్రథమం కిమిదమితి పశ్చాద్వక్త్రమితి విభావ్య కస్య చేతి సంశిశిరే సంశయం ఇతి. (25-26)

కాశీరాజుదని గ్రహించి, రాణులు, అతని పుత్రులు, బంధువులు, పౌరులును అయ్యో అయ్యో రాజాయని మరణించితివాయని నాథనాథ యని మహిళలును కఠోరముగ రోదించిరి. (25-26)

శ్లో॥ సుదక్షిణస్తస్యసుతః కృత్వా సంస్థావిధిం పితుః ।
నిహత్య పితృహంతారం యాస్యామ్యపచితిం పితుః ॥ 27

టీ:- సుదక్షిణ ఇతి. సంస్థావిధిం ఉత్తరక్రియాం. అపచితం నిష్కృతిం. 27

కాశీరాజు సుతుడు సుదక్షిణుడనువాడు తండ్రి అంత్యక్రియలను శాస్త్రసమ్మతముగ నాచరించి, నాతండ్రిని చంపిన వానిని చంపి ప్రాయశ్చిత్తమును చేసెదనని తలంచెను.

శ్లో॥ ఇత్యాత్మనాభి సంధాయసోపాధ్యాయో మహేశ్వరం ।
సుదక్షిణోஉర్చయామాస పరమేణ సమాధినా ॥ 28

టీ:- ఇతీతి. ఆత్మనా అభి సంధాయ బుద్ధ్యా అధ్యవస్య సుదక్షిణః అత్యుదారః. 28

ఈ విధముగ తన ఆత్మయందు నిశ్చయించుకొని సుదక్షిణుడు స్వకుల గురువులతో కలసి నిశ్చలమగుదీక్షతో పరమేశ్వరుని అర్చించెను. (27-28)

శ్లో॥ ప్రీతోవిముక్తో భగవన్ తస్మైవరమాదాద్భవః ।
పితృహంతృ వధోపాయం సవవ్రే వరమీశితుః ॥ 29

టీ:- ప్రీత ఇతి. వరమదాత్ వృణీష్వేత్యుక్త వానిత్యర్థః. 29

భవుడు సుదక్షిణుని ఆరాధనకు ప్రీతుడై అతనికి వరమును ప్రసాదించెను. సుదక్షిణుడు పరమేశ్వరుని నుండి తన తండ్రిని చంపిన వానిని చంపుటకై ఉపాయమును వరముగ యాచించెను. 29

శ్లో॥ సుదక్షిణాగ్నిం పరిచర బ్రాహ్మణైస్సహ ఋత్విజం ।
అభిచార విధానేన నచాగ్నిః ప్రమథైర్వృతః ।
సాధయిష్యతి సంకల్పమబ్రహ్మణ్యే ప్రయోజితః ॥ 30

టీ:- సుదక్షిణేతి. ఋత్విజం ఋత్విజమివ స్వనియోగకారిణం.శ్రు. "యజ్ఞస్య దేవమృత్విజ" మితి శ్రుతేః. అబ్రహ్మణ్యే ప్రయోజిత ఇతి. కృష్ణే ప్రయోజితో విపరీతో భవిష్యతీతిసూచితం. 30

ఓ సుదక్షిణా ! ఋత్వక్కులు, బ్రాహ్మణులతో కలసి అగ్ని ప్రజ్వలనము చేసి అభిచారహింసా రూపమైన, విధానముతో ప్రమథ గణములతో కూడి యజ్ఞమును ప్రారంభించుము. కాని కృష్ణుని యందు ప్రయోజితమైన ఈ అగ్ని నీ సంకల్పమును సాధించదు. 30

శ్లో॥ ఇత్యాదిష్టస్తథా చక్రే కృష్ణాయాభిచరన్ వ్రతీ ॥ 31

టీ:- ఇతీతి. అభిచరన్ అభిచారం కుర్వన్. వ్రతీ గృహీతనియమః. (31)

శ్లో॥ తతోఽగ్నిరుత్థితః కుండాన్మూర్తి మానతిభీషణః ।
తప్తతామ్రశిఖాశ్మశ్రురంగారోద్గారి లోచనః ॥ 32

టీ:- తత ఇతి. తప్తం తామ్రమివ శిఖాః శ్మశ్రూణి చ యస్య సః, అంగారోద్గారీణి లోచనాని యస్యసః. 32

పరమేశ్వరునిచే ఇట్లాదేశింపబడిన సుదక్షిణుడు వ్రత దీక్షితుడై అభిచారహోమమును కృష్ణుని కొరకై చేసెను. అపుడు అగ్ని ఎఱ్ఱనైన రాగివంటి శిఖలు, మీసలు, నిప్పులుగురియు నేత్రములుగల మిక్కిలి భయంకరాకారముతో అగ్నికుండము నుండి ఒక ఆకారము లేచి వచ్చెను. (31-32)

శ్లో॥ దంష్ట్రోగ్ర భ్రుకుటీదండ కఠోరాస్యస్స్వజిహ్వయా ।
ఆలిహన్ సృక్విణీ నగ్నోవిధూన్వన్ త్రిశిఖం జ్వలన్ ॥ 33

టీ:- దంష్ట్రేతి. దంష్ట్రాభిరుగ్రైః భ్రుకుటీదండైశ్చ కఠోరం క్రూరమాస్యం యస్య సః. త్రిశంఖం త్రిశూలం. 33

ఉగ్రమైన కోరలతో, ముడివడిన కనుబొమలుగల కఠోరమగు ముఖమునందలి తన నాలుకతో సృక్ సృవములను నాకుచు నగ్న శరీరుడై, మూడుజడలను విరబోసికొని జ్వలించుచు తాటి చెట్ల వంటి పాదములతో పుడమిని కంపింపజేయుచు, ప్రమథగణములతో కూడి ఆ అగ్ని ద్వారకానగరమును దహించివేయుటకై అన్ని దిక్కుల నుండి ఒక్కసారిగ ఎగిసి పారెను. అభిచారకుండము నుండి లేచి ద్వారకను దహించుటకై వచ్చున్న ఆ యగ్నిని చూచి ద్వారకాప్రజలు అడవి అంటుకొనగ భయపడిన మృగములవలె భయమును పొందిరి. (33-35)

శ్లో॥ పద్భ్యాంతాళ ప్రమాణాభ్యాంకం పయన్నవనీతలం ।
సోఽభ్యధావద్వృతో భూతైర్ద్వారకాం ప్రదహన్ దిశః ॥34

శ్లో॥ తమాభిచార దహనమాయాన్తం ద్వారకౌకసః ।
విలోక్య తత్రసుస్సర్వేవనదాహే యథామృగాః ॥ 35

టీ:- పద్భ్యామితి. దిశః ప్రదహన్. (34-35)

శ్లో॥ అక్షైస్సభాయాంక్రీడంతం భగవంతం భయాతురాః ।
త్రాహి త్రాహి త్రిలోకేశవహ్నేః ప్రదహతః పురమ్ ॥ 36

టీ:- అక్షైరితి. త్రాహి త్రాహీత్యాహురితి శేషః. 36

భయాతురులగు ద్వారకాప్రజలు, సభాభవనమున పాచికలాడుచున్న భగవంతుని కృష్ణుని చెంతకు పరుగెత్తి వచ్చి, త్రిలోకేశ రక్షింపుము రక్షింపుము అగ్ని దహనమునుండి ద్వారకాపురమునని అరచుచుపోయిరి. 36

శ్లో॥ శ్రుత్వా తజ్జనవైక్లబ్యం దృష్ట్వా స్వానాం చ సాధ్వసం ।
శరణ్యస్సం ప్రహస్యాహ మాభైష్టేత్యవితాస్మ్యహమ్ ॥ 37

శ్లో॥ సర్వస్యాంతర్బహిస్సాక్షీకృత్యాం మహేశ్వరీం విభుః ।
విజ్ఞయతద్విఘాతార్థం పార్శ్వస్థం చక్రమాదిశత్ ॥ 38

టీ:- శ్రుత్వేతి. అహమవితాస్మి రక్షిష్యామి. (37-38)

తన పట్టణ ప్రజల ఆర్తనాదములను విని వారి భయమును చూచి, రక్షకుడగు శ్రీకృష్ణ పరమాత్మ అట్టహాసమునుచేసి ఎవ్వరును భయపడవద్దు. నేను మిమ్ములను తప్పక రక్షింతును. సకల జగత్తునకు అంతస్సాక్షి బహిఃసాక్షి యగు విభుడు శ్రీకృష్ణుడు ఆ యగ్ని కలలను కృత్యగా(సంహారక దేవత) గుర్తించి దానిని దునుముటకై ప్రక్కగనే యున్న సుదర్శన చక్రమునాదేశించెను. (37-38)

శ్లో॥ తత్సూర్య కోటి ప్రతిమం సుదర్శనం
జాజ్జ్వల్యమానం ప్రళయానల ప్రభమ్ ।
స్వతేజసా ఖం కకుభోఽథరోదసీ
చక్రం ముకుందాస్త్రమథాగ్నిమర్దయత్ ॥ 39

టీ:- తదితి. రోదసీ చ ప్రకాశయదితి శేషః. యద్వా. స్వతేజసా ఖాదీన్ ప్రతి జాజ్వల్యమానం అత్యర్థం ప్రకాశమానమిత్యర్థః ఆర్థయత్ అపీడయత్. 39

కోటి సూర్యులతో సమానమగు తేజస్సు గల ఆముకుందాస్త్రము సుదర్శన చక్రము, బాగుగా జ్వలించుచు ప్రళయ కాళాగ్నివలెనుండి, స్వతేజస్సుతో ఆకాశమును దిక్కులను మరియు భూనభోంతరాళము లను దహించివేయుచున్న కృత్యాగ్నిని సమూలముగ నిర్మూలించెను. (39)

శ్లో॥ కృత్యానలః ప్రతిహతస్స రథాంగ పాణేః
రస్త్రౌజసా నృప విభగ్నముఖో నివృత్తః ॥ 40

టీ:- అర్దితోఽగ్నిర్యత్కృతవాన్ తదాహ -కృత్యానల ఇతి. సహర్త్విగ్భిః జనైశ్చ వర్తమానం. అభిచర్యంతే. మార్యంతే అనేనేత్యభిచారః కృతానలః 40

ఓ రాజా! రథాంగపాణియగు శ్రీకృష్ణుని యొక్క సుదర్శనాస్త్రముతో హరింపబడిన కృత్యాగ్ని భగ్నముఖమై మరలి వారణాశీపురమును ప్రవేశించి అచట అభిచారహోమము నాచరించుచున్న సుదక్షిణుని, ఋత్విక్కులను అచటి జనులతో సహా దహించివేసెను. (40-41)

శ్లో॥ వారాణసేంప్రతి సమేత్యసుదక్షిణం తం।
స్త్వర్విగపగ్జనం సమదహత్స్వ కృతోఽభిచారః ॥ 41

శ్లో॥ దగ్ధ్వావార్ణాసీం సర్వాం విష్ణు చక్రం సుదర్శనం ।
భూయః పార్శ్వముపాతిష్ఠత్ కృష్ణస్యాక్లిష్ట కర్మణః ॥ 42

ఆ విష్ణుచక్రము అనంతరము వారణాశి యందలి మంచములను, సభాభవనములను గోపురములను, గోకులములను, కోశాగారములను, గజ, వాజి, రథ, అన్నశాలలతో సహా దహించి మరలి వచ్చి, అక్లిష్టకర్ముడగు కృష్ణుని ప్రక్కకు చేరెను. 42

శ్లో॥ య ఏత చ్ఛ్రాపయేన్మర్త్య ఉత్తమశ్లోకవిక్రమం ।
సమాహితోవా శృణుయాత్సర్వపాపైఃప్రముచ్యతే ॥ 43

శ్రీ పురుషోత్తముని ఈ విక్రమకథను, విన్న, వినిపించిన మానవుడు శ్రద్ధగ ఆలకించిన వారును సర్వవిధ పాపముల నుండి విముక్తులగుదురు. 43

టీ:- చక్రమితి. అట్టాదిసహితాం అట్టాః మంచాః. (41-43)

**ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,**
**షట్షష్టితమోఽధ్యాయః**

**శీమహాభాగవతమున దశమస్కంధమునందు**
**అరవైఆరవ అధ్యాయము సమాప్తము**

## సప్తషష్టితమోऽధ్యాయః

శ్లో॥ సప్త షష్టితమే రామోగిరౌరైవతకేమదాత్ ।
స్వైరం యువతిభిః క్రీడన్నవదీద్ద్వివిదంబలః ॥

## బలరామకృత ద్వివిదవధ కథా ప్రారంభఘట్టః

రాజోవాచ

శ్లో॥ భూయోహం శ్రోతు మిచ్ఛామి రామస్యాద్భుత కర్మణః ।
అనంతస్యాప్రమేయస్య యదన్యత్ కృతవాన్ విభుః ॥ 1

టీ:- రామచరిత్ర శ్రవణే ఛాయామద్భుతకర్మత్వం హేతుః తత్ర చానంతత్వం. తత్రాప్యప్రమేయత్వమితి. 1

## 67వ అధ్యాయము.

ఈ అరవైఏడవ అధ్యాయము నందు, బలరామదేవుడు మధుపాన మదముతో రైవతకాంద్రియందు స్వేచ్ఛగా యువతులతో క్రీడించుచు ద్వివిదుడను వానిని చంపెను.

కాళిందీ నదిని చీల్చిన తరువాత రామచరిత్రతో సంబంధమున్న ద్వివిదుని సంహారమునుగూర్చి చెప్పవలసి యుండగ అచట చెప్పక, అంతకు ముందు జరిగిన పౌండ్రకుని వధను నిరూపించి ఇప్పుడు ద్వివిదుని కథను చెప్పుచున్నాడు.

## బలరామునిచే చేయబడిన ద్వివిద వధ కథా........

రాజు పలికెను.

బలరామచరితము అద్భుతము, అనంతము, అప్రమేయమైనది. దానిని వినవలయునను కోరిక యందును అంతే శక్తియున్నది. ఓ మహర్షీ! అద్భుతకార్యములను చేయువాడు, అనంతుడు, అప్రమేయుడు నగు విభుడు బలరామదేవుడు. ఆయన ఇంకను చేసిన అద్భుత కార్య విషయములను వినవలయునను ఆసక్తి కలదు. చెప్పవలసినది. 1

**శ్రీ శుకవాచ**

శ్లో॥ నరకస్య సఖా కశ్చిద్ద్వివిదోనామ వానరః ।
సుగ్రీవ సచివస్సోఽథ భ్రాతామైందస్య వీర్యవాన్ ॥ 2

టీ:- నరకస్యేతి. నరకస్య సఖేతి హరిణా వైరే కారణం. సుగ్రీవ సచివ ఇతి తస్య మంత్రబలం. మైందస్య భ్రాతేతి రామాయణే అతి ప్రసిద్ధత్వేన వీర్యాధిక్యముక్తమితి. 2

**శ్రీ శుకులు చెప్పుచున్నారు**

ద్వివిదను పేరుగల వానరమొకడు గలడు. వాడు నరకునకు మిత్రుడు మరియు సుగ్రీవునకు మంత్రి. మైందుడను వానికి బలీయుడగు భ్రాత. నరకునకు మిత్రుడనుటచే వైరమునకు కారణము. సుగ్రీవ సచివుడనుటచే మంత్ర శక్తి కలవాడు. మైందునకు తమ్ముడనుటచే రామాయణ ప్రసిద్ధుడు, బలవంతుడని భావము. 2

శ్లో॥ సఖ్యుస్సోపచితం కుర్వన్ వానరో రాష్ట్ర విప్లవం ।
పురగ్రామా కరాన్ ఘోషానదహద్వహ్నిముత్సృజన్ ॥ 3

టీ:- సఖ్యురితి. సఖ్యుర్నరకస్య. అపచితం ఆనృణ్యం. రాష్ట్రస్య విప్లవో నాశో యథా భవతి తథా పురాదీనదహదితి. 3

ఆ ద్వివిదుడు మిత్రుడగు నరకుని మరణమునకు ప్రాయశ్చిత్తము చేయదలచివాడై రాష్ట్రమున విప్లవములను సృష్టింప దలచి పురములను, గ్రామ సముదాయములను, గొల్లపల్లెలను, అగ్నిని రాజేసి దహించెను. 3

శ్లో॥ క్వచిత్సశైలానుత్పాట్యతైర్దేశాన్ సమచూర్ణయత్ ।
ఆనర్తాన్ సుతరామేవం యత్రాస్తే మిత్రహా హరిః ॥ 4

టీ:- కించ. క్వచిదితి. కదాచిత్ సః ద్వివిదః మిత్రహామిత్రం సఖాయం నరకాసురం హంతీతి మిత్రహా హరిః శ్రీకృష్ణః. 4

ఒకానొకప్పుడు ద్వివిదుడు పర్వతములను పెకలించి వాటితో ద్వారకా నగర పరిసర గ్రామములను ధ్వంసము చేసెను. అట్లే శ్రీహరి నర్తనశాలలో నుండునని అతడు తన మిత్రుని సంహరించినాడని వాటిని కూడ పూర్తిగ ధ్వంసం చేయుచుండెను. 4

శ్లో॥ క్వచిత్సముద్ర మధ్యస్థో దోర్భ్యాముద్ధృత్య తజ్జలం ।
దేశాన్నాగా యుతప్రాణో వేలాకూలేన్యమజ్జయత్ ॥ 5

టీ:- క్వచిదితి. తస్య సముద్రస్య జలం బాహుభ్యాం ఉత్క్షిప్య వేలయాః కూలే వర్తమానాన్ దేశాన్ న్యమజ్జయత్ ప్లావయామాసేతి. 5

ఒక్కొక్కసారి పదివేల ఏనుగుల బలముకల ద్వివిదుడు సముద్ర మధ్యమున చేరి బాహువులతో సముద్ర జలమును ఎగజిమ్ముతూ తటములందున్న దేశములను ముంచెత్తుచుండెను. 5

శ్లో॥ ఆశ్రమానృషి ముఖ్యానాం కృత్వాభగవనస్పతీన్ ।
అదూషయచ్చకృన్మూత్రైరగ్నీన్ వైతానికాన్ ఖలః ॥ 6

టీ:- ఆశ్రమానితి. ఆశ్రమస్థాన్ వనస్పతీన్ భుక్త్వా ఆహవనీయాద్యగ్నిషు మూత్రాదికృతవానిత్యర్థః. 6

నీచుడైన ఆ ద్వివిదుడు ఋశ్యాశ్రమములందలి వృక్షములను నరికి చిందరవందర చేసెను. అట్లే ఆహవనీయాద్యగ్నులను, యజ్ఞ కుండములను, మూత్రపురీషోత్సర్జనములతో అపవిత్రము గావించెను. 6

శ్లో॥ పురుషాన్ యోషితోదృప్తఃక్ష్మాభృద్ద్రోణీగుహాసు సః ।
నిక్షిప్య చాప్యథాచ్ఛ్రుంగైః పేశస్కారీవ కీటకమ్ ॥ 7

ఆ ద్వివిదుడు బలగర్వితుడై పురుషులను స్త్రీలను పర్వత చర్యల మధ్యములందు, గుహలందును పడవేసి తుమ్మెదకాళ్లతో పట్టుకొని పురుగులను వేధించినట్లుగ కొమ్ములతో వేధించుచుండెను. 7

శ్లో॥ ఏవం దేశాన్ విప్రకుర్వన్ దూషయంశ్చకులస్త్రీయః ।
శ్రుత్వాసులలితంగీతం గిరింరైవతకం యయౌ ॥ 8

ఈ విధముగ దేశములకు హాని కలిగించుచు, కులస్త్రీలను దూషించుచు, లలితములగు గీతములను విని రైవతకమను పర్వతమునకు పోయెను. - ఆ రైవత కాద్రి యందు పుష్కర ద్వీపాధిపతి,

శ్లో॥ తత్రాపశ్యద్యదుపతిం రామం పుష్కరమాలినం ।
సుదర్శనీయ సర్వాంగం లలనాయూథ మధ్యగమ్ ॥ 9

సుందరాంగుడు, లలనామధ్యగతుడైన యదుపతి యగు బలరాముని చూచెను. (8-9)

టీ:- పురుషానితి. అప్యధాత్ పిదధే. పేశస్కారీ భ్రమరః.(7-9)

శ్లో॥ గాయంతం వారుణీం పీత్వా మదవిహ్వల లోచనం ।
విభ్రాజమానం వపుషాప్రభిన్నమివ వారణమ్ ॥ 10

శ్లో॥ దుష్టశ్శాఖా మృగశ్శాఖా మారూఢః కంపయన్ ద్రువాన్ ।
చక్రే కిలకిలా శబ్దమాత్మానాం సంప్రదర్శయన్ ॥ 11

మధుపానముచేసి,మత్తెక్కిన నేత్రములతో, గీతికలాలపించుచు, మదించిన మదగజము వంటి శరీరముతో ప్రకాశించుచున్న బలరాముని చూచెను. దుష్టుడగు ఆ వానరుడు చెట్టుకొమ్మలనెక్కి చెట్లను కంపింప చేయుచు తనను ఇతరులు చూచునట్లుగ శరీరమును ప్రదర్శించుచు కిలకిలారావములు చేసెను. (10-11)

టీ:- గాయంతమితి. ప్రభిన్నం మత్తం. (10-11)

శ్లో॥ తస్యధార్ష్ట్యం కంపేర్వ్యక్ష్య తరుణ్యో జాతి చాపలాః ।
హాస్యప్రియా విజహసుర్బలదేవ పరిగ్రహాః ॥ 12

ఆ కపి యొక్క దుష్టత్వమును చూచి బలదేవునితో క్రీడించుచున్న తరుణులు, స్త్రీ జాతి సహజమైన చెంచలత్వముతో హాస్య ప్రియులై నవ్వుచూ కేరింతలిడిరి. 12

టీ:- తస్యేతి. జాత్యా స్వభావేనైవ చాపలం యసాంతాః. 12

శ్లో॥ తాహేలయా మాస కవిర్భ్రూక్షేపైస్సం ముఖాదిభిః ।
దర్శయన్ స్వగుదం తాసాంరామస్య చనిరీక్షతః ॥ 13

టీ:- తా ఇతి. హేలయా మాస అవజ్ఞతే. నిరీక్షతఃనిరీక్షమాణస్య తమనాదృత్యేత్యర్థః. 13

ఆ వానరము కనుబొమ్మల నెగురవేయుచు వారి ఎదురుగ నిలచి ఆ మగువలను అవమాన పరిచెను. అంతేగాక బలదేవుడు కూడ చూచుచుండగ ఆ వనితలకు తన గుదప్రదేశమును చూపించెను. రాళ్లతో కొట్టుట యందు నేర్పరియైన బలరాముడు కోపనుడై ఆ ద్వివిదుని కొండరాతితో కొట్టెను. ఆ దుష్ట వానరము దానిని తప్పించుకొని మదిరాకలశమును తీసుకొని బలదేవునకు కోపమును తెప్పించుచు నవ్వుచు ఆట పట్టించెను. (13-14)

శ్లో॥ తంగ్రావ్ణాప్రాహర త్క్రుద్ధోబలః ప్రహరతాం వరః॥
సంవచయిత్వా గ్రావాణం మదిరా కలశం కపిః ।
గృహీత్వా హేలయా మాస ధూర్తస్తంకోయన్ హసన్ ॥ 14

శ్లో॥ నిర్భిద్య కలశం దుష్టోవాసాం స్యాస్ఫాలయద్బలం ।
కదర్థీకృత్య బలవాన్ విప్రచక్రే మదోద్ధతః ॥ 15

శ్లో॥ తంతాస్యాఽవినయం దృష్ట్వాదేశాంశ్చ తదుపద్రుతాన్ ।
క్రుద్ధో ముసలమాదత్త హలంచారి జిఘాంసయా ॥ 16

టీ:- నిర్భిద్యేతి. ఆస్ఫాలయత్ యోషితాం వాసాంస్యాకృష్య పాటితవాన్. (14-16)

దుష్ట వానరము మదిరా కలశమును పర్వతపు రాతిపై పగులగిట్టి, వనితల చీరలనులాగి చింపివేసెను. బలరాముని అవమాన పరుచుచు మదోద్ధతుడు బలవంతుడునగువాడు అపకారమును చేసెను. వాని ఆ విధమైన అవినయము, వానిచే పాడైపోయిన వన ప్రదేశములను చూచి క్రుద్ధుడై శత్రువును చంపగోరి ముసలమును హలాయుధమును గ్రహించెను. (15-16)

శ్లో॥ ద్వివిదోऽపిమహావీర్యస్సాలము త్పాట్య పాణినా ।
అభ్యేత్య తరసాతేన బలం మూర్ధన్యతాడయత్ ॥ 17

టీ:- ద్వివిద ఇతి. సాలంవృక్షం. 17

మహా బలవంతుడగు ద్వివిదుడు కూడ చేతులతో మద్దిచెట్టును పెకలించి వేగముగ బలదేవునెదుర్కొని దానితో తలపై మోదెను. 17

శ్లో॥ తం తు సంకర్షణో మూర్ధ్నిపతంతమచలో యథా ।
ప్రతి జగ్రాహ భగవాన్ సునందేనాహనచ్చతమ్ ॥ 18

టీ:- తమితి. సునందేన ముసలేన, అహనత్ త్యర్థః. 18

ఆ సాలవృక్షము తన తలపై పడుచుండగ పర్వతమువలె స్థిరుడైన బలదేవుడు దానిని పట్టుకొని సునందమను తన ముసలాయుధముతో వానిని కొట్టెను. 18

శ్లో॥ ముసలాహతమస్తిష్కో విరేజే రక్తధారయా ।
గిరిర్యథా గైరికయా ప్రహారం నాను చింతయాన్ ॥ 19

శ్లో॥ పునర్యసంసముత్ క్షిప్య కృత్వా నిష్పత్రయోజసా ।
తేనాహనత్సు సంక్రుద్ధస్తం బలశ్శతీధాచ్ఛినత్ ॥ 20

సునందముతో తలపగులగొట్టబడిన ఆ ద్వివిదుడు గైరికమను లోహితవర్ణముగల ఓషధితో పర్వతమువలె రక్తము దారలు కట్టుచుండగ ఆ దెబ్బను లెక్కచేయక మరియొక వృక్షమును పెకలించి తన శక్తితో పత్రరహితముగచేసి బలదేవుని బలంగా కొట్టెను. క్రోధనుడగు బలరాముడు దానిని కూడ నూరు వ్రయ్యలుగ చేసెను. (19-20)

శ్లో॥ తతోऽన్యముత్పాట్యజఘ్నే తంచాపి శతధాచ్ఛినత్ ॥ 21

శ్లో॥ ఏవం యుధ్యన్ భగవతాభగ్నేతస్మిన్ పునః పునః ।
ఆకృష్యసర్వతో వృక్షాన్నిర్వృక్షరోద్వనమ్ ॥ 22

ఆ వానరుడు మరియొక చెట్టును పీకి కొట్టగ బలరాముడు దానిని కూడ నూరు ముక్కలుగ చేసెను. ఈ రకముగ భగవంతునితో యుద్ధము చేయుచు ఆ ద్వివిదుడు మాటిమాటికి వృక్షములను పెరికి బలదేవునిపై పడవేయగ ఆ వనమంతయు ఎడారి అయ్యెను. - పిమ్మట

శ్లో॥ తతోఽముంఛచ్ఛిలావర్షం బలస్యోపర్యమర్షితః ।
తత్సర్వం చూర్ణయామాసతిలయా ముసలాయుధః ॥ 23

ఆ వానరము ఆగ్రహించి బలరామునిపై శిలావర్షమును కురిపించెను. ముసలాయుధుడు ఆ రాళ్లనన్నింటిని సులభముగ పొడిపొడిగ చేసివేసెను.(21-23)

టీ:- ముసలేతి. మస్తిష్కం మస్తకే అవయవవిశేషః. గైరికయా తథాతునా. నానుచింతయన్ అగణయన్. (19-23)

శ్లో॥ స్వ బాహుతాళ సంకాశౌ ముష్టీకృత్య కపీశ్వరః ।
ఆసాద్య రోహిణీ పుత్రం తాభ్యాం వృక్షస్యరూరుజత్ ॥24

ఆ కపి రాజు తాటిచెట్లంతటి తనచేతులు పిడికిళ్లుగ బిగించి రోహిణీసుతుని సమీపించి గుద్దుచూ ఎదపై కూడ మోదుటకు ప్రారంభించెను. 24

శ్లో॥ యాదవేంద్రోఽపి తందోర్భ్యాంత్యక్త్వా ముసలలాంగతా ।
జత్రావభ్యర్థయత్క్రుద్ధ స్సోఽపతద్రుధిరం వమన్ ॥ 25

యాదవేంద్రుడుకూడ క్రుద్ధుడై ముసల హలములను వదిలి బాహువులతో వాని కంఠ, బాహుమూలము లందు బలముగ మర్దించెను. దానితో ఆ ద్వివిదుడు రక్తము క్రక్కుకొనుచు భూమిపై పడెను. 25

టీ:- స్వేతి. అరూరుజత్తాడయామాస. యాదవేంద్ర ఇతి. జత్రౌ కంఠబాహుమూలే. (24-25)

శ్లో॥ చకంపే తేనపతతాసటంకస్సవనస్పతిః ।
పర్వతఃకురుశార్దూలవాయునా నౌరివాంభసి ॥ 26

శ్లో॥ జయశబ్దోనమశ్శబ్దసాధు సాధ్వితిచాంబరే ।
సురసిద్ధ మునీంద్రాణామాసీత్కుసుమ వర్షిణామ్ ॥ 27

టీ:- చంపక ఇతి. టంకాఃసతోయవివరాణి తః.(26-27)

శ్లో॥ ఏవం నిహత్య ద్వివిదం జగద్వ్యతి కరావహం ।
సంస్తూయమానో భగవాన్ జనైస్స్వపురమావిశత్ ॥ 28

టీ:- ఏవమితి. జగతో వ్యతికరం నాశమావహతీతి తథా తం. 28

ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,
సప్తషష్టితమో౽ధ్యాయః

కురురాజా! ద్వివిదుడట్లు పుడమిపైబడుచుండగ వాయువుచే కంపితమగుచున్న సముద్రమునందలి నావవలె, సుడివడుచున్న నదులతోసహా వనమంతయు కంపించెను. సురులు ఆకాశమునుండి జయజయధ్వానములు చేసిరి. సిద్ధులు నమోనమః నమోనమః యని నినదించిరి. మహర్షులు సాధుసాధు అని పల్కిరి. అట్లే ఆకాశమునుండి పూలవాన కురిసెను.(26-27)

ఈ విధముగ జగత్తునకు వినాశకారియగు ద్వివిదుని దునిమి భగవంతుడు బలదేవుడు ద్వారకా ప్రజల చేత నుతింపబడుచు నగరమున ప్రవేశించెను. 28

శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు
అరవైఏడవ అధ్యాయము సమాప్తము

## అష్టషష్టితమో௨ధ్యాయః

శ్లో॥ అష్టషష్టితమేసాంబే నిబద్ధే కౌరవైర్యుధి ।
తద్విమోక్షాయ రామేణగజా హ్వాయవికర్షణమ్ ॥

### బలరామకృతహస్తినాపురకర్షణాదికథా ప్రారంభఘట్టః

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ దుర్యోధన సుతాం రాజన్ లక్ష్మణాం సమితింజయః ।
స్వయంవరస్థామ హరత్సాంబో జాంబవతీ సుతః ॥ 1

శ్లో॥ కౌరవాః కుపితా ఊచుర్దుర్వినీతో௨యమర్భకః ।
కదర్థీ కృత్యనః కన్యామకామా మహరద్బలాత్ ॥ 2

టీ:- శ్రీరామస్య చరిత్రాంతరం నిరూపయితుమహ - దుర్యోధనేతి. సమితింజయః సంగ్రామజిత్.(1-2)

## 68 వ అధ్యాయము

ఈ అరవై ఎనిమిదవ అధ్యాయమునందు ఓ యుద్ధములో సాంబుడు కౌరవులతో బంధింపబడగ వానిని విడిపించుటకై బలరాముడు హస్తినాపురమును సముద్రమున ముంచుటకై హలముతో ఆకర్షించుట వర్ణితమైనది.

### బలరామునిచే చేయబడిన హస్తినాపుర కర్షణాది కథా ప్రారంభ ఘట్టము.

**శ్రీ శుకులు పలికిరి**

శ్రీ బలదేవినియొక్క మరియొక చరిత్రను నిరూపించుటకై చెప్పుచున్నాడు.

ఓ రాజా! దుర్యోధనుని కూతురు లక్ష్మణ. ఆమె స్వయంవరము జరుగుచుండగ, యుద్ధనిపుణుడు, జాంబవతీసుతుడు సాంబుడు స్వయంవర మండపమునుండి ఆమెను అపహరించెను. 1

వినయరహితుడు, అర్భకుడు అగు ఈ సాంబుడు తనను ఇష్టపడి మా కన్యను మోసము చేసి బలాత్కారముగ అపహరించు చున్నాడని కౌరవులు ఆగ్రహముతో కేకలు వేసిరి. 2

శ్లో॥ బద్ధ్వేతై నందుర్వినీతం కింకరిష్యంతి వృష్ణయః ।
యేఽస్మత్ప్రసాదోపచితాం దత్తాంనో భుంజతే మహీమ్ ॥3

టీ:- బద్ధ్వేతేతి. నోఽస్మాకం మహీం అస్మాభిర్దత్తాం న తే భూపతయ ఇతి భావః. 3

ఈ ధూర్తుని వెంటబడి బంధింపుడు. మేము దయతలచి ప్రసాదించిన భూమిని అనుభవించుచున్న ఈ గొల్లలు ఏమిచేయుదురో చూతుమని కౌరవులు పల్కిరి. 3

శ్లో॥ నిగృహీతం సుతం శ్రుత్వాయద్యేష్యం తీహ వృష్ణయః ।
భగ్నదర్పాశ్శమంయాంతి ప్రాణా ఇవసు సంయతాః ॥ 4

టీ:- నిగృహీతమితి. యాంతి యాస్యంతి. ప్రాణా ఇంద్రియాణీవ సుసంయతాః. ప్రాణాయామాదిభిర్దమితాః . 4

కుమారుడు సాంబుడు బంధితుడైనాడని విని గొల్లలు దండెత్తి ఇచటికి వచ్చినచో ప్రానాయామాదులచే ఇంద్రియములు నియమింప బడినట్లుగ, గర్వమణిచివేయబడినవారై శాంతించగలరు. 4

శ్లో॥ ఇతి కర్ణశ్శలోభూరిర్యజ్ఞకేతుస్సుయోధనః ।
సాంబమారేభిరే బద్ధుం కురు వృద్ధాను మోదితాః ॥ 5

టీ:- ఇతీతి. కురువృద్ధోభీష్మః. తేనానుమోదితాః తత్సహితాః షడేత ఇత్యర్థః. 5

కురువృద్ధుడగు భీష్ముని యనుమతితో, కర్ణుడు, శల్యుడు, భూరిశ్రవుడు, యజ్ఞకేతువు, సుయోధనుడు, భీష్మునితో కలిసి ఆర్గురు సాంబుని బంధించుట కుద్యమించిరి. 5

శ్లో॥ దృష్ట్వాను ధావతస్సాంబోధార్తరాష్ట్రాన్ మహారణః ।
ప్రగృహ్యా రుచిరం చాపం తస్థౌసింహ ఇవైకలః ॥ 6

టీ:- దృష్ట్వేతి. ఏకలః ఏకః. 6

తనను బంధించుటకై వెంటబడుచున్న ధార్త రాష్ట్రులను చూచి యోద్ధయగు సాంబుడు రుచిరమను ధనస్సును పట్టుకొని ఏకలుడై సింహమువలె నిలబడెను. 6

శ్లో॥ తే తం జిఘృక్షవః క్రుద్ధాస్తిష్ఠతిష్ఠేతి భాషిణః ।
ఆసాద్యధన్వినో బాణైః కర్ణాగ్రణ్యస్సమాకిరన్ ॥ 7

టీ:- త ఇతి. కర్ణః అగ్రణీర్యేషాం తే. 7

ఆ సాంబుని బంధించుటకై కర్ణాదివీరులు ఆగ్రహావిష్టులై నిలునిలుమని పలుకుచు ధనస్సులనెక్కుపెట్టి బాణముల నతనిపై గుప్పించిరి. 7

శ్లో॥ సో౽తి విద్ధః కురుశ్రేష్ఠ కురుభిర్యదునందనః ।
నామృష్యత్తదచింత్యార్భస్సింహః క్షుద్రమృగైరివ ॥ 8

శ్లో॥ విస్ఫార్యరుచిరంచాపం సర్వాన్ వివ్యాధసాయకైః ।
కర్ణాదీన్షడ్రథాన్ వీక్ష్యతా వద్భిర్యుగపత్పృథక్ ॥ 9

టీ:- స ఇతి. అచిన్త్యస్య భగవతో౽ర్భః అచిన్త్యశ్చాసా వర్భశ్చేతివా. (8-9)

కురుశ్రేష్ఠ! యదుకుమారుడు సాంబుడు కౌరవుల బాణములచే వేధింపబడినవాడై క్రూరమృగములచే ముట్టడింపబడిన సింహ కిశోరమువలె వాటిని లెక్కగొనలేదు. వింటిని ఆకర్ణాంతములాగి అనేక బాణములతో ఆ సైనికులనందరిని సంహరించెను. అనంతరము ఆరు రథములపై వచ్చిన కర్ణాది వీరులను చూచి ఏకకాలములో వేర్వేరుగ బాణములను గుప్పించెను. (8,9)

శ్లో॥ చతుర్భిశ్చతురోవాహానేకైకేన చ సారథీన్ ।
రథినశ్చమహేష్వాసా స్తస్య తత్తేభ్యపూజయన్ ॥ 10

శ్లో॥ తం తు తే విరథం చక్రుశ్చత్వారశ్చతురో హయాన్ ।
ఏకస్తు సారథిం జఘ్నేచిచ్ఛేదాన్యశ్శరాసనమ్ ॥ 11

టీ:- తత్ప్రపంచయతి. చతుర్భిశ్చతుర ఇత్యత్రవీప్సానుసంధేయా. తత్కర్మ సంతే మానితవంతః.(10-11)

సాంబుడు నాల్గునాల్గు బాణములచే వారి అశ్వములను, ఒక్కొక్క శరముచే సారథులను, రథికులను, వింటితో వారిని బాధించెను. పిమ్మట కౌరవులలో నల్వురు సాంబుని విరథుని చేసిరి. గుఱ్ఱములను ముడియింపజేసిరి. ఒకడు సారథిని చంపెను. మరొకడు వింటిని విరిచెను. (10-11)

శ్లో॥ తంబద్ధ్వా విరథీకృత్య కృచ్ఛ్రేణ కురవోయుధి ।
కుమారం స్వస్య కన్యాం చ స్వపురం జయినో విశన్ ॥ 12

శ్లో॥ తచ్ఛ్రుత్వానారదేనోక్తం రాజన్ సంజాతమన్యవః ।
కురూన్ ప్రత్యుద్యమం చక్రు రుగ్రసేన ప్రచోదితాః ॥ 13

టీ:- తమితి. స్వస్య దుర్యోధనస్య కన్యాం చ నీత్వేతి శేషః. (12-13)

కౌరవులు సమరమున సాంబుని విరథునిచేసి అతికష్ఠము మీద బంధించిరి. విజేతలైనవారు ఆ యదుకుమారుని, తమ కన్యకయగు లక్ష్మణను తమ పురమునకు గొనిపోయిరి. ఓ రాజా! నారద మహర్షి చెప్పగా సాంబుని నిర్బంధమును గూర్చి విని ఆగ్రహించిన వారై ఉగ్రసేనునిచే ప్రేరితులై యాదవ వీరులు కౌరవులపై దండెత్తి పోవుటకు నిశ్చయించిరి. (12-13)

శ్లో॥ సాంత్వమిత్వాతు తాన్ రామ స్సన్నద్ధాన్ వృష్ణి పుంగవః ।
నైచ్ఛత్కురూణాం వృష్ణీనాం కలిం కలిమలాపహః ॥ 14

శ్లో॥ జగామ హస్తిన పురం రథేనాదిత్యవర్చసా ।
బ్రాహ్మణైః కులవృద్ధైశ్చ వృతశ్చంద్ర ఇవ గ్రహైః ॥ 15

టీ:- సాంత్వయిత్వేతి. యతః కలిం నైచ్ఛత్ అతః సాంత్వయిత్వా జగామేతి. (14-15)

వృష్ణి కులశ్రేష్ఠుడగు బలదేవుడు యుద్ధ సన్నద్ధులైన తమ వారిని ఓదార్చెను. కౌరవులకు యాదవులకు జగడము తగదని, తనకు నచ్చదని వారించెను. బ్రాహ్మణులతోను, కులపెద్దలతోను కూడినవాడై గ్రహయుతుడగు చంద్రునివలె, సూర్యతేజము వంటి తేజస్సుతో రథమునధిరోహించి హస్తినాపురమునకు పోయెను.(14-15)

శ్లో॥ గత్వా గజాహ్వయం రామో బాహ్యోపవన మాశ్రితః ।
ఉద్ధవం ప్రేషయామాస ధృతరాష్ట్రం బుభుత్సయా ॥ 16

టీ:- గత్వేతి. ధృతరాష్ట్రం ప్రతి బుభుత్సయా అభిప్రాయజిజ్ఞాసయేత్యర్థః. 16

బలరాముడు గజనగరమునకు పోయి, నగరపు వెలుపలి ఉద్యానవనమున విడిసి, ధృతరాష్ట్రుని మనోగతమును తెలిసికొన గోరినవాడై ఉద్ధవుని దూతగ పంపెను. 16

శ్లో॥ సోఽభి వంద్యాంబికా పుత్రం భీష్మం ద్రోణం సబాహ్లికం ।
ధుర్యోధనం చ విదివద్రామ మాగతమబ్రవీత్ ॥ 17

టీ:- స ఇతి. విధివత్ అభివాద్య. 17

ఉద్ధవుడు అంబికాపుత్రుని చెంతకు పోయి భీష్మ, ద్రోణ, బాహ్లిక, దుర్యోధనులకు యథా విధిగ అభివందనముచేసి బలరాముని రాకను గూర్చి తెలిపెను. 17

శ్లో॥ తేఽతి ప్రేతాస్సమాకర్ణ్య ప్రాప్తం రామం సుహృత్తమం ।
తమర్చయిత్వాభియయుస్సర్వే మంగళ పాణయః ॥ 18

టీ:- త ఇతి. తముద్ధవమర్చయిత్వా సత్కృత్య. మంగళపాణయ ఉపాయనహస్తాః. 18

భీష్మాదులు, కౌరవులును మిత్రుడు బలదేవుడు వచ్చిన వార్తను విని సంప్రీతులై ఆ సువార్తను తెచ్చిన ఉద్ధవుని మర్యాద పురస్సరముగ పూజించి, ఉపాయన హస్తులై బలరామునకు ఎదురు పోయిరి. 18

శ్లో॥ తం సంగమ్య యథాన్యాయ్యం గామర్ఘ్యంచన్య వేదయన్ ।
తేషాం యేతత్ప్రభావజ్ఞాః ప్రణేముశ్శిరసా బలమ్ ॥ 19

భీష్మాదులు బలదేవుని సమీపమునకు పోయి శాస్త్ర సమ్మతముగ వారికి పూజాదులను నిర్వర్తించి గో దానమును కూడ చేసిరి. అతని మహిమనెరిగినవారు కావున వృద్ధులైనను భీష్మాదులు శిరస్సులను వంచి ప్రణామములు చేసిరి. 19

శ్లో॥ బంధూన్ కుశలినో దృష్ట్వా పృష్ట్వా శివ మనామయం ।
పరస్పర మథోరామో బభాషేఽవిక్లబంవచః ॥ 20

క్షేమముగనున్న బంధువులను చూచి బలరాముడు ఆరోగ్య శుభములనడిగెను. ఉభయకుశలోపరి బలదేవుడు కలవరములేని మాటలను పల్కెను. - కౌరవులారా ! ప్రభువగు ఉగ్రసేనమహారాజు

శ్లో॥ ఉగ్రసేనః క్షితీశోయద్యుష్మానాజ్ఞాపయత్ప్రభుః ।
తదవ్యగ్ర ధియశ్శ్రుత్వా కురుధ్వమవిలంబితమ్ ॥ 21

టీ:- తమితి.వృద్ధా అపి ప్రణేముః.(19-21)

శ్లో॥ యద్యూయం బహవస్త్వేకం జిత్వాఽధర్మేణ ధార్మికం ।
ఆబధ్నీతాథ తన్మృష్యే బంధూనామైక్యకామ్యయా ॥ 22

టీ:- యదితి.యద్యూయం ఇత్యుగ్రసేనవాక్యం, మృష్యే సహే అథ అశు తమానీయసమర్పయ తేతి శేషః. 22

మిమ్ములనాజ్ఞాపించిన విషయమును సావధానచిత్తులై విని వెంటనే వానిని నెరవేర్చవలసినది. మీరు అనేకులు ధర్మయుద్ధముచేయు సాంబుని ఒంటరిని చేసి అధర్మముగ జయించి బంధించితిరి, బంధువులతో సామరస్యమును ఆకాంక్షించి దానిని నేను సహించుచున్నాను. వెంటనే సాంబుని తీసుకొనివచ్చి మాకు సమర్పించుకొనుడు.(20-22)

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ వీర్య శౌర్యబలోన్నద్ధమాత్మ శక్తి సమంవచః ।
కురవోబలదేవస్య నిశమ్యోచుః ప్రకోపితాః ॥ 23

టీ:- వీర్యేతి.వీర్యం ప్రభావః.శౌర్యం ఉత్సాహః. బలం సత్వం. తైరున్నద్ధం ఉచ్ఛృంఖలం. కథం ఆత్మనః శక్తేః సమం అనురూపం.23

**శ్రీ శుకులు పలికిరి**

ప్రభావము, ఉత్సాహము, బలముతో కూడి ఆత్మ శక్తికి తగినట్టి బలరాముని వాక్యమును విని కౌరవులు ప్రకోపనులై బదులు పలికిరి. 23

శ్లో॥ అహో మహచ్చిత్రమిదం కాలగత్యా దురంతయా ।
ఆరురుక్షత్యుపానద్వై శిరో మకుటసేవితమ్ ॥ 24

టీ:- అహో ఇతి. ఉపానత్ పాదరక్షా శిరరోధుమిచ్ఛతి హీనా అప్యస్మా నాజ్ఞాపయంతీత్యర్థః. 24

ఆశ్చర్యమాశ్చర్యము కాలగతి అంతములేనిదికదా! కాళ్ల కుండవలసిన పాదుకలు కిరీటాలంకృతమైన శిరమునెక్కు చున్నవి. హీనులైన వారు కూడ మమ్ములనాజ్ఞాపించుటకు యత్నించుచున్నారు. ఏమన తగును. 24

శ్లో॥ ఏతే యౌనేన సంబంధాస్సహ శయ్యాసనాశనాః ।
వృష్ణయస్తుల్యతాం నీతా అస్మద్దత్త నృపాసనాః ॥ 25

టీ:- అస్యైవ ప్రపంచశ్చతుర్భిః. ఏత ఇతి. యౌనేన పృథాయా వివాహేన. 25

కుంతీ వివాహ సంబంధముచేత ఈ యాదవులకు సహ పంక్తి భోజన, శయ్య ఆసనములందు సమానత్వము కల్పించబడినది. వారు మనమనుగ్రహించిన సింహాసనము కలవారు. 25

శ్లో॥ చామరవ్యజనే శంఖమాతపత్రం చ పాండరం ।
కిరీటమాసనం శయ్యాం భుంజంత్యస్మదుపేక్షయా ॥ 26

టీ:- కించ. చామరేతి. భుంజంతి ఉపభుంజంత ఇత్యర్థః. అస్మదుపేక్షయా అస్మాకమానాగ్రహేణ అస్మాకమనుగ్రహేణేతి యావత్. 26

మరియు మా అనుగ్రహము చేతనే వింజామరలను, శంఖమను నిధిని, శ్వేతచక్రమును, కిరీట ఆసన శయ్యలను అనుభవించుచున్నారు. 26

శ్లో॥ అలం యదూనాం నరదేవలాంఛనై
ర్ధాతుః ప్రతిపాచరితోద్ధతాత్మనాం ।
యేనః ప్రసాదోపచితాహి యాదవా
ఆజ్ఞాపయంత్యద్యగతత్రపాబత ॥ 27

టీ:- అలమితి. అతః పరం తాన్యపహరిష్యామ ఇత్యర్థః. 27

శ్లో॥ కథమింద్రోఽపి కురుభిర్భీష్మ ద్రోణార్జునాదిభిః ।
అదత్తమవరుంధీత సింహగ్రస్తమివోరణః ।
నాతఃపరం హ్యుగ్రసేనో రాజా భవితుమర్హతి ॥ 28

టీ:- కథమితి. అవరుంధీత స్వీకుర్యాత్ ఉరణః మేషః. 28

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ జన్మబంధు శ్రియోన్నద్ధమదాస్తే భరతర్షభ ।
ఆశ్రావ్యరామం దుర్వాచ్యమసభ్యాః ప్రావిశన్ పురమ్ ॥ 29

శ్లో॥ దృష్ట్వాకురూణాం దౌశ్శీల్యం శ్రుత్వావాచ్యాని చాచ్యుతః ।
అవోచత్కోపసంరక్తో దుష్ప్రేక్షః ప్రహసన్ ముహుః ॥ 30

బ్రహ్మరాతకు ప్రతికూలముగ వృద్ధిని పొందిన ఈ యాదవులు మన అనుగ్రహమును కోరువారు. ఆహా ! ఆహా ! భయమును వీడి నేడు మనలను ఆజ్ఞాపించుచున్నారు. ఇక చాలు. వీరి ప్రభుత్వ లాంఛనములు కూడ అపహరింతముగాక ! సింహముచేత చిక్కిన మేకవలె కౌరవులైన, భీష్మ, ద్రోణ, అర్జునులచే ఈయబడిన రాజ్యమున ఇంద్రుడు కూడ అడ్డగింపజాలడు. ఇకమీదట ఉగ్రసేనుడు రాజుగ నుండుటకు అర్హుడు కాడు. (27-28)

**శ్రీ శుకులు పలికిరి**

ఓ భరతశ్రేష్ఠ! జన్మచేత, బంధువులచేత, ఐశ్వర్యముచేత మత్తులైన కౌరవులు బలరాముని యెదుట సభా మర్యాదనతిక్రమించి, దుర్వాక్యములను పలికి పట్టణములోనికి పోయిరి. బలదేవుడు కౌరవుల దుశ్చేష్టలను చూచి దుర్వాక్యములను విని కోపముతో ఎరుపెక్కిన కనులతో భయంకరుడై మాటిమాటికి అట్టహాస మొనరించుచు పలికెను. 29,30

టీ:- జన్మేతి. జన్మనా బంధుభిశ్చ ఉపలక్షితయా. శ్రియా ఉన్నద్ధ ఉత్కటో మదో యేషాం తే దుర్వాచ్యం పరుషం వాక్యం. అసభ్యాః దుర్జనాః. (29-30)

శ్లో॥ నూనాం నానామదోన్నద్ధా శ్శాంతింనేచ్ఛంత్యి సాధనః ।
తేషాంహి ప్రశమోదండః పశూనాంలగుడో యథా ॥ 31

శ్లో॥ అహో యదూన్ సుసంరబ్ధాన్ కృష్ణం చ కుపితం శనైః ।
సాంత్వయిత్వాహమేతేషాం శమమిచ్ఛన్ని హాగతః ॥ 32

టీ:- నూన మితి. నానావిధైః ధనాభిజనాది మదైరున్నద్ధాః తేషాం దండ ఏవ ప్రశమః ప్రకర్షేణ శమయతీతి తథా లగుడః దండః. (31-32)

నిశ్చయముగ, జన్మ, ధన, అభిజనాది అనేక విషయములందు మధించిన దుర్మార్గులు శాంతిని ఇష్టపడరు. మధించిన పశువులకు బడితతో వలె వారికి ప్రథమ శిక్షదండనమే. అయ్యయ్యో! యుద్ధ సన్నద్ధులైన యాదవులను, కోపనుడైన కృష్ణుని మెల్లగ ఓదార్చి. నేను వీరిని శాంతింప చేయుటకై ఇచటికి వచ్చితినికదా! అని వాపోయెను. (31-32)

శ్లో॥ త ఇమే మందమతయఃకలహా భిరతాః ఖలాః ।
తంమామవజ్ఞాయముహుర్దుర్భాషాన్ మానినోऽబ్రువన్ ॥33

టీ:- త ఇతి. దుర్భాషాన్ అవాచ్యశబ్దాన్. 33

ఈ మూర్ఖులు కలహమునే వాంఛించు నీచులు. సాంత్వనమునకై వచ్చిన నన్ను అవమానించుచు దురభిమానులై అవాకులు చవాకులాడిరి. 33

శ్లో॥ నోగ్రసేనః కిల విభుర్భోజవృష్ణ్యంధకేశ్వరః ।
శక్రాదయో లోకపాలాయస్యాదేశాను వర్తినః ॥ 34

టీ:- దుర్భాషణమనుస్మరతి షడ్భిః - నేతి. విభుః ఆజ్ఞాపయితుం సమర్థః 34

మా ఉగ్రసేన మహారాజు, భోజ, వృష్ణి, అంధకులను ఆజ్ఞాపించుటకు సమర్థుడైనవాడు. ఇంద్రాది లోకపాలురు కూడ ఆయన ఆజ్ఞను శిరసావహింతురు. 34

శ్లో॥ సుధర్మాక్రమ్యతేయేన పారిజాతోఽమరాంఘ్రిపః ।
ఆహృత్యభుజ్యతేసోఽసౌ నకిలాధ్యాసనార్హణః ॥ 35

శ్లో॥ యస్య పాదయుగం సాక్షాచ్ఛ్రీరుపాస్తేఽఖిలేశ్వరీ ।
సనార్హతి కిల శ్రీశో నరదేవ పరిచ్ఛదాన్ ॥ 36

టీ:- అహో దుష్టాః శ్రీకృష్ణమప్యధిక్షిప్తవంత ఇత్యతి కుపిత ఆహ త్రిభిః - సుధర్మేతి.(35-36)

ఆహా ! కృష్ణుని కూడ ఈ దుష్టులు అధిక్షేపించు చున్నారని కోపముతో అనుచున్నాడు. శ్రీకృష్ణుడు దేవసభను కూడ ఆక్రమించి, దేవవృక్షమగు పారిజాతమును సాధించి, అనుభవించుచున్నాడు. అట్టి వాడు వీరిచే ఆక్రమింపబడుటకు అసాధ్యుడు కదా ! ఎవని పాద యుగళమును అఖిలాండేశ్వరియగు సాక్షాత్ లక్ష్మీదేవి ఉపాసించు చున్నదో అట్టి శ్రీశుడు నరపతులచే అనుభవింపబడు రాజ్యమునకు అనర్హుడు కదా! (35-36)

శ్లో॥ యస్యాంఘ్రిపంకజరజోఽఖిలలోకపాలై
ర్మౌళ్యుత్తమైర్ధృత ముపాసిత తీర్థ తీర్థం ।
బ్రహ్మాభవోఽహమపి యస్య కలాః కలయా
శ్రీశ్చోద్వ హేమచిరమస్య నృపాసనం క్వ ॥ 37

ఎవని పాదపంకజముల ధూళి, రేణువులను ఇంద్రాది లోకపాలురు తమతమ ఉత్తమాంగము (శిరస్సు) లందు ధరింతురో, తీర్థ సదృశులగు యోగులు యోగేశ్వరులకు ఏ మహానుభావుడు తీర్థమో, సర్వలోకములచే సేవింపబడు గంగాతీర్థము తాను

శ్లో॥ భుంజతే కురుభిర్దత్తం భూఖండం కిలవృష్ణయః ।
ఉపానహః కిల వయం స్వయంతు కురవశ్శిరః ॥ 38

టీ:- యస్యేతి. మౌళ్యుత్తమైర్మౌళియుక్తైరుత్తమాంగైః. ఉత్తమైః మౌళిభిరితి వా. ఉపాసితాని తీర్థాని యైర్యోగిభిస్తేషామపి తీర్థం. యద్వా. ఉపాసితం సర్వైః సేవితం తీర్థం గంగా. తస్య తీర్థం తీర్థత్వ నిమిత్తం. కించ. బ్రహ్మేభవః శ్రీశ్చ. అహమపి. ఉద్వహేమ కథం భూతావయం. యస్య కలాయా అంశస్య కలాః అంశాః. (37-38)

తీర్థత్వమును పొందుటకు ఎవ్వనినుపాసించుచున్నదో, మరియు బ్రహ్మ, భవుడు, నేను, శ్రీ కూడ ఎవని కలాంశలై ఆయంశలను చిరకాలము ధరించుచున్నామో, అట్టి మహనీయునకు సింహాసనమెక్కడిది? ఎంతటిది? ఔనుకదా! వృష్ణులు కౌరవులు ప్రసాదించిన భూమిని అనుభవించుచున్నారా! మేము ఔరా! పాదరక్షలమా! కౌరవులు స్వయముగ శిరములా! (37-38)

శ్లో॥ అహో ఐశ్వర్యమత్తానాం మత్తానమివమానినాం ।
అసంబద్ధగిరోరూక్షాః కస్సహేతాను శాసితా ॥ 39

శ్లో॥ అద్య నిష్కౌరవాముర్వీం కరిష్యామీత్యమర్షితః ।
గృహీత్వా హలముత్తస్థౌదహన్నివ జగత్త్రయమ్ ॥ 40

టీ:- అహో ఇతి. మత్తానామివ మద్యాదినా. రూక్షాః పరుషాః అనుశాసితా స్వయం దండధరస్సన్ . (39-40)

అహో! మద్యాదుల వల్ల మత్తెక్కిన వారివలె ఐశ్వర్య మదమత్తులైన వీరి మాటలు ఎంత పరుషములైనవి. స్వయముగదండధరుడైన వాడు ఏవడు ఈ వాక్యములను సహించగలడు.

నేడు ఈ ఉర్విని కౌరవ రహితముగ చేయుదును అని పల్కుచు ఆగ్రహావిష్టుడై హలాయుధుడు హలమును ధరించి, లోకత్రయమును దహించువానివలె లేచి నిలబడెను. (39-40)

శ్లో॥ లాంగలాగ్రేణ నగరముద్విదార్యగజాహ్వయం ।
విచకర్ష స గంగాయాం ప్రహరిష్యన్నమర్షితః ॥ 41

టీ:- లాంగలేతి. లాంగలాగ్రేణ. దక్షిణతః ప్రాకారమూలే నిఖాతేన ఉద్విదార్య ఉత్పాట్య. 41

కుపితుడైన హలాయుధుడు దక్షిణదిశయందలి కోటగోడ పునాదులలో నాగలిని నాటి హస్తినను పెకలించి సముద్రమున ముంచివేయ సమకట్టెను. 41

శ్లో॥ జలయానమివా ఘూర్ణంగంగాయాం నగరం పతత్ ।
అకృష్యమాణమాలోక్యకౌరవా జాత సంభ్రమాః ।
తమేవ శరణం జగ్ముస్సకుటుంబ జిజీవిషవః ॥ 42

ఓడవలే ఊగిపోవుచు హస్తినాపురము గంగయందు పడెను. అట్లు నాగలిచే చీల్చబడి లాగబడుచుండగ చూచి కౌరవులు బిత్తరపోయి, తత్తరపడుచు, బ్రతుకులు నిల్పుకొనుటకై, సకుటుంబులై ఆ భగవంతుని, బలదేవుని శరణు జొచ్చిరి. 42

శ్లో॥ సలక్షణాం పురస్కృత్య సాంబంప్రాంజలయో౽బ్రువన్ ।
రామరామాఖిలాధార ప్రభావంన విదామతే ॥ 43

శ్లో ॥ మూఢానాం నః కుబుద్ధీనాం క్షంతుమర్హస్యధీశ్వర
స్థిత్యుత్పత్తివ్యయానాం త్వమేకో హేతుర్నిరాశ్రయః ।
లోకాన్ క్రీడనకానీశక్రీడతస్తే వదం త్యజాః ॥ 44

టీ:- జలయానమితి. జిజీవిషవ ఇత్యక్షరాధిక్యం సోఢవ్యం. (42-44)

లక్ష్మణతో కూడ సాంబుని ముందుంచుకొని చేతులు కట్టుకొని రామా ! ఓ బలరామా ! సకల ప్రపంచముకు ఆధారభూతుడవగు నీ శక్తిని తెలిసికొన జాలమైతిమని పల్కిరి. అధీశ్వరా! కుత్సిత బుద్ధులగు మూఢులము మేము. క్షమించగలవు. ఈ లోకము యొక్క సృష్టి, స్థితి, లయములకు నిరాశ్రయుడవగు నీవే కారణము. ఓ పరమపురుషా! బ్రహ్మాదులు ఆటలాడుకొను నీకు ఈ లోకములన్నియు ఆటస్థలములే యని పల్కుచుందురు. (43-44)

శ్లో॥ త్వమేవ మూర్ధ్నీదమనంత లీలయా
భూమండలం బిభర్షి సహస్ర మూర్ధన్ ।
అంతే చ యస్యాత్మ నిరుద్ధ విశ్వ
శ్శేషేఽద్వితీయః పరిశిష్యమాణః ॥ 45

టీ:- త్వమితి. శేషే శయనం కరోషి శేష పర్యంకే పరిశిష్యమాణో యః సచ త్వమేవేతి వా. 45

వేయిపడగలవాడా! అనంతమైన ఈ భూమండలమును నీ శిరములందు సులభముగ మోయుచున్నావు. ప్రళయాంతమున నీవే ఆత్మతత్త్వముతో ఈ విశ్వమును నిరోధించి అద్వితీయుడవై శేషించిన వాడవగుటచే నీవు ఆదిశేషుడవని కీర్తింపబడుచున్నావు. 45

శ్లో॥ కోపస్తే బలశిక్షార్థం సర్వేషాం న చ మత్సరాత్ ।
బిభ్రతో భగవన్ సత్త్వం క్షితి పాలన తత్పరః ॥ 46

టీ:- అస్మాసు కోపశ్చ తవాయముచిత ఏవేత్యాహుః కోప ఇతి- క్షితి పాలనే తత్పరః. తాత్పర్యవాన్ కోపః. పాఠాంతరే సంబోధనం. 46

ఓ భగవంతుడా! పుడమిని పాలించుట యందు ఆసక్తుడవగు నీవు మా శక్తిని శిక్షించుటకు మాత్రమే కోపమును వహించుచున్నావు. కాని మా యందు ద్వేషముతో కాదు. 46

శ్లో॥ నమస్తే సర్వభూతాత్మన్ సర్వశక్తి ధరావ్యయ ।
విశ్వకర్మన్నమస్తేఽస్తు త్వాం వయం శరణం గతాః ॥ 47

టీ:- నమ ఇతి. విశ్వం కర్మ కృత్యం యస్య త్వమితి సంబోధనమ్. 47

లోక సృష్టికర్తా! సర్వ భూతాత్మక! సర్వ శక్తిధర! అవ్యయ! నీకు నమస్కారములు, నమస్కారములు నమస్కారములు. మేమందరము నీ శరణు జొచ్చియున్నాము. 47

శ్లో॥ ఏవం ప్రపన్నైస్సంవిగ్నైర్వేపమానాయనైర్బలః ।
ప్రసాదితస్సుప్రసన్నో మాభైష్టేత్య భయం దదౌ ॥ 48

టీ:- ఏవ మితి. వేపమానమయనం పురం యేషాం తైః. 48

ఈ విధముగ ఊగిసలాడుచున్న హస్తినాపురమున కంపించి పోవుచూ ఉద్విగ్నులై శరణుజొచ్చిన కౌరవులచే వేడుకొనబడిన బలదేవుడు భయపడవలదని పురప్రజలకు అభయప్రధానము చేసెను. 48

శ్లో॥ దుర్యోధనః పారిబర్హం కుంజరాన్ షాష్టిహాయనాన్ ।
దదౌ ద్వాదశసాహస్ర మయుతాని తురంగమాన్ ॥ 49

శ్లో ॥ రథానాం షట్సహస్రాణి రౌక్మాణాం సూర్యవర్చసాం ।
దాసీనాం నిష్కకంఠీనాం సహస్రం దుహితృ వత్సలః ॥ 50

టీ:- దుర్యోధన ఇతి. తురంగమాంశ్చ ద్వాదశాయుతాని.(49-50)

దుర్యోధనుడు ఉపాయనములుగ ఆరు, పండ్రెండు సహస్రముల వయస్సు గల పండ్రెండు వేల ఏనుగులను పదివేల తురంగములను సమర్పించెను. అట్లే కూతురి యందలి ప్రేమతో సూర్యుని వంటి తేజస్సుగల ఆరువేల బంగారు రథములను, బంగారు కంఠహార భూషితలైన వేయిమంది దాసదాసీ జనములను, బహూకరించెను. (49-50)

శ్లో ॥ ప్రతిగృహ్యాతు తత్సర్వం భగవాన్ సాత్వతర్షభః ।
ససుతస్సస్నుషః ప్రాయాత్సుహృద్భి రభినందితః ॥ 51

టీ:- ప్రతి గృహేతి. సుహృద్భిః కౌరవైః. 51

భగవంతుడు సాత్వత శ్రేష్ఠుడు బలరాముడు ఆ బహుమానము లన్నింటిని గ్రహించి, స్నేహితులతో అభినందితుడై, కొడుకును కోడలిని వెంటబెట్టుకొని ద్వారకా నగరమునకు పోయెను. 51

శ్లో ॥ తతః ప్రవిష్టస్స్వపురం హలాయుధీ
స్సమేత్స బంధూననురక్త చేతసః ।
శశంస సర్వం యదు పుంగవానాం
మధ్యేసభాయాం కురుషు స్వచేష్టితమ్ ॥ 52

శ్లో ॥ అద్యాపి వః పురం హ్యేతత్సూచయద్రామ విక్రమం ।
సమున్నతం దక్షిణతో గంగాయాం నను దృశ్యతే ॥ 53

టీ:- తత ఇతి. మధ్యే సభాయాం సభామధ్యే.(52-53)

ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,
అష్టషష్టితమోஉధ్యాయః

ద్వారకా నగరమును చేరిన బలదేవుడు, అనురాగయుతులైన బంధువులతో కూడినవాడై, సభా మధ్యమున కౌరవులు చేసిన చేష్టలను, తన కృత్యమును యాదవ వరులకు సర్వమును వివరించెను. నేటికిని ఈ హస్తినాపురము రామ పరాక్రమునకు సాక్షిగ దక్షిణ దిశయందు ఎత్తుబడినదిగ, గంగాతోయమున కనువిందు చేయుచున్నది. (52-53)

శీమహాభాగవతమున దశమస్కంధమునందు
అరవైఎనిమిదవ అధ్యాయము సమాప్తము

## ఏకోనసప్తతితమో௨ధ్యాయః

శ్లో॥ ఏకోనసప్తతితమే గార్హస్థ్యం ప్రతిమందిరం ।
కృష్ణస్య నారదో దృష్ట్వా విస్మితో௨గాత్తతస్తువన్ ॥

## 69 వ అధ్యాయము

ఈ అరవైతొమ్మిదవ అధ్యాయమునందు ప్రతి మందిరమునందు శ్రీకృష్ణుని గృహస్థ ధర్మమును చూచి నారద మహర్షి విస్మితుడయ్యెను. పిమ్మట స్తోత్రము చేయుచు అచటినుండి వెళ్లిపోయెను.

### శ్రీకృష్ణం ప్రతి నారదాజమ కథా ప్రారంభఘట్టః

### శ్రీకృష్ణుని చెంతకు నారదాగమన కథా ప్రారంభ ఘట్టము.

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ నరకం నిహతం శ్రుత్వాతథోద్వాహంచ యోషితాం ।
కృష్ణేనైకేనబహ్వీనాంతం దిదృక్షుస్స్మ నారదః ॥ 1

టీ:- ఏకోనసప్తతితమే గార్హస్థ్యం ప్రతిమందిరమ్, కృష్ణస్య నారదో దృష్ట్వావిస్మితో௨గాత్తతస్తువన్. 1

**శ్రీ శుకులు పలికిరి**

నరకుడు శ్రీకృష్ణునిచే హతుడగుటను, పదహారువేలమంది సుందరీ మణులను శ్రీకృష్ణుడొక్కడే పరిణయ మగుటను విని నారదుడు ఆ మహిమాన్వితుని దర్శింప ముచ్చటపడుచుండెను. 1

శ్లో॥ చిత్రం బతైతదేకేనవపుషాయుగపత్పృథక్ ।
గృహేషు ద్వ్యష్ట సాహస్రం స్త్రియ ఏక ఉదావహత్ ॥ 2

టీ:- దిదృక్షామభినయేనాహ.- చిత్రమితి. ద్వ్యష్టసాహస్రం స్త్రీః ఉదావహత్ పరిణీతవాన్. 2

శ్రీకృష్ణుని సందర్శించు కోరికను అభినయముతోననుచున్నాడు. ఇది బహు చిత్రము కదా ! శ్రీకృష్ణభగవానుడు ఏక శరీరధారియై ఒకేమారు పదహారువేల మందిని పరిణయమాడి, వేరువేరు గృహము లందు గృహస్థధర్మమును నిర్వహించుచున్నాడు. 2

శ్లో॥ ఇత్యుత్సుకో ద్వారవతీం దేవర్షిర్ద్రష్టుమాగమత్ ।
పుష్పితోపవనా రామద్విజాళి కులనాదితామ్ ॥ 3

టీ:- ఇతీతి. ద్వారవతీమభివర్ణ యతి సార్ధత్రయేణ - పుష్పితేతి. పుష్పితేషూపవనేషు ఆరామేషు ఉద్యానేషు. ద్విజానామలీనాం చ కులాని తైర్నాదితాం. 3

ద్వారకా నగరమును మూడున్నర శ్లోకములతో వర్ణించు చున్నాడు. అని విని ఉత్సుకుడైన దేవర్షి నారదుడు, పుష్పించిన ఉప వనములు, ఉద్యాన వనములందు ఝుంకార నాదములు కలిగిన ద్వారవతీ నగరమును చూడగోరినవాడై వచ్చెను. 3

శ్లో॥ ఉత్ఫుల్లేందీవరాం భోజకల్హార కుముదో త్పలైః ।
ఛురితేషు సరస్సూచ్చైః కూజితాం హంస సారసైః ॥ 4

టీ:- ఉత్ఫుల్లేతి. చురితేషు వ్యాప్తేషు. 4

శ్లో॥ ప్రాసాద లక్షైర్నవభిర్జుష్టాం స్ఫాటిక రాజితైః ।
మహామకరత ప్రఖ్యైస్స్వర్ణ రత్న పరిచ్ఛదైః ॥ 5

టీ:- ప్రాసాదేతి. మహామరకతైః ప్రఖ్యాయంతే ప్రకాశంత ఇతి తథా తైః. స్వర్ణరత్నమయాః పరిచ్ఛదాః పరికరాః యేషుతైః. 5

వికసించిన నల్ల కలువలు, కమలములు, ఎరుపు తెలుపు మిశ్రితమైన మిక్కిలి పరిమళముగల కలువలు, ఎఱ్ఱ తామరలు, తెల్ల గలువలచే వ్యాప్తమైన సరస్సులయందు మిక్కిలి బిగ్గరగ కూయుచున్న హంసలు బెగురు పక్షులతోడను, - మేడలనుండి చూడబడుచున్న నవరత్న ఖచితమైన స్ఫటికములతో ప్రకాశించుచున్నట్టి, మహా మరకతములుగ ప్రసిద్ధిని పొందినట్టి బంగారు రత్నవేదికలతొడను - విభజింపబడిన రాజమార్గముల ముంగిళ్లయందలి అంగళ్ల చేతను, చతుశ్శాలలు మనోహరములగు సభాభవనములచేతను, దేవాలయము లతోడను, మార్గములందు కళ్లాపి చల్లబడిన వీధియందు కడపలు గలిగినట్టి, చలించుచున్న పతాకలుగల టెక్కెములచే నివారింప బడుచున్న ఎండ వేడిమి కలిగినట్టి - ఏ ద్వారకా నగర నిర్మాణమున విశ్వకర్మ తన నైపుణ్యమును శ్రమకోర్చి ప్రదర్శించెనో, ఏ నగరము

శ్లో॥ విభక్త రథ్యాపథచత్వరాపణై
శ్శాలా సభాభీరుచిరాం సురాలయైః ।
సంసిక్త మార్గాంగణ వీధిగేహాళీం
పతత్పతాకా ధ్వజవారి తాతపామ్ ॥ 6

టీ:- విభక్తేతి. పత్యంతః ప్రచలంత్యః. పతాకాః యేషు తైః. ధ్వజైర్వారిత అతపో యస్యాస్తాం. 6

శ్లో॥ తస్యామంతః పురం శ్రీమదర్చితం సర్వధిష్ణ్యపైః ।
హరేస్స్వకౌశలం యత్రత్వష్టాకార్త్స్న్యేన దర్శితమ్ ॥ 7

టీ:- తస్యామితి. తస్యాం సర్వైర్ధిష్ణ్యపైర్లోకపాలైరర్చితం. 7

శ్లో॥ తత్రషోడశభిస్సద్మ సహస్రైస్సమలం కృతం ।
వివేశై కతమం శౌరేః పత్నీనాం భవనం మహత్ ॥ 8

టీ:- తత్రేతి. షోడశభిస్సద్మసహస్రైస్సమలంకృతం హరేరంతఃపురం వివేశ. తత్రచ. తస్య శౌరేః పత్నీనాంభవనేషు ఏకతమం వివేశేత్యన్వయః యత్ర స్వకౌశలం త్వష్టా సందర్శితమిత్యంతఃపురభవనయోర్విశేషణం. 8

సకల లోకపాలురచే నిత్య మర్చించబడునో అట్టి ద్వారకా పట్టణమున శ్రీమంతుడగు శ్రీహరి అతఃపురమున్నది.(4-7)

విశ్వకర్మ పనితనమును ప్రదర్శించిన ఆ ద్వారవతి యందు, పదహారువేల సదనములచే అలంకృతమైన మురారి పత్నులయొక్క మహాభవనములందు ఒకసతి భవనముననున్న హరి అతఃపురమును నారదమహర్షి ప్రవేశించెను. 8

శ్లో॥ విష్టబ్ధం విద్రుమస్తం భైర్వైదూర్య ఫలకోత్తమైః ।
ఇంద్ర నీలమయైః కుడ్యైర్జ గత్యా చాహిత త్విషా॥ 9

టీ:- తదును వర్ణయతి చతుర్భిః - విష్టబ్ధమితి. విద్రుమస్తంభైర్విష్టబ్ధం విధృతం వైడూర్యమయాని ఫలకోత్తమాని స్తంభాశ్రయాణి ఛాదనాని. తైః ఇంద్రనీలమయైః కుడ్యాదిభిశ్చోపలక్షితం. జగత్యా భూమికయా ఇంద్రనీలమయ్యా.ఆహితాత్విట్ యస్యాః తయా. 9

నాల్గుశ్లోకములతో ఆ అంతఃపురమును వర్ణించుచున్నాడు. పగడములు పొదిగిన స్తంభములపై నిల్పిన, ఉత్తమమైన వైఢూర్య మణులను పొదిగిన పైకప్పు పలకములు కల్గినట్టి ఇంద్ర నీల మణిమయములగు గోడలచే లోకమున వెదజల్లుబడు కాంతులతో విరజిల్లునట్టి... 9

శ్లో॥ వితానైర్నిర్మితైస్త్వష్ట్రా ముక్తాదామ విలంబిభిః ।
దాంతైరాసన పర్యం కైర్మణ్యుత్తమ పరిష్కృతైః ॥ 10

శ్లో॥ దాసీభిర్నిష్క కంఠీభిస్సువాసోభిరలంకృతం ।
పుంభిస్సకంచుకోష్ణీష సువస్త్రమణి కుండలైః ॥ 11

టీ:- వితానైరితి. ముక్తాదామ్నాం విలంబాః వివిధాని లంబాని లంబమానాని విద్యంతే యేషుతైః. మణ్యుతమైః పరిష్కృతైః భూషితైః (10-11)

విశ్వకర్మచే నిర్మితమై ముత్యాలహారములతో వ్రేలాడదీయబడిన మేలు కట్టులు కలిగినట్టి, ఉత్తమమైన మణులు పొదిగి తీర్చబడిన దంతపు ఆసనములు, మంచములు కలిగినట్టి, బంగారుహారములను కంఠములందు ధరించిన చీనాంబర ధారిణులైన దాసీ జనముల తోడను, రాజోద్యోగమునకు తగిన పొడవగు అంగీలను, తలపాగలను, చిత్రపుటంచుగల శాలువాలను, మణికుండలములను, ధరించిన పురుషులతోడను - (10-11)

శ్లో॥ రత్న ప్రదీప నికరద్యుతిభిర్నిరస్త
ధ్వాంతం విచిత్ర వలభీషు శిఖండినోఽంగ ।
నృత్యంతి యత్ర విహితా గరు ధూపమక్షై
ర్నిర్యాతమీక్ష్య ఘన బుద్ధయ ఉన్నదంతః ॥ 12

టీ:- రత్నేతి. ఈక్ష్య సమీక్ష్య. ఘనో మేఘోఽయమితి బుద్ధిర్యేషాం తే. 12

ఓ రాజా! రత్నదీప సముదాయకాంతులతో అంధకారము పటాపంచలు కాగా, విచిత్ర చందశాలలయందు నెమళ్లు పురులువిప్పి నాట్యములు చేయుచుండగ, అందుంచిన అగరొత్తుల పొగలు గవాక్షములనుండి వెలుపలికి వచ్చుటను చూచి లోపల ఉరుముచున్న మేఘములను తలపించుచుండగ - 12

శ్లో॥ తస్మిన్ సమాన గుణరూప వయస్సువేష
దాసేసహస్రయుతయాను సవంగృహిణ్యా ।
విప్రోద దర్శచ మరవ్యజనేన రుక్మ
దండేన సాత్వతపతిం పరివీజయంత్యా ॥ 13

టీ:- తస్మిన్నితి. అనుసవం సర్వకాలం. అత్మనా సమానాని గుణరూప వయాంసి సుష్ఠు వేషాఽలంకారశ్చ యస్య తేన. దాసీ సహస్రేణ. యుతయా గృహిణ్యా సహ. 13

ఆ సభా భవనమునందు, సమాన గుణ, రూప, వయో వేష ధారిణులగు వేయిమంది దాసీ జనముతో కూడిన గృహిణీ జనము బంగారు పిడిగల వింజామరలతో వీచుచుండగ నారదమహర్షి సాత్వత పతియగు శ్రీకృష్ణుని సంధర్శించెను. 13

శ్లో॥ తం సంనిరీక్ష్య భగవాన్ సహసోత్థితశ్ర్శీ
పర్యంకత స్సకల ధర్మభృతాం వరిష్ఠః ।
ఆగమ్య పాదయుగళే శిరసా కిరీట
జుష్టేనసాంజలి రవీ విశదాసనేస్వే ॥ 14

టీ:– తమితి. శ్రియః రుక్మిణ్యాః పర్యంకతః అవీవిశత్ ఉపవేశయామాస. 14

సర్వధర్మాచరణులలో శ్రేష్ఠుడైన భగవానుడు శ్రీకృష్ణుడు మహర్షి నారదునిగాంచి శ్రీ పర్యంకమునుండి వెంటనే లేచివచ్చి అంజలి ఘటించి కిరీటముతోడి శిరము ఆ మహనీయుని పాదయుగళము సోకగ మ్రొక్కి తన ఆసనమున కూర్చుండ జేసెను. 14

శ్లో॥ తస్యావనిజ్య చరణౌ తదపస్స్వమూర్ధ్నా
బిభ్రజ్జగద్గురుతరోఽపి సతాం పతిర్హి ।
బ్రహ్మణ్య దేవ ఇతి యద్గుణనామ యుక్తం
తస్యైవ యచ్చరణ శౌచమ శేష తీర్థమ్ ॥ 15

టీ:– తస్యేతి. అబిభ్రత్ అబిభరత్ దధారేత్యర్థః. పులకాన్యబిభ్రన్నిత్యాదౌ తథా ప్రయుక్తత్వాత్. బిభ్రదితి శత్రంతం వా. తథా చ సంపూజ్య అభిభాష్య చ ప్రాహేత్యుత్తరేణాన్వయః. కథంభూతః. యస్య చరణశౌచం గంగా. అశేషతీర్థం సః. అత ఏవ. జగద్గురుతరోఽపి. సతాం ధర్మభృతాం పతిత్వాదేవమకరోదిత్యర్థః. సతాం పతిత్వే హేతుః. బ్రహ్మణ్యదేవ ఇతి తత్ గుణకృతం నామ. తత్ తస్యైవ యతో యుక్తం సమంజసం. అత స్తద్ధర్మప్రవర్తనాయైవమాచరణమిత్యర్థః . 15

ఆ శ్రీకృష్ణ భగవానుడు స్వయముగ జగద్గురువరుడయ్యెను. నారద మహర్షి భూమిపైనుంచిన పాదములను స్వయముగ అభిషేకించి ఆపాద జలమును తన శిరస్సున ధరించెను. పులకితుడయ్యెను. బ్రహ్మణ్య దేవుడను గుణ నామములు ఆ భగవానునకే తగియున్నవి. ఎందుకనగ గంగ ఆ భగవంతుని పాద శౌచము. అందుకే ఆయన సకల లోకములకు తీర్థము. అందుకే జగద్గురుత్వము, ఆయన యందు నిత్యము సత్యము. ఆ ధర్మప్రవర్తనమును లోకమున ప్రసరింపజేయుటకే నారద మహర్షి యొక్క పాద తీర్థమును తన తలయందు దాల్చెనని భావము. 15

శ్లో॥ సంపూజ్య దేవ ఋషి వర్య మృషిః పురాణో
నారాయణో నరసఖో విధినోది తేన ।
వాణ్యాభిభాష్యమితయా మృతజుష్టయతాం
ప్రాహప్రభో భగవతే కరవామ కింతే ॥ 16

టీ:- సంపూజ్యేతి. అభిభాష్య దిష్ట్యా త్వదాగమనమిత్యాది ప్రియముక్త్వా. 16

అర్జునునకు మిత్రుడు, పురాణపురుషుడునగు నారాయణ ఋషి విధి ప్రకారము దేవ ఋషి వరుడగు నారదుని పూజించి అమృత ప్రాయమగు మితవాక్కులతో ప్రియమార పల్కరించి, పూజ్యుడవగు దేవర్షీ ! ప్రభూ! నీకేమి ఉపకారము చేయవలయునని పల్కెను. 16

**శ్రీ నారద ఉవాచ**

శ్లో॥ నైవాద్భుతంత్వయి విభోஉఖిలలోకనాథ
మైత్రీజనేషు సకలేషు దమఃఖలానాం ।
నిశ్శ్రేయసాయ జగతః స్థితిరక్షణాభ్యాం
స్వైరావతార ఉరుగాయ విదామ సుష్ఠు ॥ 17

టీ:- భగవతా స్వస్యార్హణం అనర్హం మన్యమానస్తత్సంభావయన్నాహ - నేతి. సర్వ మిత్రత్వాదేవమర్హణం. నతు మను గౌరవాత్. తర్హి కథం న కంసాదిషు మైత్రీ తత్రాహ - ఖలాంనాం దమశ్చనైవా ద్భుతమితి. కుతః. జగతః స్థితిః ధారణం. రక్షణం పాలనం. తాభ్యాం సహ. నిశ్శ్రేయసాయ తవాయం స్వేచ్ఛావతార ఇతి. వయం సుష్ఠు సమ్యక్ విదామ. అతః ఖలదమః సాధుసన్మానంచ యుక్తమితి భావః (17)

**శ్రీ నారదమహర్షి పల్కెను**

స్వామీ! సమస్త లోకమునకు ప్రభువా! సమస్త మిత్ర జనమునందు ఇట్టి గౌరవభావముండుట మీకు యుక్తమైనదే. కేవలము అది నా గొప్పతనము కాదు. అట్లే దుష్టులను శిక్షించుట నీ యందు అద్భుత విషయముకాదు. జగత్తు యొక్క స్థితి రక్షణముల కొరకు, భద్రత కొరకు స్వేచ్ఛావతార రూపుడవు నీవు. గొప్పగ కీర్తింబడువాడవని మేము బాగుగ నెరుగుదము. 17

శ్లో॥ దృష్టం తవాంఘ్రి యుగళం జనతా పవర్గం
బ్రహ్మాదిభిర్హృది విచింత్య మగాధబోధైః ।
సంసార కూప పతితోత్తరణావ లంబం
ధ్యాయం శ్చరామ్యనుగృహాణ యథాస్మృతి స్యాత్ ॥ 18

శ్లో॥ తతోऽన్యదావిశద్గేహం కృష్ణస్యాస్స నారదః ।
యోగేశ్వరేశ్వరస్యాంగ యోగమయా వివిత్సయా ॥ 19

టీ:- యదుక్తం ప్రభో కిం కరవామేతి అత్రాహ - దృష్టమితి. భక్తజనతాయాః అపవర్గరూపం కించ. అతి దుర్లభతయా బ్రహ్మాదిభిర్యోగీశ్వరైరపి హృది విచింత్యం కించ. సంసార కూపే పతితానాముత్తరణాయ అవలంబం ఆశ్రయం. ఏవ భూతం తవాంఘ్రియుగళం. మయాదృష్టం అతః కృతకృత్యోऽస్మి. తథాపి తస్యస్మృతిర్యథా స్యాత్. తథానుగృహాణ అతస్తద్ధ్యాయన్నేవ నిత్యం చరామీతి. (18-19)

శ్లో॥ దీవ్యం తమక్షైస్తత్రాऽపి ప్రియయాచోద్ధవేనచ ।
పూజితః పరయా భక్త్యా ప్రత్యుత్థానావనాదిభిః ॥ 20

ప్రభో! ఏమిచేయగలమంటివి, వినుము. సర్వ జగత్తు విషయము నెరిగిన బ్రహ్మాది దేవతలకు నీ దర్శనము అతి దుర్లభమగుటచే, వారిచే ఎల్లవేళల ధ్యానింపబడినట్టి, భక్తజనులకు ముక్తి ప్రదాతవైనట్టి, మరియు సంసార కూపమున పటిన వారి నుద్ధరించుటకై ఆలంబనమైనట్టి, నీ యొక్క పాద యుగళమును నేడు నేను చూడగల్గితిని. అందుచే ధన్యుడనైతిని. అయినను నీ పాద దర్శన స్మృతి సదా యుండునట్లు అనుగ్రహింపుము. అందుకే నీ చరణ కమలమును నిత్యము ధ్యానించుచూ సంచరించుచున్నాను. 18

ఓ రాజా! పిమ్మట ఆ నారదమహర్షి యోగీశ్వరేశ్వరిని యోగమాయను తెలిసికొనుటకై మరియొక కృష్ణపత్నీ గృహమున ప్రవేశించెను. 19

అచట కృష్ణ పరమాత్మ మరొక ప్రియురాలితో ఉద్ధవునితో కలిసి పాచికలాట ఆడుచుండుటను కాంచెను. ఆ ప్రియురాలి గృహమున కూడ పరమ భక్తితో ప్రత్యుత్థాన ఆసన ప్రధానములచేత, శ్రీకృష్ణునిచే పూజితుడయ్యెను. 20

శ్లో॥ పృష్టశ్చావిదుషేవాసౌ కదాయాతో భవానితి ।
క్రియతే కిన్ను పూర్ణానామ పూర్ణైరస్మదాదిభిః ॥ 21

ఏమియు ఎరగనివాని వలె శ్రీకృష్ణపరమాత్మ ఓ నారదమహర్షీ! మీరు ఎప్పుడు వచ్చితిరని యడిగెను. సకల మనోభీష్టములు తీరి పరిపూర్ణులగు మీకు అపరి పూర్ణుడనగు నేనేమి చేయవలసి యున్నది. అని అడిగెను. 21

శ్లో॥ తథాపి బ్రూహినో బ్రహ్మన్ జన్మైతచ్ఛోభనం కురు ।
సతు విస్మిత ఉత్థాయతూ ష్ణీమన్యదగాద్గృహమ్ ॥ 22

శ్లో॥ తత్రాప్యాచష్ట గోవిందం లాలయంతం శిశూన్ సుతాన్ ।
తతోஉ న్యస్మిన్ గృహేஉ పశ్యన్మజ్జనాయకృతోద్యమమ్ ॥ 23

టీ:- దీవ్యంతమితి. అక్షైర్దీవ్యంతమిత్యాదౌ దదర్శేతి జ్ఞాతవ్యం. (20-23)

ఓ బ్రాహ్మణోత్తమా ! సకల పరిపూర్ణుడవైనను ఇంకను కోరవలసినదేమైన యున్నచో కోరి ఈ మా జన్మలను ఫలవంతము చేయుము. అని శ్రీకృష్ణుడు పల్కగ విని నారదుడు ఆశ్చర్యపడి నోటమాట రాక లేచి ఊరకయే మరియొక పత్నీ గృహమును పోయెను. అచట కూడ శిశువులను, సుతులను లాలించుచున్న గోవిందుని చూచెను. వెంటనే మరియొక పత్నీ సదనమునకు పోయి జలకా లాడుటకు సిద్ధమగుచున్న శ్రీకృష్ణపరమాత్మను చూచెను. (22-23)

శ్లో॥ జుహ్వంతం చ వితానాగ్నీన్ యజంతం పంచభిర్మఖైః ।
భోజయంతం ద్విజాన్ క్వాపి భుంజానమవశేషితమ్ ॥ 24

శ్లో॥ క్వాపి సంధ్యాముపాసీనం జపంతం బ్రహ్మవాగ్యతం ।
ఏకత్ర చాసి చర్మభ్యాం చరం తమపి వర్త్మసు ॥ 25

మరియొక పత్నీ గృహమునకు పోయి అచట పంచమహా యజ్ఞములు చేయుచు ఆహవనీయాగ్నుల యందు హోమమును చేయువానిని కనెను. ఇంకొక గృహమున బ్రాహ్మణ సంతర్పణము చేసి ఆయన్న శేషమును తినిచున్న వానిని చూచెను. మరియొక సతి ఇంట సంధ్యా వందనము చేసి గాయత్రీ మంత్రమును జపించు వానిని గాంచెను. ఒకచోట ఖడ్గ కవచధారియై మార్గమున చరించు

శ్లో॥ అశ్వైరథైర్గజైః క్వాపి విచరంతం గణగ్రజం ।
క్వచిచ్ఛయానం పర్యంకేస్తూయ మానం చ వందిభిః ॥ 26

శ్లో॥ మంత్రయంతం చ కస్మింశ్చిన్మంత్రిభిశ్చోద్ధవాదిభిః ।
జలక్రీడారతం క్వాపి వారముఖ్యాభిరావృతమ్ ॥ 27

శ్లో॥ కుత్రచిద్ద్విజముఖ్యేభ్యోదదంతంగాస్స్వలం కృతాః ।
ఇతి హాస పురాణాని శృణ్వంతం మంగళానిచ ॥ 28

శ్లో॥ హసంతం హాస్యకథయా కదాచిత్ప్రియయాగృహే ।
క్వాపి ధర్మం సేవ మాన మర్థకా మౌచ కుత్రచిత్ ॥ 29

వానిని చూచెను. వేరొక పత్నీ గృహమున అశ్వ, రథ, గజ పర్యవేక్షణము చేయుచు తిరుగుచున్న గదాగ్రజుని కనెను.మరొక గృహమునందు పర్యంకమున పరుండి వంది మాగధులచే నుతింపబడుచున్న కృష్ణుని సందర్శించెను. (24-26)

మరొకపత్నీ మందిరమునకు పోయి ఉద్ధవాది మంత్రులచే మంత్రాలోచన చేయుచున్న శ్రీకృష్ణభగవానుని చూచెను. వారవనితలతో పరివేష్టితుడై జలక్రీడలాడుచున్న వానిని ఇంకొక పత్నీ సదనమున తిలకించెను. మరొకరి మందిరమున చక్కగ అలంకరింపబడిన గోవులను ద్విజవరులకు దానము చేయుచుండుటను దర్శించెను. వేరొకరి మందిరమున కరిగి మంగళకరములగు ఇతిహాస పురాణములను వినుచున్న శ్రీకృష్ణమూర్తిని కాంచెను. ఇంకొక ప్రియురాలి గృహమున ఆమెతో కూడి హాస్య కథలు చెప్పుకొనుచు నవ్వుచున్న వానిని చూచెను. ధర్మార్థమై ధర్మార్థ కామములను సేవించు శ్రీకృష్ణ భగవానుని మరియొక పత్నీ గృహమున సందర్శించెను. (27-29)

శ్లో॥ ధ్యాయంతమేక త్రాత్మానం పురుషం ప్రకృతేః పరం ।
శుశ్రూషంతం గురుం క్వాపి కామైర్భోగైస్సపర్యయా ॥ 30

శ్లో॥ కుర్వంతం విగ్రహం కైశ్చిత్సంధిం చాన్యత్రకేశవం ।
కుత్రాపి సహరామేణ చింతయంతం సతాంశివమ్ ॥ 31

టీ:- జుహ్వంతమితి. వితానాగ్నీనాహవనీయాదీన్ అగ్నీన్ పంచభిర్మఖై ర్మహాయజ్ఞైర్యజంతం. (24-31)

శ్లో॥ పుత్రాణాందుహితౄణాంచ కాలే విధ్యుపయాపనం ।
దారైర్వరైస్తత్సదృశైః కల్పయంతం విభూతిభిః ॥ 32

టీ:- పుత్రాణామితి. కాలే తత్సమయే. విధినా ఉపయాపనం ప్రాపణం వివాహమిత్యర్థః. కల్పయంతం ఘటయంతం. విభూతిభిః విభవైః. 32

శ్లో॥ ప్రస్థానో పానయనైరపత్యానాం మహోత్సవాన్ ।
వీక్ష్యయోగేశ్వరేశస్య యేషాం లోకావిసిస్మిరే ॥ 33

వేరొక పత్నీ గృహము నందు ఒకచోట ఆత్మ ధ్యాన పరాయణుడైన ప్రకృతి పురుషుని గనెను. ఒకచోట ఇష్టమైన సంపదల నిచ్చి గురువులకు సపర్యలు చేయుచూ సేవించుచున్న మాధవుని చూచెను. మరొకరి గృహమునందు కొందరితో విరోధించు వానిని ఇంకొకచోట కొందరితో సంధిచేసుకొనుచున్న వానిని చూచెను. మరొక పత్నీ మందిరమున బలరామునితో కూడి సజ్జనుల క్షేమమునుగూర్చి విచారించువానిని దర్శించెను. (30-31)

మరొకసతీ సదనమున పుత్రపుత్రికలకు సకాలమున వివాహాదులను జరిపించి వారివారి గృహములకు ఉపాయనములతో పంపించు వానిని, ఇంకొకచోట ప్రియ పత్నులకు వారివారికి తగినట్లు సంపదలను సమకూర్చువానిని సందర్శించెను. 32

కూతుళ్లను అల్లుండ్రను మాతృమందిరముల నుండి అత్తవారిండ్లకు, అత్తవారిండ్లనుండి తమఇండ్లకు పంపుటయు, పిలుచుకొని వచ్చుటయు అను మహోత్సవములను కల్పించుచు

శ్లో॥ యజంతం సకలాన్ దేవాన్ క్వచిత్క్రతుభిరూర్జితైః ।
పూర్తయంతం క్వచిద్ధర్మం కూపారామాలయాదిభిః ॥ 34

శ్లో॥ చరంతం మృగయాం క్వాపి హయ మారుహ్య సైంధవం ।
ఘ్నంతం తతః పశూన్ మేధ్యాన్ పరీతం యదుపుంగవైః ॥35

టీ:- ప్రస్థాపనేతి. ప్రస్థాపనం దుహితృజామాత్రాదీనాం స్వగృహాత్తద్గృహం ప్రతి నయనం. ఉపానయనం తత్తద్గృహాత్పున రుపానయనంతైర్మహోత్సవాన్ కల్పయంతం. యోగీశ్వరేశస్య యేషాం అపత్యానం మహోత్సవాన్ వీక్ష్య లోకాస్సర్వేఽపి విసిస్మిరే విస్మయం చక్రుః. తథాభూతాన్ కల్పయంతం. (33-35)

శ్లో॥ అవ్యక్త లింగం ప్రకృతిష్వంతః పురచరాదిషు ।
క్వచిచ్చరంతం గేహేషు తత్తద్భావభుబుత్సయా ॥ 36

శ్లో॥ అథోవాచ హృషీకేశం నారదః ప్రహసన్నివ ।
యోగమాయోదయం వీక్ష్యమానుషీమీయుషో గతిమ్ ॥ 37

టీ:- అవ్యక్తేతి. అవ్యక్తలింగం వేషాంతరేణ ఛన్నం. (36-37)

పాల్గొనుచున్న వానిని ఒకచోట, వేరొకచోట వారికి తగిన ఉపాయనము లను పంపుచున్న యోగీశ్వరేశ్వరుని సంతాన మహోత్సవములను కాంచి లోకములన్నియు విస్మయమునకు లోనయ్యెను, ఒకచోట మహిమాన్విత క్రతువులతో సకల దేవతల నుద్దేశించి యాగములు చేయుచున్న వానిని, కూప, ఉపవన, దేవాలయములతో ధర్మపాలనము పూర్తి చేయుచున్న వానిని మరొక పత్నీ గృహమున దర్శించెను. ఒకానొక చోట సింధుదేశహయము నధిరోహించి యదువీరులతో కూడి యజ్ఞపశువులను చంపుచున్న క్రూరమృగములను వేటాడుచున్న శ్రీకృష్ణపరమాత్మను కాంచెను. (33-35)

అంతఃపురమున చరించుచున్న లోకుల గృహములందు ప్రచ్ఛన్నవేషధారియై వారివారి అభిప్రాయములను తెలిసికొనుటకై తిరుగుచున్న వానిని ఒకచోటకనెను. పిమ్మట నారదుడు యోగమాయ మానవ జన్మమెత్తిన గతిని ఈ విధముగ చూచి నవ్వుచున్న వానివలె హృషికేశునితో పల్కెను. (36-37)

శ్లో॥ విదామ యోగమాయాంతే దుర్దర్శామపి యోగినాం ।
యోగేశ్వరాత్మన్నిర్భాతాం భవత్పాద నిషేవయా ॥ 38

టీ:- విదామేతి. హే యోగీశ్వర ఆత్మన్. ఆత్మని మమ మనసి తవ స్వరూపేవా. నిర్భాతాం ప్రతీతాం తవ యోగమాయాం. కేవలం. విదామ విద్మః న తు త్వత్పారమార్థ్యమితి భావః. 38

ఓ యోగీశ్వరా! నా మనస్సున లేదా నీ స్వరూపమునందు ప్రతీతమగుచున్న, యోగులకు కూడ దర్శింపసాధ్యముకాని నీ యోగమాయను నీ పాదసేవలవలన మాత్రమే మేము ఎరుగుదుము. కాని పారమార్థ్యమును నెరుగము. 38

శ్లో॥ అనుజానీహి మాంకృష్ణలోకాంస్తే యశసాऽऽప్లుతాన్ ।
పర్యటామి తవోద్గాయన్ లీలాభువన పావనీః ॥ 39

టీ:- త్వన్మనుష్యనాట్యేన ముహ్యామి అతో మాం ప్రస్థాపయేత్యాహ - అనుజానీహీతి. 39

కృష్ణా! నీ లీలావినోదములచే పావనమైన భువనములందు నీ లీలలను గానము చేయుచు సంచరింతును. నీ కీర్తిచే నిండిన లోకముల యందు తిరుగుటకై నన్ననుమతింపుము అని నారదుడడిగెను. 39

శ్రీ భగవాన్వాచ

శ్లో॥ బ్రహ్మన్ ధర్మస్య వక్తాహం కర్తా తదను మోదితా ।
తచ్ఛిక్షయన్ లోకమిమ మాస్థితః పుత్ర మాఖిదః ॥ 40

టీ:- బ్రహ్మన్నితి. తత్తస్మాల్లోకం శిక్షయన్నిమం ధర్మమాస్థితః న తు తత్త్వతః. అతః హే పుత్ర మాఖిదః మోహం న ప్రాప్నుహీతి. 40

శ్రీ భగవానుడు అనెను

ఓ బ్రాహ్మణా ! నారదా ! ధర్మములను వచించువాడను, ఆచరించువాడను, అనుమోదించువాడను నేనే. ధర్మమును లోకమునకు శిక్షించుటకే నేను ఈ గృహస్థ ధర్మమును స్వీకరించితిని. యదార్థమునకు కాదు. అందువలన ఓ కుమారా! దుఃఖించవలదు. భ్రాంతిని పొందవద్దు. అని భగవానుడు పల్కెను. 40

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఇత్యాచరంతం సద్ధర్మానా దిష్టాన్ గృహమేధినాం ।
తమేవ సర్వగేహేషు సంతమేకం దదర్శహ ॥ 41

టీ:- ఇతీతి. ఇతి ఏవమనుగృహీతః తమేకమేవ సంతం దదర్శేతి. 41

శ్లో॥ కృష్ణస్యానంత వీర్యస్య యోగమాయా మహోదయం ।
ముహుర్దృష్ట్వా మునిరభూద్విస్మితో జాతకౌతుకః ॥ 42

టీ:- కృష్ణస్యేతి. ముహుర్ముహుర్దృష్ట్వాజాతకౌతుకో మునిర్విస్మితో బభూవేతి. 42

శ్లో॥ ఇత్యర్థ కామధర్మేషు కృష్ణేన శ్రద్ధి తాత్మనా ।
సమ్యక్సభాజితః ప్రీతస్తమేవానుస్మరన్యయౌ ॥ 43

టీ:- ఇతీతి. శ్రద్ధాయుక్తః ఆత్మా యస్య తేన. 43

**శ్రీ శుకులు పలికిరి**

ఈ విధముగ గృహస్థులకు కూడ సద్ధర్మములను ఉపదేశించుటకై తానే స్వయముగ ఆచరించుచూ సర్వగృహము లందు తానొక్కడే యయ్యు కనిపించుచున్న శ్రీపతిని దర్శించెను. 41

అనంత శక్తిశాలియగు కృష్ణునియొక్క యోగమాయ మహోదయమును మాటిమాటికి చూచి ఉత్సాహము కల్గిన నారద మహర్షి అత్యంత ఆశ్చర్యపడెను. 42

ధర్మార్థ కామముల ప్రభోధమునందీవిధముగ శ్రద్ధాళువగు శ్రీకృష్ణునిచే చక్కగ పూజితుడైన నారదమహర్షి సంప్రీతుడై ఆ గదాగ్రజునిచే స్మరిమచుచు అచటినుండి వెడలిపోయెను. 43

శ్లో॥ ఏవం మనుష్య పదవీ మనువర్త మానో
నారాయణోఽఖిల భవాయగృహీత శక్తిః ।
రేమేంఽగషోడశ సహస్ర వరాంగ నానాం
సవ్రీడ సౌహృదనిరీక్షణ హాస జుష్టః ॥ 44

టీ:- నారదదృష్టాః శ్రీకృష్ణ లీలాః నిగమయతి – ఏవమితి. అఖిలస్య భవాయ ఉద్భవాయ. గృహీతాః శక్తయో నానామూర్తయోయేన సః సవ్రీడం చ తత్సౌహృదం చ తేన నిరీక్షణం హాసశ్చ. తాభ్యాం జుష్టః 44

ఈ విధముగ మానవ ధర్మమును అనుసరించుచున్న నారాయణమూర్తి సకల సంసార ఉత్పత్తికై నానామూర్తులను ధరించిన వాడై పదహారువేల వరాంగనల యొక్క లజ్జాయుత స్నేహమయమైన క్రీగంటి చూపులను హాసములను అనుభవించుచు ఆనందించెను. 44

శ్లో॥ యానీహ విశ్వవిలయోద్భవ వృత్తిహేతుః
కర్మాణ్యనన్య విషయాణి హరిశ్చ కార ।
యస్తానిగాయతి శృణోత్యను మోదతేవా
భక్తిర్భవేద్భగవతి హ్యపవర్గ మార్గే ॥ 45

టీ:- యానీతి. అనన్యవిషయాణి అసాధారణాని. అపవర్గమార్గే మోక్షప్రదే. 45

విశ్వము యొక్క సృష్టి, స్థితి, లయముల ప్రవృత్తికి కారణ భూతములైన, అసాధారణ విషయములైన ఏ కర్మలను శ్రీహరి ఆచరించెనో వానిని గానము చేసినను, చదివినను, విన్నను, అనుమోదించినను జనునకు భగవంతుని యందు, మోక్షమార్గము నందును ఎనలేని భక్తి భావము కలుగునని ఫలమును శ్రీ శుకులు చెప్పిరి. 45

**ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే,**
**ఏకోనసప్తతితమోఽధ్యాయః**

**శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు**
**అరవైతొమ్మిదవ అధ్యాయము సమాప్తము**

## సప్తతితమో౽ధ్యాయః

శ్లో॥ తతస్తుసప్తతితమే కృష్ణస్యాహ్నిక కర్మణి ।
దూత నారదయోః కార్యేమంత్రిమంత్ర విచారణమ్ ॥
జగన్మంగళ చారిత్ర మాహ్నికం జగదీశితుః ।
నారదేన క్వచిత్కాంచిద్దృష్టమాహ యథాక్రమమ్ ॥

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ అథోషస్యుపవృత్తాంయాం కుక్కుటాన్ కూజతోశపన్ ।
గృహీత కంఠ్యః పతిభిర్మాధవ్యో విరహాతురాః ॥ 1

టీ:- శ్లో."ఇత్యర్థ కామధర్మేషు కృష్ణేన శ్రద్ధితాత్మనే" తి ప్రత్యుతస్య శ్రీకృష్ణస్యాహ్నికస్యాధికారే అథశబ్దః. ఉపవృత్తాయాం ఆసన్నాయాం పతిభిః శ్రీకృష్ణైః. మాధవ్యో మాధవస్య భార్యాః. 1

శ్లో॥ వయాంస్యరూరువన్ కృష్ణం బోధయంతీవ వందినః ।
గాయంత్స్వళిష్వనిద్రాణిమందారవన వాయుభిః ॥ 2

టీ:- వయాంసీతి. వందిన ఇవ శ్రీకృష్ణం బోధయంతి సంతి వయాంసి పక్షిణః అరూరువన్ అతిశయేనా కూజన్ మందారవనవాయుభిః గాయత్సు అళిషు అనిద్రాణి వయాంసి. 2

## 70వ అధ్యాయము

పిమ్మట ఈ డెబ్బైయవ అధ్యాయమునందు కృష్ణుని యొక్క సంధ్యావందన కర్మ సంధర్భమున దూత నారదులయొక్క కార్యము నందు మంత్రుల మంత్రాలోచనము వర్ణింపబడినది. జగదీశ్వరుని యొక్క, జగన్మంగళరూపమైన, చారిత్రకమైన, అహ్నిక క్రియయు వర్ణితము. నారదమహర్షి ఒకచోట తాను చూచిన కొంత విషయమును ఉన్నది ఉన్నట్లుగ చెప్పెను.

### శ్రీ శుకులు పలికిరి

అనంతరము తెల్లవారుఝామున ఆహ్నిక సమయమాసన్న మగుచుండగ కోళ్లు కూయుటకుపక్రమించగ విరహమును సహించని మాధవుల సతీమణులు గాఢముగ భర్తలచే కంఠాలింగనము చేసికొన బడినవారై ఆ కుక్కుటములను శపించిరి. 1

మందార వనవాయువులచే లేచి తుమ్మెదలు గానము చేయుచుండగ నిద్ర నుండి మేల్కొనిన పక్షులు వంధిమాగధులు స్తోత్రములచే కృష్ణుని మేల్కొనుపుచున్నట్లుగ కిలకిలారావములు చేయజొచ్చెను. 2

శ్లో॥ ముహూర్తం తంతు వైదర్భీ నామృష్యదతి శోభనం ।
పరిరంభణ విశ్లేషాత్ప్రియ బాహ్వంతరం గీతా ॥ 3

శ్లో॥ బ్రాహ్మే ముహుర్త ఉత్థాయ వార్యుపస్పృశ్య మాధవః ।
దధ్యౌ ప్రసన్నకరణ ఆత్మానం తమసః పరమ్ ॥ 4

టీ:- ముహూర్తమితి. వైదర్భీత్యుపలక్షణం అన్యాసామపి. పరిరంభణ విశ్లేషాత్ తం ముహూర్తం పర్యాలోచ్య. (3-4)

శ్లో॥ ఏకం స్వయం జ్యోతి రనన్య మవ్యయం
స్వసంస్థయానిత్య నివృత్త కల్మషం ।
బ్రహ్మాఖ్య మస్యోద్భవసాది హేతుభి
స్స్వశక్తి భిర్లక్షిత భావ నిర్వృతిమ్ ॥ 5

టీ:- ఏకమితి. ఏకం అఖండం. తత్రహేతుః. అనన్యం నిరుపాధిం. అత ఏవ. అవ్యయం నిత్యం స్వయంజ్యోతిః. తత్ర హేతుః. నిత్యం నివృత్తం కల్మషం అవిద్యా యస్మాత్తం. ఉపలక్షణమాహ.- అస్యేతి. విశ్వస్య లక్షితః భావశ్చాసౌనిర్వృతిశ్చ. భావస్సత్తా. నిర్వృతిరానందః. తథాహి. గుణక్షోభా త్పూర్వం సత్తామాత్రం యః. శ్రు.''సదేవ సోమ్యేదమగ్రఆసీ'' దితి శ్రుతేః స ఏవానందశ్చ. శ్రు.''విజ్ఞాన మానంద'' మిత్యాది శ్రుతేః. తం సదానందమిత్యర్థః. 5

ప్రియుడగు శ్రీకృష్ణుని కౌగిలింతతో మరియుచున్న విధర్భరాజ తనయ కౌగిలింతల సడలింపు వలన పక్షుల పూజితములకు అది మంచి సమయుముకాదని ఆగ్రహించెను. 3

మాధవుడు బ్రాహ్మీమూహుర్తముననే మేల్కొని నీటిని స్పృశించి ఆచమనము చేసి అరుణోదయ మగుచుండగ ఆత్మను ప్రసన్నము చేసికొనుటకుపక్రమించెను. 4

ఉపాధిరహితమైన అఖండ జ్యోతి స్వరూపము ఒక్కటియే. స్వయముగ ప్రకాశించునది, అది నశించనిది. నిత్యమైనది. నిత్యమైనది కనుకనే నివృత్త పాపము గలది. బ్రహ్మమని దాని నామము. ఈ విశ్వము యొక్క సృష్టి, స్థితి, లయములకు కారణభూతమైనది. స్వశక్తి చేతనే సర్వ సత్తాకము ఆనందస్వరూపమైనది. "సదేవసోమ్యేదమగ్ర ఆసీత్" అని శృతి. "సపవానందశ్చ" ఆనంద స్వరూపము ఆ బ్రహ్మయే. "విజ్ఞానమానందః" అనియు శ్రుతి. 5

శ్లో॥ అథాప్లుతోఽంభస్యమలేయథావిధి
క్రియాకలాపం పరిధాయ వాససీ ।
చకార సంధ్యోప గమాది సత్తమో
హుతానలో బ్రహ్మజజాప వాగ్యతః ॥ 6

టీ:- అథేతి. ఆప్లుతః స్నాతః. సంధ్యాయాః ఉపగమః ఉపాసనం. ఆదిర్యథా భవతి తథా క్రియాకలాపం చకార. కాణ్వత్వాదుదయాత్పూర్వమేవ హుతానలః. బ్రహ్మ గాయత్రీం జజాప. 6

శ్రీకృష్ణపరమాత్మ నిర్మల జలముల స్నానముచేసి పీతాంబరములను ధరించి, విధిప్రకారము సంధ్యా కలాపముల నాచరించి సూర్యోదయము నకు పూర్వమే ప్రాతరౌపాసన హోమాదుల నాచరించి, గాయత్రి మంత్రోపాసనము చేసెను. 6

శ్లో॥ ఉపస్థాయార్కముద్యంతం తర్పమిత్వాత్మనః కళాః ।
దేవానృషీన్ పితౄన్ వృద్ధాన్ విప్రానభ్యర్చ్య చాత్మవాన్ ॥7

టీ:- ఉపస్థాయేతికళాః అంశాన్. దేవాన్ ఋషీన్. పితౄంశ్చ తర్పయిత్వా. 7

అనంతరము సూర్యోపస్థానము చేసి, ఉదయించుచున్న సూర్యునకు అర్ఘ్యములను సమర్పించి తన అంశలగు దేవతకు, పితరులకు తర్పణములు విడిచి, ఆత్మస్వరూపుడగు కృష్ణ పరమాత్మ వృద్ధులను, విప్రులను అర్చించెను. 7

శ్లో॥ ధేనూనాంరుక్మ శృంగాణాం సాధ్వీనాం మౌక్తికస్రజాం ।
పయస్వినీనాం గృష్టీనాం సవత్సానాం సువాససామ్ ॥ 8

టీ:- ధేనూనామితి. గృష్టీనాం ప్రథమప్రసూతానాం . 8

బంగరుకొప్పెరలు తొడిగిన కొమ్ములుగల ఆవులను, ముత్యాల హారములచే అలంకృతలైన తరుణులను, ప్రథమ ప్రసూతలైన సవత్సాక ధేనువులను, వస్త్రములచే నలంకరింపబడిన, వెండితొడుగులుకల గిట్టలు కల్గిన ధేనువులను, తెల్లని పట్టుచీరలను, జింకచర్మము, తిలలతో

శ్లో॥ దదౌరౌప్యఖురాగ్రాణాం క్షౌమాజిన తిలైస్సహ ।
అలంకృతేభ్యో విప్రేభ్యోద్వంద్వం ద్వంద్వందినేదినే ॥ 9

టీ:- దదావితి. ద్వంద్వమితి మహాసంఖ్యాయుక్తసంఘాభిధానం. ద్వంద్వశో యత్ర బ్రాహ్మణాగా విభేజిర ఇత్యుక్తేః ద్వంద్వమితి. శ్రు. "హిరణ్యేనపరివృత్తాన్ కృష్ణాన్ శుక్లదతో మృగాన్ మష్కారే భరతోఽదదాచ్ఛతం ద్వంద్వాని సప్తచే"తి శ్రుత్యుక్తాని సప్తోత్తరశతం ద్వంద్వాన్యేకీకృత్య పురాణే చతుర్దశలక్షత్వేన గణితాని. యథోక్తం. భరతమేవాధికృత్యనమస్కంధే. శ్లో. మృగాన్ శుక్లదతః కృష్ణాన్సు వర్ణేన పరిష్కృతాన్ , అదాత్కర్మణి మష్కారే నియుతాని చతుర్దశేతి. తతశ్చేయం ద్వంద్వసంఖ్యా శ్లోకేన సంగృహ్యతే. శ్లో. చతుర్దశానాం లక్షాణాం సప్తాధికశతాంశకః, ద్వంద్వం చతురశీత్యగ్ర సహస్రాణి త్రయోదశేతి. దినేదినే ప్రతిదినం ప్రతిగృహంవేతి. బధ్వం బధ్వమితి చ పాఠాంతరం. 9

కూడ చక్కగ అలంకృతులైన బ్రాహ్మణులకు నిత్యము ద్విగుణముగ దానము చేసెను. (8-9)

శ్లో॥ గోవిప్రదేవతావృద్ధాన్ గురూన్భూతాని సర్వశః ।
నమస్కృత్వాత్మ సంభూతీర్మంగళాని సమస్పృశత్ ॥ 10

టీ:- గోవిప్రేతి. ఆత్మసంభూతీః స్వవిభూతీః మంగళాని కపిలాదీని. 10

గోవులను, విప్రులను, దేవతలను, పెద్దలను, గురువులను, సమస్త భూతములను నమస్కరించి, స్వస్థితి ఐశ్వర్యములను వర్ణించు మంగళకరములగు కపిలాది మంత్రములను పఠనము చేసెను. 10

శ్లో॥ ఆత్మానం భూషయా మాసనరలోక విభూషణం ।
వాసోభిర్భూషణైస్స్వీయైర్దివ్య స్రగను లేపనైః ॥ 11

టీ:- ఆత్మానమితి. నరలోకస్య విభూషణరూపమాత్మానాం. స్వీయైః పీతాంబరకౌస్తుభాదిభిః. 11

నరలోకమునకు అలంకారప్రాయమైన తన స్వరూపమును, పీతాంబరములచేతను, కౌస్తుభాది ఆభరణములచేతను, దివ్యకుసుమ మాలలచేతను, సుగంధ ద్రవ్యములచేతను అలంకరించుకొనెను. 11

శ్లో॥ అవేక్ష్యాజ్యంతథా దర్శం గోవృషద్విజదేవతాః ।
కామాంశ్చ సర్వవర్ణానాం పౌరాంతః పురవాసినాం ।
ప్రదాస్య ప్రాకృతైః కామైః ప్రత్యోష్య ప్రత్య నందత ॥ 12

టీ:- అవేక్ష్యేతి. కామానభిలషితానర్థాన్ . 12

అనంతరము ఆజ్యమును, అద్దమును చూచి, గో, వృషభ, విప్ర దేవతలను సందర్శించెను. పురమునందు, అంతఃపురమునందు నివసించు సర్వవర్ణములవారు కోరిన అర్థములను దానము చేసెను. ప్రకృతములగు వారి కోర్కెలను తీర్చి సంతసింపచేసెను. తానును అభినందితుడయ్యెను. 12

శ్లో॥ సంవిభజ్యాగ్రతో విప్రాన్ స్రక్తాంబూలాను లేపనైః ।
సుహృదః ప్రకృతీర్దారానుపాయుంజ్క్త తతస్స్వయమ్ ॥ 13

శ్లో॥ తావత్సూత ఉపానీయ స్యందనం పరమాద్భుతం ।
సుగ్రీవాద్యైర్హయై ర్యుక్తం ప్రణమ్యావస్థితోఽగ్రతః ॥ 14

టీ:- సంవిభజ్యేతి. విప్రాన్. స్రగాదిభిః సంవిభజ్య. తేభ్యస్తాని దత్త్వేత్యర్థః. ఉపాయుజ్క్త భోగార్థమగ్రహీత్ . (13-14)

మొదట, పుష్పమాలలను తాంబూలములను, సుగంధ ద్రవ్యములను బ్రాహ్మణులకు సమర్పించి, అనంతరము మిత్రులను, పురజనులను, దారాపుత్రులను, వాటిని గ్రహించుటకై తానే స్వయముగ నియోగించెను. ఇంతలో సూతుడు సుగ్రీవాది హయములతో కూడిన పరమాద్భుతమగు రథమును తీసుకొని వచ్చి నమస్కరించి ఎదుట నిల్చెను. (13-14)

శ్లో॥ గృహీత్వాపాణినా పాణిం సారథేస్తమథారుహత్ ।
సాత్యక్యుద్ధవ సంయుక్తః పూర్వాద్రి మివ భాస్కరః ॥ 15

టీ:- గృహీత్వేతి. పాణీం కృతాంజలిం గృహీత్వా. 15

పిమ్మట సాత్యకి ఉద్ధవులతో కూడినవాడై శ్రీకృష్ణపరమాత్మ అంజలి ఘటించిన సారథి చేతిని తనచేతితో నందిపుచ్చుకొని తూర్పు కనుమను భాస్కరునివలె ఆ రథమునధిరోహించెను. 15

శ్లో॥ ఈక్షితోఽంతఃపురస్త్రీణాం సవ్రీడప్రేమవీక్షితైః ।
కృచ్ఛ్రాద్విసృష్టో నిరగాజ్జాత హాసోఽహరన్మనః ॥ 16

టీ:- ఈక్షిత ఇతి. సవ్రీడప్రేమ వీక్షితైః ఈక్షితః. క్షణం స్థితః తాభిరేవ వీక్షితైః కృచ్ఛ్రాత్ విసృష్టో నిరగాదితి. 16

సిగ్గుతో ప్రేమతోకూడిన అంతఃపురజనము చూపులతో చూడబడినవాడై కొంత సమయము తర్వాత చిరునవ్వుతో వారి మనస్సులను దోచుకొనుచు అతికష్టము మీద దృష్టిని మరల్చుకొని వెళ్లిపోయెను. 16

శ్లో॥ ఏవం ససర్వదారాణాం గృహేభ్యో భగవాన్విభుః ।
నానా రూపోవినిర్గత్య ఏకరూప స్సభాం యయౌ ॥ 17

టీ:- ఏవమితి. ఏవం సర్వగృహేభ్యఃపృథక్ పృథక్ నిర్గత్య అనంతరం ఏక ఏవ సన్. 17

ఈ విధముగ ఒకేసమయమున శ్రీకృష్ణభగవానుడు భార్యలందరి గృహముల నుండి అనేక రూపములతో వెలువడి ఏకరూపుడై సుధర్మమను సభకు పోయెను. 17

శ్లో॥ సుధర్మాఖ్యాం సభాం సర్వైర్వృష్ణిభిః పరివారితః ।
ప్రావిశద్యన్నివిష్టానాం నసం త్యంగ షడూర్మయః ॥ 18

టీ :- సుధర్మేతి. సుధర్మాం ప్రావిశత్. యన్ని విష్టానాం యత్ర ప్రవిష్టానాం. 18

ఓ రాజా! సుధర్మ సభయందున్నవారికి, అధికారదాహము, తృష్ణ, శోకము, మోహము, జర, మరణములు ఉండవు. అట్టి సభను వృష్ణికులజులతో పరివేష్టించి యున్న శ్రీకృష్ణ భగవానుడు ప్రవేశించెను. 18

శ్లో॥ అథోపవిష్టః పరమాసనే విభు
ర్బభౌ స్వభాసాకకుభోఽవ భాసయన్ ।
వృతోన్నసింహైర్యదుభిర్యదూత్తమో
యథోడు రాజో దివి తారకాగణైః ॥ 19

టీ:- అథేతి. నృసింహైః. నృషు శ్రేష్ఠైః. నృసింహ ఇతి పాఠే - కృష్ణ ఏవ . 19

సుధర్మ సభయందు పరమాసనమున ఉపవిష్టుడైన శ్రీకృష్ణ విభుడు స్వతేజస్సుతో దశదిశల ప్రకాశింపచేయుచు వెలిగెను. నృసింహములవంటి యదుశ్రేష్టులతో పరివేష్టింపబడిన విభుడు ఆసమయమున తారకల సముదాయముతో కూడిన చంద్రునివలె ప్రకాశించెను. 19

శ్లో॥ తత్రోపమంత్రిణో రాజన్నానా హాస్యరసైర్విభుం ।
ఉపతస్థుర్నటాచార్య నర్తక్యస్తాండవైః పృథక్ ॥ 20

టీ:- తత్రేతి. ఉపమంత్రిణః పరిహాసకాః పృథక్ పృథక్ స్వస్వ సముదాయైః. 20

ఓ రాజా ! ఆ సుధర్మ సభయందు హాస్యరసపోషకులు హాస్యప్రసంగములతో, నాట్యాచార్యులు నాట్యములతో, తాండవములతో, నర్తకీమణులు లాస్యములతోడను వేర్వేరుగ శ్రీకృష్ణ పరమాత్మను ఆనందపరవశుని చేసిరి. 20

శ్లో॥ మృదంగవీణా మురజవేణుతాళతరస్వనైః ।
ననృతుర్జగుస్తుష్టువు స్సూతమాగధ వందినః ॥ 21

టీ:- మృదంగేతి. మృదంగాదయః ప్రసిద్ధాః దరః శంఖః సూతాదయః తుష్టువుః. 21

సూత, మాగధ, వందిమాగధులు, మృదంగము, వీణ, పిల్లనగ్రోవి, తాళముల మనోహర స్వనములతో నాట్యములు సల్పుచు విభుని ఆనందపరిచిరి. 21

శ్లో॥ తత్రాహుర్బ్రాహ్మణాః కేచిదాసీనా బ్రహ్మవాదినః ।
పూర్వేషాం పుణ్యయశసాంరాజ్ఞాంచా కథయన్కథాః ॥ 22

శ్లో॥ తత్రైకః పురుషోరాజన్నాగతో పూర్వదర్శనః ।
విజ్ఞాపితో భగవతే ప్రతీహారైః ప్రవేశితః ॥ 23

టీ:- తత్రేతి బ్రాహ్మణాః బ్రహ్మ వేదం ఆహుః మంత్రాన్ వ్యాచఖ్యురిత్యర్థః వాదినః వచనచతురాః . (22-23)

ఆ సభా భవనమునందాసీనులైన కొందరు విప్రవరులు వేదమంత్రార్థములను వ్యాఖ్యానించిరి. వచన చతురులైన మరికొందరు పవిత్రకీర్తినార్జించిన పూర్వరాజప్రముఖుల కథలను వినిపించిరి. ఇంతలో ఓరాజా! ఆ సభకు ఒక పురుషుడు మాత్రము కృష్ణ సందర్శనకు మొదటనే రాలేదని, అట్టి పురుషుని ప్రవేశపెట్టి ద్వారపాలకులు భగవంతుడు కృష్ణునకు నివేదించిరి. (22-23)

శ్లో॥ సనమస్కృత్య కృష్ణాయ పరేశాయ కృతాంజలిః ।
రాజ్ఞామావేదయద్దుఃఖంజరాసంధనారోధజమ్ ॥ 24

టీ:- స ఇతి స పురుషః. జరాసంధేన యో నిరోధః తత్ప్రభవం రాజ్ఞాం దుఃఖమావేదయత్. 24

ఆ పురుషుడు పరాత్పరుడు కృష్ణునకు నమస్కరించి అంజలి ఘటించి జరాసంధునిచే నిరోధింపబడిన రాజుల దుఃఖమును గూర్చి నివేదించెను. 24

శ్లో॥ యేచ దిగ్విజయే తస్యసన్నతిం న యయుర్నృపాః ।
ప్రసహ్య రుద్ధాస్తే నాసన్నయుతే ద్వేగిరివ్రజే ॥ 25

టీ:- య ఇతి గిరివ్రజే తత్సంజ్ఞకే దుర్గే. రుద్ధాః ఆసన్. తేషాంచ దుఃఖమావేదయదిత్యన్వయః. కృష్ణకృష్ణేతి షట్ శ్లోకైః రాజ్ఞాం విజ్ఞప్తిః. తత్ర ప్రథమేన శరణాశ్రయణం త్రిభిర్భయానువాదః ద్వాభ్యాం ప్రార్థనమితి. 25

మహానుభావా! జరాసంధుడు, తాను దిగ్విజయము చేసినపుడు అతనికి లోబడని రాజులను ఇరువదివేలమందిని గిరి వ్రజమను దుర్గమునందు బలవంతముగ బంధించెను. వారు, తమ దుఃఖములను ఇట్లు నివేదించుకొనిరి.- కృష్ణ కృష్ణయను శ్లోకము మొదలు ఆరు శ్లోకములతో ఈ విన్నపము ఉన్నది. అందు మొదటి శ్లోకమున శరణువేడుట, పిమ్మట మూడు శ్లోకములలో తమ భయనివేదనము తదుపరి రెండింటియందు పరాత్పరుని ప్రార్థనము కలదు. 25

**రాజాన ఉవాచ**

శ్లో॥ కృష్ణ కృష్ణా ప్రమేయాత్మన్ప్రపన్నభయభంజన ।
వయంత్వాంశరణం యామోభవభీతాః పృథగ్ధ్రుశః ॥ 26

టీ:- కృష్ణేతి. పృథక్ దర్శినః. 26

శ్లో॥ లోకోవికర్మ నిరతః కుశలే ప్రమత్తః
కర్మణ్యయం త్వదుదితే భవదర్చనే స్వే ।
యస్తావదస్య నబలవానిహ జీవితాశాం
సద్యశ్ఛినత్త్య నిమిషాయ నమోऽస్తు తస్మై ॥ 27

టీ:- లోకస్య భవభయం వివృణ్వంతో నమంతి. లోకఇతి. వికర్మ నిషిద్ధం కామ్యం చ. తస్మిన్నితరాంరతః. తస్మాత్ స్వే కుశలే ధర్మే భవంతః అర్చనే త్వయా ఉదితే ఉక్తే పాంచరాత్రే. సామాన్యతశ్చ గీతాసు. శ్లో."యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్, యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమిత్యాది. ప్రమత్తః అనవహితః యావదయం లోకస్తావదేవాస్య లోకస్య యః సద్యో జీవితాశాం భినత్తి. తస్మై తుభ్యం అనిమిషాయ కాలాత్మనే నమ ఇతి. 27

**రాజులు పలికిరి**

కృష్ణ కృష్ణ! అప్రమేయాత్మ! భీతులగువారి భయమును భంజించువాడా! సంసార భీతులమగు మేమెల్లరము వేరువేరుగ నీ రూపములను దర్శించుచూ శరణు కోరుచున్నాము. రక్షింపుము. 26

ఈ లోకము నిషిద్ధములగు కర్మలయందాసక్తమై నీచే పాంచరాత్రమునందు, సామాన్యముగ భగవద్గీత యందు చెప్పబడిన యత్కరోషీయ యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్, యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం అను తమ క్షేమమున కుపయుక్తమైన మీ పాద పద్మారాధన మను స్వధర్మమును విడిచి ప్రమత్తమై యున్నది. అట్టి లోకము యొక్క జీవితాశయమును తృంచివేయు కాలస్వరూపుడ వగు నీకు నమస్కారము. 27

శ్లో॥ లోకే భగవన్భగవతః కలయావతీర్ణ
సద్రక్షణాయఖల నిగ్రహణాయచాన్యః ।
కశ్చిత్త్వదీయమతియాతిని దేశ మీశ
కిం వాజనస్స్వకృత మృచ్ఛతి తన్నవిద్మః ॥ 28

టీ:- సేయం లోకస్య గతిః వయంతు త్వద్భక్తాః అతోఽస్మాకం కుత ఏతద్దుఃఖమాపన్న మిత్యాశ్చర్యేణాహుః - లోక ఇతి. భో ఈశ ఈశ్వర. సద్రక్షణార్థమవతీర్ణోఽసి చేత్ తథాప్యస్మాకం దుఃఖం స్యాచేత్తర్హికిమన్యః కశ్చిజ్జరాసంధాదిస్త్వదాజ్ఞామతిలంఘయతి. కించ. త్వయా రక్షమాణోఽపి జనః స్వకర్మజం దుఃఖం ప్రాప్నోత్యే వేతి న విద్మః నచైతదుభయమపి యుక్తమితి భావః. 28

శ్లో॥ స్వప్నాయితం నృపసుఖం పరతంత్రమీశ
శశ్వద్భయేన మృతకేన ధురం వహామః ।
హిత్వాయదాత్మని సుఖం త్వదనీహలభ్యం
క్లిశ్యామ హేఽత కృపణా స్తవ మాయయేహ ॥ 29

టీ:- కిం దుఃఖం తదాహుః - స్వప్నాయితమితి. స్వప్నవజ్జాతం నృపసుఖం నృపోచితం సుఖం. యతః పరతంత్ర విషయసాధ్యం.

ఇది లోకపుతీరు. మేము మీ భక్తులము కథా! మాకెందుకు ఇట్టి దుఃఖస్థితి కల్గినదని ఆశ్చర్యముతో పల్కుచున్నాడు. - ఓ భగవంతుడా! నీవీ లోకమున సజ్జనుల రక్షించుటకు, దుష్టులను నిగ్రహించుటకు కదా అవతరించితివి. అయినను మాబోటి వారికి ఇట్టి దుఃఖము సంభవించినదన్న జరాసందాది నీచులు నీ యాజ్ఞను ఉల్లంఘించుచున్నారన్నమాట. నీచే రక్షింపబడుచున్న మేము స్వకర్మామ గుణమగు దుఃఖమును అనుభవించుచున్నాము. ఈ రెండును ఎట్లు పొసుగుచున్నవో మేము తెలిసికొన జాలకున్నాము. 28

ఓ స్వామీ ! పరాధీనమైన ఈ రాచరిక సుఖము కల లాంటిది. ప్రస్తుతము మేము ఎల్లవేళల మృతప్రాయమగు ఈ శరీరముతో భయభ్రాంతులమై పుత్రదార చింతారూప భారమును వహించు చున్నాము. ఇది ఎంతో కష్టతరమైనది. మేము అంతకు పూర్వమే నిష్కాములమై నిన్నాశ్రయింపజాలక పోయితిమి. నిష్కామకర్మచే లభించు స్వతస్సిద్ధమగు ఆత్మసుఖమును పొందజాలక నీ మాయచే ఈ లోకమున అతిదీనులమై క్లేశముల ననుభవించుచున్నారము. 29

కించ సంప్రతి శశ్వద్భయం యస్మిన్. తేన మృతతుల్యేస శరీరేణ ధురం పుత్రదారాదిచింతారూపభరం కేవలం వహామః. అహో కష్టం నః. యే వయమితః పూర్వమేవ నిష్కామాస్సంతస్త్వాం నాశ్రితా ఇత్యాహుః. హిత్వేతి. త్వత్ త్వత్తః యత్ అనీహైః నిష్కామైః లభ్యం ఆత్మని స్వతస్సిద్ధం సుఖం తత్ హిత్వా క్లి శ్యామః. 29

శ్లో॥ తన్నో భవాన్ప్రణత శోకహరాంఘ్రియుగ్మో
బద్ధాన్వియుంక్ష్వ మగధాహ్వయ కర్మపాశాత్ ।
యో భూభుజోఽయుతమతం గజవీర్యమేకో
బిభ్రద్రురోధ భవనే మృగరాడివాజాన్ ॥ 30

టీ:- త్వన్మాయాకృతం కర్మబంధం త్వమేవ నివర్తయేతి ప్రార్థయంతే - తదితి. వియుంక్ష్వ మోక్షయ. మగధో జరాసంధః. తత్సంజ్ఞికాత్ కర్మపాశాత్ ననుభవద్భి రేవ విక్రమ్యతతో నిర్గమ్యతామితిచేదతాహుః - య ఇతి. య ఏక ఏవ ఆయుతమతం గజానాం వీర్యం బిభ్రత్సన్ స్వభవనే భూభుజోఽస్మాన్ రురోధ. మృగరాట్సింహః. అజాన్ మేషానివ. 30

అందువల్ల ఓ భగవంతుడా ! నమస్కరించువారి దుఃఖమును హరింపచేయు పాదయుగళము కలవాడవు నీవు. అట్టి నీవు నీ మాయచే కల్పించిన కర్మపాశమునుండి మమ్ములను నీవే విడిపింప వలయును. పదివేల ఏనుగుల బలము కలిగిన జరాసంధుడొక్కడే స్వ భవనమున సింగము మేకలను వలె మమ్ములను బంధించియున్నాడు. అట్టి మాగధుడను కర్మ పాశమునుండి మమ్ములను విడిపింపుము. 30

శ్లో॥ యోవై త్వయాద్వినవకృత్వ ఉదాత్త చక్ర
భగ్నో మృధే ఖలు భవంతమనంత వీర్యం ।
జిత్వానృలోకనిరతం సకృదూఢదర్పో
యుష్మత్ప్రజారుజతినోఽజితతద్వి ధేహి ॥ 31

టీ:– కించ. యుష్మదీ యావయమితి అస్మానధికం బాధత ఇత్యాహుః – య ఇతి. హే ఉదాత్తచక్ర ఉద్యతసుదర్శన యోవై. దినవకృత్వః అష్టాదశ వారాన్. త్వయా సహమృధే వర్తమానే. తత్ర సప్తదశకృత్వః త్వయా ఖలుభగ్నః పరాజితః. పశ్చాదనంతవీర్యమపి నృలోకనిరతం నరశరీరవినోదం భగవంతం భవంతంసకృజ్జిత్వా. ఊఢదర్పః ప్రాప్తగర్వః యుష్మత్ప్రజాః నః అస్మాన్. రుజతి పీడయతి. తత్ తత్ర యత్ యుక్తం కార్యం. తద్విధేహి జరాసంధపీడాం నివారయేత్యభిప్రాయః. 31

శ్లో॥ ఇతి మాగధసం రుద్ధా భవద్దర్శనకాంక్షిణః ।
ప్రపన్నాః పాదమూలం తే దీనానాం శం విధీయతామ్ ॥ 32

ఓ సుదర్శనచక్రధారీ ! ఆ జరాసంధుడు పదిహేడు మార్లు నీచే యుద్ధమున పరాజితుడై, పదునెనిమిదవ పర్యాయము అనంత శక్తి సంపన్నుడవై, నరశరీరమున వినోదించుచున్న నిన్ను గెలిచి అత్యంతము గర్వితుడై నీ వారలమగు మమ్ములను మిక్కిలి పీడించు చున్నాడు. అందువలన యుక్తమాచరించి ఆ జరాసంధుని బాధను నివారించుము. 31

**దూత యనుచున్నాడు**

ఈ విధముగ జరాసంధునిచే బంధింపబడిన రాజులు మిమ్ములను సందర్శించవలెనను బలీయమగు కోరిక గలవారై నీ పాదపద్మములను శరణుజొచ్చియున్నారు. ఆ దీనులకు శుభము నాచరించుము. 32

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ రాజదూతే బ్రువత్యేవం దేవర్షిః పరమద్యుతిః ।
బిభ్రత్పింగ జటాభారం ప్రాదురాసీద్యథారవిః ॥ 33

శ్రీ శుకులు పలికిరి

ఈ విధముగ రాజదూత శ్రీకృష్ణ భగవానునకు విన్నవించు సమయముననే ఎర్రని జడలను ధరించిన నారదమహర్షి లోకోత్తరమగు తేజస్సుతో సూర్యుని వలే అచట ప్రత్యక్షమయ్యెను. 33

శ్లో॥ తంద్రుష్ట్వా భగవాన్కృష్ణః సర్వలోకేశ్వరేశ్వరః ।
వవంద ఉత్థితశ్శీర్ష్ణా ససభ్యస్సానుగోముదా ॥ 34

సర్వలోకేశ్వరేశ్వరుడు భగవంతుడు శ్రీకృష్ణుడు ఆ దేవర్షిని చూచి లేచి సభాసభ్యులతో, అన్నదమ్ములతో ప్రత్యుత్థానము చేసి ముదమున శిరస్సు వంచి వందనమాచరించెను. 34

శ్లో॥ సభాజయిత్వా విధివత్కృతాసన పరిగ్రహమ్ ।
బభాషే సూన్నతైర్వాక్యైశ్శ్రద్ధయా తర్పయన్మునిమ్ ॥ 35

నారదమహర్షికి విధి ప్రకారముగ గౌరవ మర్యాదలు సల్పి ఉచితాసనమున కూర్చుండజేసి శ్రద్ధతో సూనృత వాక్యములతో మహర్షికి ఆనందమును కలుగచేయుచు సంభాషించెను. 35

టీ:- దూత ఆహ - ఇతీతి. (32-35)

శ్లో॥ అపిస్విదద్యలోకానాంత్రయణామకుతోభయం ।
ననుభూయాన్భగవతోలోకాన్పర్యటతో గుణః ॥ 36

ఈ రోజు ముల్లోకములు ఇతరులవల్ల భయరహితములుగ నున్నవి గదా! అందుకు కారణము పూజ్యులగు తాము లోకములందు సంచరించు మహాగుణ లాభము చేతనే మాకు సకల లోకముల విషయములు విధితములగుచున్నవి. 36

టీ:- అపీతి భూయాన్ మహాన్ గుణో లాభో యదస్మాకం సర్వలోక వృత్తాంత జ్ఞానమితి. 36

శ్లో॥ నహితేఽవిదితం కించిల్లోకేష్వీశ్వర కర్తృషు ।
అథ పృచ్ఛామహే యుష్మాన్పాండవానాం చికర్షితమ్ ॥ 37

టీ:- నేతి. ఈశ్వరః కర్తాయేషాం తేషు. 37

ఓ మహర్షీ! ఈశ్వర సృష్టియందలి లోకములందు మీకు తెలియని విషయము కొంచెమైనను ఉండదు. కావున పాండవులు చేయదలచు వ్యవహారమును గూర్చి మిమ్ములనడుగుచున్నాము. 37

నారద ఉవాచ

శ్లో॥ దృష్టామయాతే బహుళా దురత్యయా
మాయావిభో విశ్వసృజశ్చ మాయినః ।
భూతేషు భూమంచర తస్వ్య శక్తి భి
ర్వహ్నేరివ ఛన్నరు చో నమేద్భుతమ్ ॥ 38

టీ:- ఏవమవిదుషేవ భగవతా సర్వజ్ఞేన జరాసంధవధార్థమేవ పాండవ చిక్షీరితం పృష్టో నారదోమాయేయమితి జ్ఞాత్వాహ త్రిభిః - దృష్టా ఇతి. విశ్వసృజశ్చ బ్రాహ్మణోఽపి. మాయినో మోహకస్య తే స్వశక్తిభి ర్విద్యాదిభిర్భూతేష్వంతర్యామితయా చరతో వర్తమానస్య. యద్యహం. భూతేషు వర్తే. తర్హిభూతాని మాంకింన పశ్యంతి తత్రాహ. - వహ్నేరివఛన్న రుచ ఇతి. స్వశక్తిభిరేవ ఛన్నారుక్ ప్రకాశో యస్య తస్య. అతస్తవేదం ప్రశ్నాది న మేఽ ద్భుతం. 38

నారదమహర్షి పలికెను

సర్వజ్ఞుడగు భగవంతునిచేత ఏమి ఎరుగని వానివలె జరాసంధుని సంహారము కొరకే పాండవ చేష్టితమును గూర్చి అడుగబడిన నారదుడు అది శ్రీకృష్ణుని మాయలో భాగమేయని భావించి మూడు శ్లోకములతో నుడువుచున్నాడు. ఓ మహాత్మా! సర్వ లోకములను సృజించు బ్రహ్మకు కూడ భ్రాంతిని కలిగించు అత్యగాధమైన నీ మాయ నాచే చూడబడినది. సకల భూతములందు స్వశక్తులతో విహరించుచూ, నివురుగప్పిన నిప్పువలె నున్న ఆ అద్భుతమైన తేజస్సు నెరిగిన నాకు ఈ ప్రశ్న ఆశ్చర్యకరముకాదు. 38

శ్లో॥ తవవేహితం కోஉర్హతిసాధువేదతుం
స్వమాయమేదం సృజతో నియచ్ఛతః ।
యద్విద్యమానాత్మతయావభాసతే
తస్మై నమస్తే స్వవిలక్షణాత్మనే ॥ 39

టీ:- తవేతి. ఇదం జగత్ కథంభూతం. అసదేవ యత్తవ మాయయా విద్యమానాత్మతయా అవభాసతే తజ్జగత్సృజతః. కింతుం కేవలం తే తుభ్యం నమః తదేవ శక్యమిత్యాహ - తస్మై నమ ఇతి. కుతః స్వేన రూపేణ సర్వతోవిలక్షణాత్మనే అచింత్యాయేత్యర్థః. 39

ఓ మహానుభావా ! నీ మనస్సులోని భావమును సరిగా తెలిసికొనుట కెవనికి సాధ్యము? నాకును అంతే. ఈ జగత్తు నీ మాయచే లేనిదానివలె కనబడుచున్నదై ఉన్నదానివలె సృజింపబడు చున్నది. నియమింపబడుచున్నది. అట్టి విలక్షణ ఆత్మ స్వరూపుడవైన నీకు నమస్కారము. 39

శ్లో॥ జీవస్యయస్సంసరతోవిమోక్షణం
నజానతోஉనర్థవహాచ్ఛరీరతః ।
లీలావతారైస్స్వయశఃప్రదీపకం
ప్రాజ్వాలయత్త్వాం తమహం ప్రపద్యే ॥ 40

టీ:- నన్వేవంభూతస్య కిం మాయాచేష్టితైరిత్యత ఆహ - జీవస్యేతి. అవిద్యాతమసా ఆవృతత్వేన అనర్థప్రపకాత్ శరీరాత్సంసరతః. తేనైవ తమసా తస్మాచ్ఛరీరాద్వి మోక్షణో పాయమజానతః. ప్రాజ్వలయత్ ప్రదీపతవాన్. తం త్వాం యశశ్రృణాదిభిః జీవస్య మోక్షార్థమిత్యర్థః. 40

ఆత్మస్వరూపుడవైన నీకు ఈ మాయ చేష్టలతో నేమిపనియనగ చెప్పుచున్నాడు. - అజ్ఞానమను చీకటితో నావరింపబడిన అనర్థకరమగు శరీరమునుండి ముక్తిని పొందు మార్గము నెరుగని జీవుడు, నీ లీలావతారములచే కీర్తి శ్రవణాదులచేతను స్వమోక్షము కొరకు నీ యశోదీపమును వెలిగించెను. అట్టి జ్యోతి స్వరూపుడవగు నిన్ను శరణుకోరుచున్నాను. 40

శ్లో॥ అథా ప్యాశ్రావయే బ్రహ్మన్నరలోక విడంబనం ।
రాజ్ఞః పైతృష్వసేయస్య భక్తస్య చ చికీర్షితమ్ ॥ 41

శ్లో॥ యక్షతే త్వాం మఖేంద్రేణ రాజసూయేన పాండవః ।
పారమేష్ఠ్యకామోనృపతి స్తద్భవాననుమోదతామ్ ॥ 42

టీ:- అథేతి. ఆశ్రావయే శ్రావయిష్యామి. నరలోక విడంబనం బ్రహ్మత్వాం. బ్రహ్మన్నితి పాఠే హే బ్రహ్మన్ పరమాత్మన్ నరలోకాను కారిణం త్వాం శ్రావయిష్యామీతి. (41-42)

అయినను ఓ పరమాత్మా! మానవ లోకమున మానవానుకరణము చేయుచున్న నీకు నీ మేనత్త కుమారుడు భక్తుడునైన యుధిష్ఠిర మహారాజు చేయగోరు కార్యమును గూర్చి వినిపించ గలను. రాజ్యప్రాప్తిని కోరుచున్న పాండు కుమారుడు యుధిష్ఠిరుడు రాజసూయయాగముతో మిమ్మారాధింప తలచుచున్నాడు. దానిని మీరు అనుమతింపవలయును. (41-42)

శ్లో॥ తస్మిన్దేవక్రతువరే భవంతం వైసురాదయః ।
దిదృక్షవస్సమేష్యంతి రాజానశ్చ యశస్వినః ॥ 43

టీ:- న చాత్రై చవవాను మోదనంకార్యం కింతుం తత్రా గంతవ్య మిత్యాశయేనాహ. - తస్మిన్నితి. 43

ఇచట మాత్రమే మీ ఆమోదమును తెలుపవద్దు. రాజసూయమునకు రావలయునను ఆశయముతో పల్కుచున్నాడు. ఓ దేవా ! ఆ యాగము నందు మిమ్ములను దర్శించ వలయునను కోరికతో యశోవంతులైన దేవతలు భూపతులనేకులు వచ్చుచున్నారు. 43

శ్లో॥ శ్రవణాత్కీర్తనాద్ధ్యానా త్పూయంతే௨ంతావ సాయినః ।
తత్రబ్రహ్మమయస్యేశ కిముతేక్షాభిమర్శినః ॥ 44

అచట యాగమునకు వచ్చినవారందరు మీ దర్శనము వలన పునీతులగుదురను ఆశయముతో అనుచున్నాడు. ఓ పరబ్రహ్మా ! ఆ

టీ:- తత్రాగతాశ్చ సర్వే త్వద్దర్శనాదినా పూతా భవిష్యంతీత్యాహ - శ్రవణాదితి. అంతావసాయినః శ్వపచా అపి. బ్రహ్మమయయస్య వేదమూర్తేః ఈక్షాచ అభిమర్శశ్చ స్పర్శనం తే విద్యేతే యేషాం తే. 44

శ్లో॥ యస్యామలం దివి యశః ప్రదితం రసాయాం
భూమౌచతే భువనమంగళదిగ్వితానం ।
మందాకినీతి దివి భోగవతీతి చాధో
గంగేతిచేహ చరణాంబు పునాతి విశ్వమ్ ॥ 45

టీ:- క్రైముత్య మతిశయేనాహ.- యస్యేతి. హే భువనానాం మంగళరూప. దివిపాతాళే భూమౌ చ ప్రథితం. యస్య. యశః విశ్వం పునాతి. కథం భూతం ప్రథితం దిగ్వితానం దిశాం భువనానాం వితానవదలంకరణం తథా చరణాంబు చ ప్రథితం పునాతి. కథం తత్రప్రథితం దివి మందాకినీతి. అథశ్చభోగవతీతి. ఇహ చ భూమౌ గంగేతి. తస్య తవ ఆగమనాత్సర్వం పవిత్రం మంగళం చ భవిష్యతీతి భావః. 45

రాజసూయ యాగమునందు బ్రహ్మమయుడవగు నిన్నుగూర్చి, వినుట వలన కీర్తించుట వలన, మననము చేయుట వలనను అతినికృష్టులు కూడ పవిత్రులగుదురు. అట్టియెడ నీ దర్శన స్పర్శనాదులు కలిగిన వారి విషయమున చెప్పవలసినదేముండును. 44

ఓ భువన మంగళ స్వరూపా ! నీ నిర్మలమగు కీర్తి, స్వర్గమర్త్య, పాతాళములందు, దిక్కులయందు అలంకరణమైనట్లే మీ పాదోద్భవ యగు జలము స్వర్గమున మందాకిని నదియని, పాతాళమున భోగవతియని, పుడమియందు గంగానదియని ఈ విశ్వమును పవిత్రము చేయుచున్నది. 45

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ తత్రతేష్వాత్మనః పక్షేష్వగృహ్ణత్సు జిగీషయా ।
వాచః పేశైఃస్మయన్ భృత్యముద్ధవం ప్రాహకేశవః ॥ 46

టీ:- తత్రేతి. తత్రైవం నారదేనోక్తే. తేషు తత్ర వర్తమానేష్వాత్మీయ పక్షేషు యాదవేషు. జరాసంధస్య జిగీషయా. అగృహ్ణత్సు అననుమన్యమానేషు సత్సు వాచః పేశైః పేశలవాగ్భిరిత్యర్థః. 46

**శ్రీ శుకులు అనుచున్నారు**

నారదమహర్షి ఆ విధముగా విన్నవించు సమయమున అచటనున్న యాదవ పక్షమువారు కొందరు జరాసంధు జయింపగోరుటను నిరాకరించుచుండగ నేర్పరితనపు మాటలతో శ్రీకృష్ణపరమాత్మ భృత్యుడగు ఉద్ధవుని గూర్చి పలికెను. 46

శ్లో॥ త్వంహి నః పరమం చక్షుసుహృన్మంత్రార్థ తత్త్వవిత్ ।
అథాత్రబ్రూహ్యనుష్ఠేయం శ్రద్ధయా కరవామతత్ ॥ 47

శ్లో॥ ఇత్యుపామంత్రితో భర్త్రా సర్వజ్ఞేనాపి ముగ్ధవత్ ।
సందేశం శిరసాదాయ ఉద్ధవః ప్రత్యభాషత ॥ 48

టీ:- త్వమితి. చక్షుష్ట్వే హేతుః - మంత్రార్థానాం మంత్రసాధ్యానాం అర్థానాం తత్త్వవిత్ పరిపాకవేదితా. (47-48)

ఓ ఉద్ధవా! ఆలోచన పరమార్థతత్త్వము నెరిగిన మంచి మిత్రుడవు నీవు. మాకు ముఖ్యమైన నేత్రము వంటి వాడవు. కావున ఈ సందర్భమున మేమేమి చేయవలెనో బాగుగానాలోచించి వచింపుము. - అని సర్వజ్ఞుడైనను, అమాయకునివలె అడుగుచున్న పరమాత్మునిచే నిమంత్రితుడైన ఉద్ధవుడు ఆ సందేశమును శిరసా వహించి బదులు పలికెను. (47-48)

**ఇతి శ్రీమద్భాగవతే, దశమస్కంధే, సప్తతితమోఽధ్యాయః**

**ఓమ్ తత్సత్**

**శ్రీమహాభాగవతమున దశమస్కంధమునందు**

**డెబ్బదియవ అధ్యాయము సమాప్తము**

**ఓమ్ తత్సత్**

